# సుఖద

రచన:

శ్రీ జైనేంద్రకుమార్

అనువాదం:

శ్రీ పురాణం కుమారరాఘవశాస్త్రి



ప్రచురణ:
1957.

మూల్యము : రూ. 4. 50.

సంపాదకుడు : "ఛాయేశ్వర్"

ముద్రణ : విక్టరీ ప్రెస్, విజయవాడ-1

మీరొక రచయిత కాగోరుతున్నారా?
అయితే ఇంకా ఉత్తమరచయిత కాగోరుతున్నారా?
అయితే
# జైనేంద్ర సాహిత్యం
పూర్తిగా చదవండి!
-కాదు-అధ్యయనం చేయండి!
మీలోని రచనాశక్తి, రచనాసక్తి అపూర్వంగా
పెంపొందుతాయి!
మీ కల్పనాశక్తి కట్టులు త్రెంచుకు ప్రవహిస్తుంది!

ప్రకాశకులు :
ప్రేమచంద్ పబ్లికేషన్స్,
విజయవాడ.



## ర చ యి త

జననం: 1905. ప్రారంభికవిద్యాప్రాప్తి, బ్రహ్మచర్యాశ్రమం—హస్తినాపురంలో (1911–18). ప్రైవేటు మెట్రిక్ 1919. కాశీ విశ్వవిద్యాలయంలో—1919–1920. సహాయ నిరాకరణోద్యమంలో కాలేజీ పరిత్యాగం—1921. ప్రథమ కారాగారవాసం–1924. పునః కారాగారవాసాలు–1930–1932. ఆ తరువాత నిరుద్యోగం. తనను తాను శాశ్వత నిరుద్యోగినని చెప్పుకొనేవారు.

మొదటి కథలసంపుటి 'ఫాంసీ' (ఉరి) తో 1929 లో సాహిత్యరంగంలో అడుగు పెట్టారు. మొదటి నవల 'పరఖ్' ప్రచురణ—1930. మొదటి తాత్విక గ్రంథం 'జైనేంద్రుని అభిప్రాయాలు'—ప్రచురణ : 1937. సాహిత్యరంగంలో ఈయన ప్రవేశమువల్ల ఉద్భవించిన కలకలాన్ని గురించి కతిపయ విజ్ఞుల ఈ ఉద్ఘాటనవల్ల ఊహించవచ్చు—

"నువు గోర్కీ... కోరుతున్నావా ? భారత దేశంలో గోర్కీ కాగలిగినవారూ - అయినవారూ ఎవరైనా ఉన్నారా అంటే ఒక్క జైనేంద్రుడు మాత్రమే."

-ప్రేమ్‌చంద్.

"'జైనేంద్రుని అభిప్రాయాలు' చదువుతూ టాల్‌స్టాయ్ రచనలు చదువుతున్నంత—కాదు, ఇంకా చాల అధికంగా ఆనందానుభూతిని పొందాను నేను..."

—కిశోర్ లాల్ మశ్రూవాలా.

"...హిందీ కథాసాహిత్య క్షేత్రంలో, ఇప్పుడు మనం రవీంద్రనాథ్ శరత్ బాబులను జైనేంద్రునిలో ఒకే సారిగా పొందగలిగాము—తిరిగి పొందగలిగాము."

—మైథిలీ శరణ గుప్త.

# పరిచయం

శాస్త్రిగారు జైనేంద్రుని పరిచయం వ్రాయమని వ్రాసినప్పుడు 'ప్రవహించే నీటిని కొలిచేదెలాగా?' అనే ప్రశ్న వేసుకున్నా. బ్రతికున్న వ్యక్తిని గురించి వ్రాయడ మంత మంచిదికాదు, పైగా జీవించియున్న రచయిత చిర వర్ధమానుడు. ఆయన్ని కొలచేదెలా! అయినా నేటికాలం ఇలా జవాబు చెప్పకొని పూరుకుంటుందా? లేదు, రచనలు చదివిన మీదట రచయితను గురించి తెలుసుకోవడం నేటి పరిపాటి. ఒకోచోట తెలుసుకున్న మీదట చదవడం కూడ జరుగుతోంది.

జైనేంద్రుని ప్రవేశంతో హిందీ సాహిత్యంలో పెద్ద తుఫాన్ లేచింది. ఈయన తీసుకున్న ప్లాట్, చేబట్టిన శైలి, వాడినభాష అంతా క్రొత్తే. చేపట్టింది వాస్తవికం, శైలిలో స్పష్టమైన వ్యక్తీకరణ, పాత్రల్లో అద్భుతమైన కాంట్రాస్టు, విరోధాత్మకమైన యాస్పిరేషన్సు, నిర్మాణాత్మకమైన దృక్పథం గల మౌలికత్వం. ఇదంతా హిందీవారికి నూతనం. అందుచేతనే ప్రారంభంలో ఈయన్ను విమర్శించినవారనేకం. రెండోవైపు మన్ననకూడా పెరిగింది. ఈయన దేనికీ చలించలేదు. రెంటినీ ఒకటిగానే తీసుకున్నాడు. కొంతకాలానికి ఏకాభి ప్రాయంగా సముచిత స్థానం లభించింది. పైగా ఈయన స్కూలంటూ ఏర్పడింది. ఇలాచంద్రజోషీ, అజ్ఞేయ ఈయన స్కూలుకు చెందినవారు.

ప్రేమ్‌చంద్ తరువాత తరచు ఈయన్ని పేర్కొంటారు. నన్నడిగితే ఈయన తరువాతనే ఎవరైనా. హిందీ సాహిత్యంలో ఉపేక్షిత విషయాలను, అందులోనూ ఎవరూ ముట్టని, మరుగుపడిన, చిన్న చిన్న విషయాల్ని పూర్తి చేసింది ఈయన. మరొకరు సియారామ శరణ గుప్తగారు. ఆట్టే చూస్తే వీరికి అష్టసిద్ధుల్లో 'లఘిమ' బాగా వచ్చినట్లుంది. ఒకరిది గద్యం-మరొకరిదిపద్యం: జైనేంద్రుడు 'తమరు ఏమిచేస్తున్నా?'రనే విషయం దగ్గరనుంచి ఆత్మ - పరమాత్మ వరకు వ్రాశాడు. చదువుకున్న మధ్యతరగతివారి మనస్తత్వ - చిత్రణలో ఈయన శరత్‌కి ఏమాత్రం తీసిపోడు. పాత్రల వివేకాన్ని చిత్రించడంలో రవీంద్రుడు. ఇలా శరత్-రవీంద్రులను ఈయనలో చూచుకొని హిందీ పాఠకులు గర్విస్తారు. 'నన్ను మించిపోయా'డన్నాడు ప్రేమ్‌చంద్; ఇంకా ఈయన్ను 'ఇండియన్ గోర్కీ' అన్నాడు. తెలుగునాట గోపీచంద్‌ని ప్రక్కన పెట్టుకుంటే ఈయన్ను తొందరగా అర్థంచేసుకోవచ్చు.

1929 లో 'ఫాంసీ' కథలసంపుటితో సాహిత్యరంగంలో ప్రవేశం. మరుసంవత్సరమే 'పరఖ్' నవల ప్రచురణ. ఈయన పరఖ్‌తో పేరు తెచ్చుకున్నాడు. అది పండిత-పామర ప్రశంసల నందుకొనడమేగాక హిందు

స్తానీ ఎకాడమీ వారి బహుమతి నందుకుంది. తరువాత సునీత, త్యాగపత్ర, కళ్యాణి, సుఖద, వివర్త, వ్యతీత మొదలైన నవలలు వ్రాశాడు. ప్రతిదీ 'బాగు' అనిపించుకుంది. ఇంకా కథలెన్నో వ్రాశాడు. ఈయన ఒక్క కథకుడే గాదు, తత్త్వవేత్త కూడాను. 'జైనేంద్రకే విచార్' 'ప్రస్తుతప్రశ్న' 'జడ్ కీ బాత్' 'మంథన్' 'సోచ్-విచార్' మొదలైనవి తాత్త్విక గ్రంథాలు. 'సాహిత్యకా శ్రేయ-ప్రేయ' 'పూర్వోదయ్' సాహిత్యాలోచనలు.

మానవ బలహీనతను క్రిటికల్‌గా చిత్రించడంలో హిందీలో ఈయనకు ఈయనే సాటి. ఏ సమస్యతో ప్రారంభిస్తాడో అదే సమస్యతో ముగిస్తాడు. 'పరఖ్'లోని 'కట్టో' 'త్యాగపత్ర'లోని 'బువా' పాత్రలు మన సానుభూతి - సమవేదనలకు పాత్రము లౌతవి. ఈయన పాత్రలు రాగ ద్వేషాలకు నిలయాలు, ఆత్మపీడితులు. ఆ ఆత్మవ్యథలోనే పరమాత్మను దర్శిస్తాడు.

సంఘంకంటె వ్యక్తి ప్రధానం ఈయనకు. పాత్రల్లో వ్యక్తిత్వం మెండు. వీరివన్నీ వ్యక్తిపాత్రలు. చూద్దామన్నా 'టైపు'పాత్ర కనిపించదు. ఈవిషయంలో గోర్కీని గుర్తుకు తెస్తాడు. సంఘాన్ని సున్నితంగా పరిహసిస్తాడు. పాత్రల్లో కామన్‌సెన్సు ఎక్కువ. అనుభవంమీద నమ్మకంజాస్తి. ఏదీ ఈయన ఊహాగానంగా వ్రాయలేదు. ఈయనకు సాహిత్య విలువలు బాగా తెలుసు. సాహిత్యంలో సాంఘికదృష్టికంటె తాత్త్వికదృష్టి మెండు. అఖండ సత్యాన్వేషణ ఈయన సాహిత్యోద్దేశ్యం. ఏ జీవితాదర్శంతో ఈయన కథకుడో, అదే జీవితాదర్శంతో తత్త్వవేత్త. తత్త్వవేత్త సహజంగా హేతువాది. ఈయన వ్యక్తిత్వంలో వచ్చిన అనుకూలం - ప్రతికూలం కృతిత్వంలోకూడా ద్వీగు సహాసంగా నడిచాయి. ఈయనకు తెలియనిదంటూ లేదు. వ్రాసినదంతా నిర్మాణాత్మకంగా వ్రాశాడు. మాట్లాడినా నిర్మాణాత్మకంగానే. ఇది నాకు బాగా జ్ఞాపకం : **1944** మేలో గాంధీ ఆశ్రమం (కొమరవోలు, కృష్ణా జిల్లా)లో అడిగిన ప్రశ్నలకు ఇచ్చిన జవాబులు సూక్తులుగా హృదయాన్ని హత్తుకున్నాయి. ఆయన్ని అడిగినన్ని ప్రశ్నలు ఇంకేరచయితను అడుగలేదనుకుంటాను. ఆయానిచ్చిన జవాబులు కొన్నివందల పేజీల్లో అచ్చయ్యాయి. మానవుడు ఎందుకు వ్రాస్తున్నాడనే ప్రశ్ననుంచి మంచీ - చెడూ, సుఖ - దుఃఖాలు, సాహిత్యం, నీతి - నియమాలు మొదలైన అనేక విషయాలపై చక్కని జవాబులిచ్చాడు. అశ్లీలంమీద ఆయన ఇచ్చిన జవాబు నన్ను బాగా ఆకర్షించింది : "ఏదీ అశ్లీలంకాదు, అది మన దృష్టిదోషం-మనదృక్పథం". ఇదీ ఆయన జవాబు. ఆయన్ను చదువుతుంటే వినోదంకంటే విజ్ఞానం మెండు. ఎచ్చటా ఉత్తేజితులం కాము. రసాస్వాదనమే మనకందేది. ఈయన పరిస్థితులకు భయపడిగాని లోనైగాని వ్రాయలేదు.

ఈయన రచనలు సంకల్ప - వికల్పాలు; వికల్పంతో ప్రారంభించి సంకల్పంతో ముగిస్తాడు. తర్కంతో ప్రారంభించి విశ్వాసంతో విరమిస్తాడు. అలాగే గద్యంతో ప్రారంభించి పద్యశైలితో ముగిస్తాడు. ఈయన్ని గద్య కవి అన్నా తప్పు లేదు. మనస్తత్వ రచయిత సహజంగా వికల్పశీలి. సంకల్ప శీలిగా మారితే కవిగా జను వేస్తాం. ఈయన ఆబ్జెక్టివ్ - సబ్జెక్టివ్ రెండు రకాలర చయిత. ఉద్దేశ మూలకంగా వ్రాసినప్పుడు ఆబ్జెక్టివ్; కవి హృదయంగా చెప్పినప్పుడు సబ్జెక్టివ్. ఈయన ఏదీ దాచలేదు. అంత రాత్మలో లేచిన సంఘర్షణను కాగితం మీదకు దించాడు. వారి ప్రతి అక్షరం భావ — బుద్ధి పోరాటంతో బయటపడింది.

ఇరవయ్యో శతాబ్దపు రచయితలు చివరికి తత్వవేత్తలుగా మారాలన్న బెర్నార్డ్ షా వాక్యం ఈయన విషయంలో అక్షరాల రుజువైంది. ఈయన ఆస్తికుడు అయినా, భౌతిక వాదాన్ని కాదనలేదు. Matter and mind పరస్పరాపేక్షం అంటాడు. Nothing is sinal ఈయన స్యాద్వాదం. జిజ్ఞాస - సమన్వయం ఈయన తాత్విక చింతను మూలం. గాంధీగారి వ్యావహారిక ఆధ్యాత్మికవాదం ఈయన్ని బాగా ఆకర్షించింది.

నిర్మాణం - సమన్వయం - మానవత్వం (ఐక్యత) ఈ మూడు ఈయన వ్యావహారిక ఆధ్యాత్మిక వాదానికి లక్ష్యం. వ్యావహారికం - ఆధ్యాత్మికం, చీకటి - వెలుగు ఈ రెంటినీ కలిపి చూడటంతో జీవితంలో సంధి సాధ్యం అంటూ రెంటినీ సానుభూతితో చూస్తాడు. ఈ సానుభూతి చూపడంలో రచయిత జైనస్యాద్వాది. ఈయన తాత్విక చింతను జైన-తర్కపద్ధతి 'స్యాద్వాదం' ఆధారం. ఇంకా ఈయన్ని కాంట్ పరతత్వ వాదంలోని నైతిక దృక్పథం బాగా ఆకర్షించింది. గాంధీ - టాల్‌స్టాయ్‌ల ఆస్తికత్వం నచ్చిందంటాడు. వ్యక్తిలో నైతిక బలాన్ని పెంచాలంటాడు. ఆలోచనలను కంట్రోల్ చెయ్యడం సుతరాము గిట్టదు. 'వ్యక్తిలోని సమిష్టి భావం సాహిత్యం' ఇదీ ఈయన సాహిత్యానికిచ్చిన పరిభాష.

ఇలా ఈయన ఇచ్చిన పరిభాషలు చెప్పిన సూక్తులు చెప్పుకు పోవడంలో శాస్త్రిగారిచ్చిన రెండు పేజీలు ఎప్పుడో దాటాను. ఎంత క్లుప్తంగా పరిచయం చేద్దామన్నా పది పేజీలకు తక్కువకాదు. ఈ కొలతను తక్కువలోనే ముగిస్తున్నాను.

తెనాలి,
11-11-'56

దోనేపూడి రాజారావు

# తొలి పలుకు

సుఖదాదేవి ఆత్మకథను బైటికి తీసుకురావడంలో నాకు కొన్ని అనుమానాలు లేకపోలేదు. కాని ఒక ధైర్యం మాత్రం ఉంది: ఇది అచ్చు అయి వెలుగు చూడవలెనన్న కోరిక ఆమెకు ఉన్నట్టే రచనలో కనిపిస్తుంది. కోరిక అయితే ఉంది; కాని నమ్మకం ఉన్నట్టు లేదు. అందుచేత అక్కడక్కడ వర్ణనలు సుదీర్ఘంగా సాగిపోయాయి. అటువంటి చోట్ల నేను స్వతంత్రించి కొన్ని భాగాలు తీసివేశాను, కొన్ని తగ్గించాను. అందువల్ల పాఠకుల హృదయాల్ని స్పృశించి, సానుభూతి ఉత్పన్నం చేయగల భావ తీవ్రత ఎక్కడా దెబ్బ తినలేదనే నా నమ్మకం.

సుఖదాదేవి మొన్నమొన్నటిదాకా బ్రతికే ఉంది. ఆమెను ఎరిగిఉన్నవాళ్ళూ, బంధువులూ చాలమంది ఉన్నారు. కాగా ఇప్పుడామె జీవితకథను నేను ప్రకటించుట విపత్కరమైన పనే. ఐనా రచనలో ఎక్కడా కల్ల, కపటం లేదు. ఎవరి యెడల అన్యాయం జరగలేదు.

ఆమె తన కథ అంతా వ్రాసుకుని ఉపసంహార ప్రకరణంతో మనవద్ద సెలవు తీసుకుంది. ప్రకరణం చివర ఒక తేదీ కూడా ఉంది. కాని ఆ తేదీకి తరువాత ఆమె చనిపోయిన తేదీకి మధ్య చాల అంతరం ఉంది. కాబట్టి ఈ కథకు ఉత్తర భాగం కూడా ఉంటే ఉండవచ్చు. అదికూడా దొరికితే ప్రకటిస్తాను. ఈ భాగం ఎలాగో నా చేతికి వచ్చింది. ఉత్తర భాగాన్ని కూడా సంపాదించడానికి నాశక్తి కొలది ప్రయత్నిస్తాను, అంతవరకే నేను చెప్ప గలిగింది. ఆపైన భగవదిచ్ఛ ఎలా ఉంటే అలా జరుగుతుంది.

మీ,

జైనేంద్రకుమార్

# సుఖద

నేను ఎందుకోసం నా ఆత్మకథ రాయటానికి పూనుకున్నానో నాకే తెలియదు. ఇక్కడ ఈ ఆసుపత్రిలో పైన మేడమీది గదిలో మంచాన పడివున్నాను. ఏమీ తోచని పరిస్థితి. చుట్టూ శూన్యవాతావరణం. నన్ను ఆవరించిన ఈ శూన్యస్థితి నన్ను మింగివేసేట్టుగా ఉంది. చేసే పనేమీ లేదు. శూన్యంలోకి చూస్తూ పడివున్నాను. ఆ శూన్యంలో నా నిరర్థక జీవితమే మొదటినుంచి చివరదాకా విరచితమై కనిపిస్తూ ఉంది. అలా కళ్ళయెదుట అనివార్యమైన విధివైపరీత్యాన్ని చూస్తూ ఉంటే బ్రతుకు భారంగా తోస్తున్నది. ఇటువంటి పరిస్థితిలో 'సరేకానీ, ఆత్మకథ రాసుకుందాం' అనిపించింది.

లాభం? లాభమేమీ ఉన్నట్టు కనిపించదు. ఈ రాస్తున్నది ఎప్పటికైనా అచ్చుపడే అవకాశం ఉందా? బహుశా అచ్చుపడదనే అనుకుంటాను. మరెందుకూ ఈ రాయటం? ఏమో, నాకు తెలియదు. ఏమైనా మొత్తంమీద రోజూ కొంతసేపు కాలక్షేపమన్నా ఔతుందిగా! లేకపోతే గడియలు యుగాలై ప్రాణాల్ని కొరుక్కుతింటున్నాయి.

ఆసుపత్రిలో పడివున్నాను. ఒక్కదాన్నే. ఒక నౌకరైతే ఉన్నాడనుకోండి. బిడ్డలు, భర్త...అందరూ ఉన్నారు

ఎక్కడో దూరాన. వాళ్ళను తలచుకోటానికే భయం వేస్తోంది. ఏ ముఖం పెట్టుకుని వాళ్ళను ఇంకా స్మరించగలను ? నా యీ చేతులతోనే వాళ్ళను దూరంగా నెట్టేసుకున్నాను. నా యీ దౌర్భాగ్యాన్ని నేనే చేతులారా కొని తెచ్చుకున్నాను. ఒకప్పుడు బంగారంలాంటి సంసారం నాది; ఇప్పుడు తల దాచుకోటానికి బెత్తెడు తావులేదు. అంతా నాకు భ్రష్టం అయిపోయింది. కారణం నేనే, నా ప్రవర్తనే. ఇప్పటికైనా కోరుకుంటే నా పచ్చని సంసారం నాకు మళ్ళీ ఒనగూడుతుంది. కాని — నేను అందుకు మాత్రమే తగినదాన్నై ఉంటే—

నాకు జబ్బు బాగా ఎక్కువైపోయింది. ఇది ఆఖరు దశ. ఆ సంగతి డాక్టరుకు బాగానే తెలుసు. అయినాకూడా ఇంకా బ్రతుకుతానేమో నని ఆశపడుతున్నాడు. బ్రతకాలన్న ఆశ నాకు కల్పించటానికీ ప్రయత్నిస్తున్నాడు. పాపం డాక్టరు! నా పేరు ప్రతిష్ఠలు తెలిసినవాడేమో, నా పట్ల చాల గౌరవంగా, ఉదారంగా ఉంటున్నాడు. కాని నాలాంటి వ్య ఇంకా బ్రతికిఉండటం నిరర్థకం అన్న విషయం గుర్తించలేక పోతున్నాడేం ? నేను ఇంకా బ్రతికిఉండటం నిరర్థకమని నాకు మాత్రం నిశ్చయమైపోయింది. ఇప్పుడు నా వయస్సు ముప్ఫయి సంవత్సరాలు మాత్రమే. అయితేయేం ? అంత మాత్రం ఆయుస్సు చాలదా ? ఇంత ఆయుస్సు పోసి బ్రహ్మదేవుడు నన్నిక్కడికి ఎందుకు పంపించాడో నాకు బోధపడటం లేదు. ఇంతవరకూ చేసింది ఏముందీ ? ఏమి ఆధారం చేసుకుని ఇంకా బ్రతకాలని కోరుకునేది ?

ఆసుపత్రి మేడమీద వరండాలో మంచంమీద పడు

కుని చూస్తోంటే ఏముంది? ఇల్లు, దుకాణం, మనుష్యులు, పరివారం—ఏమీ లేదు. అంతా శూన్యమే. ఆ శూన్యం లోనే ఏవో దృశ్యాలు పొడసూపుతూ ఉంటాయి. ఆ శూన్యమే నిరంతరాయంగా ఏవేవో చిత్రాల్ని ప్రదర్శిస్తూ ఉంటుంది. అల్లంత దూరాన భూమి క్రిందికి ఏటవాలుగా దిగిపోయింది. ఎంత లోతువరకూ అలా పోయిందో మరి! ఆపైన విశాలమైన మైదానం కనిపిస్తుంది. అక్కడక్కడ పెద్ద పెద్ద యిళ్ళు కాబోలు చుక్కల్లా అగపడుతున్నాయి. ఓ వైపు పొలాలు కాబోలు పచ్చగా ఉన్నాయి. మరోవైపు నేలంతా గోధుమరంగులో ఉంది. ఇంకా చాలదూరాన రెండు తెల్లని గీతల్లా కనిపిస్తున్నాయి, నదులు అయివుండచ్చు. దృష్టి ఇంకా దూరానికి నిగిడ్చి చూస్తే సర్వమూ ఒకానొక అస్పష్టమైన వలయాకారపు రేఖలో అంతర్హితమై అంతరించిపోతోంది. అంతవరకే నా దృక్పరిధి.

అలా వరండాలో కూచుని ఈ అనంతావకాశంలో దృశ్యపరంపర పరికిస్తూ ఉన్నాను. 'అనంతం' అన్నాను. కాని 'అనంతం' అంటే యేమిటో నాకు తెలుసా అసలు? నా చూపు ఎంతవరదాకా అందుకోగలదో అక్కడితో ఈ దృశ్యపరంపర సమాప్తి చెందుతుందని అనుకుంటాను. కాని నిజంగా సమాప్తి చెందుతున్నదా? అక్కడితోనే ఇదంతా అంతమా? 'అంత'మని ఎక్కడేనా ఉన్నదా అసలు? లేదు. చిత్రాలు తయారౌతూ ఉంటాయి; చెరిగిపోతూ ఉంటాయి; మళ్ళీ లేస్తాయి. చిత్రపటం ఎప్పుడూ అలాగే ఉంటుంది. దానిమీద చిత్రకారుని లీలలు ఎప్పటికెప్పుడు

కొత్తకొత్తగా ప్రత్యక్షమౌతూనే ఉంటాయి. అతని యీ చలనచిత్రజగత్తులో ప్రతివస్తువుకూ స్థానం ఉంది. నాకూ ఉంటుందని అనుకుంటాను. నల్లని బిందువుకూడా స్థానం ఉంటుంది. బిందువు నల్లనిదే కావచ్చు; అయినా ..నిరంతరం తయారౌతూ, చెరిగిపోతూ, మారుతూ సాగిపోతూఉండే ఈ చిత్రంలో ఒకానొక బిందువుయొక్క నైల్యంద్వారా సృష్టికర్త ఏమి సాధింపదలచాడో మరి! బహుశా... ఏమైనాగానీ, ఆ నలుపు తలచుకుంటేమాత్రం నాకీనాడు చాల భయంవేస్తోంది.

నేను నా అవసానదశకు చేరుకున్నాను. ఈ దశ దాటిన తర్వాత ఏం గావాలి? ఆపైన ఏముంది? ఒకరు ఒక విధంగా చెబుతారు. ఇంకొకరు ఇంకోవిధంగా చెబుతారు. ఎన్ని తలకాయలున్నాయో అన్ని అనుమానాలు. ఏది నిజమో, ఏది అబద్ధమో నిర్ణయించలేం. కానిఒక్కమాటమాత్రం నిజం: ఈ అవసానదశతోనే సర్వం సమాప్తిచెందదు. మనం ఇక్కడ ఉండం; ఆమాట నిజమే. కాని దిశలు అనంతములు. మృత్యువు తరువాత కూడా అస్తిత్వం ఉంది; పరగతులు ఉన్నాయి. జీవనధార నిరంతరం పరిభ్రమిస్తూ ఉంటుంది. కర్మఫలయోగపరంపరకు ఆది లేదు; అంతం లేదు; నడిమిదశ మాత్రం ఉంది. కాని ఎందుకూ ఈ ఆలోచన? నా ఆరోగ్యం పూర్తిగా పాడైపోయిందనీ, మరి నేనింకే ప్రసక్తీ పెట్టుకోకూడదనీ గుర్తు ఉంచుకోవాలి. మాటిమాటికీ దగ్గు గుండెలు పెగుల్చుకుని వస్తూ ఇదొక పాడురోగం అని మాటిమాటికీ జ్ఞాపకం చేస్తూఉంది.

తుచ్ఛురాలిని; జబ్బుమనిషిని. అయినాకూడా కాలక్షేపం

కోసం ఆత్మకథ చెప్పుకుంటున్నాను. నిజానికి ఈ కథ అచ్చు పడాలనీ, లోకులు చదవాలనీ నాకు ఆశ లేకపోలేదు. ఎప్పటికైనా అచ్చుపడి, లోకులు దీన్ని చదివి, వారి సానుభూతి పొందగలిగితినా, నాకు పరలోకంలో కాస్త ఓదార్పుగా ఉంటుంది. పరలోకం అంటే ఏమిటో, అక్కడికి మీ సానుభూతి నాకు ఎలా చేరుతుందో నాకైతే తెలియదు. బహుశా నాకు అక్కడ నరకమే సంప్రాప్తమౌతుందేమో! ఏమైనా కానీ ఇది నా అవసానదశ. ఆత్మకథ చెప్పుకుంటున్నాను. ఈ కథ మున్ముందు ఎవరెవరు చదవనున్నారో నా కిప్పుడు తెలియదు. కాని వారి సానుభూతిని పొందటం అవసరమని నాకు తోస్తున్నది. పరలోకసుఖంకోసం యీ లోకంలో ఆచరించవలసిన కొన్ని ధర్మాలు ఉన్నాయని చెబుతారు. అవేమీ నాకు తెలియవు. నేను చేసిందీ ఏమీ లేదు. కాని ఇహలోకవాసుల సానుభూతి పరలోకవాసులకు సాయపడగలదన్న విశ్వాసాన్ని మాత్రం నేను వదలుకో దలచలేదు.

అంతర్యామి ఒకడు ఉన్నాడు. ఎక్కడ ఉన్నాడో అతని రూపం ఎలా ఉంటుందో నేను చెప్పలేను. నా హృదయమంతా ఆయనకు బాగా తెలుసు. నేను ఆయన్ను చేరుకోగలిగితే పాదాలమీద వాలిపోయి అంటాను: "స్వామీ! నీకు సర్వం తెలుసు. ఏం చేశానో చేశాను. నన్ను విడిచి పెట్టి పోబోకు. ఇదిగో, నేనే, నా యదార్థరూపంలో నీముందు ఉన్నాను" అని.

ఇవాళ టపాలో మావారి దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. దానికి జవాబుకూడా రాసేశాను. వారు ఏమి రాశారంటే:

"మీ అమ్మగారిద్వారా నీ క్షేమసమాచారాలు నాకు అప్పు డప్పుడు తెలుస్తున్నాయి. ఒకసారి వచ్చి నిన్ను చూడాలని ఉంది. నీ కిష్టమైతే ఉత్తరం రాయి. నేను రావటం నీకు ఇష్టం లేకపోతే రాయద్దు" అని రాశారు. ఉత్తరంలో ఇంకా కొన్ని సంగతులుకూడా ఉన్నాయి. అవన్నీ నేను మీకు తెలిపితే మీ సానుభూతి నాకు దుర్లభం ఔతుందేమో! ఆ ఉత్తరానికి జవాబు నేను వారికి రాయలేదు; మా అమ్మగారికి రాశాను: "నా ఆరోగ్యం ఇక్కడ రోజురోజుకూ బాగు పడుతూనే ఉన్నదని వారికి తెలియజెయ్యి. వారిక్కడికి వచ్చి చూడవలసిన అవసరంలేదు. వారి ఉత్తరాలు నాకు దయ వుంచి పంపవద్దు" అని.

టపా రెండుగంటలప్పుడు వచ్చింది. అప్పుడే జవాబు కూడా రాసి పంపించేశాను. ఇప్పుడు మూడు గంటలైంది. కాగితాలు, కలం పుచ్చుకుని ఆత్మకథ రాసుకుందామని కూర్చున్నాను. మొదటిసారిగా నా మనసులో కలిగిన ఆలో చన ఏమంటే: "అటువంటి జవాబు రాయవలసిన దౌర్భాగ్యు రాల్ని అయినాను కదా! భర్తను పిలిపించుకుని లక్షసార్లు, కోటిసార్లు 'నన్ను క్షమించండి' అని అడగలేకపోతున్నానేం? 'మీరు ఇక్కడికి రండి. మీ పాదధూళితో నా తల అలంక రించుకుంటాను. లేకపోతే నిమిషనిమిషానికీ మృత్యుముఖంగా జరిగిపోతున్నాను' అని రాయలేకపోతిని కదా!" ఇటువంటి ఆలోచనలతో వివశనైపోయి, నా అభాగ్యగాథ రాయటం మొదలుపెట్టాను. లేకపోతే ఈ మనోబాధ నేను సహించ లేకుండా ఉన్నాను.

మూడుసంవత్సరాల తరువాత వారు నాకీ ఉత్తరం రాశారు. ఇన్నాళ్ళు నాకు ఉత్తరం రాయకుండా వారు ఎలా సహించి ఉన్నారో నాకు తెలియకపోలేదు. ఇన్నాళ్ళకు మూడు సంవత్సరాల తరువాత ఈనాడు మళ్ళీ వారు ఏంత ఓర్పు తెచ్చుకుని ఈ ఉత్తరం రాయగలిగారో—ఆ సంగతికూడా నాకు తెలియకపోలేదు. కాని వారికి నేను అమ్మద్వారా జవాబు పంపించాను: 'నన్ను గురించి మీరేమీ ఆలోచించ నద్దు. అటువంటి శ్రమ పెట్టుకోవద్దు' అని. ఎంత అభాగ్యురాలినో!

ఇక రాయలేను. అలసిపోయాను. ఇలా రాస్తూ పోతే కథ ఆరంభం కాదు. హృదయబాధే బైటికి పొర్లి వస్తూ ఉంటుంది. ఇవాల్టికి ఇక్కడ ఆపేస్తాను. రేపు మళ్ళీ మొదలు పెడతాను. అదిగో డాక్టరుకూడా వస్తున్నట్టున్నాడు.

## 2

కథ ఎక్కడినుంచి ఆరంభం చేసేది? నిన్న రాసింది ఒకసారి చదివాను. ఇక భావవీధిలో విహరించను. నాస్థితికి నేను జాలిపడను. నన్ను నేను అర్థం చేసుకోటానికి ప్రయత్నిస్తాను. నన్ను నేను ఖండించుకుంటూ పెడతాను.

పేరు సుఖద. ఈ పేరు చాలమంది వినే ఉంటారు. వార్తాపత్రికలద్వారా ఆమెను మీరు ఎరిగేఉంటారు. నేనే ఆమె. తల్లి, తండ్రి, భర్త, పుత్రులు—అంతా ఉన్నారు. కాని వాళ్ళందర్నీ క్రిందనే దిగవిడిచి కీర్తిపథాలు ఎక్కివెళ్లాను.

అల్పవయస్సునందే చాలా అనుభవాలు సంపాదించాను. స్వప్నగత ప్రేమ చవిచూచాను. అనేకుల ప్రశంసలు పొందాను. అదంతానే నా కిప్పుడు దుఃఖహేతువుగా పరిణమించింది. నేను చాల పైకి ఎగిరిపోతున్నానని లోకులు అనుకున్నారు. నిజంగానే ఉత్పథాలకు ఎగిరిపోతున్నానని నేనూ అనుకున్నాను. కాని విధి వైపరీత్యం చూడండి! ఎక్కడికక్కడ తెగతెంపులు చేసుకుంటూ... నేను వేరు... అన్న భావంతో... పరుగులు పెట్టి చివరకు ఏకాకి నైపోయాను. ఎక్కడ ఆగి చూచినా, నాకు కనిపించింది శూన్యం, శూన్యం! శూన్యం! కేవలం యెండమావులు! నీళ్ళెక్కడా లేవు. శూన్యమే ధగధగా మెరుస్తూ కనిపించేది. ఈనాడు బాగా అలసిపోయి వున్నాను. ఏమాత్రం సత్తువ లేదు. ఆ పరుగులు పెట్టటంలో నాలోని ప్రేమలన్నీ ఇగిరిపోయాయి; మిగిలిందేమీ లేదు. ఇలా ఇప్పుడు నడియెడారిలో వచ్చి పడ్డాను. పైన నెత్తి మాడే యెండ. క్రింద పాదాలు బొబ్బలెక్కే ఇసుక. చుట్టుపక్కల యెక్కడా జన సంచారం లేదు. తిరిగి వెనక్కు వెళ్ళిపోయే ఆస్కారం లేదు. ఎప్పుడో ఈ కొనఊపిరి ఆగిపోవటమే మిగిలి ఉంది.

విపరీతాల్లో కెల్లా విపరీతం చూడండి! 'సుఖదాదేవి వీరవనితసుమీ!' అని ప్రశంసించినవారు యెందరో ఉన్నారు. ఈ అభాగ్యురాలి దర్శనంకోసమని అనేకమంది వచ్చి వెళ్లే వాళ్లు. అప్పుడు అనుకునేదాన్ని: 'నాకు ఈ వీరత్వంనుంచి యెప్పుడు విముక్తి కలుగుతుందా భగవంతుడా?' అని.

నేటికి నా అభిప్రాయాలన్నీ ఉడికి ఉడికి తారుమారై పోయాయి. ఈ కథ అంతా చదివి లోకులు ఏమనుకుంటారో

మరి ? ఇదా ఆ సుఖదాదేవి కథ ? అని ఆశ్చర్యపోతారేమో ! కాని నిజంగా ఇదే ఆ సుఖదాదేవి కథ. సుఖదాదేవి ఈ రోగంతో చనిపోవచ్చు. పూర్వం వార్తాపత్రికల్లో పేరుమోగిన ఆ సుఖదాదేవే అసలైన సుఖదాదేవి కావచ్చు. ఏమైనాగానీ, ఆ పూర్వగాథ యావత్తూ వట్టి తమాషా అని నాకు ఇప్పుడు స్ఫురిస్తున్నది. అందులో పటుత్వం లేదు, సత్యం లేదు. అందు వల్ల జీవితం వికసించలేదు, నాశనమైపోయింది. హృదయంలోని ప్రేమ పరిపుష్టం కాలేదు; అసహజమైన మార్గాల్లో తపించి, శుష్కించి, ఇగిరిపోయింది. ఇంతకాలం అనవసరంగా పరుగులు పెట్టాను. అంతకుమించి ఒరిగిందేమీ లేదు.

నాలో నేను తరచి చూచుకుంటే—ఏముంది అక్కడ విశేషం ? అందరు ఆడపిల్లలవంటిదాన్నే నేనున్నూ. చెప్పుకో దగిన విశేషం ఏముందనీ ? అయినా నాలో ఏదో విశేషం ఉన్నట్టూ, నేనొక విశిష్టురాల్ని అయినట్టూ భావించుకుంటూ ఉండేదాన్ని కాబోలు ! అమ్మ, నాన్న నన్ను ఎంతో గారాబంగా చూచేవాళ్ళు. మొదట పుట్టిన ఆడపిల్లను నేను. నాకు ఒక అన్నయ్య ఉండేవాడు. అతడు నాకన్నా అయిదేళ్లు పెద్ద. అందుచేత నాతో పోట్లాడేవాడుకాదు. ముద్దుగా దగ్గరకు తీసి ఆదరించేవాడు. ఇంతకూ చాల గారాబంగా పెరిగిన పిల్లను. నా మాట చలామణీ ఔతూ ఉండేది. నేను చక్కని దాన్ని, సంపన్నుల యింటి బిడ్డను - అన్న భావం ఉండేది. నన్ను బడికి పంపించారు. తొమ్మిదో తరగతివరకూ చదివాను. ఆతర్వాత ఇంకా చదువుకోటానికి మనస్కరించలేదు; చదువు మీద అయిష్టతా ఏర్పడ్డది. కాని అప్పటికే ఇంగ్లీషులో

మాటాడ్డం చాతనయింది; తెలుసుకోదగిన విషయాలన్నీ తెలుస్తున్నాయి. ఇంకా యెందుకు చదువు? ఒక సంవత్సరం ఇంట్లోనే ఉండిపోయాను... స్నేహితురాళ్ళతో ఆడుకుంటూ పాడుకుంటూ. తరువాత పద్ధెనిమిదోయేట నాకు వివాహం అయింది.

ఇక్కడ కొంచెం ఆగాలి. వివాహం అంటే ఏమిటి? జీవనయాత్రలో వివాహంవరకూ ఒకయెత్తు; ఆతరువాత ఒక యెత్తు. ఒక మజిలీ సమాప్తమై మరో మజిలీ ఆరంభమౌతుంది. వివాహంవరకూ రాస్తా ఎగుడు దిగుడులు లేకుండా సమంగానే ఉంటుంది. ఆతరువాతమాత్రం రోడ్డు ఎత్తుగా పైకి వెడుతుంది. అక్కడ గ్యాలప్ తీసి పరుగుపెట్టటానికి వీలేదు. అక్కడ ఒకే వ్యక్తి కాదు, మరో వ్యక్తి కూడా తోడు ఉంటుంది; ఆ ఒక్క వ్యక్తే కాదు, ఇంకా చాలమంది ఉంటారు వెంట. వివాహానంతరం వ్యక్తిత్వం కేవల వ్యక్తిత్వంగా ఉండక నాగరిక వ్యక్తిత్వంగా ఉంటుంది. అదొక పెద్ద ప్రశ్నార్ధక చిహ్నం; ఒక గొప్ప సమస్యకు సంబంధించిన పెద్ద అధ్యాయం; ఏవేవో కొన్ని గుణగణాల సంపుటీకరణం. కేవలం కలలు కంటూ కూర్చోటంతో సరిపోదు. కొంత బాధ్యతకూడా వచ్చిపడుతుంది. కేవలం పుచ్చుకోలు వ్యవహారమే కాదు. ఇచ్చికోలు వ్యవహారంకూడా ఉంటుంది.

ఈ మీమాంసను ఇక్కడ ఆపేద్దాం. నాకు పెళ్ళి అయింది. పెళ్ళి కాకపూర్వం నేను కన్న కలలు, నాలో అజ్ఞాతంగా ఊగిసలాడిన కోరికలు వాస్తవంగా అనుభవంలోకి

వచ్చే అవకాశం లభించిందికదా అనుకున్నాను. ఈ నా తెలివి తక్కువతనాన్ని ఇంకా అధికంచేసే భర్తే దొరికారు నాకు నేను చక్కనిదాన్నని నాకు తెలుసు. సౌందర్యగర్వంకూడా ఉండేది నాకు. మావారు నన్ను దగ్గర కూర్చోబెట్టుకుని ఎంతోసేపు, మాట పలుకు లేకుండా, అదేపనిగా నావైపు ముగ్ధుడై చూస్తూండేవారు. అప్పుడు నాలో నేను అనుకునేదాన్ని: 'నాది నిజంగా అసాధారణమైన సౌందర్యం' అని. మావారు ఎప్పు డెప్పుడు, ఏ యే రకంగా నన్నూ, నా సౌందర్యాన్నీ లాలించి, యాచించి, అనుభవించటానికి ప్రయత్నిస్తూఉండేవారో— అదంతా తలచుకుంటే ఇప్పటికీ నా శరీరం పులకరిస్తుంది, సిగ్గు తెరలు కమ్ముకొస్తాయి. ఆరోజుల్లో వారి ప్రేమనూ, ఆదరాన్నీ అన్యాయాసంగా స్వీకరించేదాన్ని—అవి నాసొత్తే అన్నట్టు. ఒక రకమైన ఆత్మాభిమానం నాలో వేళ్ళుపాతుకుపోయింది. వారు నాపట్ల ఇంత ఆదరం చూపుతున్నారంటే, నా సౌందర్యం చూచి సంభ్రమచిత్తులు ఔతున్నారంటే... అంత ఆర్హత నాలో ఉంది, అందుకు నాకు హక్కు ఉంది...అని తలచే దాన్ని. కాని అందువల్ల నాకు రసానుభూతి ఏమాత్రమూ లభించలేదు. పైగా నా పరిస్థితిలో రకరకాల అభావాలు తొంగిచూస్తూ కనిపించేవి.

నిజం చెబుతున్నాను...కథ చెబుదామని ఆరంభం చేశాక మధ్యలో సిగ్గెందుకూ?...వివాహానికిపూర్వం అను కుంటూ ఉండేదాన్ని: 'నేను చేసుకోబోయే భర్తకు పదెనిమిది వందలైనా నెలజీతం ఉండాలి. తప్పకుండా ఒక మోటారు

కారు చేతిలో ఉండితీరాల్సిందే' అని. ఎటువంటి సంబంధ మైతే చేసుకోవాలో...నే నెవరితోనూ చెప్పలేదు కాని... అప్పుడే నిర్ణయించుకున్నాను. ఒక వరుడిని దృష్టిలో పెట్టుకునే ఉన్నాను. కాని విదేశాలకు వెళ్ళే ప్రయత్నంలో ఉన్న ఆ యువకుడు నా తల్లిదండ్రులకు నచ్చలేదు. అప్పు డనుకున్నాను: "మన హిందూ దేశంలో ఆడపిల్లకు తల్లిదండ్రులు శత్రుతుల్యులే. ఈ దేశంలో ఆడబ్రతుకు బ్రతుకే కాదు" అని. ఆతరువాత కొన్నిరోజులకు నన్ను వీరికిచ్చి వివాహం చేశారు. వీరికి జీతం నెలకు రెండువందలు మాత్రమే. అదేక చెప్పుకోదగ్గ జీతమా? ఇది నా మనస్సుకు మొదట బాధాకరంగానే ఉండింది. కాని వారు నన్నెంతో ప్రేమతో స్వీకరించారు. ఎంతో ఆదరణ చూపారు. ఒక్కరోజులోనే నన్ను పూర్తిగా విశ్వసించారు. నా ఆజ్ఞానువర్తి అయినారు. అందుచేత కొన్నాళ్ళు నా అభిమానాన్ని విస్మరించాను. కాని రోజులు గడచినకొద్దీ చూద్దునుకదా: చాల లోపాలు కనిపిస్తున్నాయి సంసారంలో. జీతంలో కొంతభాగం...పల్లెటూళ్ళో ఉంటోన్న మా అత్తగారికి వెడుతోంది. ఎందుకూ ఆవిడకు పంపించటం. మావారి పెద్దన్నగారు ఉన్నారుగా! ఆయన ఏదన్నా పని చేసి డబ్బు సంపాదించకూడదూ? మా ఆడబిడ్డచూపుకూడా ఎప్పుడూ మామీదే ఉంటుందేం? మేము ఇక్కడ ఎంత కష్టపడుతున్నాసరే వీళ్ళందరికీ డబ్బు పంపిస్తూ ఉండాల్సిందేనా? నా కిదంతా ఏమీ బాగులేదు. ఈ విషయాలు పురస్కరించుకుని కలతలు పొడసూపినవి.

# 3

"ఉన్న డబ్బేదో నీదగ్గరే ఉంది. ఎవరికేనా పంపిస్తే పంపించు, లేకపోతే లేదు" అన్నారాయన.

"డబ్బు నాదేం కాదుగా!"

"నేను నీవాడిని. ఈ హక్కు పురస్కరించుకుని ఉన్నదంతా నీదే. చుట్టాలు, పక్కాలు కావాలంటావా సరే. వదలుకుంటావా వదలుకో. బాగా ఆలోచించుకుని ఎలా తోస్తే అలా చెయ్యి. అంతే నేను చెప్పగలిగింది."

"మీ డబ్బు మీరే అట్టిపెట్టుకోండి. నాకేం అక్కర్లేదు. మీ యిష్టంవచ్చినట్టు చేసుకోండి. నాకు వేళకు రెండు రొట్టెలు పడేస్తే చాలు."

మావారు ప్రసంగాన్ని మరి పెరగనీలేదు. నాటినుంచీ ఇంట్లో నాయిష్టప్రకారమే నడుచుకుంటూ వచ్చాను. మావారు ఏమీ అభ్యంతరపెట్టలేదు.

ఈ పైసన్నివేశాన్ని ఇప్పుడు గుర్తుకు తెచ్చుకుంటున్నానంటే...ఆనాటి నా మనస్థితిని తెలుసుకునేందుకే – మొదటినుంచీ నాకు సౌందర్యగర్వం ఉండేదనే నాకు బాగా గుర్తు. క్రమేణా ఈ గర్వం ఇంకా చిలవలు పలవలు తొడిగింది. నేనొక యోగ్యురాలినన్న గర్వంకూడా ప్రవేశించింది. సంపన్నుల యింటి బిడ్డననీ, సభ్యత తెలిసిన వ్యక్తిననీ ఒక ఆత్మాభిమానం కూడా ఉండిందేమో! ఇంతకు తప్పితే నాలో ఇంకే విశే

షమూ ఉన్నట్టులేదు. మంచి మంచి దుస్తులే ధరిస్తూ ఉండే దాన్ని; ఇప్పటికీ అంతే. విలువ ఎంతైనాసరే బట్టలు అందంగా ఉండి తీరాల్సిందే. ఇల్లు శుభ్రంగా, పటాలు అవీ అలంకరించి అందంగా ఉండాలని నా కోరిక. అలాగే ఉంచేదాన్ని. మావారి వేషభాషల్లోకూడా ఏ చిన్న లోటుపాట్లూకూడా ఉండరాదని నా కోరిక. సంఘంలో పైమెట్టుమీాదఉండే విస్తార ధనవంతు లైనవారితో దీటుగా మా వేషభాషలు, ప్రవర్తన ఉండాలని ఆశించేదాన్ని. మేమూ, మాసంసారం వాళ్ళ దృష్టికి ఆకర్ష ణీయంగా వెలుగొందాలని కోరుకునేదాన్ని. అందుచేత మా వారు అప్పుడప్పుడు 'మితవ్యయం, మితవ్యయం' అంటూ మాటాడుతూ ఉంటే నాకు అసహ్యమనిపించేది. "మనం ఎప్పుడూ పైకి చూస్తూ ఉండాలి. అప్పుడే మనకు ఉన్నతి లభిస్తుంది" అని సమాధానం చెబుతూ ఉండేదాన్ని. వారు కూడా అప్పుడప్పుడు నా మాట అంగీకరిస్తూనే ఉండేవారు.

అటువంటి మనఃప్రవృత్తివల్లనే ఈనాడు ఈదశకు దిగ జారి వచ్చాను.

జీవితప్రవాహానికి ఆదిమమైన స్రోతస్సు ఏదో నిర్ణ యించటం కష్టం. నా జీవితానికి మొదలు నా జీవితంలోనే ఉండదు. చరిత్ర అనంతము, ప్రపంచం విశాలమైనది. వాటికి చిహ్నస్వరూపమే వ్యక్తి. కాబట్టే ఈ జీవితగాథకు మూల సూత్రాన్ని ఎక్కడ తడివి చూడాలి? అనే ప్రశ్న వచ్చింది నాకు.

ఆ సూత్రం ఎటువంటి దారాలతో పేనారో మరి! ఎవరు ఎక్కడ ఈ విశాల విశ్వరాట్టుంమీాద ఆ సూత్రాన్ని

పడుకుతూ కూర్చున్నారో మరి ! నిజం చెప్పాలంటే—ఈ విశ్వజీవితాన్నిగురించిన మన సమాలోచనలన్నీ...ఒక మహా సముద్రం ఒడ్డున నత్తగుల్లలు ఏరుకుని ఆడుకుంటూ ఉండే పసిపిల్లల నిర్ణయాలవంటివే. ఆ పిల్లలవంటి మనకు మెదడు ఏర్పడింది; హృదయం ఏర్పడింది. అవి అకర్మణ్యంగా ఉండవు. అందుచేత దుర్గ్రాహ్యమైనదాన్ని తెలుసుకోవాలన్న ప్రయత్నం ప్రపంచంలో సాగుతూ ఉంది. ఈ నా కథారచనలోకూడా... తెలిసో తెలియకో అటువంటి ప్రయత్నమే చేస్తున్నానంటే—ఆశ్చర్యం ఏముంది ?

వివాహం అయిన రెండు సంవత్సరాలకు మా పెద్దబ్బాయి పుట్టాడు. గార్హస్థ్యంలో నాకు తృప్తి కనిపించటంలేదు. ఏవేవో కలలు కంటూ ఉండటం మానలేదు. సంసారం సాగిపోతూనే ఉంది. పిల్లవాడిని ప్రేమగా సాకుతూనే ఉన్నాను. కాని మనస్సుకు సంతోషం ఏమీ లేకుండాఉంది. ఈ అసంతృప్తి ఫలితంగా అప్పుడప్పుడు ఇంట్లో ధూంధాంలాడేదాన్ని; లేదా మంచి పసందైన దుస్తులు వేసుకుని బజారుకు పోయేదాన్ని. ఒక్కొక్కప్పుడు నా అనుచరులపట్ల దయాదాక్షిణ్యాలు ప్రకటించి, నా అసంతోషాన్ని సంతుష్టపరుచుకునేదాన్ని. అప్పుడప్పుడు ఇష్టజనులను ఇంటికిపిలిచి, విందుచేసి ఆ అసంతృప్తిని మరచిపోయేదాన్ని.

ఇక్కడ ఒక్క విషయం జ్ఞాపకం వస్తోంది. నా అతిశయాన్ని అంగీకరించినటువంటివాళ్ళను మాత్రమే ఇంటికి ఆహ్వానించేదాన్ని. తదితర్లను పిలిచేదాన్నికాదు: నన్ను పొగిడేవాళ్ళే నా చుట్టూ పరివేష్టించి వుండట్టం నాకు ఆనందంగా

ఉండేది. చాటున వాళ్ళు నన్ను పొగడుతున్నారా నిందిస్తు న్నారా అన్న విషయం అనవసరం.

ఇంటో జమాఖర్చుల విషయం వచ్చినప్పుడు తరచు ఏదో సంఘర్షణ ఉత్పన్నమాతూనే ఉండేది. అటువంటి సమయాల్లో నేను రూపాయలసంచిని విసురుగా అవతలపారేసి "మీ డబ్బు మీ దగ్గరే ఉంచి మీయిష్టం వచ్చినట్టే వాడండి. నాకెందుకు పీడ" అనేదాన్ని.

మావారు రూపాయలసంచిని అందుకుని మారు మాటాడే వారు కాదు. కాని ఎలా వచ్చేదోమరి! మర్నాడే మళ్ళీ రూపాయలసంచి నాచేతికే వచ్చేది. యథాపూర్వంగా ఖర్చంతా నా చేతిమీదే జరుగుతూ ఉండేది.

నా యితర మిత్రత్వాల్ని గురించి ఇక్కడ ఏమి చర్చించను? ఒకానొక వ్యక్తితో నాకు ఏర్పడిన మిత్రత్వంలో ఒకరకమైన రసానుభూతి ఉత్కటమాతూ ఉన్నట్టు నాకు అప్పుడప్పుడు అనిపిస్తూనే ఉండేది. కాని ఇటువంటి విషయాల్ని పురస్కరించుకుని మా సంసారంలో ఏవిధమైన ఉపద్రవమూ ఏర్పడలేదు. మావారికి నామీద అఖండమైన విశ్వాసం ఉండేది. ఆ విశ్వాసమే నాకు కవచమై నన్ను కాపాడింది. ఇరు దరుల మధ్య బంధీకృతమైన జీవితప్రవాహం ఒడ్డులను కొంచెం కొంచెం ఒరసికొంటూ...అప్పుడప్పుడు ఆటకాయితనంగా ఒడ్లుదాటి పొర్లి పడుతూ...మొత్తానికి సాగిపోతూ ఉంది. ఇంతలో బైటినుంచి ఒక అఘాతం అనుకోకుండా వచ్చి తగిలింది. ఆ దెబ్బ తట్టుకోలేకపోయాను. అదే ముఖ్యంగా చెప్పవలసిన కథ. కాని ఇప్పుడు కాదు, రేపు...

# 4

ఒకనాడు మూడు ఝాములప్పుడు మావారు ఇంటికి వచ్చి "ఇదిగో, ఎవరో అబ్బాయి వచ్చాడు. ఇంట్లో పనిపాటలు చేసేందుకు ఎవరన్నా కావాలన్నావుగా! అతన్ని పెట్టుకుంటావా?" అని అడిగారు.

"ఎవరా అబ్బాయి?"

"ఎవరో నాకూ బాగా తెలియదు. చూడ్డానికి మంచి వాడులాగే కనిపిస్తున్నాడు. నౌకరీ కావాలంటున్నాడు. ఎటువంటి నౌకరీ అయినా సరేనట. చెంబు తప్పేలాలుకూడా తోముతానంటున్నాడు. కేవలం నౌకరీకోసమే కాదు, కొన్ని రోజులపాటు కాలంగడుపుకు పోదామన్నట్టుగా కనిసిస్తున్నాడు. పెట్టుకుందామా అతన్ని?"

"ఏడి ఆ అబ్బాయి?—"

"పిలుస్తా ఉండు...ఓ అబ్బాయి! లోపలికి రా!"

ఆ అబ్బాయి లోపలికి వచ్చాడు. చాల వినయంగా నా ముందు వచ్చి నిల్చున్నాడు. ఇరవై సంవత్సరాల యీడు ఉంటుందో ఉండదో! పసిమిరంగు మేనిచాయ. అనుభవ శూన్యుడులా కనిపిస్తున్నాడు. అప్పుడే తల్లి ఒడిలోనుంచి ప్రాకివచ్చి నిల్చున్న పసివాడులా ఉన్నాడు. ధరించిన దుస్తులు అతని రూపానికి తగినట్టుగా లేవు.

"చెంబు తప్పేలాలు తోమటం నీకు చాతనౌనా?"

"ఆఁ"

"శూద్రుడివా ?"

"కాదు—"

"మరి ?"

"శూద్రుడినే."

"జీతం ఎంత కావాలి ?"

"మీరు ఇచ్చినంత."

"చదువుకున్నవాడులా కనిపిస్తున్నావే !—"

"లేదు-లేదు—"

"ఏమీ చదువుకోలేదా ?"

"నాలుగోక్లాసుదాకా చదువుకున్నాను."

నాకు నవ్వు వచ్చింది. "నిజం చెప్పు: తల్లిదండ్రుల మీద కోపంవచ్చి లేచి పారిపోయి రాలేదు కద !"

ఆ కుర్రవాని ముఖం గంభీరముద్ర తాల్చింది. "నాకు తల్లిదండ్రులు లేరు."

అతడు చెబుతున్న ఏమాటమీదా నాకు నమ్మకం కుదరలేదు చాలసేపటివరకూ. "ఏదైనా ఇంట్లో వస్తువు ఎత్తుకు పారిపోవు కదా !" నవ్వుతూ అడిగాను.

కాసేపటివరకూ అతడేమీ మాటాడలేదు. చివరకు అన్నాడు: "మీకు అలాంటి అనుమానం ఉంటే నన్ను పెట్టుకోకండి. వెళ్ళిపోతాను." ఇలా అంటూ అతడు వెళ్ళిపోటానికే ఉద్యుక్తుడైనాడు. అప్పుడన్నాను: "ఇదిగో, ఉండు. ఇంతకూ నీ పేరు ఏమన్నావు ?"

"గంగాసింగు."

"మీా తండ్రి పేరు ?"

"హీరాసింగు."

"నాకు మళ్ళీ నవ్వొచ్చింది. "నీకు ఆకలి వేస్తుందా ?"

"ఊఁ, ఆకలిగానే ఉంది."

నేను ఒక జంపఖానా తెచ్చి పరిచాను. దానిమీాద వచ్చి కూర్చోమన్నాను.

అతడు ఏమీా సంకోచించకుండా వచ్చి కూర్చున్నాడు. ఈలోగా మావారు బయటికి వెళ్ళిపోయారు. నేను ఇంట్లో ఉన్న ఏవో ఫలహారాలు తెచ్చి పెట్టాను. అతడు తింటూ కూర్చున్నాడు. నేను అతనివైపే చూస్తూ కూర్చున్నాను. చూచి చూచి చివర కన్నాను: "ఇదిగో, గంగాసింగ్! నువ్వు గంగాసింగువు కాదు. ఇక్కడ ఎన్నాళ్ళు ఉంటావు ?"

తింటూ తింటూ అతడు తలెత్తి నాముఖంలోకి చూచాడు. "నేను గంగాసింగునే" అంటూ నావైపు అలాగే చూస్తునే ఉన్నాడు.

"సరే, నువ్వు గంగాసింగువే అనుకుందాం. నాకు రెండు పూటలా చెంబు తప్పేలాలు తోమి అందించాలి. నెలకు నాలుగు రూపాయలు ఇస్తున్నాం, నీకైతే ఆరు రూపాయలు ఇస్తాను. జీతం ముందే కావాలంటావా ?"

అతడు నా ముఖంలోకి చూస్తూ ఉండిపోయాడు ఏమీా మాటాడలేదు.

"వింటున్నావా ? నీకు అవసరమైతే ఈనెల జీతం ముందుగానే ఇస్తాను."

అతడు నాముఖంలోకి చూస్తూ అలాగే ఉండిపోయాడు.

"అవసరం లేదా ?"

"లేదు."

పలహారం పూర్తిచేసి అతడు ఆ పళ్ళాన్ని పంపుదగ్గర కడిగి తీసుకువచ్చి అడిగాడు : "దీన్ని ఎక్కడ పెట్టమంటారండీ?"

"ఇలా నాకు ఇచ్చెయ్యి."

"చెప్పండి, ఎక్కడ పెట్టమంటే అక్కడ పెడతాను."

ఈ విధంగా ఆ బాలయువకుడు మా యింట్లో ప్రవేశించాడు. మాతోనే ఉంటున్నాడు. తెల్లవారకముందే లేస్తాడు. ఇల్లంతా శుభ్రంగా ఊడుస్తాడు. పనిపాటలు చాల చాకచక్యంగా చేస్తాడు. పాపం ఎప్పుడూ ఏదో పని చేస్తూనే ఉంటాడు. కూర్చుని మాటాడేందుకుకూడా తీరిక చేసుకోడు. అతడు ఇంట్లో పనిపాటలు చేస్తోంటే నాకు కష్టమనిపించేది. మేము అతన్ని ఒక చుట్టాన్నిగా భావించటం అతనికి ఇష్టం ఉండేదికాదు. మేము అతన్ని ఒక నౌకరులా చూడాలనే అతని పట్టుదల. నేనొకసారి మావారితో అన్నాను : "మీకు తెలుసా ఆ అబ్బాయి ఎవరో ?"

"ఎందుకూ ? ఎవరేమిటి ?"

"పైకి అలా కనిపిస్తున్నాడు గాని.

"ఎవరంటావు ఇంతకూ ?"

"ఏదో ఒక విప్లవసంఘానికి చెందిన వాడులా కనిపిస్తున్నాడు."

మావారు నా ముఖంలోకి చూస్తూ "విప్లవసంఘాల్ని గురించి నీకేం తెలుసు ?" అని అడిగారు.

"నా కన్నీ తెలుసు."

"అన్నీ తెలుసా ? ఎప్పటినుంచేమిటి ?"

"నామాట అబద్ధమైతే చూడండి; అతడు తప్పకుండా విప్లవసంఘ సభ్యుడే."

"అయితే ఔనేమో. కాబట్టి అతన్ని పనిలోనుంచి తీసివేద్దామంటావా ? ఇప్పుడెక్కడికి వెడతాడు పాపం ? మనకు విప్లవంతో ఏం పని ? ఉద్యోగం చేసుకు బ్రతికే వాళ్ళం. ఏమంటావ్ ?"

"పనిలోనుంచి తీసివెయ్యటం ఎందుకూ ? మన వినోద్ అతనికి బాగా అలవాటు పడ్డాడు. అయినా చెప్పద్దూ, నాకు భయంగానే ఉంది !"

"చెయ్యవలసిన పనేమిటో చెయ్యాలిగాని, భయపడి ప్రయోజనం లేదు."

వినోద్‌కు ఆ యువకుని దగ్గర ఎక్కువ చనువు ఏర్పడింది. మరి నాలుగైదు రోజులు అయాక తనకు రావలసిన జీతం అడిగి పుచ్చుకున్నాడు. ఆ డబ్బుతో వినోద్‌కు ఏవేవో రకరకాల ఆటవస్తువులు కొని తీసుకువచ్చి ఇచ్చాడు.

ఒకరోజు ఉదయాన ఆ యువకుడు ఎక్కడ వెదకినా కనిపించలేదు. చివరకు వినోద్ పడుకుని నిద్రపోతున్న మంచం మీద దిండుకింద ఒక ఉత్తరం కనిపించింది. అది ఆ యువకుడు రాసి పెట్టి వెళ్ళాడన్నమాట. ఆ ఉత్తరంలో...తనకు ఇన్నాళ్ళు ఇక్కడ ఆశ్రయం ఇచ్చినందుకు కృతజ్ఞత ప్రకటించాడు. అందరికీ నమస్కారాలు చెప్పాడు. వినోద్‌కు ముద్దులు

చెప్పాడు. ఇలా వెళ్ళిపోవలసివచ్చినందుకు క్షమాపణ యాచించాడు.

మరి మూడురోజులు గడిచాయి. ఒక ఆంగ్ల వార్తా పత్రికలో అతని ఫోటో ప్రకటించారు, చూచాను. ఆశ్చర్యమైంది. ఒక అసాధారణ సంఘటన జరిగింది. అతన్ని బందీ చేశారు. అతని పేరు గంగాసింగు కాదు.

గంగాసింగూ (నేను మాత్రం అతన్ని ఆపేరుతోనే పిలుస్తాను) ఇంకా ముగ్గురు అనుచరులూ కలసి ప్రజల మన స్తత్వంలో ఒక పెద్ద మార్పు తీసుకురావటానికి ప్రయత్నించారు. వీరి ఉద్యమం ఒక వింతైన మెరుపుతీగలా దేశమంతటా వ్యాపించింది. వీరి కార్యక్రమం శాంతియుతమైనదిగా అంగీకరించటానికి వీల్లేదు. అందుచేత ప్రజల హృదయాల్లో సంశోధన బయలు దేరింది. పలువురు పలువిధాలుగా చెప్పుకోసాగారు. ఈ కార్యకర్తలు ప్రభుత్వపు గూఢచారులే అనికూడా కొంతమంది అన్నారు. వాళ్ళు మూర్ఖులని కొందరన్నారు. వీరులని మరికొందరు ప్రశంసించారు. కోర్టులో విచారణ ఆరంభమైంది. ఏమి శిక్ష విధిస్తారో అని అందరూ ఎదురుచూచారు. ఈ నలుగురే గాక ఇంకా చాలమంది కూడా పట్టుపడ్డారు. వీళ్ళందరిలో ఎవరెవరికి ఉరిశిక్ష వేస్తారో! ఎవరెవరికి ద్వీపాంతరవాస శిక్ష విధిస్తారో! అనేకరకాల ఊహాగానాలు బయలుదేరాయి. కాని నా మనస్సు ఎలా ఉందో అప్పుడు నాకే తెలుసు. మొదటిరోజునే నేను మా వారితో పోట్లాట పెట్టుకున్నాను.

"చూచారా మరి! నేను చెబితే వినిపించుకున్నారు కాదు. ఇప్పుడేం చెబుతారో చెప్పండి?" అన్నాను బిగ్గరగా ఆయనతో.

"ఏం వినిపించుకోలేదంటావు?" – శాంతంగా అడిగా రాయన.

"ఆ యువకుడు ఒక అసాధారణవ్యక్తి యని చెప్పాను కాదూ!"

"అయితే?" వారు నా ముఖంలోకి అలానే చూస్తూ ఉన్నారు.

"అయితే ఏముందీ? ఆ అబ్బాయి ఫొటోలు ప్రకటించిన పత్రికలన్నీ నాకు తెచ్చి ఇవ్వండి. ఇంట్లో అన్ని గోడలనిండా అలంకరిస్తాను. అన్ని పుస్తకాల్లో అతికిస్తాను. అందరికీ పంచిపెడతాను. అతడు ప్రభుత్వపు గూఢచారి అని అన్నారే అందరూ! అలా అంటానికి వాళ్ళకు సిగ్గు ఎలా లేక పోయిందో! నిజం చెప్పండి: మీరూ అతన్నిగురించి అలానే అనుకుంటున్నారా?" నా స్వరం స్థాయి క్రమేణా హెచ్చింది.

"ఎవరూ?"

"మీరు—మీరే."

"నేనా? నేనలా అనుకోటంలేదే—"

"మరి ఎలా అనుకుంటున్నారేమిటి?"

"నేను ఎలా అనుకుంటున్నానా?"

"ఔను, చెప్పరాదూ! : 'వాడొక గజదొంగ అనుకుంటున్నాను' అని."

"సుఖదా! —" వారు ఆశ్చర్యంగా నా ముఖంలోకి చూస్తూ నిల్చున్నారు.

"ఊఁ, మాట్లాడరేం? ఊరుకుంటారేం? నే నడిగింది మీకు వినిపించటం లేదా? ఆ కుర్రవాడు విప్లవసంఘానికి చెందినవాడూ అని నేను ఆరోజున చెబితే వినిపించుకున్నారు కాదు. ఇప్పుడు అతన్ని ఉరిదీసిన తరువాతైనా నమ్ముతారా?"

"నాకు మొదటినించీ తెలుసు ఆ సంగతి? ఎందుకు అలా మాట్లాడతావు?"

ఆ మాటకు నేను క్షణకాలం విస్తుపోయాను. మరు క్షణమే మళ్ళీ కోపం వచ్చేసింది. "మీకు మొదటినుంచీ తెలుసునా? మీకా?"

"ఔను. నాకు తెలుసు సుఖదా! కాని అతన్ని ఆ మార్గంనుంచి మరలించలేకపోయాను."

నాకు ఆ సమయంలో వివేకం లేకుండాపోయింది. "చాలు చాలు ఊరుకోండి. అబద్ధాలు కల్పించి చెప్ప బోకండి. మీకు అసలు ఏమీ తెలియదు. విప్లవవీరు డెవరో నాకు తెలుసు. మీరు మీ ఉద్యోగం చూచుకోండి, అంతే. అతన్ని మీ రెలా గుర్తించగలరు? అతని పాదధూళికి కూడా మీరు పోలరు."

నా నోటికి ఏమి పుండు పుట్టిందో! ఆనాడు ఎందుకలాగ దురుసుగా మాట్లాడానో మరి! ఇప్పుడు ఆలోచించుకుంటే నాకేమీ బోధపడటం లేదు. కాని అప్పుడు నా హృదయం... ఆ కుర్రవానికి జరిగిన స్థితికి ఎంతగానో విక్షుబ్ధమైపోయింది. నాకు అప్పుడు కలిగిన కోపాన్ని ఏమాత్రమూ అణచుకో లేక

పోయాను. ఆ కోపం అంతా మావారిమీద చూపించేశాను. నా మాటలన్నీ వింటూ వారు ఆశ్చర్యపోతూ చూస్తూ నిల్చున్నారు. మారుమాట పలకలేదు. మరికాసేపటికి మళ్ళీ అన్నాను: "అతని కేసు విచారణ ఎక్కడ జరుగుతున్నది? నేనూ వెడతాను."

"సరే..." అంటూ వారు అక్కడినించి పోబోతున్నారు.

"విచారణ ఎక్కడ జరుగుతున్నదో చెప్పరేం?"

"నాకు తెలియదు."

"సరే, వెళ్ళండి. నేనే తెలుసుకుంటాను."

వారు ఏమీ మాటాడలేదు; వెళ్ళిపోయారు.

నాటి ఆ సన్నివేశం యావత్తూ నాకు స్ఫురణకు వస్తోంది. ఆ సమయాన నాకు అనిపించింది: నాకు అత్యంత ప్రియమైన వస్తువు ఏదో ఎవరో నా చేతుల్లోనుంచి బలవంతాన లాక్కుపోయినట్టు. పాపం ఆ యువకుణ్ణి ఉరికంబం ఎక్కిస్తారు. ఈ యింట్లో అతన్నిగూర్చి విచారపడుతున్నది నేను ఒక్కతెనే. మా వారికి చీమ కుట్టినట్టన్నా లేదు. ఆయనకు ప్రస్తుతం మన దేశ దుర్దశను గురించిన చింతే లేదు. తన ఉద్యోగం, తన పనులు—అంతేకాని మరో విషయమే పట్టించుకోరాయన. నేను కొన్ని పుస్తకాలూ, నవలలూ చదివాను. మన దేశం త్వరలో స్వాతంత్ర్యాన్ని పొందవలసిన ఆవశ్యకతను నేను

తెలుసుకున్నాను. దేశం పరాధీనమై, దాస్యంలో మ్రగ్గుతూ ఉన్న ఈ సమయంలో ఇల్లు, వాకిలి, సంసారం, గృహస్థధర్మం- ఎందుకు ఇవన్నీ ? ఎందుకూ ఈ మామూలు నికృష్టజీవితం ? ఆ యువకుడు చూడండి: ఎంత చిన్నవాడో ! దేశసేవలో ప్రాణం అర్పించేస్తున్నాడు! అతని చరిత్ర యాదవస్తూ నా మనస్సులో ఒక్కసారి తిరిగింది. అతడు పీరుడు. అతి రహస్యంగా ఎన్నెన్ని గొప్ప కార్యాలో నిర్వహించాడు. ఎన్నో ఎత్తులు పైయెత్తులు వేశాడు. దేశసేవలో నిరంతర దీక్షాబద్ధకంకణుడు. త్యాగశీలి. ఇటువంటి అతని చరిత్ర స్మరిస్తూఉంటే మావారు ఒక మామూలు నీరస వ్యక్తిగా గోచరించేవారు. పోనీ, వారిలో ఆ పటుత్వం లేనప్పుడు నేనన్నా లేచి ముందడుగు వెయ్యకపోతే ఎలాగ ? కాని ముందడుగు వెయ్యటమంటే ఏమి చెయ్యాలో సరిగా బోధపడటం లేదు.

ఈవిధంగా మనస్సు ఎటువైపునకో ఆకర్షితం కా సాగింది. ఆనాడల్లా మళ్ళీ నేను మావారితో మాటాడలేదు. మర్నాడు వారు పది పన్నెండు ఆంగ్ల వార్తాపత్రికలు తీసుకు వచ్చి పడేశారు. కాని నన్నేమీ పలుకరించలేదు. కొంత సేపటివరకూ నే నా పత్రికల్ని ముట్టుకోనేలేదు. కాని వారు వెళ్ళిపోయాక నేను ఒంటరిగా ఉన్నప్పుడు ఆపత్రికల్లో ఉన్న ఆ యువకుని ఫొటోలన్నీ కత్తిరించి తీసుకున్నాను.

సాయంత్రం వారు వచ్చేసరికి చాల ఆలస్యం అయింది. నాకు అప్పుడు హఠాత్తుగా జ్ఞాపకంవచ్చి అడిగాను: "ఆ చీటీ ఏం చేశారు మీరు ?"

"ఏం చీటీ ?"

"అదే, గంగాసింగు రాసి పెట్టి పోయిన ఉత్తరం. నేను దాన్ని మీ కే ఇచ్చాననుకదూ అనాడు ?"

"నేను అప్పుడే చింపి వేశాను దాన్ని."

వారు అటువంటి సమాధానం చెబుతారని నేను అనుకోలేదు. ఆశ్చర్యంగా వారి ముఖంలోకి చూస్తూ నిల్చున్నాను. నాకు అప్పుడేమీ తోచలేదు. వారిపట్ల ఒకరకమైన అసహ్యభావం నా హృదయంలో సందడించింది. "మీరంత వట్టి పిరికివారని నే నెప్పుడూ అనుకోలేదు సుమీ !"

పుల్ల విరిచి పొయ్యిలో పెట్టినట్టుగా నేను పలికిన ఆ మాట విని వారు విస్తుపోయారు. ఉలకలేదు, పలుకలేదు.

నేను దూకుడుగా అక్కడే ఉన్న ఒక బల్ల మీద కూలబడ్డాను. చేతి గాజులూ, వేలి ఉంగరం, మెడలో గొలుసు... అన్నీ తీసేశాను. తివాచీ మీదికి విసిరి పారేశాను. "అవిగో, మీ వస్తువులు మీరు తీసుకోండి. వాటినిగురించేగా మీరంత భయపడుతున్నది !"

వారు నిర్ఘాంతపడి కాసేపు అలాగే నిల్చున్నారు. చివరకు ఆ సొమ్ములన్నీ తీసి అలమారలో పెట్టి వచ్చారు. అక్కడే తివాచీమీద కూర్చుంటూ, "ఔను, నేను పిరికి పందనే. నీకు తగినవాడిని కాదు బహుశా" అన్నారు.

ఆ మాటలు నాకు చురుగ్గా తగిలాయి. నే నా బల్ల మీద అలానే కూర్చుని, "పోనీ, తగిన వ్యక్తినే ఇంట్లో తీసుకువచ్చి పెట్టుకోరాదూ ! ఆ వ్యక్తి ఎవరో నాకు తెలుసు లెండి" అన్నాను.

వారి ముఖంలో నెత్తురు చుక్కలేదు. నే నింకా ఇలా అన్నాను: "మీరాదీ అన్న వస్తువు నాదగ్గర ఏది ఉన్నా సరే తీసేసుకోండి. మీ సొమ్ములూ నాకు అక్కర్లేదు, మీ ముద్దు మురిపాలూ అక్కర్లేదు, ఏమీ వద్దు." అప్పుడు నా మనస్సులో ఎంత గందరగోళంగా ఉందో మరి! కట్టుకున్న చీర, తొడుక్కున్న రవికె కూడా చించి ముక్కలుచేసి అవతల పార వేద్దామనిపించింది. కాని అలాగే కూర్చుండిపోయాను. వారు తలవంచుకుని అలాగే కూర్చున్నారు.

మనిషిలో ఏమేమి భావాలు అణగి దాగి ఉంటాయో చెప్పలేం. మావారిపట్ల అపారమైన ప్రేమ మాటిమాటికీ నాలో పొంగుతూనే ఉంటుంది. వారిపట్లనే ఇంత ఏహ్యాభావం కూడా నాలో దాగి వున్నదే! ఇదేమిటో నాకు అర్థం కాదు. కాని ఆ సమయాన ఆ బల్లమీద కూర్చుని మాట్లాడుతోన్న ప్పుడు నాలో రేగిన హింసభావాలు తలుచుకుంటే ఇప్పుడు నా శరీరం కంపిస్తున్నది.

మరికాసేపటికి మావారు "సుఖదా! ఇంతకూ నీ ఉద్దేశం ఏమిటి? నేను ఉద్యోగం మానేసి విప్లవసంఘంలో చేరిపోవాలనా?" అని అడిగారు.

"ఏం లేదులెండి, నా ఉద్దేశం ఏమీ లేదు."

"నేను ఆ పనికూడా చెయ్యగలను. కాని చెయ్యాలా? ...అదే సందేహం. ఊహుఁ, నేను చెయ్యను, చెయ్యకూడదు; అది తప్పుడుమార్గం. ఇంతకూ సుఖదా! నువు ఏమి మాటాడుతున్నావో నీకే అర్థమాతున్నట్టు లేదు."

అప్పుడు నాలో నాకే భయం అనిపించింది. నాకు ఒక స్థిరమైన విశ్వాసం లేదు. ఆ సమయాన వారిపట్ల నా హృదయంలో విద్వేషం పెరిగిపోయింది. ఆ భావావేశంలో నాకే భయమైంది. కోపంతో చీదరించుకుంటూ గదిలోనుంచి బయటికి వెళ్ళిపోయాను.

# 6

ఆ తరువాత మా గార్హస్థ్యజీవితం నిస్సారం కాజొచ్చింది. వారు ఎక్కువగా వారి పనుల్లో నిమగ్నులై ఉండటం సాగించారు. లేకపోతే మిత్రులతో అధికంగా కాలక్షేపం చేస్తూ ఉండేవారు. నాచుట్టూకూడా ఒక ప్రత్యేక జీవిత పరిధి ఏర్పడిపోయింది. నాలో మొలకెత్తిన యీ కొత్త ఉత్సాహం – ఈ కొత్త వాతావరణాన్ని నిర్మించుకోటంలో సహాయకారి అయింది.

ఆనాటి రాజకీయవాతావరణం అస్థిరంగా ఉంది. 1920 నాటి ఆందోళన చల్లబడిపోయింది. ప్రజాశక్తుల్ని ఏకముఖంగా నడిపించగలిగిన ఒక నిర్దిష్ట కార్యక్రమం లేకపోయింది. వేరు వేరు పార్టీలు తలసూపాయి. భిన్నాభిప్రాయాలు పొడసూపాయి. పార్టీలమధ్య స్పర్థలు పెరిగాయి.

గంగాసింగుతోపాటు నలుగురు యువకులు పట్టుపడటం, ఆతరువాత వారి దళానికి సంబంధించిన ఇంకా అనేకమంది కూడా అరెస్టు కావటం—ఈ సంఘటనే ఎక్కడ చూచినా చర్చనీయాంశమైంది. ఈ సంఘటన గురించి నాకు విస్పష్ట

మైన అభిప్రాయం ఏర్పడిపోయింది. బాధ్యతగల పెద్దలు మాత్రం ఒక నిశ్చితాభిప్రాయానికి రాలేకపోయారు. భారత దేశంలోని యువకులశక్తిని మనం త్రోసిరాజనకూడదు. వాళ్ళను ఒంటరిగా మనం దిగవిడునరాదు. భారతదేశంలో హృదయంలేదా ? ఈ యువకులంతా భారతమాత బిడ్డలు; పురుషసింహాలు. భారతమాత బల్లెపు పదును వారే. హింస, అహింస !—నాకు తెలియదు బాబూ మీ హింసాహింసల మీమాంస. ఈ యువకులు బ్రహ్మాండం ఊగిసలాడించారు; దేశసేవలో మృత్యువును కౌగలించుకున్నారు. భావిభారత సంతతి ఈ ముద్దుబిడ్డల్ని స్మరించి తీరుతుంది. వారిని గురించి ఆక్షేపణగా అంట్లు, సొంట్లు పలికేవాళ్ళకు సిగ్గులేదేం ? మా స్త్రీలను అడగండి, చెబుతాం; మా బిడ్డల సంగతి మాకు తెలుసు. నన్నడగండి; నేను వాళ్ళను బాగా ఎరుగుదును. వాళ్ళు నిజంగా అమూల్యమైన, ప్రకాశవంతమైన వజ్రాలు !

ఇటువంటి అభిప్రాయాలే నేను అనేకచోట్ల వెల్లడించాను. చాలమందితో కలిసి మాటాడేను. ఆ యువకుల ఫోటోలు సేకరించి తెలిసినవాళ్ళందరికీ పంచిపెట్టాను. తోటి స్త్రీలకు ఉపదేశించటంకూడా సాగించాను : "సొమ్ములు తీసి పారెయ్యండి. సొమ్ములు పెట్టుకుని కులికేరోజులు కావు ఇవి. ఘోషా పద్ధతిని రూపుమాపండి. మొగుడికి బానిసలైపోకండి. స్వాతంత్ర్యసంపాదనలో మీరుకూడా మీ పాత్ర నిర్వహించండి'' అని.

ఆరోజుల్లో నాకు అంత స్థయిర్యం ఎలా చేకూరిందో చెప్పలేను. మొదటినుంచీ నాలో భావావేశం ఉండేది;

హృదయంలో భర్తవైపు ఆకర్షణా ఉండేది. నా శక్తిసామర్థ్యాలేమిటో, నేనెంత ఎత్తువరకూ పోగలనో ప్రయత్నించి చూపెడదామన్న ఉద్రిక్తవాంఛ నాలో ప్రవేశించింది. మనసులో ఒకవిధమైన అతృప్తి ఏర్పడిఉంది; అది తనను తాను చంపుకుని ఒక సంతృప్తిని చూరగొనాలని తహతహలాడింది. రాను రాను అందులో ఉన్న అసలు రహస్యంకూడా తెలియవచ్చింది. మనస్సుకు ఏదో వ్యాసంగం కావల్సివచ్చింది. తననుంచి దూరంగా ఎక్కడో చిక్కుకుపోవాలని కోరింది. తదనుగుణంగానే అనాయాసంగా ఒక వ్యాసంగం లభించింది.

ఇంకో సంగతి: ప్రజలు, ముఖ్యంగా స్త్రీలు నా స్థితికి ఆశ్చర్యపడుతున్నట్టు, నన్ను చూచి ఆశ్చర్యపడుతున్నట్టు నాకు అనిపించేది. కొందరు నన్ను వ్యతిరేకించారు. కొందరు నన్ను ఆమోదించి, అనుసరించారు. ఏమైనా మొత్తంమీద అన్నిచోట్లా నాకు గౌరవం హెచ్చింది. అందువల్ల నాకు ఆనందం కలిగింది. సభల్లో, సమావేశాల్లో నాకు పని కలిగింది. ఎరగనివాళ్ళు కూడా నా పరిచయభాగ్యంకోసం తహతహలాడారు. ఎక్కడ చూచినా అందరూ నన్ను గురించే చెప్పుకుంటూ వచ్చారు. ఇదంతా నాకు ఆనందదాయకమైంది. ఇటువంటి కీర్తిప్రతిష్ఠలమీద ఏర్పడిన లోభంవల్ల నా భావాలు ఇంకా ఉగ్రరూపం తాల్చాయి. అవి ప్రజలముందు వ్యక్తం చేస్తూన్నప్పుడు నాకెంతో గర్వంగా ఉండేది.

దేశంకోసం ప్రజాశక్తుల్ని సమీకరించవలసిన సమయం ఇది. దేశం చాల రోజులనుంచీ చప్పగా పడిఉంది. ఎంతకాలమని ? ఇక లేచిరావాలని చూస్తోంది. ఆవేశాలు పొంగు

తూన్న సమయం వచ్చింది. ప్రధాన నాయకుడు తనలో తాను వెతుక్కుంటున్నాడు : ఒక నిర్దిష్టమార్గాన్ని ఆవిష్కరించేందుకు; అంటే ప్రస్థానభేరి ప్రయోగించటానికి ఇంకా ఆలస్యం ఉంది. ఇటువంటి సమయంలో ఎవరికి తోచినట్టుగా వారు ఒక కార్యక్రమాన్ని బైటికి తీసుకురావాలని చూస్తున్నారు. యువకులు ఓపిక పట్టలేకపోతున్నారు. ఇక్కడ కొందరు, అక్కడ కొందరు సమావేశమై ఆలోచించుకొని ఏదో చెయ్యాలన్న ప్రయత్నాల్లో ఉన్నారు.

ఏది ఏవిధంగా జరగాల్సిఉందో చెప్పటం కష్టం. కొందరు యువకులు కలిసి ఒక కార్యక్రమాన్ని నిర్ణయించాలని ఉద్దేశ్చారు. కాంగ్రెసు దేశానికంతకూ సంబంధించిన రాజకీయసంస్థ. కాని యువకులు అందులో చేరక, తాము ప్రత్యేకంగా నిర్వహించవలసిన బాధ్యతలేవో ఉన్నట్టు భావించేవారు. ఒక సమావేశం ఏర్పాటుచేశారు; నన్నుకూడా ఆహ్వానించారు.

ఇంతవరకు నాకు బయటి ప్రపంచ జీవనపరిస్థితులు ఎక్కువగా తెలియవు. ఇలా ఉంటాయన్న ఒక ఊహకూడా ఏర్పడలేదు. స్త్రీవ్యక్తి ఇంట్లో సాంసారిక జీవితానికే కాకపోతే...ఆమె బయటి ప్రపంచంలో నిర్వహించవలసిన బాధ్యతలేమిటో నాకు సంపూర్ణంగా తెలియవు.

బాహ్యప్రపంచ జీవన పరిజ్ఞానం స్త్రీలకు భర్త ద్వారానే లభించగలదు అన్నభావనే నాకు తెలియకుండానే నాకు ఆధారంగా ఉండేది పూర్వం. కాని ఈ మధ్య...

ఽరిష్టంగా చెప్పలేని ఏ శక్తి వల్లనో... నేను ఆయననుంచి వేరై...పరిపూర్ణ స్వతంత్రురాల నౌతూవచ్చాను. మా కేదైనా సంబంధం ఉందీ అంటే—మామూలు దైనిక వ్యాపా రాల్లో మాత్రమే. ఒకే యింట్లో భోజనం చేస్తున్నాం; ఒకే యింట్లో పడుకుంటున్నాం; ఒకే బిడ్డకు ఆయన తండ్రి, నేను తల్లిని; ఆయన ఖర్చులూ, నా ఖర్చులూ ఒకే చోటునుంచి వచ్చే ఆదాయంలోనే వెళ్ళమారుతున్నాయి. అయినా మే మిద్దరమూ విడిపోయి రెండు ప్రవాహాలుగానే సాగిపోతున్నట్టు ఉంది. నా తరహా వేరు; నా భావాలు వేరు. కుటుంబ జీవితం, అది వేరు. మావారి కోరికలేమిటి ? వారి భావాలేమిటి ? వా రేమనుకుంటున్నారు ?—అన్న ఆలోచనే లేకుండా పోయింది నాకు. ఎందువల్లనో నాకే తెలియదు. నా భావా లేమిటి ? నా కేమి కావాలి ?—అదే నాకు ప్రముఖ విషయ మైపోయింది ఆరోజులో.

అయినప్పటికీ యే సహజ సంస్కారాల ప్రేరేపణవల్లనో "ఒక సభకు రమ్మని పిల్చారు; వెళ్ళనా ?" అని అడిగాను, మావారిని, ఒకనాడు.

ఈ ప్రశ్న విని వారు సంతోషించినట్టే కనిపించారు. ప్రసన్నభావమే కనబరచారు. "ఏం సభ అది ?"

"తెలియదు. ఇదిగో నోటీసు పంపించారు."

వారు ఆ నోటీసు అందుకుని చదివారు. చదివి అడి గారు : "వీళ్ళంతా ఎవరో నువ్వు ఎరుగుదువా ?"

"ఎక్కువగా ఏమీ ఎరగను."

"చూడు సుఖదా! నువ్వు చేయదలచుకున్న ఏ పనికీ నేను అడ్డువస్తానన్న అనుమానం ఎప్పుడూ పెట్టుకోవద్దు. కాని అందరూ అన్ని పనులూ చెయ్యలేరని నా అభిప్రాయం. ప్రతి వ్యక్తీ తన కర్తవ్యమేదో నిర్ణయించుకోవాలి. పరధర్మాన్ని ఆశించకూడదు."

నాకు కోపం వచ్చింది. "అంటే, నేను సభకు వెళ్ళకూడదనేగా మీ ఉద్దేశం. మీరెందుకు అలా ఉద్దేశపడుతున్నారో, స్పష్టంగా చెప్పండి, వింటాను."

మావారు ఏం మాటాడినా...ఆ మాటల్లో...నన్ను అస్తమానం తమ అధీనురాలిగానే ఉంచుకోవాలని కోరుతున్నట్టు నాకు ధ్వనిస్తూ ఉంటుంది. ప్రతి మగవాడూ అలానే కోరుకుంటాడు; వీరూ అంతే అనుకునేదాన్ని. భార్య భర్తకు లొంగిపోయి పడిఉండటం తప్ప అనే నిర్ణయానికి వచ్చేశాను. భార్య అణగిమణగి ఉంటున్నంతకాలం భర్త మిడిసిపడకుండా ఎందుకుంటాడు?—అనుకునేదాన్ని.

మావారు నాతో ఎప్పుడు మాటాడినా చాల నెమ్మదిగా, తమ ఆధిక్యాన్ని నాపై రుద్దటానికి ఇష్టం లేనట్టుగా మాటాడతారు. అదే నాకు చాల అసహ్యమనిపిస్తుంది. ఎందువల్లనంటే—ఆ మాటల్లో నేను గ్రహించదగిందిగాని, వ్యతిరేకించదగిందిగాని ఒక్కటీ ఉండదు. తియ్యగా ఉంటాయి మాటలు. ఆ తీయదనంలోనే వారి అధికారవాంఛ - గర్వం కూడా దాగి ఉన్నట్టు నాకు స్ఫురించేది. ఆ తీయదనం పైపూత

మాత్రమే. లోపల కాఠిన్యమే, పశుత్వమే. ఆ పశుత్వం నగ్నరూపంలో ఎప్పుడూ బయటపడదేం ? అందుకే నాకు చాల కోపం వస్తూఉంటుంది. అందుకనే వాళ్ళు తెలియకుండా అనేశాను : "నేను వెళ్ళకూడదని మీ రెందుకు అనాల్సి వచ్చిందో విడమరచి చెప్పండి ఇవాళ" అని.

మావారు ఆశ్చర్యపోయారు. "ఎబ్బే; నే నా మాట ఎప్పుడన్నాను ? నే ననేది ఏమంటే..."

"నేను వెళ్ళటం మీకు ఇష్టమేనా అయితే ?"

"వెళ్ళటం, వెళ్ళకపోవటం ... ఆ నిర్ణయం నువే ఎందుకు చేసుకోకూడదూ ? నన్ను అడగవద్దు అంటున్నాను."

"చూడండీ, మీ మనసులో మాట దాచకుండా విడమరచి చెప్పేయండి—అని అడుగుతున్నాను నేను. మీరు నాతో అబద్ధం చెప్పాల్సిన అవసరం లేదు. నిర్ణయం చేసుకోవలసింది నేనే నని మీరు నిజంగా నమ్ముతున్నారా ? దాపరికం లేకుండా చెప్పండి. బులుబూచికం మాటలు నాకు పనికిరావు. నేను పసిపిల్లను కాదు. మీ మనసులో ఉన్న దేమిటో నిజం చెప్పండి."

వారేమీ చెప్పలేదు. "సుఖదా !..." అని మాత్రం పలికి ఊరుకున్నారు.

అప్పుడు నేను ధోరణి సాగించాను : "అదీకథ : నేనేదో మీతో మాటాడాలని వస్తే మీరేమో మూతి బిగించుకుని జవాబే చెప్పరు. ఏమీ తెలియనట్టు నటిస్తారు. స్త్రీకి కూడా హృదయం ఉంది; బుద్ధి ఉంది; ఆమెకు ఉండే బాధ్యతలు ఆమెకూ ఉంటాయి. తన నిర్ణయాలను ఆమె చేసుకో

గలదు. నేను ఈ సభకు వెళ్ళి తీరతాను. మీరు అడ్డగించలేరు."

"నేను నిన్ను ఎప్పుడైనా ఏవిషయంలోనైనా అడ్డగించానా ?"

నాకు ఆవేశం ఎక్కువైంది. "అడ్డగించలేదా ? 'సరే అలాగే' అంటూనే అడ్డగిస్తూంటారు. నేను అర్థంచేసుకోలేనని అనుకోకండి. నా కంతా తెలుస్తూనేఉంది. జ్ఞాపకం పెట్టుకోండి : ఇంట్లో దాసీలాగా బ్రతికేటువంటిదాన్ని కాదు నేను."

"దాసీ ఏమిటీ ?" ఆశ్చర్యంగా అడిగా రాయన.

"పిలవటానికేం ? 'దేవీ !' అని పిలుస్తారు మీరు. కాని అది వట్టి శబ్దమేగా ! నేను ప్రతి యింట్లో చూస్తూనే ఉన్నాను : మగవాడు ఆడదానికి ఒంటినిండా సొమ్ములు దిగవేసి కూర్చోబెడతాడు, మెత్తమెత్తగా తియ్యతియ్యగా కబుర్లు చెబుతాడు, బుజ్జగిస్తాడు, ఉబ్బిస్తాడు. ఇదంతా స్త్రీని సన్మానించటం అనిపించుకుంటుందా ? ఇంతమాత్రంచేత పురుషుడికి తనమీద ఎంతో అభిమానం ఉన్నదని ఏ స్త్రీయైనా భావిస్తూ ఉన్నట్టయితే ఆమె వట్టి మూర్ఖురాలన్నమాట. దాసిని దాసిగా అట్టిపెట్టుకునేందుకే పురుషుడలా నాటకం ఆడుతూఉంటాడు."

ఆసమయాన వారు నాకేసి చూచిన చూపుల్లోని భావం ఇప్పటికీ నా మ్రోల ప్రత్యక్షమౌతున్నది. అప్పటి వారి మూర్తిని తలచుకుని నేను నిలువునా కరిగిపోతున్నాను ఇప్పుడు. కాని అప్పుడో ? నన్ను ఏ దయ్యం ఆవేశించిందో మరి !

"ఇంతకూ నీకు కావలసిందేమిటి సుఖదా?"

"ఏమీలేదు. స్త్రీకి కూడా స్వతంత్ర వ్యక్తిత్వం ఉన్న దనే విషయాన్ని మీరు గ్రహించటమే నాకు కావలసింది."

"నాచేత ఎలా గ్రహింపచేద్దామనీ?"

"స్వతంత్రురాలినై; స్వయం వ్యక్తనై."

"స్వతంత్రం ఎలావస్తుందంటావు? స్వయంవ్యక్తిత్వం ఏవిధంగా చేకూరుతుందంటావు?"

"తొందరెందుకూ? కొన్నాళ్ళు ఓపిక పట్టండి. అంతా ప్రత్యక్షంగానే చూద్దురుగాని."

నాటి ప్రసంగం అంతటితో అగిపోయింది. మావారు మరేమీ మాటాడలేకపోయారు. వారిని ఆ అవస్థలో వదలి పెట్టి నేను అక్కడినించి వెళ్ళిపోయాను. పురుషులు ఏర్పాటు చేసుకుంటున్న సభలో వెళ్ళి కూర్చోగలిగినంత సంస్కారం అసలు నాలో ఉన్నట్టూ నాకు తెలీదు, వెళ్ళితీరాలన్న సంకల్పమూ నాకు లేదు. మనస్సులో సంకోచంగానే ఉంది. కాని మా వారితో అంతసేపు తర్జన భర్జన అయినతర్వాత... 'ఉహుఁ, ఏమైనా సరే, సభకు వెళ్ళితీరాల్సిందే...' అనిపించింది.

సభలో ఇరవై మందికూడా ఉన్నట్టులేదు. స్త్రీలు ఎవరూలేరు; నేను ఒక్కతెనే.

సభికులలో ముప్ఫయిసంవత్సరాలు దాటినవారు ఎవ రైనా ఒకరిద్దరు ఉన్నారేమో! రెండుమూడు గంటలసేపు సమావేశం జరిగింది. ప్రసంగాలు ఒక నిర్దిష్టమైన రీతిలో

సాగలేదు. రాజకీయ పరిస్థితి, లోకాభిరామాయణం, చెయ్య వలసిన పనులు, చెయ్యరాని పనులు, వినోద విషయాలు, భావి నిర్ణయాలు...రకరకాలుగా సాగింది సభా కార్య క్రమం. మూడు గంటలు ముగిసేసరికి మేమంతా ఒక సంఘంగా ఏర్పడినట్టూ, ఆ సంఘానికి నేను ఉపాధ్యక్షురాలి నైనట్టూ తెలుసుకున్నాను. సభాకార్యక్రమంలో నేను ఎక్కువపాలు తీసుకోలేదు. లోపల నన్ను సంకోచం బాధి స్తూనే ఉంది. ఏదో కొద్దిగానే మాట్లాడాను. గంగాసింగున్నూ, అతని అనుచరులనూ ఉదాహరణంగా చెప్పి, మనంకూడా అన్ని త్యాగాలకూ సిద్ధంగా ఉండాలనీ, దేశంకోసం బలి కావటానికూడా వెనుదీయరాదనీ ఆవేశంగా నాలుగు మాటలు చెప్పి, సిగ్గుపడుతూ అటూ ఇటూ దిక్కులు చూడసాగాను. నేను ఒక్కతెనే ఒక పక్క కూర్చుని ఉన్నాను. నేను మాట్లాడ్డం ముగించినతర్వాతనే హరీశబాబు నా పక్కన వచ్చి కూర్చున్నాడు. అతడు ఇదివరకు ఒకసారి నన్ను కలసి ఆ యీ రాజకీయవిషయాలేవో ముచ్చటించి వున్నాడు. అతడు నా పక్కన కూర్చుంటూ మెల్లిగా 'నమస్కారం' పలికి ఒక కాగితం బైటికి తీశాడు. అందులో సంఘ ఉపాధ్యక్షుని పేరు ఇంకా రాయలేదు. ఆ చోట నా పేరు నేను చూస్తూఉండగానే రాశాడు. "ఇది మన సంఘ అధికార సభ్యుల జాబితా" అన్నాడు.

నేను విని ఊరుకున్నాను. సమాధానం ఏమీ చెప్ప లేకపోయాను.

"చూడండి, మమ్మల్ని నిరాశపరచకండి" అని పలికి హరీశబాబు కాసేపు ఆగి కొంచెం తగ్గుస్వరంతో మళ్ళీ ఇలా అన్నాడు : "భారత దేశంలో అన్నింటికీ పురుషులేనా ? స్త్రీలు లెక్కలోకి రారా ?"

నాకు అప్పుడు ఏదో ఒక పెద్ద పవిత్రమైన కార్యభారం నాపై పడబోతున్నట్టు భావన కలిగింది. "నన్ను వదిలెయ్యండి; క్షమించండి" అన్నాను.

"అదేంమాట ? స్త్రీలు లేకుండా పురుషులు ఒక్క అడుగుకూడా ముందుకు సాగిపోలేరు. మన హిందూదేశంలో స్త్రీపురుషులకు సమానబాధ్యతలంటూ లేకపోవటం మన దౌర్భాగ్యం. ఈ దౌర్భాగ్యాన్ని మనం శిరసావహించి ఇంకా పాటిస్తూ ఉండవలసిందేనా ? మీరలా సంకోచించటానికి కూడా కారణం మేమే, పురుషులమే. అందుకనే మమ్మల్ని శిక్షించ దలచుకున్నారా ? మమ్మల్ని ఒంటరిగా దిగవిడిచేస్తారా ? వద్దు వద్దు. మమ్మల్ని మన్నించి ఈ పదవి మీరు స్వీకరించాలి, తప్పదు."

అతని మాటలు నా చెవుల్లోనించి లోపలికి దూసుకుపోయి నన్ను ఆపాదమస్తమూ శోధించాయి. అతడు పలికిన మాటలు నిండు సత్యాలుగా నాకు స్ఫురించాయి. స్త్రీ కూడా ఒక శక్తి. ఆ శక్తి నాలో వికసించి, ప్రస్ఫుటం కావాలని ఒక తహతహ పొడసూపింది. అన్నాను : "సంఘంలో సభ్యురాలినై మీతోనే ఉంటానుకదా ! ఒక పదవి అంటూ నాకు కట్టబెట్టకండి. అయినా వారిని అడగాలిగా !" చివరి

వాక్యం పలుకుతూండగానే ఎక్కడలేని సిగ్గూ నన్ను ఆవహిం చింది.

హరీశ్ ఆశ్చర్యం ప్రకటించాడు. "వారంటే ఎవరూ?"

నేనేదో తప్పుజేసినట్టు చిన్నబోయాను. ఏమీ మాటాడలేదు.

"ఓహో! వారా? అయినా ఇందులో ఎవరినో పెద్ద అడగవలసిన అవసరం ఏముందీ? ఎవరి ఆత్మ వారికి ఉంది. ఎవరి యిష్టం వారిది. ఆత్మ స్వతంత్రమైంది. ఎవర్నీ అడగ నక్కర్లేదు లెండి. సభాకార్యక్రమం నిల్చిపోయింది చూడండి. చప్పున కానీయండి. పట్టీ అంతా పూర్తిచేస్తాను, త్వరగా..." అన్నాడు హరీశ్. అంటూ నా సమాధానం ఆశించకుండానే తన స్థానంలో ఆసీనుడై పట్టీ పూర్తి చేశాడు. అధికార సభ్యులపేర్లు అన్నీ రాశాడు. నేను మళ్ళీ ఏవిధమైన అభ్యం తరమూ చెప్పలేకపోయాను.

సభ ముగిసింది. హరీశ్ నావద్దకు వచ్చాడు. "మీతో కొన్ని సంగతులు మాటాడాలి. రేపు ఎప్పుడు వచ్చి కలుసు కోమన్నారు?" అని అడిగాడు.

"ఇంటికే వస్తారా?"

"ఇంటికి కాకపోతే ఎక్కడికి రమ్మంటారో చెప్పండి."

"రేపే?"

"ఔను. అనవసరంగా కాలయాపన దేనికి?"

"సరే, రేపు మూడుగంటలప్పుడు రండి."

"ఇంటికే కదూ? సరే." అంటూ హరీశ్ బాబు ఒక

అడుగు ముందుకు వేసి ప్రభాత్‌ను కేకవేసి పిల్చాడు. "ఇదిగో! ప్రభాత్! ఆవిడగారిని ఇంటిదాకా తీసుకుపోయి దిగబెట్టిరా!" అన్నాడు.

"వద్దులెండి, అక్కర్లేదు..." అన్నాను.

"పరవాలేదు. ఇతడు మీ కొడుకులాంటివాడు" అన్నాడు హరీశ్.

ఇక నేనేమీ మాటాడలేదు. ప్రభాత్ నా వెనకనే మా యింటి వాకిలిదాకా వచ్చాడు. తరువాత వెళ్ళిపోయాడు.

# 8

స్త్రీకి కొన్ని ప్రత్యేక అవకాశాలు ఉన్నాయి; కొన్ని ఇరకాటాలూ ఉన్నాయి. మంచి పేరు తెచ్చుకోవాలంటే ఆమెకు తేలికే. కీర్తిద్వారం ఆమె ముందు ఎప్పుడూ తెరిచే ఉంటుంది. అలాగే చెడ్డ పేరు తెచ్చుకోవాలన్నా తేలికే. ఆమె తలచుకుంటే సామూహిక కార్యక్రమాలలో చొరవ విరివిగా లభిస్తుంది. ఎందువల్లనంటే ఆమెను ఎవరూ అడ్డగించరు. అందరూ ఆమెను ససంభ్రమంగా, సమాదరంగానే చూస్తారు. కాని ఈ అవకాశాలే పోను పోను ఇరకాటాలై కూర్చుంటాయి. వాటిమూలాన్నే ఆమె జీవితంలో పరిపూర్ణత రాకుండా కుంటుపడుతుంది. ఆమెలో అసలైన శక్తి జాగృతం కాదు. ఆమెకూ ఇతర్లకూ ఏర్పడే పరస్పరసంబంధాలు అభిన్నంగా, హృదయపూర్వకంగా ఉండవు. ఏమైనాగానీ - రెండుమూడు నెలలు అయేసరికి ప్రభాత్ నావాడే అయి

పోయాడు. నరేశ్ ఎప్పుడూ నా మాట కాదంటూనే ఉంటాడు, అయినా అందరికన్నా ఎక్కువగా అతడే నన్ను గౌరవిస్తూ ఉంటాడు. శర్మాజీ అందర్నీ విడిచిపెట్టేసి నామాటే బలపరుస్తూ ఉంటాడు. కాని హరీశబాబు తత్వం మాత్రం మొదటిరోజున ఎంతవరకు తెలిసివచ్చిందో ఇప్పటికీ అంతే. నాకు చాల చేరువలో ఉన్నట్టే కనిపిస్తాడు; కాని తనకు తాను స్వతంత్రుడులాగే ఉంటాడు. ఆయన నా లోతు పూర్తిగా తెలుసుకోలేదు; చేరువకు లాక్కొని తెలుసుకుందామని ప్రయత్నించనూ లేదు. ఈలోగా నాకూ, మావారికీ ఎడం ఎక్కువైంది. నేను క్రమేణా స్వతంత్రురాల్ని ఔతూ వచ్చాను. ఇంట్లో నేను ఇప్పుడు వంట చెయ్యటం లేదు. ఒక వంట బ్రాహ్మణుని పెట్టాం. పిల్లవాణ్ణి కనిపెట్టి ఉండేందుకు ఒక నౌకర్ని పెట్టాం. నేనూ మావారూ ఎప్పుడైనా అవసరమైతే ముక్తసరిగా మాటాడి ఊరుకునేవాళ్ళం. అంతే. ఏవిధమైన రగడా పెట్టుకునేవాళ్ళం కాదు.

"ఈమధ్య నీ వస్తువులేమీ పోలేదుకద !" అడిగారు మావారు ఒకనాడు.

"ఏం ? అలా అడుగుతున్నారేం ?"

"నా జేబులోనుంచి డబ్బులు అప్పుడప్పుడు మాయమై పోతున్నాయి ఒకసారి అయిదురూపాయలనోటు ఒకటి డ్రాయరులో పెట్టాను. అదీ కనిపించకుండా పోయింది. అందుకోసం అడుగుతున్నాను."

"అయితే మీ ఉద్దేశం : నేను కాజేస్తున్నాననా ?" అంటూ వారి ముఖంలోకి చూచి, నేను గాభరాపడి

పోయాను. ఆయన ముఖం నల్లబడిపోయింది; ఏమీ మాటాడ లేకపోయారు.

పరిస్థితి చక్కబరుద్దామన్న ఉద్దేశంతో ఇలాఅన్నాను: "నవ్వులాటకు అలా అన్నానులెండి. అంతగా కంగారుపడతా రేం? నేను నిజంగానే అంత అవిశ్వాసంగా మాట్లాడాననా మీ ఉద్దేశం?"

"సుఖదా! అటువంటి నవ్వులాటలకు ఎల్లప్పుడూ దిగ బోకు. నాకు వంటబ్రాహ్మణునిమీద అనుమానంగా ఉంది. ఇంట్లో మనం తెచ్చి పడేసే సరుకుల్లోనుంచికూడా కొంత కొంత సంగ్రహిస్తున్నాడని నా ఊహ. నువు సరేనంటే అతన్ని పనిలోనుంచి తీసేస్తాను."

"తీసెయ్యాల్సిందే. నన్ను అడగాల్సిన పనేముంది?"

"నువ్వేగా అతన్ని పెట్టావు, అందువల్ల అడిగాను."

"అయితేమాత్రం? మీ రెందుకు తీసివెయ్యకూడదూ అతన్ని?"

"ఎవరిద్వారా ఇతన్ని మనం పనిలో పెట్టుకున్నామో ఆయనకు ఈ సంగతి మొదట చెప్పటం బాగుంటుందని నువు అభిప్రాయపడతావేమో అనుకున్నాను. ఇతడు విశ్వాస పాత్రుడే అని ఆయన మళ్ళీ చెప్పేట్టయితే పనిలోనుంచి తీసివెయ్యనక్కర్లేదు. మన అనుమానం నిరాధారం కావచ్చు కదా!"

వంటబ్రాహ్మణుడు హరీశబాబుద్వారా మా యింట్లో పనికి కుదిరాడు. ఆ సంగతి మావారికి తెలుసు. 'ఆవిషయమై వ్యంగ్యభావసూచకంగా మాటాడుతున్నారేమో వారు' అని

అనుమానం కలిగింది నాకు. అలాగే వారి ముఖంలోకి చూస్తూ చివరకు అడగబోయాను : "అయితే మీ ఉద్దేశం——"

మావారు అర్ధోక్తిలోనే అడ్డువచ్చారు : "నా ఉద్దేశం : నువు వంటబ్రాహ్మణుని పిల్చి నాలుగుమాటలూ అడిగెయ్యాలని."

"నేను అడగనా ?"

"ఔను. నువు అడిగితేనే బాగుంటుంది. నా మనసులో ఒక అనుమానం ఏర్పడిపోయింది. అందువల్ల నాకు న్యాయదృష్టి ఉండకపోవచ్చు. నీకు అటువంటి అంతరాయం ఏమీ లేదుగా ! అదీగాక నీ దయ పురస్కరించుకునికదా అతడు ఇక్కడ కుదిరాడు."

వారి మాటలు చాల సహజంగా ఉన్నాయి. కాగా నేనే దోషినన్నట్టు అనిపించింది. "కాదులెండి, మీరే అతనితో చెప్పెయ్యండి. నాదగ్గరకు పంపి స్తేమాత్రం నేనతన్ని తప్పకుండా వెళ్ళగొట్టేస్తాను. అతనిమీద మీరు నిరాధారంగా అనుమానించారని నేను అనుకోను" అన్నాను.

ఈ నా మాటలు విన్నప్పుడు వారిలో ఎటువంటి భావం ఉత్పన్నమైందో నాకు తెలియదు. వారి దృష్టిలో కృతజ్ఞతాభావం లాంటిది నాకు కనిపించింది. "పోనీలెద్దూ ! ఇదేమంత పెద్దవిషయం కాదులే" అన్నారు.

ఆ సమయంలో నాలోనూ కృతజ్ఞతాభావమే తొణికిసలాడింది. అన్నాను : "పెద్దవిషయం కాకపోవటమేం ? కనిపెట్టి చూచేవాళ్ళెవరూ లేరనుకున్నాడు కాబోలు ! ఇంట్లో

అన్నీ ఇప్పుడే తిరగమరగవేసి చూస్తాను ఒకసారి. మరీ సర్వం నౌకర్ల చేతుల్లోనే ఒప్పజెప్పేయడమైపోయింది...''

''ఇవాళ సాయంత్రం నువ్వు ఎక్కడికేనా వెళ్ళాలా? ఎక్కడికీ వెళ్ళక్కర్లేకపోతే మనం షికారు పోదాం. లేదా సినీమాకు వెడదాం.''

నేను వెంటనే వంటబ్రాహ్మణుని కేకవేసి పిల్చాను. అతడు వచ్చాడు. ''ఏమయ్యా బాబూ! నిన్ను వెంటనే పనిలోనుంచి ఎందుకు తీసివెయ్యకూడదో సంజాయిషీ చెప్పు?'' అన్నాను.

వంటబ్రాహ్మణుడు అలానే చూస్తూ నిల్చుండిపోయాడు.

''ఏమండీ! మీ జేబులోనుంచి ఎన్ని రూపాయలు మాయమైపోయాయి?'' అని మావారివైపు తిరిగి అడిగాను.

''రూపాయలా? లేదు – లేదు, ఎందుకులే——''

''ఏమయ్యోయ్, వంటబ్రాహ్మడా! మావారి జేబులోంచి ఏడు రూపాయలూ, ఇంకా కొన్ని అణాలు మాయమైపోయాయి. నువ్వు ఇంకా ఇవాళ పొయ్యి అంటించలేదుగా! ఇప్పుడు తక్షణం వెళ్ళిపో. రేపు మధ్యాహ్నం రెండుగంటల్లోగా ఆ రూపాయలు ఎత్తుకుపోయిన దొంగను తీసుకువచ్చి మాకు ఒప్పజెప్పు. లేదా ఆ డబ్బు నువ్వే తీసుకువచ్చి ఇచ్చెయ్యి. తెలిసిందా? డబ్బు తిరిగి తెస్తే పనిలో ఉండు. లేకపోతే నీవంటివాడు మాకు అక్కర్లేదు.''

'అమ్మగారూ! అమ్మగారూ!' అంటూ ఏదో చాల

బ్రతిమి లాడబోయాడు వంటబ్రాహ్మణుడు. నేను మాత్రం ఎక్కడలేని కోపం తెచ్చుకుని "పోవయ్యా పో, నాకు కనపడ కుండా దూరంగా వెళ్ళిపో - రేపు డబ్బు తీసుకురా. అప్పుడు చెబుదువుగానిలే చెప్పదలచుకున్నదంతా - తెలిసిందా? ఊఁ - వెళ్ళిపో." అంటూ విదిలించికొట్టాను. అతడు వెళ్ళి పోయాడు.

అప్పుడు నేను మావారివైపు తిరిగి "ఇక నన్నేం చెయ్యమంటారో చెప్పండి. పికారుకు ఎలా రాను? వంట ఎవరు చేస్తారు ఈ పూట?" అన్నాను.

"నువు చేస్తావా వంట! వద్దులే. ఈపూట ఎక్కడన్నా ఒక హోటల్లో భోజనం చేద్దాం."

ఆయన అలా అన్నారుగాని, మళ్ళీ ఇన్నాళ్ళకు లభించిన వంటచేసే అవకాశాన్ని జారవిడువలేకపోయాను.

# 9

నాటి సందెవేళ నాకు గుర్తుకు వస్తోంది. కాని ఏ మొగం పెట్టుకుని ఆ మంచిగడియల్ని స్మరించుకునేది? జీవితంలో చాలదూరం పరుగులు పెట్టిపెట్టి ఈ స్థితికి వచ్చాను. ఎంతో గొప్పవి అని తోచిన నా జీవిత సంఘటనలు కొన్ని ఇప్పుడు తుచ్ఛములుగా కనిపిస్తున్నాయి. నాటి సందెవేళవంటి కొన్ని గడియలుమాత్రమే ఈ విస్తృత జీవితమరుభూమిలో కాస్త జలమయమై, పచ్చపచ్చగా కనిపిస్తున్న ఒయాసిసులు. అటు వంటి సుసమయాలను ఆ రోజుల్లో అలక్ష్యం చేశాను. ఎండ

మావులవెంట పరుగులు పెట్టాను. ఈ స్థితికి చేరుకున్నాను. ఇదంతా తలచుకుంటే నాకు ఇప్పుడు ఆశ్చర్యం వేస్తుంది. అప్పుడు నేను బుద్ధిపూర్వకంగా నిర్లక్ష్యంగా జారవిడుచుకున్న ఆ మంచిగడియల్ని స్మరించుకుంటున్నానంటే...నా దుఃఖం ఇంకా అధికతరం కావటానికే, నా మూఢత్వం ఇంకా ప్రస్ఫుటంగా ప్రకటం కావటానికే.

నేను ఇంట్లో వంట ఎన్నాళ్ళో చెయ్యలేదు. ఆ మర్నాడే వంటబ్రాహ్మణుడు డబ్బు తీసుకొని హాజరైనాడు. 'నేను దొంగతనం చెయ్యలేదు అమ్మగారూ!' అని ఒట్టు కూడా పెట్టుకున్నాడు. అతనిమీద దొంగతనం వెయ్యటం నాకూ ఇష్టం లేదు. అతడు: "నన్ను తిట్టండి, కొట్టండి, చీవాట్లు వెయ్యండి. అంతేగాని ఇటువంటి కళంకంమాత్రం నా తలకు చుట్టకండి. చెడ్డపేరు తెచ్చుకుని నేనిక ఎక్కడా పనిపాటలు చేసుకు బ్రతకలేను" అంటూ తెచ్చిన డబ్బు నా పాదాలదగ్గర పెట్టాడు. నేను ఆ డబ్బును అతనిమీదికే విసిరి కొట్టాను. "వెళ్ళు. అయ్యగారిని క్షమాపణ వేడుకో. మళ్ళీ ఇంకెప్పుడన్నా వారు నీమీద ఫిర్యాదు చేశారంటే జాగ్రత!" అంటూ కసిరాను.

సాయంత్రం మీటింగు ఉంది. తప్పకుండా రావల్సిందని హరీశబాబు చాల బలవంతంచేసి పిల్చాడు. నిన్న మా వారితో షికారు వెళ్ళలేదు. ఇవాళ వెడదామనుకున్నాను. సినీమాకు కూడా పోదామనుకున్నాను. మీటింగుకు వెళ్ళలేక పోతే మానెలే అనిపించింది. "తీరిక చిక్కలేదు; అందుచేత రాలేకపోయాను" అని ఒక చీటీ రాసి పంపుదామనుకున్నాను.

కాని అంతలోనే మళ్ళీ నా బాధ్యతలన్నీ గుర్తుకురాసాగాయి. వెళ్ళకపోతే ఎలా ? అనిపించింది. పోనీ, మీటింగుకు వెళ్ళబోయేలోగా మావారికి భోజనాదికాల ఏర్పాట్లన్నీ చూచే పోదామనుకున్నాను. పొయ్యిదగ్గరే కూర్చుని మావారికి ఇష్టమైన పదార్థాలేవో రెండుమూడు చేయించాను వంటబ్రాహ్మణునిచేత. సాయంత్రం కావస్తున్నది. కాని వారింకా రాలేదు ఇవాళ. ఆరు అయింది; ఆరున్నర అయింది. ఏడు అయాక ఎప్పుడో వచ్చారు, మీటింగువేళ దాటిపోతోంది. 'ఇవాళ చాల ఆలస్యం చేశారేం?" అని అడిగాను.

"ఊఁ, అయింది ఆలస్యం ఇవాళ. పోనీలే, అయితే అయిందిగాని, మరి ఇవాళ షికారుకు పోదామా ? నిన్న చెప్పావుగా : ఇవేళ తప్పకుండా వెడదామని !"

"ఇవాళ కాదు. రేపు వెడదాం."

"ఏం ? మళ్ళీ దేశ సమస్య ఏదన్నా అడ్డంవచ్చిందా ?"

"మీకేం తెలుస్తుందీ ? ఆరున్నరకు మీటింగు ఉంది. ఇప్పటికే ఆలస్యం అయిపోయింది."

"వెళ్ళాలా ? తప్పదా ?"

వారు అలా అడగటం నాకు బాగనిపించలేదు. దేశ సమస్య అనేది పరిహాసాస్పదమైన విషయం కాదుకదా ! "వెళ్ళాలి, తప్పదు" అన్నాను.

"ఎప్పుడు వస్తావు తిరిగి ?"

"చెప్పలేను."

"పోనీ, సినీమా రెండో ఆటకన్నా వెడదాం. ఏమంటావు ?"

'ఊహుఁ, వద్దు."

అప్పటి నా మనస్థితి నాకే సరిగా అర్థంకాలేదు. చాల సేపటినుంచీ వారికోసం ఆశతో ఎదురుచూచాను. వారు వచ్చి ఎంతో ఆశగా షికారుపోదామా అని అడిగారు. నేను మీటింగువేళ దాటిపోతున్నదంటూ ఆందోళన ప్రకటించాను. మీటింగుకే బయలుదేరాను వారిని ఇంట్లో విడిచిపెట్టి. వెడు తూంటే నా మనస్సులో 'ఈ సంసారం– ఇదంతా వట్టి జంజాటం' అనిపించింది. "దేశస్వాతంత్ర్యంకోసం కృషి.చేస్తూ, ఆ మహ త్తర ఆశయంకోసం ప్రాణాల్నికూడా బలిఇచ్చేందుకు సిద్ధంగా ఉన్న ఆ మహాపురుషుల్ని చూడు !" అని నాకు నేను ప్రబోధం చెప్పుకున్నాను.

# 10

హరీశబాబు విషయమై ఏవేవో విషయాలు వింటూనే ఉన్నాను. వాటిలో నిజం ఎంతో, అబద్ధం ఎంతో నిర్ణ యించటానికి ఏమీ ఆధారం లేదు. హరీశబాబు తనను గురించి ఎప్పుడూ ఏవిషయమూ చెప్పుకోడు. అతడు వంగదేశీయుడు అయినా, హిందీ చాల బాగా మాటాడతాడు. అతడు ఈ ప్రాంతీయుడు కాదని అనుమానించేందుకు ఏమాత్రమూ అవ కాశం కనిపించదు. అతడు డబ్బులేక అవస్థపడట మనేది ఎన్నడూ ఎరగడని చెబుతారు. సంపన్నులయింట్లో పుట్టాడు. చిన్నప్పటినుంచీ దేశసేవలోనే మెలగుతున్నాడు; చాల కష్టా

లకు లోనైనాడు. దగ్గరగానే ఉంటాడు; కాని చాల దూర స్థుడుగా అనిపిస్తాడు. ఎదురుగానే ఉంటాడు; కాని అతనిలో ఏముందో కనుక్కోలేం. అంతా గుట్టే.

మీటింగు హరీశ్ బాబు ఇంట్లోనే జరుగుతుందన్నారు. కాని తీరా వెళ్ళి చూద్దునుకదా : హరీశ్ ఒక్కడే ఒక ఫైలు ముందుపెట్టుకుని కూర్చున్నాడు. నేను రావటం చూచాడు. కాగితాలు పక్కన పెట్టేశాడు. కళ్ళజోడు తీసేశాడు. "రా, కూర్చో. కాని ఇప్పుడు ఏడున్నర అయిందికాదూ!" అన్నాడు.

"మీటింగు అయిపోయిందా ఏమిటి?"

"అయిపోయింది. నీకోసమే ఎదురుచూస్తూ కూర్చు న్నాను. అంతా వచ్చారు, వెళ్ళిపోయారు. నువ్వు ఒకవేళ రావేమో నని అంతా అనుమానించారు. కాని నాకుమాత్రం నమ్మకమే : నువ్వు తప్పకుండా వస్తావని."

నేను ఆ పక్కనే కూర్చున్నాను. ఆలస్యంగా వచ్చి నందుకు క్షమాపణ యాచించాను.

హరీశ్ నవ్వాడు. "ఇంతమాత్రానికే క్షమాపణ అడ గాల్సిన అవసరం ఏముందీ ? కుటుంబం, సంసారం మరి ! ఏదో కాస్త ఆలస్యం అవటం మామూలే. ఆలస్యం కాక పోవ టమే ఆశ్చర్యకరమైన విషయం. నేను గృహస్థును కాదనీ, అంతమాత్రాన సంసారంలో ఉండే గొడవలు నాకు తెలియ వనీ నువ్వు ఎందుకు అనుకోవాలి ? ఇంతకూ...ఆలస్యంగా వచ్చావు కాబట్టి తొందరగా వెళ్ళిపోదామనుకుంటు న్నట్టున్నావే ?"

"లేదు - లేదు" అన్నాను వెంటనే.

ఆతరువాత హారీశ్ ఒకరకంగా ధోరణి ఆరంభించాడు: "ఆలస్యం అయితే ఔతుందనుకో. కాని దేశానికి సంబంధించిన కార్యక్రమం ఇంట్లో పనుల్లాగా కొనసాగిద్దామంటే లాభంలేదు. నువ్వు ఒక్క గంట ఆలస్యం చేశావంటే మన పనులకు ఎంత నష్టం కలుగుతుందో తెలుసా? ఇలాగా పది మంది పది గంటలు ఆలస్యం చేస్తే ఎంత పని ఖరాబైపోతుందో ఆలోచించు. కాబట్టి ఎప్పుడూ ఇలా ఆలస్యం పనికిరాదు."

ఈ ధోరణి నాకేం రుచించలేదు. ఇంత ప్రభుత్వం, అధికారం నామీద అతడు చూపించాల్సిన అవసరం ఏముందీ? అతనికి ఈ పెద్దరికం నేనెప్పుడు కట్టబెట్టాను? అయినా అతని ఆధికారిక వాక్చాతుర్యాన్ని ధిక్కరించలేకపోయాను. తప్పు చేసినదానిలాగే కూర్చుండి పోయాను.

అతడు మళ్ళీ ఇలా అన్నాడు: "ఇక నెప్పుడూ నువ్వు ఆలస్యం చెయ్యవు. నాకు తెలుసు ఆ సంగతి. నా మాటలకు నువ్వు కోపగించుకోవనీ నాకు తెలుసు. ఎందుకు కోపగించుకుంటావు? నిజానికి మన సంఘ పటిష్ఠత నీమీదనేగా ఆధారపడి ఉంది! నీకు తెలియనిది ఏముంది? నిన్ను గురించి మేము ఏమనుకుంటున్నాం? నీలో అఖండమైన విశ్వాసం, పట్టుదల, కార్యదీక్ష ఉన్నాయని మా భావన. మిగతావాళ్ళు ఎలా ఉన్నా నువ్వుమాత్రం పదునెక్కిన కత్తిలాగ ఉండాల్సిందే. లేకపోతే మన ఆశయాలు విచలితమైపోవూ? మన సంఘ సభ్యులందరిలోనూ మన ఆశయాలూ, ఆదర్శాలూ ఉజ్వలంగా ఎల్లప్పుడూ ప్రజ్వలిస్తూ ఉండాలంటే...అందుకు

ఆధారం నువే. ఈవిషయం నువ్వు బాగా గుర్తించాలని నా కోరిక. మనం చెదరిపోయినా సరే, మన ఆశయాలు భగ్నం కాకూడదు. లేదా, ఈ ఆశయాలన్నీ అర్థంలేనివని నిర్ణయించి చేతులు ముడుచుకు కూర్చుందాం. ఆ యీ కార్యక్రమాలతో లోకాన్ని మోసగించటం ఎందుకూ? ఆదర్శాలను విశ్వసిస్తున్నామూ అంటే వాటిని సుస్థిరంగా, తీక్షణంగా, ఉజ్వలంగా ఉంచుకోవాల్సిందే. వాటికి పతనం రానీయకూడదు. మనం చనిపోయినా సరే అవి తలెత్తుకుని ఉండాల్సిందే. అదీ మన ప్రతిష్ఠ – మన ప్రత్యేకత."

ఆ మాటలు వింటూంటే నాకు గుండె దడదడ కొట్టుకో సాగింది. ఆ మాటల్లో నాకు పూర్తిగా గ్రహణయోగ్యమైన అంశం ఏదీ కనిపించలేదు. కాని ఆ మాటలు నాలోనికి చొచ్చుకుపోయాయి. నా హృదయంలోని ఏ తీగనో స్పృశించాయి. నా ఆత్మలో ఒక విచిత్రమైన ఝంకారం బయలుదేరి పరివ్యాప్తమైంది. నన్ను విడిచి నేను ఎక్కడికో పైకి ఎగిరిపోవాలనిపించింది. సర్వం త్యజించివెయ్యాలనిపించింది. నేను మనుష్యవ్యక్తిని కాదా? ఆదర్శమే నేను అయిపోయానా? ఆదర్శంలాగే నేనూ ఉజ్వలమైన, అదృశ్యమైన ఒక మహావిరాట్ పదార్థం – సర్వశూన్యం – అయిపోయానా?... కేవలం ఒక చైతన్యంగా, ఒక శక్తిగా, ఒక జాగృతిగా, ఒక జ్యోతిగా, ఒక సంకల్పంగా...

కాని అస్థిమాంసయుతుడైన హరీశబాబు స్థిరంగా, తీక్షణంగా నా ముఖంలోకి చూస్తున్నాడు. అతని చూపులు ఎదుర్కుంటూన్న నాలో ఒక విధమైన భయంకూడా ఉత్పన్న

మైంది. నేను వట్టి తుచ్ఛవ్యక్తిని అన్న భావం నాలో ఒక మూల సందడిస్తూ ఉంది. అతని దగ్గరనుంచి లేచి పారిపోదామనిపించింది. "నువు అనుకున్నంత గొప్పదాన్ని కాదు నేను. నాకంత సామర్థ్యం లేనేలేదు. మీరు నన్ను ఇక్కడ అట్టిపెట్టాలని చూచినా నేను ఉండను – వెళ్ళిపోతాను" అని బిగ్గరగా అరిచి చెబుదామనుకున్నాను. కాని నేను అక్కడ నుంచి లేచిపోలేదు; ఏమీ మాటాడనూ లేదు; నిశ్చేష్టురాలినై కూర్చుండిపోయాను.

"ముఖ్యంగా కావల్సింది మన ఆదర్శం. ప్రధానంగా మనం దాన్నే అంటిపెట్టుకుని ఉండాలి; దాన్నిగురించే అనవరతం ఆలోచిస్తూ ఉండాలి. ఆదర్శాన్ని పురస్కరించుకుని కర్తవ్యం ఉండనే ఉంటుంది. కర్మక్షేత్రంలో స్త్రీకి సామర్థ్యం లేకపోవచ్చు. కాని ఆమె ప్రజ్ఞ అంతకు మించిన మరో క్షేత్రంలో అప్రతిహతంగా ఉంటుంది. అందువల్లనే మన కర్తవ్యాల్నిగురించి నీతో ఎప్పుడూ నేను ప్రసంగించటం లేదు. ఎప్పుడూకూడా ఆదర్శాన్ని ముందు ఉంచుకుని మన కార్యక్రమం సాగిపోతూఉండాలి. లేకపోతే అంతా నిష్ప్రయోజనమౌతుంది. మనకు తగినంత శ్రద్ధ లేకపోతే ఆదర్శం అసత్యం ఔతుంది. శ్రద్ధ, పట్టుదల బాగా ఉంటే అదే పరమ సత్యం ఔతుంది. మామూలుస్త్రీ మామూలు స్త్రీయే. దుర్గాదేవి అయితేనే ఈశ్వరుని వామాంగిని కాగలదు. కాబట్టి నేను చెప్పేది ఏమంటే—స్త్రీ తన హృదయాన్ని ఎప్పుడూ శూన్యంగా ఉంచుకోకూడదు...అలా ఉలికిపడబోకు...ఈ కాగితాలన్నీ చూచావా? వీటిలో మనం

చెయ్యాల్సిన అనేక పనులు రాసి ఉన్నాయి. కాని సుఖదా! కర్తవ్యాల్ని గురించిన విచారమంతా తరవాత. మొట్టమొదట ఆలోచించాల్సింది మన ఆదర్శాల్ని గురించి. ఆదర్శం చాల సూక్ష్మమైంది. దాన్ని బాగా భావన చేసుకోవాలి. అది అదృశ్యం, అనూహ్యం; కాని స్వయంభువు. అది కర్మ కాండకు తరువాత వచ్చేది కాదు; ముందు ఉండాల్సిందే. ఈ సంగతి తెలియనివాళ్ళే కర్మకాండను గురించి ఎక్కువగా వాగుతూ ఉంటారు. తెలిసినవాళ్ళు పనిపాటల్లో మునిగి పోతారు, అనవసరంగా వాగరు. అత్యంత నిష్కాములూ, ఆదర్శప్రాణులూ, ఛాయామయులూ కూడా ప్రసంగప్రియులే కాబట్టి ఈ కాగితాలన్నీ అవతలకు కట్టేసాను. వాటిల్లో పనిపాటలవివరాలే ఉన్నాయి..."

అంటూ హరీశబాబు తన ముందున్న కాగితాలన్నీ దూరంగా అవతలకు తోసేశాడు. నా ముఖంలోకి చూచి మందహాసంచేస్తూ మళ్ళీ ఇలా చెప్పసాగాడు: "పనిపాటల్ని గురించిన చింత మనస్సులోనుంచి తొలగించుకో. ఎక్కువగా భావనాశక్తి అలవరచుకోవాలి. పనిపాటల్లో ఒకరకమైన నైచ్యం కనిపిస్తుంది. దేశం విరాట్‌శక్తి. దాన్ని ఊహా ప్రపంచంలో దర్శించాలి. పనిపాటల ఒత్తిడి మనకు విసుగు కూడా పుట్టిస్తుంది. కాబట్టి సుఖదా! యువకులైనవాళ్ళు కేవలం పనిపాటల్లోనే మునిగిపోయి ఉండకూడదు. ఆదర్శ భావుకులై ఉత్పథాన ఉండాల్సిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. అందుకు నువ్వు బాగా పనికివస్తావు."

హరీశ్‌బాబు తదేకంగా నా ముఖంలోకి చూస్తూ

ఇంకా ఇలా ధోరణి సాగించాడు: వ్యర్థకాలక్షేపం మనకు పనికిరాదు. మనం కేవలం శిష్టజనులమే కాదు; గృహస్థులమే కాదు; మన సర్వస్వాన్నీ దేశసేవకోసం సమర్పించుకున్న వాళ్ళం; సమర్పితులమైపోవల్సిందే. మనమంతా సమైక్యంగా, అభిన్నంగా ఉండాలి. అంతేకదూ! ఏమంటావు?"

వింటూ కూర్చున్నాను. నన్ను నేను మరచిపోతున్న ట్టనిపించింది. నేను నేనేనా? నేను నేను కాకపోవటంలోనే కృతార్థత గోచరిస్తున్నదా? నేను మధ్యలో ఏమీ మారు పలకవలసిన అవసరంలేకుండా అతనే చెప్పుకుపోతున్నాడు. ఏమీ ప్రశ్న వెయ్యవలసిన అవసరంకూడా నాకు కనిపించ లేదు.

ఇలా ఒకరకమైన అవస్థలో పడి ఉన్నాను. తలవంచు కుని కూర్చున్నాను. ఇంతలో హఠాత్తుగా గలగల నవ్వు వినిపించింది. తలెత్తి చూచాను—

"అదేమిటి? ఎక్కడికి వెళ్ళిపోయావు?"

ఆ ప్రశ్న విని సిగ్గుపడుతూ నిల్చున్నాను. మాటా పలుకూ లేకుండా శూన్యంలోకి చూస్తూ ఉండిపోయాను. హరీశ్ మరొకసారి మెల్లిగా నవ్వాడు: "నిజంగా నువ్వు ఇక్కడ లేవు, నీ మనస్సు ఎక్కడికో వెళ్ళిపోయింది! సరే, మంచిదేలే. నా చివరి వాక్యాలు రెండుమూడు నీకు వినిపించ లేదల్లే ఉంది. అవి గాలిలో నీ మీదుగా ఎగిరిపోయినట్టు న్నాయి. పోనీలే. ఇంతకూ నేను చెప్పదలచినవిషయం ఏమంటే—ఇంకొక్క వారం రోజులు మాత్రమే నేను

ఇక్కడ ఉంటాను. ఆ తరువాత మరోచోటికి వెళ్ళిపోవాలి. చెప్పు మరి, ఎంత భారం నీమీద విడిచిపెట్టి వెళ్ళమంటావు ?

ఆ ప్రశ్న నాకు సరిగా అర్థంకాలేదు. ఆ సమయాన నా మనస్థితి అవధులు అతిక్రమించి ఉంది. కేవలం 'సమర్పిత' నై పోయి వున్నాను. మహత్తరమైన ఆదర్శాన్ని ఎదుట ప్రత్యక్షంగా చూడాలన్న ఉద్దేశంతో ఉన్నాను. అంతేగాని బాధ, భారం వహించే స్థితిలో లేను. అందుచేత ప్రశ్న సరిగా అర్థంగాక అతనివైపు ప్రశ్నార్థకంగా చూచాను.

"విషయం ఏమంటే—మన అవసరమైన కాగితాలు కొన్ని నీదగ్గర అట్టిపెట్టి వెడతాను. జాగ్రతగా ఉంచుతావుగా! అదీగాక...ఇంకో సంగతి: నీవల్ల డబ్బు ఎంత సపయి ఔతుంది. చాలానే కావాలి."

"ఎంత?"

"ఎంతంటావా? దేశానికి సంబంధించిన మహా కార్యం. ఎంతని చెప్పేది? దేశంలో ముప్పయిమూడు కోట్లమంది ఉన్నారు. ఎరివల ఎంత సాధ్యంఔతుందో అంతా కావాల్సిందే. ఈ మహాయజ్ఞంలో అంతా హోమం అవ్వాదే. త్యాగమే ఇక్కడ ప్రధానం; స్వార్థం ఏమీ లేదు."

నేను ఆలోచనలో పడ్డాను డబ్బు ఎంత రావాలో ఒక అంకె నాకేమీ స్ఫురించలేదు. "నావంతు ఎంత సేకరించి తీసుకురావాలి?" అని అడుగుదా మనుకున్నాను. కాని నోటివెంట మాటేమీ రాలేదు.

"పోనీలే, ఇప్పుడే పెద్ద ఆలోచించాల్సిన విషయం ఏమీ లేదు. నేను ఇక్కడినుంచి వెళ్ళిపోయేముందు కావాలి. ప్రభాత్‌నుగురించి నీ ఉద్దేశం ఏమిటి?"

హఠాత్తుగా వచ్చిన ఈ ప్రశ్నకు నేను వెంటనే సమాధానం చెప్పలేకపోయాను. ప్రభాత్‌నుగురించి నాకు ఎక్కువగా ఏమీ తెలియదు కూడాను.

"విశ్వాసపాత్రుడేనా ? ఏమంటావు ?"

"అతన్ని గురించి మీకే ఎక్కువగా తెలుసు. నాకు..."

"నాకు తెలుసే అనుకో. కాని మీరు ఒక్క చూపులోనే మాకన్నా ఎక్కువ విషయాలు గ్రహించగలరు. అసలు తత్వంకూడా మీరే తేలిగ్గా పట్టేస్తారు. అతనిమీద నాకు బాగా నమ్మకం ఉంది. అయినా నువ్వు సరేనని ఒప్పుకుంటేనే నేను ఏదన్నా బాధ్యతగల పని అతనికి అప్పగిస్తాను. ఏమైనా... అతన్ని కుర్రవాడులాగే అట్టిపెట్టాలి. అతని సంగతంతా నీకు మున్ముందు తెలుస్తుంది. స్నేహానికి ప్రాణం ఇచ్చే మనిషి. అందులో సందేహం ఏమీలేదు. అతనికి ఇక్కడ పాపం ఏమీ గడవటంలేదు. నాలుగు ట్యూషన్‌లు చెప్పి ఏదో సంపాదిస్తూ చదువుకుంటున్నాడు. అతనిభారం నీకు అప్పగించేసి నిశ్చింతగా వెళ్ళిపోదామని నా ఉద్దేశం. ఏమంటావు? అతన్ని కాస్త కనిపెట్టి ఉంటావా మరి ?"

అందుకు మౌనంద్వారా అంగీకారం సూచించాను.

"సరే అయితే. ఇంకేం, అతడు మన ఇద్దరి మధ్య

స్నేహంచిహ్నంగా ఉంటాడు, కాని మరి...?" అంటూ హరీశబాబు ఏదో అనుమానిస్తున్నట్టు ఆగిపోయాడు.

" -మీవారికేమన్నా కష్టంగా ఉండదుగదా ?" అన్నాడు.

ఆ మాటకు నాకు ఒళ్ళు మండిపోయింది. "నేను స్వతంత్రురాల్ని" అన్నాను.

"అలాగా ?"

"ఔను—"

తరువాత కాసేపటివరకూ ఎవరమూ మాటాడలేదు. నాకు లోలోపల కోపం రెచ్చిపోయింది. ఇక నేనక్కడ ఉండాల్సిన అవసరం లేదనిపించింది. "ఇక నేను వెళ్ళిపోనా?" అని అడిగాను.

"వెడతావా ? సరే అయితే - చాల ఆలస్యం అయినట్టుంది." అంటూ నావైపు చూడకుండానే కాగితాలన్నీ మళ్ళీ ముందువేసుకుని వాటిలో నిమగ్నుడైపోయాడు— ఇంకా నేనక్కడే ఉన్నానన్న స్పృహే లేకుండా.

మరికొన్ని క్షణాలు అక్కడే మౌనంగా కూర్చుని చివరకు లేచాను. "నమస్కారం" అన్నాను.

అతడు తల ఎత్తలేదు. పెన్సిల్ పుచ్చుకుని కాగితం మీద ఏదో రాసుకుంటూనే 'నమస్కారం' అన్నాడు.

నేను లోలోపల మండిపోతూ గదిలోనుంచి గబగబా బైటికి వెళ్ళిపోయాను.

# 11

రుసరుస లాడుకుంటూ వచ్చాను ఇంటికి. నాకోసం ఎదురు చూచినవాళ్ళూ లేరు, నేను వచ్చానని సంతోషించిన వాళ్ళూ లేరు. చేసిన వంట అంతా చల్లారిపోయింది. వంట మనిషి ఒక మూల చేరగిలపడి కునుకుపాట్లు తీస్తున్నాడు. మావారు గదిలో టేబిల్ మీద దీపంముందు కూర్చుని ఫైలు తిరగవేస్తున్నారు. లేచివచ్చి నన్ను పలకరిస్తారేమోనని ఆశిం చాను. కనీసం వచ్చి నామీద కోప్పడినా బాగుండుననుకున్నాను. వస్తూ వస్తూ దారిలో...ఇక మళ్ళీ ఎప్పుడూ హరీశ్ బాబు ఇంటికి వెళ్ళకూడదనే నిశ్చయించుకున్నాను. కాని ఇంట్లోమాత్రం నన్ను పలుకరించే దిక్కు ఏదీ? నా అవ సరం ఇక్కడ ఏముంది? నాకు చాల అసహ్యమనిపించింది. ఒకసారి గదిలోకి వెళ్ళాను. మళ్ళీ తిరిగి వచ్చేశాను. దుస్తులు మార్చుకున్నాను. సోకనుమీద కాస్త ధూంధాంలాడాను. భోజనం వడ్డించమని వంటబ్రాహ్మడికి హుకుం జారీచేశాను. దురుసుగా వచ్చాను మళ్ళీ గదిలోకి "ఏమండీ, మిమ్మల్నే" అంటూ.

వారు మెల్లిగా తలెత్తిచూచారు. "వచ్చావేమిటి!"

"చిత్తం, వచ్చాను."

వారు నా ముఖంలోకి అలాగే కాసేపు చూచారు. విలక్షణంగా ఒక మందహాసం చేశారు. "సుఖదా! కోపం నీ ముఖానికి ఎంత అలంకారంగా ఉందో తెలుసా? నిజంగా ఇప్పుడు నీ ముఖం చాల అందంగా ఉంది."

ఆమాటతో నాలోని కాఠిన్యమంతా మాయమై పోయింది. ఒళ్ళంతా పులకరించింది. "ఏమిటింకా పనిపెట్టుకు కూర్చున్నారు. వంటంతా చల్లారిపోయింది. ఇప్పుడెంతైందో ఏమన్నా తెలుసా? బాగానేఉంది; లేవండి."

"నువు మరి..." క్షమాపణ యాచిస్తున్న మనిషిలా ముఖంపెట్టి అన్నారు.

"నేను రాకపోతే మీరు భోజనం చెయ్యకుండానే పడుకుంటారా యేమిటి? ఈ నియమం ఎప్పటినుంచి ఆరంభించారబ్బా! నేనేదో బైట కాస్త తినివచ్చాను."

వారు ముఖంవంచుకున్నారు. "అయితేసరే, నువు వెళ్లు. నాకు కాస్త పని వుంది."

"అలా వల్లకాదు, లేవండి. తమరు కాస్త అనుగ్రహిస్తే వంటబ్రాహ్మడు పని పూర్తిచేసుకుని వెళ్ళిపోతాడు మరి!"

"అతన్ని వెళ్ళిపొమ్మని చెప్పు" అన్నారు ఆయన తలెత్తి నావైపు చూడకుండానే.

ఇదంతా నాకు ఆహ్లాదకరంగానే ఉంది. ఇంతకూ ఈ యింట్లో నా అవసరం లేకపోలేదన్నమాట! నా కిక్కడ తగినంత గౌరవమూ ఉందన్నమాటే! కాని కటువుగాఅన్నాను: "ఇక మీ యిష్టం; నేను వెడుతున్నాను."

"వెళ్ళు, నన్ను విసిగించబోకు" అన్నారు ఆయన తల ఎత్తకుండా.

ఇంతలోనే వారిలో ఈ మార్పు ఏమిటి? నాకేమీ

బోధపడలేదు. నే నక్కడినుంచి తరలిపోవటంకంటే మిగిలిం దేమీ లేదు.

నాకు కోపంవచ్చింది. "నేను ఇంట్లోనే తప్ప ఇంకెక్కడా భోజనం చెయ్యటానికి వీల్లేదా ఏమిటి? మీరు భోజనం మానేస్తే మానేసుకోండి - నాతో వంతు పెట్టుకుంటారెందుకూ?"

"నన్ను పనిచేసుకోనిస్తావా లేదా?" పుల్లవిరిచినట్లు అనేశారు.

నాకు అప్పుడు అనిపించింది: గబగబాపోయి, ఫైలు తీసి అవతల పారేసి, రెండు చేతులూ పట్టుకుని కుర్చీలోనుంచి లేవదీసి "అబద్ధం స్వామీ! నేనెక్కడా భోజనం చేసి రాలేదు" అని చెప్పి వంటింట్లోకి లాక్కుపోదామని. కాని నే నలా ఏమీ చెయ్యలేకపోయాను. పైగా ఇలా అన్నాను: "నేను ఈ యింటికీ మీకూ దాసీదాన్ని కాదు, తెలుసునా? నాకు అవతల చాల పని ఉంది. మీరు నన్నిక్కడ బంధించి ఉంచాలని చూస్తున్నారు. అలా వల్లకాదు."

అప్పుడు వారు తలెత్తి నాకేసి చూచారు. "ఏం పని? దేశాన్ని సంస్కరిస్తావా?"

ఇంతవరకూ నేను నిల్చునే ఉన్నాను - మరి కాసేపటికి భోజనానికి వెడతాంగదా అనే ఉద్దేశంతో. కాని ఇప్పుడు వారి మాట విన్నతరువాత జోరుగా ఆ పక్కన పడివున్న పేముకుర్చీ దగ్గరకు లాక్కుని అందులో తాపీగా కూర్చున్నాను. "చిత్తం, ఆ పనే."

వారి శాంతం చెక్కుచెదరలేదు. "సంస్కారణావశ్యకత ఉంది; నాకు తెలుసు. బైట ఎక్కడో సంస్కరిస్తావా? ఇంట్లో సంస్కరించవా?"

నాకు ఒళ్ళు మండిపోయింది. "మీకు భయం వేసున్నది కాబట్టి నేను నా తలపెట్టిన పని విడిచి వచ్చేయాలన్న మాట!"

"అయితే ఇవాళ నీ కా దీక్ష లభించలేదా యేమిటి?" మెల్లిగా తీక్షణమైన స్వరంతో అన్నారాయన.

"ఏం దీక్ష?" దూకుడుగా అడిగాను.

"సంస్కరణదీక్ష – విప్లవదీక్ష."

నాకు ఇక ఒళ్ళు తెలియలేదు. "ఆరి భగవంతుడా! నన్ను ఎటువంటి పశువుపాల పడేశావు!" అన్న మాటలు నా నోటినుంచి అప్రయత్నంగా వచ్చాయి. నేను అక్కడి నుంచి లేచి వెళ్ళి పోయాను.

వడ్డించిన పదార్థాలు మళ్ళీ పాత్రల్లో పెట్టేసి పడుకోమని వంటబ్రాహ్మడికి చెప్పాను. పక్క వేసుకుని పడుకున్నాను.

ఆ రాత్రి ఇంట్లో ఎవరూ భోజనం చెయ్యలేదు. పక్కమీద కళ్లు తెరచుకుని చూస్తూ అలాగే పడుకున్నాను. పది అయింది, పదకొండు అయింది, పన్నెండు అయింది, ఒంటిగంట అయింది...వారి పక్క ఖాళీగానే ఉంది. ఇంకా వారు వచ్చి పడుకోలేదు. ఈ జరిగినదానికి నేనేమీ విచార

పడాలనుకోటంలేదు. కాని ఎంతసేపటికీ నిద్ర రాకుండా ఉంది. లేచివెళ్ళి వారిని బ్రతిమాలి తీసుకువద్దామా అనిపించింది. 'ఆడదాని మాటకు వారు అంతగా పట్టించుకుంటారేమిటి? మనస్సు చూడరేం?' అని చాల కటకట పడ్డాను. కాని ఇవన్నీ నా లోపలి లోపలి ఆలోచనలే. లోపలే ఉండి పోయాయి. కళ్ళు తెరచుకుని చీకటిలోకి చూస్తూ గడి యలు లెక్కపెట్టుకుంటూ పడుకున్నాను. హరీశ్ బాబు అంటే నాకు బాగా కోపం కలిగిపోయింది. అసహ్యంకూడా కలిగింది. కాని నాకు ఈ స్థితిలో వాళ్ళ విప్లవమార్గమే తప్ప మరో జీవితపంథా శరణ్యంగా కనిపించటం లేదు. ఒంటిగంట దాటాక నాకు కొంచెం కునుకుపట్టినట్టుంది. నిద్రపోయినట్టూ లేదు, మేలుకొని ఉన్నట్టూ లేదు. అటువంటి స్థితిలో ఎవరో నా తలకింది దిండు కదిలిస్తున్నట్టు అనిపించింది. నా మనస్సుకు ఏమీ అనుమానం లేదు. ఇంకా బాగా నిద్రపోతున్నట్టు నటించాను. నేను నిద్రపోవటం లేదన్న అనుమానం కలిగిం చటం నాకు ఇష్టంలేదు. దిండు కదిలించిన చెయ్యి దానికింద ఏదో పెట్టింది. అదొక ఉత్తరం అని నిద్రపోతున్న నాకు ఎవరు చెప్పారో మరి! దిండుకిందనుంచి చెయ్యి ఇవతలకు వచ్చేసింది. ఆ వ్యక్తి లేచి వెళ్ళిపోతున్నాడు. అతడు వేసే ప్రతి అడుగూ నాకు వినిపిస్తూనే ఉంది. ద్వారందాకా వెళ్ళాడు. మెల్లిగా గడప పుచ్చుకుని అక్కడ ఆగాడు. నేను నిద్రలో పెద్దకేక వేశాను. స్వప్నంలోనిది ఆ కేక. నేను స్పృహలో లేను. నిద్రపోతున్నాను. ఆవ్యక్తి అక్కడ ఆగిపోయాడు, సంకోచిస్తున్నాడు, రావటంలేదు—అని నిద్ర

మత్తే నాకు తెలిపింది. ఆ స్వప్నావస్థలో నేను రెండుమూడు కేకలు వేశాను.

వారు నా తలమీద చెయ్యివేసి నిముకుతూ "సుఖదా! సుఖదా ! ఏమిటీ ?" అని పలుకరించారు.

సుఖద ప్రశాంతంగా నిద్రపోతోంది.

"సుఖదా !"

నేను ఉలికిపడి లేచాను. కళ్ళు తెరిచాను. "ఏమిటీ ? ఎవరూ ?" అని గాభరాగా అన్నాను.

"ఏమిటైంది సుఖదా ?"

నాకు ఒళ్ళంతా చెమట పట్టింది.

"నువు నిద్రలో కేకలు వేస్తున్నావు. ఏదన్నా కల వచ్చిందా ? ఒంట్లో బాగులేదా యేమిటి ?" అంటూ వారు నా తలదగ్గర వచ్చి కూర్చున్నారు.

"ఒంట్లో బాగానే ఉంది. ఔను, ఏదో కల వచ్చింది" అన్నాను.

"ఎందుకూ నీకు భయం ? నేను లేనూ !" వారు నా తల నిముకుతూ అన్నారు.

నాకు ఇప్పటికి బాగా స్వాస్థ్యం చిక్కింది. "నేను కేకలు వేశానా ?" అని అడిగాను.

"రెండుమూడుసార్లు కేకలు వేశావు."

"చాల భయంకరమైన కలే. ఎవరో వచ్చి నా తల కింద దిండుఎత్తి దానికింద తడిమాడు. పోతూపోతూ మళ్ళీ తిరిగి

వచ్చాడు. అతని చేతిలో—అబ్బ! అతడు నావైపుకు వస్తున్నాడు—"

నా తలవెంట్రుకల్లో వేళ్లు జొనిపి దువ్వుతూ "ఏం భయంలేదు. అనవసరంగా భయపడతావేం? వట్టి కలేగా! నేను ఇక్కడ లేనూ? కనిపించటంలేదూ?" అన్నారు మావారు.

తరువాత చాలసేపటివరకూ వారు నాదగ్గరే కూర్చున్నారు...వీపు తట్టుతూ. వారి అరచెయ్యి తెచ్చుకుని నా ముఖంమీద కప్పుకున్నాను. మరికాసేపటికి వారి అరచేయి మీద చెంప ఆనించి ఒత్తిగిలి పడుకున్నాను...రెండుచేతులా వారి మణికట్టు గట్టిగా పుచ్చుకుని. ఆతరువాత నాకు ఎప్పుడు నిద్ర పట్టిందో తెలియదు. తెల్లవారి లేచి చూద్దును కదా... మావారు వారి మంచంమీద పడుకుని నిద్రపోతున్నారు. నా దిండుకింద ఏవిధమైన కాగితమూ లేదు.

# 12

మర్నాడు పగలంతా మళ్లీ మేము మాటాడుకోలేదు. ప్రొద్దుట నించి సాయంత్రందాకా ఆలోచించి ఆలోచించి భగవంతుడు నన్ను అప్పజెప్పిన మార్గంలో ఉండిపోటానికే నిశ్చయం చేసుకున్నాను. విప్లవమార్గంలో నేను చాలదూరం వెళ్ళకూడదు. ఆ మార్గం నాకు సరిపడేదికాదు. ఇలాంటి ఆలోచనలలో మధ్యమధ్య హరీశ్ బాబు జ్ఞాపకంవస్తే అతనిపట్ల అసహ్యాభావంకూడా ఉత్పన్నమౌతూ ఉండేది హృదయంలో. విప్లవ

మార్గం రహస్యభరితమైంది. అందువల్లనే అటువైపు ఆకర్షణ. అందువల్లనే దానిపట్ల ద్వేషంకూడా. అటువైపు చాల ఆపదలు ఉన్నాయి. నేను అటు వెళ్ళకూడదు. నిజంగా వెళ్ళకూడదు. సంఘ సమావేశాలకు వెళ్లుతున్నాను; కాని నన్నెవరు లెక్కచేస్తున్నారు? ఈ భావం మిక్కుటంగా నాకు ఆ మార్గంనుంచి విముఖత్వాన్ని కలిగించింది. పూర్తిగా సంసార జీవితంవైపే ఆకర్షితనైనాను. మానసికంగా ఈ పరివర్తన ఎలా వచ్చిందో నాకే ఆశ్చర్యమనిపించింది. సాయంత్రమైంది. ఇక ఒంటరిగా ఉండలేకపోయాను. ఆలోచించి ఆలోచించి కణతలు వేడెక్కిపోయాయి. దుఃఖం పొర్లి పొర్లి వస్తున్నది. అప్పుడు లేచి బయలుదేరి వెళ్ళాను వారు ఉన్న గదిలోకి. పడక కుర్చీలో వాలి కళ్లు మూసుకుని పడుకుని ఉన్నారు. ఈ మధ్య వారికి సిగరెట్టుకూడా అలవాటైంది. చివరదాకా కాల్చిన సిగరెట్టుముక్క ఒకటి చేరువనే ముక్కాలిపీటమీద 'ట్రే'లో కొంతసేపు పొగలుగ్రక్కి ఆరిపోయింది. నేను వచ్చిన సంగతి వారికి తెలియనే తెలియదు.

"ఏమండీ! మిమ్మల్నే..."

"ఆఁ..." అన్నారు. కళ్ళు విప్పి ఒకసారి తిరిగి చూచారు. మళ్లీ యథాపూర్వంగా పడుకున్నారు. ఏమీ మాటాడలేదు.

"ఒకమాట అడుగుదామని వచ్చాను."

జవాబు లేదు. "కళ్ళు విప్పి చూడ్డానికే అంత అసహ్యమనిపిస్తున్నానా? వెళ్ళిపోనా?" అన్నాను.

అప్పుడు వారు కుర్చీలోనుంచి లేచి వచ్చారు. ఇంకో కుర్చీ దగ్గరకు లాగి "కూర్చో" అన్నారు.

"ఎందుకూ? నిల్చునే ఉంటాలెండి."

"మాటాడవలసిన అవసరం ఉన్నప్పుడు నిల్చోటం దేనికి? కూర్చో, ఊఁ."

నేను వివశనై కూర్చున్నాను. వారూ తమ కుర్చీలో వచ్చి కూర్చున్నారు. "ఊఁ, ఏం మాట? చెప్పు."

చెప్పదలచిన సవ్యమైన మాటలన్నీ మనసులోనే మాయమైనాయి. అవన్నీ గుర్తుకు తెచ్చుకుందామన్న ప్రయత్నం సఫలం కాలేదు. ఊరికే కూర్చోటం భారమని పించింది. చివరకు అనేశాను: "అసలు మీ ఉద్దేశం ఏమిటో నాకు విస్పష్టంగా చెప్పండి. ఈవిధంగా నేను ఈ యింట్లో ఉండలేకపోతున్నాను."

వారు నావైపు గుడ్లు ఒప్పజెప్పి చూస్తూ ఉండిపోయారు. ఒక్కమాటకూడా పలుకలేదు.

"మీకు అనుమానంగా ఉంటే నన్ను ఇంట్లోనుంచి వెళ్ళగొట్టెయ్యరాదూ?" అన్నాను.

"సుఖదా!—" అంతే—ఆపైన వారేమీ అనలేదు.

నాపేరు పలకటం; నా ముఖంలోకి చూస్తూ మౌనంగా ఉండిపోవటం—ఎప్పుడూ వారి అలవాటు అంతే. అదే నన్ను ఆపాదమస్తకం శోణికించేస్తుంది. వారు పైకి చెప్పకపోయినా చెప్పదలచుకున్నదంతా ఒక పెద్ద బరువై వచ్చి నన్ను కుంగ దీస్తుంది. ఇదీ వారి యుక్తి—భలేయుక్తి. ఇది చాల

అన్యాయం కదూ! దోషమంతా నా తలకే చుట్టటం కాక పోతే ఏమిటిది ?

"మాటాడరేం ? రోజంతా వారితో వీరితో ఎంతైనా ప్రసంగాలు చేస్తూనే ఉంటారుగా ! నేను ఎదుటికి వచ్చేసరికి ఇదేం పాపం ?"

"ఏం చెప్పమంటావు సుఖదా ! నామూలాన నువు చాల దుఃఖపడుతున్నావు. నిజమే పాపం ! నాకూ తెలుసు ఆ సంగతి. కాని అందుకు ప్రతిక్రియ నీ చేతిలోనే ఉంది. నేను చేయగలిగింది ఏముందీ ?'' చాల కష్టంమీద అన్నారు ఆయన ఈ మాటలు.

"మీ ఉద్దేశం ఏమిటో సరిగా చెప్పండి : నేను ఎక్కడికేనా వెడితే మీకు ఎందుకూ అంత కోపం వస్తుంది ?''

"ఆగు. సుఖదా !'' వారు గాలిలో చెయ్యి అడ్డంగా ఊపారు. "నాకు కోపం రావటంలేదు. కాని నువు కోపంగా రుసరుసలాడుతూ తిరిగిరావటం... అదే బాగుండలేదు. కోపంతో ఎందుకు తిరిగిరావాలి ! నువు విశ్వసించిన మార్గంలో విశ్వాసం ఎందుకు ఉంచుకోలేవు ? నా ఉద్దేశాల్ని మాత్రం నువు విశ్వసించగలవన్న నమ్మకం ఏముందీ ? నిన్నటికాండ అంతా ఎందుకు జరగాల్సివచ్చింది ? నన్ను, నా ఉద్దేశాల్ని నువు లెక్కలోకి తీసుకోవల్సిన అవసరంలేదు. జీవితంలో నువు విశ్వసించిన ఒకానొక మార్గాన్ని పూర్తిగా విశ్వసించి ముందుకుపో. నేను సంతోషిస్తాను. నువు అటూ ఇటూ ఊగులాడుతూ ఉండటం నాకు ఇష్టంలేదు. నువు 'నువు'గా ఉండలేకపోతే నాకుమాత్రం తృప్తి ఎలా ఉంటుంది ? నువు

'నువు'గా ఉన్నప్పుడే నిన్ను నేను పొందగలను. కాబట్టి సుఖదా! నీ మనస్సులోలి అనుమానాలన్నీ తీసి అవతల పారవెయ్యి."

"మీరు హరీశబాబును ఎరుగుదురా?"

"ఎందుకూ?"

"ఎరుగుదురా?"

"బహుశా ఎరుగుదునేమో?"

నాకు కోపం వచ్చింది. "తల్లకిందుగా మాటాడకండి. 'బహుశా' అంటే ఏమిటి మీ అర్థం?"

"నీకు చెప్పతగిందేమీ నాకు తెలియదు. నేను అతన్ని ఒక దృక్పథంలో చూచాను. అంతవరకే అతన్ని ఎరుగుదును. విప్లవసంఘనాయకుడుగా అతన్ని పూర్తిగా ఎరగను."

"ఎటువంటి మనిషి అంటారు?"

"చాల మంచివాడు."

"నాకు అలాగ అనిపించటం లేదు."

"అయితే నువు అతన్ని బాగా అర్థంచేసుకోలేదన్న మాట! బాగా అతన్ని గురించి తెలుసుకున్నతరవాత మంచి వాడు కాదని అనిపించదు. అయినా ఎందుకీ విషయం?"

"ఇక్కడ అతడు సంఘం స్థాపించాడు. ఇంకా చాల చోట్ల దీనికి బ్రాంచీలు ఉన్నాయనే వింటున్నాను. అతనికి అస్తమానం ఇదే పని. అందుకు ధనంకూడా బోలెడంత కావాలిగా! నేను ఎక్కడినుంచి ఏమి తెచ్చి ఇయ్యగలను

ఆయనకు ? మనిషి ఎటువంటివాడూ అని అందుకోసమే అడుగుతున్నాను. మీరు సరేనంటే ఏదో కొద్దిగా ఆయనకు ఇవ్వొచ్చు."

వారు నవ్వారు. "నేను సరే అనాలా ? ఎందుకూ ? నేను యజమానిని కాబట్టేనా ? అందుకనే నేను ఈ విషయంలో ఏమీ మాట్లాడ్డానికి వీలులేదు."

"మిమ్మల్ని అడక్కుండా నేనెలా ఇవ్వగలనూ ?"

"అయితే నీకు ఇవ్వాలని లేదా ? ఇవ్వటం ఇష్టం లేదా నీకు ?"

"ఇవ్వాలనే ఉంది. పాపం అతడు ఇల్లు వాకిలి విడిచి పెట్టేసి దేశంకోసం ఎంతో పాటుపడుతున్నాడు. మనం అంత మాత్రం సాయం చెయ్యకపోతే ఎలాగ ? కాని..."

"కాని నేనొకడిని ఉన్నానిక్కడ. అదేనా నీ యిబ్బంది ? ఔనా సుఖదా ! ఇదిగో ! ఎప్పుడూకూడా నన్ను నీవాడినిగానే భావించు. ఇటువంటి విషయాల్లో నువ్వు వేరు, నేను వేరు అన్న భావంతో ఆలోచించకు. డబ్బు నీదగ్గరే ఉంటున్నది. అందులోనుంచి ఎప్పుడు, ఎవరికి, ఎంత ఇవ్వాలని తోస్తే అంత ఇచ్చేసెయ్యి. నీదగ్గర ఉన్నదానికంటే ఎక్కువ ఇవ్వవలసివస్తే...లేదా ఇంకా వేరే ఏమన్నా ఇవ్వవలసి వస్తే అప్పుడు నాతో చెప్పు. మన స్థితి నీకు తెలియనిది కాదు. 'కాని...' అనే శబ్దం తీసుకొచ్చావంటే అంతా చెడిపోతుంది. నేను శాసించేవాడిని ఐపోతాను. నీ స్వాతంత్ర్యానికి భంగం వస్తుంది. అలా లాభంలేదు. ఏ పనులైనా పరస్పర విశ్వాసంమీద సాగిపోతూఉండాలి."

నాకు ఏమి మాట్లాడ్డానికీ తోచలేదు. అప్పటికీ ఇలా అన్నాను : "విశ్వాసం మాట అలా ఉంచండి. భారమంతా నా నెత్తిమీద పడెయ్యాలనేగా మీ భావం! అదేగా మీ 'విశ్వాసం'లోని అర్థం. భారమంతా మీ చేతుల్లోనే ఎందుకు తీసుకోకూడదూ? అదే అన్నింటిని మించిన 'విశ్వాసం' ఔతుందే! అంతా నామీద పడేసి మీరు సాక్షిమాత్రంగా చూస్తూ ఉంటారన్నమాట! అప్పుడు అపరాధమంతా నేనే మొయ్యాలి. అదేనా మీకోరిక? అలా కాదులెండి. చెప్పండి: హరీశ బాబుకు ఎంత ఇవ్వవచ్చు?"

"అతడు ఎంత కావాలన్నాడు?"

"ఇంత అని తేల్చి చెప్పలేదు."

"అడిగి తెలుసుకో. అతడు అడిగినదానికి తగ్గించి ఇచ్చే అధికారం మనకు లేదు. అతడు త్యాగి. సర్వం దేశ సేవలో అర్పించేశాడు. మనం భోగులం, గృహస్థులం; అసలు కష్టం పడాల్సింది మనం. మన కాలమంతా, కీర్తి, గౌరవం, ధనం సంపాదించేందుకే వినియోగమౌతున్నది. హరీశ్ లాంటి ఆర్జనపరులుకాని వ్యక్తులకు కష్టాలు కలుగుతున్నాయంటే ఆ దోషమంతా మనదే."

"అయిదువందలైనా..." పరిహాసంగా సూచించాను అంచనా.

"హరీశ్ అడిగితే అయిదువందలైతే మాత్రం ఎందుకు ఇవ్వకూడదూ?"

"మీ దగ్గర ఉన్నాయా మరి, అయిదు వందలు?"

"నువ్వు ఉంటే నాదగ్గర లేనిదేమిటి రాణీ!"

వారు అటువంటి మాటలు పలికినప్పుడు నాకు ధైర్యం జారిపోతుంది. అణువులో అణువుగా విలుప్తమై పోతాను. ఏమైనాగానీ, ఆ రాత్రి మా యిరువురి హృదయాల్లోనూ కాఠిన్యమనేది ఏమాత్రమూ కనిపించలేదు. ఇద్దరం కరిగి నీరై ప్రవహించాం. నేను ఏడ్చాను; వారు ఏడ్చారు. అవి దుఃఖాశ్రువులే. కాని అవి ప్రవహించాక సుఖానుభవం చూరగొన్నాం. కాని పైనుంచి అంతా పర్యవేక్షిస్తూ ఉండే భగవంతుని ఇచ్ఛ ఎలా ఉందో...ఆయన ఏమి రచిస్తున్నాడో ...ఎవరికి తెలుసు?

# 13

ఈవిధంగా నా జీవితంలోని మాలిన్యమంతా ప్రక్షాళితమై, ప్రసన్నత – పరిపూర్ణత చేకూరుతుందని ఆశించాను... మర్నాటి ఉదయం నిద్ర లేచినప్పుడు. ఎగుడుదిగుడు లేకండా ఇక నా జీవితం సాఫీగా సాగిపోతుందిలే అనుకున్నాను. కాని విధి వేరుగా ఉంది. తెల్లవారేసరికి ప్రభాత్ వచ్చాడు: ఎక్కడో మహిళాసమావేశం జరుగుతుందిట. దానికి నేను అధ్యక్షత వహించాలిట. కరపత్రాల్లో నా పేరు అచ్చువేశారట. ఇప్పుడు నేను కాదనకూడదట. ఒప్పుకోవాల్సిందేనట.

"నన్ను బైటికి ఎందుకూ ఈడవటం? మీరే ఏదో నిర్వహించేయ్యండి. ఆసంగతే మీ అన్నగారితో చెప్పి వెళ్ళి" అన్నాను.

"హరీశ్ అన్నగారు చెబితేనే వచ్చాను. మీరు తప్పకుండా ఒప్పుకోవాలని వారు కోరుతున్నారు."

అధ్యక్షపదవిని వదలుకోటం నాకు నిజంగా మనసులో ఇష్టంగా ఉందా? నన్ను ముందుగా అడిగి తెలుసుకోకుండా నేను ఒప్పుకుంటానని హరీశ్ బాబు ఎలా అనుకున్నారు? ఒప్పుకోవల్సిందేనని ఈ బలవంతం ఏమిటీ? హరీశ్ అన్నగారి ఈ అధికారమంతా ఏమిటో నాకు అర్థంకావటం లేదు. ప్రభాత్ తో వాదన పెట్టుకున్నాను. కోపగించుకున్నాను. రాననీ చెప్పాను. కాని ప్రభాత్ నన్ను ఒకపట్టాన విడచిపెట్టలేదు. కరపత్రాలు అచ్చు అయినాయి. ఇప్పుడు మారిస్తే ప్రజలు ఇంకోరకంగా భావిస్తారు...అంటూ సాకులు ఏకరువు పెట్టాడు. "అయితే మావారేమంటారో అడుగు" అన్నాను చివరకు.

ఇంట్లో సర్దుకోవలసిన చాలా పనులు ఉన్నాయి నాకు. మావారు ప్రాతఃకాలకృత్యాలు నిర్వర్తించుకోటంలో ఉన్నారు. ఒకసారి గదిలోకి వచ్చారు; వెంటనే మళ్ళీ వెళ్ళిపోయారు. ప్రభాత్ లోపలికి వచ్చి కూర్చుని నాతో మాటాడుతూ ఉండటం వారికి కష్టం కలిగించిందేమో ననుకున్నాను. మరి కాసేపటికి వారు మళ్లీ గదిలోకి వచ్చారు. "ఏదీ నా... అరె, నువ్వు ఇంకా కూర్చునే ఉన్నావేం? ఇంకా స్నానం, గీనం చెయ్యవేం?"

"ఏమండోయ్! ఇతడు ప్రభాతకుమార్. కాలేజిలో బి.ఏ. చదువుతున్నాడు" అంటూ పరిచయవాక్యం పలికాను.

ప్రభాత్ లేచి మావారికి నమస్కారం చేశాడు. వారు

ప్రసన్నంగా ముఖం పెట్టి ప్రతినమస్కారం చేశారు. కాని ఆ ప్రసన్నత తెచ్చిపెట్టుకున్నదిలాగే నాకు కనిపించింది.

"ఇప్పుడే స్నానంచేసి వచ్చేస్తాను. నువు కూర్చో." అన్నారు మావారు.

"కాని, నేను – నేను..." అని జంకుతూ గొణుగుతూ, కూర్చున్నవాడు మళ్లీ లేచి "చిత్తం, ఒక విషయంలో మీ అనుమతి కావలిసివచ్చింది" అన్నాడు ప్రభాత్.

"లేవబోకు, కూర్చో, కూర్చో."

ప్రభాత్ నిల్చునే ఉన్నాడు. "ఒక మహిళాసంఘ సమావేశం జరుగబోతున్నది. దానికి అధ్యక్షురాలుగా ఉండ వలసిందని అమ్మగారిని అడగటానికి వచ్చాను."

"అరె, కూర్చోవేం? కూర్చో. ఇతనికి కొంచెం ఫలహారం...కూర్చో బాబూ!—అధ్యక్షపదవికి అంగీకారం పొందావుగా!"

"వారు మనసారా అంగీకారం తెలుపలేదు. మీరు గనుక అనుజ్ఞ ఇస్తే వారు మా ప్రార్థన అంగీకరిస్తారని తోస్తుంది."

మావారి ముఖంలో ప్రసన్నత తొణికిసలాడింది. "మీరు ఇక్కడే కూర్చుని ఉండండి. మా యింటికి అధ్యక్ష పదవిని తీసుకువచ్చావు." కాస్త ఫలహారం పుచ్చుకోకుండా వెడతావా? బాగుంది. నేను—అరె, ఏదీ నా—"

"అయితే నన్ను వెళ్ళమంటారా?" అని అడిగాను.

"అయ్యో! ఎందుకు వెళ్ళకూడదూ? ఎందుకు వెళ్ళ కూడదూ? ఇంతకూ ఏదీ నా—" అంటూ ఒక అలమర

తెరిచారు. రెండో అలమరకూడా తెరిచారు. దేనికోసమో అక్కడా ఇక్కడా కెలికి చాలసేపు వెదికారు. చివరకు ఉత్త చేతులతోనే వెళ్లిపోయారు గదిలోంచి.

నేను చూస్తూ కూర్చున్నాను. వారు వెళ్ళిపోయాక "ఔను, ఫలహారంచేసి పోదువుగానిలే" అన్నాను ప్రభాత్ తో.

అంటూనే వెళ్ళి కొద్దిగా ఫలహారాలు తెచ్చి అతని ముందుపెట్టి నేను అక్కడినుంచి వెళ్ళిపోయాను. ఇంట్లో నాకోసం ఎదురుచూస్తున్న ఆ యీ పనులు చక్కపెడ్తున్నాను. ఇంట్లో స్త్రీ అనే వ్యక్తి అస్వతంత్రురాలేకదా! ఆమెకు ఉన్నతి లేదు. అభ్యుదయం సున్న...అని ఇలాగ ఏవేవో ఆలోచనలు పోతూ స్నానాదికాలు ముగించాను. ఈ సంసార జీవితమంతా ఒక రకమైన గాడి లాంటిది. స్ఫూర్తి ఏమా త్రమూ కనిపించదు ఇందులో. ఆ గాడిలో పడి ఒకే పద్ధతిలో పోతూఉండాలి. ఆ క్రమం తప్పితే అపరాధం ఔతుంది. ఇలా అనుకుంటూ గదిలోకి తిరిగి వచ్చాను. ప్రభాత్ ఒంటరిగా కూర్చునే ఉన్నాడు. అతని సంగతే మరచిపోయాను ఇంటి పనుల గొడవలో. అతడు నన్ను అమ్మగారూ అని పిలుస్తాడు. వట్టి పిచ్చి కుర్రవాడు. "ఆలస్యం అయింది ప్రభాత్! నీసంగతే మరచిపోయాను సుమీ! క్షమించాలి" అన్నాను.

ప్రభాత్ సిగ్గుపడుతూ ఏమో గొణిగాడు. 'అమ్మగారూ' అన్నపదం ఒక్కటే నాకు స్పష్టంగా వినిపించింది. నాకు నవ్వొచ్చింది. "నన్ను 'అమ్మగారూ' అనక్కర్లేదులే. ఎంతో గొప్ప ధర్మాత్ములైతేనే అమ్మ ఔతుంది. నన్ను అక్కా అని పిలుస్తూ ఉండు" అన్నాను.

ఇంతలో లోపలినుంచి నాకు పిలుపు వచ్చింది. టేబిల్ మీద ఫలహారాలు వడ్డించటం అయిందిట. నేను వెళ్ళాలి. ప్రభాత్ లేచాడు. నాకు నమస్కారం చేశాడు, "వెళ్ళొస్తాను అక్కా!" అన్నాడు.

"వెడతావా? మంచిది."

మావారు టేబిల్‌దగ్గర కూర్చున్నారు. ఫలహారానికి తొందరపడుతూనే ఉన్నారు. కాని ఇంకా తినటం ఆరంభించ లేదు. నాకోసం ఎదురుచూస్తూ కూర్చున్నారు. నేను రాగానే "వారూ వీరూ మన దర్శనానికి రావటం, మాట్లాడ్డం... ఇదంతా ఉదయంపూట అయితే అట్టే బాగుండదు. చూడు: నాకు ఆలస్యం ఐపోవటం లేదూ?" అన్నారు.

నేనూ వచ్చి టేబిల్ దగ్గర కూర్చున్నాను. "తెల్ల వారిందో లేదో ఇవాళ సభాధ్యక్షపదవి ఇంటికే సరాసరి వెతుక్కుంటూ వచ్చింది" అన్నాను.

"అదే. ఏ రెండుగంటలప్పుడో మూడుగంటలప్పుడో వస్తే కష్టం ఉండేదికాదు."

"నేనేం చెయ్యను? ఈ గొడవలన్నీ ఇలా నె మీద వచ్చి పడుతున్నాయి మీరు వద్దంటే వెళ్ళను, మానేసాను."

"అదేం మాట! అందువల్ల మన గౌరవం పెరుగుతుంది. పైగా నీ వెనకాల నేనూ కొన్ని విషయాలు తెలుసుకుంటూ ఉంటాను."

ఇలాగే కొంత సంభాషణ సాగింది. చివరకు మావారు కచేరీకి వెళ్ళిపోయారు. వారి మాటల్లో వ్యంగ్యం ఏమన్నా

ఉందేమో అన్న అనుమానం కలిగింది. ఒక్కవిషయం మాత్రం నాకు పూర్తిగా తెలిసిపోయింది : స్త్రీ కేవలం సంసారంలోనే మునిగిపోయి ఉండేట్టయితే ఆమెకిక బాహ్య ప్రపంచంతో సంబంధం ఏమాత్రమూ ఉండదు. కాబట్టి స్త్రీలలో చైతన్యం తీసుకురావటానికి నేను ముందడుగు వేసి కృషి చెయ్యాల్సిన అవసరం ఉన్నట్టు నాకు స్ఫురించింది. దేశం పురుషులదేనా ? స్త్రీలది కాదా ? నిజం మాట్లాడితే స్త్రీలే ఎక్కువబాధ్యత నిర్వహించాల్సిఉంది. చూస్తూ చూస్తూ ఉండగానే నా మనస్సులో ఉత్సాహం, ఆవేశం పొంగి వచ్చాయి. ఏవేవో భావాలు పొడసూపాయి. పట్నంలోని స్త్రీలందర్నీ సంఘటితపరచాలన్న ఉబలాటం కలిగింది. అనేక చోట్ల మహిళాసభల్ని ఏర్పాటుచేయాలి. పూర్వ సంప్రదాయాల మురికిగుంటలోనుంచి స్త్రీలంతా బైటికివచ్చేసి, దేశ స్వాతంత్ర్యంకోసం పాటుపడేట్టు చెయ్యాలి. ఇలాగ అనేక భావాలు నా హృదయమంతా నిండిపోయాయి. నేనొక మామూలు క్షుద్రవ్యక్తిని కాక ఒక మహాశక్తినైపోతున్నట్టు అనిపించింది. నా హృదయంలో సంసారం, సంసారానికి సంబంధించిన విషయాలూ – ఏమీలేవు. స్ఫూర్తితో నిండిపోయి ఉన్నాను. కర్తవ్యచింతన ఉదయించింది. పనిపాటల్లో అలసిపోయిన ఒక మామూలు గృహిణిని కాదు నేను. ఎంతో చైతన్యంగల ప్రజ్ఞాశీలిని. ఇంకా ఎంతో శక్తిమంతురాల్ని కాగలననిపించింది. ఇటువంటి ఒకానొక విచిత్ర స్వప్నావస్థను నే నా సమయంలో మొదటిసారిగా అనుభవించగలిగాను. హరీశబాబు ఇంటికి పోయి, అతని సలహాప్రకారం ఒక

ప్రోగ్రాం ఆవిష్కరించాలనికూడా సంకల్పం కలిగింది; ఎలా కలిగిందో నాకే తెలియదు. స్త్రీలందర్నీ ఆవేశపరచి రంగంలో దూకించాలి. ఇంటి నాలుగుగోడలమధ్య బంధితమైయున్న శక్తిని జాగరితం చెయ్యాలి.

ఆనాటి మధ్యాహ్నమే నేను ఒంటరిగా, నా అంతట నేనే, హరీశబాబు ఇంటికి వెళ్ళాను. ఆ యిల్లు నే నిదివరకు ఒక్కసారే చూచి వున్నాను. నేను వెళ్ళేసరికి హరీశ్ ఇంట్లో లేడు. ఒక ముసలి దాసీదిమాత్రం ఉంది.

# 14

అక్కడికి వెళ్ళగానే నేనొకరకమైన విచికిత్సలో పడ్డాను. ఆ దాసీది నాతో ఏమీ మాటాడలేదు. హరీశబాబు ఎప్పుడు ఎక్కడికి వెళ్ళిందీ, ఎప్పుడు వచ్చేదీ ఆమె చెప్ప లేదు. నన్ను ఆమె అనుమానంగా చూడసాగింది. అందు చేత నేను తిరిగి వెళ్ళిపోడానికి ఇష్టపడలేదు. ఆమె అను మానానికి జవాబుగా నేను లోపలికే సాగిపోయాను. లోపల రెండు గదులు ఉన్నాయి. ఒకటి పెద్దది. ఇదివరకు ఒకసారి వచ్చినప్పుడు ఈ గదిలోనే కూర్చుని హరీశ్‌తో మాట్లా డాను. అందులో ఒకమూల చాప ఒకటి పరచిఉంది. మరో వైపు మేజాబల్లమీద టైపురైటరు, రిజిష్టరు, ఫైలు, కాగి తాలు వగైరా ఉన్నాయి. ఆ పక్కగది చాలచిన్నది. విశ్రాం తిగా కూర్చోటానికీ, పడుకోటానికీ ఉపయోగిస్తాడు కాబోలు! అందులో ఒక మంచం వేసి ఉంది. దాని తలవైపు కొన్ని

గుడ్డలు ఉండగా చుట్టిపెట్టి ఉన్నాయి. విశ్రాంతికోసం కూర్చో టానికిగాని, పడుకోటానికిగాని ఉపయోగపడేది ఆ మంచమే అయివుంటుంది.

ఆ గది చూస్తోంటే నాకు చాల చిత్రమనిపించింది. ఆ మంచం వాల్చి ఉంటే ఇక గదిలో వేరే బెత్తెడు చోటుకూడా మిగలదు. ఇంత చిన్నగదా మరీను ? ఇటువంటి గదిలో కాల క్షేపం చేయగలుగుతున్న ఆ వ్యక్తినిగురించి కొన్ని ఆలోచ నలు కలిగాయి. కనీస సౌకర్యాలుకూడా అక్కర్లేదా ఆయ నకు ? వెళ్ళి మంచంమీద కూర్చున్నాను. చుట్టూ చూచాను. బాగా సున్నం కొట్టిన గోడలు కావు. పటాలుకూడా ఏమీ లేవు. మంచంమీద తలవైపున పెట్టి ఉన్న గుడ్డలు తడిమి చూచాను. ఒక ఉన్ని దుప్పటి ఉంది. ఇంకా మూడు ధోవ తులు కాబోలు ఒక తుండుగుడ్డలో చుట్టి ఉన్నాయి. ఆ గుడ్డలే అతనికి పక్క, దిండు అన్నమాట ! షెల్ఫులో ఉన్న పుస్తకాలు కొన్ని బైటికి తీసి చూచాను. అటూ ఇటూ పేజీలు తిరగేసి మళ్ళీ యథాస్థానంలో ఉంచేశాను. అక్కడ కొన్ని కాగితాలుకూడా ఉన్నాయి. అవి గాలికి లేచిపోకుండా వాటిమీద ఒక రాయి పెట్టి ఉంది. వాటిలోనుంచి కాగి తాలు తీసి జాగ్రతగా చదివాను. అక్కడ ఉన్న ఫైలు కూడా తీసి కొన్నిచోట్ల చదివాను. ఇలాగ నేనక్కడ ఊరికే కూర్చోలేదు. ఏదో ప్రయోజనం పొందుతూనే ఉన్నాను. అంతా కొత్తగా కనిపిస్తోంది. అయినా నేనక్కడ ఒక పరాయి మనిషినన్న భావమే కలగలేదు. అక్కడి కాగితాలూ అవీ

తిరగవేస్తూ ఉండటం అనౌచిత్యకార్యంగా నాకు స్ఫురించనే లేదు.

ఇంతలో బైటినుంచి ఏదో శబ్దం వినిపించింది. ఎవరో అధికారయుతమైన కంఠస్వరాన దాసీదానితో ఇలా అంటున్నారు: "వెంటనే వీధితలుపు తాళం పెట్టెయ్యి. తాళంచెవి నాకు ఇచ్చెయ్యి. నువు వెళ్లి దొడ్డివాకిలి దగ్గర కూర్చుని నా కోసం ఎదురు చూస్తూ ఉండు. నేను తెచ్చి ఇచ్చే కాగితాల్ని పట్టుకుపోయి శ్రీమతి...కి అందజెయ్యి. గుడ్డలమూట అనుకోవాలి చూచేవాళ్ళు; కాగితాలన్న సంగతి ఎవరికీ అంతుపట్టకూడదు; తెలిసిందా?..."

నాకు ఆశ్చర్యం అయింది. ఆ కాగితాలు ఎవరికి అందజెయ్యాలని చెబుతున్నాడో ఆమె పేరు నేను స్పష్టంగానే విన్నాను. నా పేరే అది. లేకపోతే సుఖద అన్న పేరుగల వ్యక్తి ఇంకొకరెవరైనా ఉన్నారా?

"ఈకాసేపటిలో ఇక్కడికి ఎవరైనా వచ్చారా?" అనికూడా ప్రశ్నించాడు ఆ వ్యక్తి దాసీదాన్ని.

ఎవరో ఒకావిడ వచ్చిందని జవాబు చెప్పింది దాసీది.

"ఎవరూ? లోపలికి ఎందుకు రానిచ్చావే తెలివిమాలినదానా?"

ఈ మాటలు అతడు చాల మెల్లిగా, కోపంగా, విసుగ్గా పలికాడు. అతడు లోలోపల ఏదో భయపడుతున్నట్టు ఆ మాటల్లో ధ్వనిస్తూనేఉంది. కొంతసేపటిక్రితం అతని నోటివెంట నా పేరు ఉచ్చరితమైనప్పటినుంచీ నా చెవులు అటువేపే ఉన్నాయి. అందుచేత అతడెంత నెమ్మదిగా

మాటాడినా నాకు ప్రతి అక్షరం స్పష్టంగానే వినిపించింది. ఆతరువాత టకటక బూట్లచప్పుడు. మరుక్షణమే గుమ్మం దగ్గర నాకు ఒక పురుషాకృతి ప్రత్యక్షం. ఆపాదమస్తమూ యూరోపియన్ దుస్తుల్లో ఉన్నాడు. ఇటువంటి సంఘటన ఎదుర్కోవలసి ఉంటుందని నేను ఎప్పుడూ అనుకోలేదు. అటువంటి వేషంలో పరిపుష్ట దేహంగల ఆ యువకుడు ఎదురుగా వచ్చి నిల్చునేసరికి నేనొక విషమావస్థలో పడిపోయి నట్టనిపించింది.

"దయచేసి మీరు ఎవరో చెబుతారా?" అని అడిగాడు.

నేను సంకోచిస్తూ "నేనా? నేను హరీశబాబుకోసం..." అన్నాను.

"హరీశబాబు! ఎవరాయన?"

నేనేమీ జవాబు చెప్పలేకపోయాను.

"క్షమించండి. ఇక్కడ హరీశబాబు అనే వ్యక్తి ఎవరూ లేరు. ఇది నా యిల్లు. మీరు ఎవరి అనుజ్ఞతో ఇలా లోపలికి రాగలిగారు?"

ఈ మాటలు పలుకుతూనే అతడు లోపలికి వచ్చి తలుపు మూసేశాడు. కుడిచెయ్యి పంట్లం జేబులో జొనుపుతూ ఒక అడుగు ముందుకు వచ్చాడు. "క్షమించండి. కాని మీరు ఉన్నచోట...అక్కడే ఒక్కసారి దయచేసి లేచి నిల్చుంటారా?" అన్నాడు.

ఆ కంఠధ్వనిలో ఏముందో మరి! ధిక్కారంగా కూర్చుని ఉండలేకపోయాను. లేచి నిల్చున్నాను.

"మీ చేతిలో ఉన్న కాగితం కింద పడేయండి."

నా చేతిలో ఒక కాగితం ఉన్నట్టు నాకు తెలియదు. అది దానంతట అదే కింద జారి పడిపోయింది.

"రెండు చేతులూ పైకి ఎత్తండి."

నేను రెండు చేతులూ పైకి ఎత్తాను.

"క్షమించండి" అంటూ అతడు చెయి చాచి నా శరీరం అంతా పలుతావుల తడివి చూచాడు. అన్నాడు: "ఇంకా నాకు బాగా నమ్మకం కుదరటంలేదు. ఇక్కడి కాగితాలేమైనా మీరు తీసిఉంటే...లేదా ఇంకెక్కడేనా దాచివుంటే...వాటిని మీఅంతట మీరే నాకు తెచ్చి ఇవ్వండి. వినిపిస్తోందా నా మాట?"

"ఇక్కడి కాగితాలేమీ నేను తీసి దాచలేదు."

"నిజం చెప్పండి. లేకపోతే నేను మగవాడిని, నా చేతులతో మీ శరీరమంతా సోదా చూడాల్సివస్తుంది."

"నా మాట నమ్ముతారా నమ్మండి, లేకపోతే మీ యిష్టం; సోదా చూచుకోండి."

"చూడండి శ్రీమతిగారూ! చులాగ్గా నమ్మి ఊరు కోటం మా రూల్సుకు వ్యతిరేకం. అయినా మీ మాటల్ని విశ్వసిస్తాను. ఇక మీ చేతులు దించెయ్యండి. పక్కగదిలో రండి."

పక్కన పెద్దగదిలోకి వచ్చాను. అతడు నన్ను కింద

చాపమీద కూర్చోమన్నాడు. తానేమో కుర్చీలో కూర్చున్నాడు. "ఏమండీ! ఈ నా యింట్లోకి తమరు హరీశ్ బాబు కోసమనా వచ్చానన్నారు? ఎవరాయన? అడగవచ్చా నే నా ప్రశ్న?"

ఏమి సమాధానం చెప్పటానికీ నాకు వెంటనే తోచ లేదు. అతని వెనకాల మేజాబల్ల మీద ఉన్న టోపీ (Hat) కేసి తదేకంగా చూస్తూ ఉండిపోయాను. అతనే మళ్ళీ ఇలా అన్నాడు: "మీరేమీ భయపడనక్కర్లేదు. తలుపు గడియ వేసే ఉంది లెండి. తాళం వెయ్యకపోయినా పరవాలేదు. ఊఁ, ఇక చెప్పండి."

"మీరు గవర్నమెంటు ఆఫీసరా?"

ఆ యువకుడు నవ్వాడు. "అలాగే అనుకోండి; కాని అసలు సంగతేమంటే...ఈ యింట్లో ఉంటున్నది నేనే."

"ఈ యింటికి నేను ఇదివరకొకసారి వచ్చాను. కాని —"

"ఇంకేం మరి? ఈ యిల్లు నాది అన్న సంగతి మీకు తెలిసే ఉంటుంది."

"ఉహుఁ. ఈ యిల్లు మీది కాదు."

యువకుడు పెద్దగా నవ్వాడు. "ఓహోహో! మీరు చాల తెలివిగలవారులా కనిపిస్తున్నారే. అయితే శ్రీమతి గారూ! ఈ యిల్లు మీదంటారా?"

"మీరు ఉపయోగించదగిన వస్తువు ఒక్కటికూడా ఈ యింట్లో నాకు కనిపించటం లేదే!"

"ఓహో! This is very interesting. (చాల తమాషాగా ఉంది.) అయితే ఉండండి. ఆ హరీశ బాబు అన్న పెద్దమనిషి ఎవరో కాస్త చెప్పండి వింటాను. ఆ సంగతి తెలుసుకోవలసిన అవసరంకూడా ఉంది."

"మీరు ఆయన్ను ఎరగరా?"

"Good heavens! (ఆరి భగవంతుడా!) నేనేం ఎరుగుదునూ? మీరు చెబితే తెలుసుకుంటాను."

"ఇవాళ ఉదయంవరకూ వారు ఇక్కడే ఉన్నారుగా!"

"What!" (ఏమిటీ!) అంటూ ఆశ్చర్యసూచకంగా ఉచ్చరించి అతడు కుర్చీలోనుంచి లేచాడు పెద్ద పెద్ద అడుగులు వేసుకుంటూ గదిలో అటూ ఇటూ తిరగసాగాడు. "ఎవరు చెప్పారు మీ కా సంగతి?" అన్నాడు కాసేపు ఆగి.

"ఎవరు చెబితే యేం? ఇవాళ ఉదయందాకా వారు ఇక్కడే ఉన్నారు. నాకు బాగా తెలుసు."

అతని భావాల్లో ఏదో మార్పు వచ్చినట్టుంది. గదిలో పచార్లు చేస్తునే ఇలా అన్నాడు: "శ్రీమతిగారూ! క్షమించాలి. నిన్న ఉండిన మనిషి ఇవాళ ఉదయంకూడా ఉంటాడనీ, ఇప్పుడుకూడా ఉండవచ్చుననీ మీరు అనుకుంటున్నారు కాబోలు! క్షమించండి...మీరు మంచి ప్రజ్ఞావంతులులాగే కనిపిస్తున్నారు. ఇల్లు సంసారం ఉందేమో కూడాను. అయినా ఈ గూఢచారితనం—" అంటూ ఒక నిట్టూర్పు విడిచాడు. పచార్లు చేస్తూనే ఉన్నాడు. క్రమేణా అతని నడకలో వేగం తగ్గింది. హఠాత్తుగా నా ముందు వచ్చి ఆగాడు. "మీరు

చెబుతున్న ఆ హరీశబాబు అనే వ్యక్తి మీకేమన్నా అప కారం చేశాడా యేమిటి ?—" అని అడిగాడు. అతని కంఠ స్వరం స్థాయి తగ్గింది, లాలనగా అడుగుతున్నట్టు కనిపించింది.

ఆ కంఠస్వరానికి నేను విచలితనైనాను. "మీకు నామీద అనుమానంగా ఉందా ?" అని అడిగాను.

"లేకపోతే ఎలా విశ్వసించను ?"

"అందుకనేనా అస్తమానం పంట్లంజేబులో చెయి పెట్టు కుని కూర్చున్నారు ?"

"చిత్తం. గది తలుపుకూడా అందుకోసమే గడియవేసి అట్టిపెట్టాను. ఇదిగో, ఇలా చూడండి—" అంటూ పంట్లం జేబులోనుంచి చెయి తీసి చూపించాడు. అతని చేతిలో రివా ల్వారు కనిపించింది. చాల చిన్నది. మన అరచెయ్యి అంత ఉంది సుమారు."

ఇక నాకు భయపడాల్సిన అవసరం కనిపించలేదు. ఆ యువకుని ముఖంలో గాంభీర్యం కాస్త కూస్త కాదు. అతడు ఏదో పొరపాటు పడ్డాడనీ, ఆ పొరపాటును నేను ఎప్పుడు పడితే అప్పుడు ఇట్టే తొలగించి వెయ్యగలననీ నాకు నిశ్చయ మైపోయింది.

"మీరు ఆడవాళ్ళకు కూడా రివాల్వారు చూపి స్తున్నారే.!"

"చిత్తం, ఆడవాళ్ళంటే మాకు చాల గౌరవం. పురు షులకు వాళ్ళు ఏమాత్రమూ తీసిపోరని మా నమ్మకం."

"నేను కాగితాలేమన్నా దాచానేమో నని మీరు

అనుమానించారుకదూ! ఇవిగో, తీసుకోండి నాదగ్గర ఉన్న కాగితాలు" అంటూ నేను నా రవికలోపల దాచి తెచ్చిన వందరూపాయల నోట్లు మూడు బైటికి తీసి చూపిస్తూ "వారికి ఇచ్చిపోదామని వచ్చాను. పనులకు కావాలిగా! ఇంకా రెండువందలు ఇవ్వాలి. మీరు నిజంగా వారి మిత్రులే. తీసుకోండి - ఇవిగో" అన్నాను.

పచార్లు చేస్తున్న ఆ యువకుడు నిర్ఘాంతపోయి నిల్చున్నాడు. అతని కన్నుల్లో వింత కాంతి వచ్చింది. "మీరేనా —సుఖదాదేవి అంటే?"

"చిత్తం, నేనే సుఖదాదేవిని."

క్షణంసేపు అతడు కదల్లేదు, మెదల్లేదు. అలానే నిల్చుని నా ముఖంలోకి తదేకంగా చూచాడు. ఆతరువాత మెరుపులా నాముందుకు పరిగెత్తుకువచ్చి నన్ను రెండుచేతులా పుణికి పుచ్చుకుని ఆవేశంగా 'That is grand!' (అద్భుతం!) అన్నాడు.

ఆతరువాత నన్ను క్షమాపణ యాచించాడు. ధన్యవాదాలు పలికాడు. చాల సంతోషం ప్రకటించాడు. స్నేహపిచ్చిలంగా మాటాడాడు. ఆ సంతోషంలో అతడు తన్ను తానే మరచిపోయాడు. ఎదుట నేనున్న సంగతికూడా మరచేపోయాడేమో! ఇలాగ ఇంత తేలిగ్గా తనను తానే మరచిపోగల వ్యక్తిని నే నిదివరకు ఎప్పుడూ ఎక్కడా చూడలేదు. "అదేమిటి? అలా అయిపోయారేమిటి?" అని అడిగాను.

"ఏమీలేదు. నేను ఇప్పుడు అపరిమితమైన ఆనందంలో

ఉన్నాను. 'You are a real grand' (మీరు చాల అద్భుతమైన వ్యక్తి) ఇవిగో, ఇవి చూసుకోండి" అంటూ జేబులోనుంచి ఒక ఉత్తరం తీశాడు. అది హరీశబాబు నాకు రాసిన ఉత్తరం. అందులో ఈ మిస్టర్ లాల్‌ను గురించిన పరిచయ వాక్యాలు ఉన్నాయి. ఇతన్ని పూర్తిగా విశ్వసించి, ఇతని ఆదేశాల్ని మన్నించవలసిందిగా నన్ను కోరుతూ హరీశ్ బాబు ఉత్తరం ముగించాడు.

ఉత్తరం అంతా చదువుకుని ససంభ్రమంగా అతన్ని అవలోకించాను. హరీశబాబు పైకి చూడ్డానికేకాదు, వస్తుతః సన్యాసి. కాని ఇతనిలో వైరాగ్యమనేది లేశమాత్రంకూడా కని పించదు. అడుగుదామనుకుని "మీరు మరి..." అంటూ ఆరం భించాను. నా వాక్యం పూర్తి కాకుండానే అతడు అందుకుని "మీ భావం నాకు తెలిసిందిలెండి. మేమంతా ఈ మామూలు ప్రపంచానికి చెందినవాళ్ళం. హరీశ్ మహాత్ముడు. మా మార్గం కూడా భిన్నమైనదే. మాకు చావు అంటే పెళ్ళితో సమానం. బ్రతుకు ఆనందంగా గడుపుకోగలిగితేనే ఆనందంగా చచ్చి పోగలం. ఆ సంగతి అలా ఉంచండి. హరీశ్ వెళ్ళిపోతూ ఈ ఉత్తరం ఇచ్చారు. నిన్న అర్ధరాత్రప్పుడు ఆయన్ను ఇక్కడి నించి ప్రయాణంచేసి పంపించవలసివచ్చింది. ఇప్పుడు ఇక్కడ మన పరిస్థితులు క్షేమకరంగా లేవు. ఈ యిల్లు విప్లవ సంఘ కేంద్రం అని పోలీసులకు కబురు తెలిసింది. కాబట్టి ఇక్కడ అంతా తారుమారు చెయ్యాలి. చాల కాగితాలు తగల బెట్టెయ్యాలి. అవసరమైన కాగితాలుమాత్రం మీదగ్గరకు పంపిస్తాం. మీరు నన్ను ఎరగరు. నేను ఒకచోట నిలకడగా

ఉండేవాడిని కాదు లెండి. అటూ ఇటూ పరుగులు పెడుతూ ఉంటాను. నేను రాత్రే కాబూలునుంచి వచ్చాను. నీతులు, రీతులు, ధర్మాలు, శాస్త్రాలు నాకేమీ తెలియవు. ఒక పని తర్వాత మరోపని చేసుకుంటూ పోవటమే నా పని. ఇక నడుము బిగించండి. రోజులు మంచివి కావు. మనకూ, మన సంఘానికీ ఇది పెద్ద ఆపత్సమయం. ఎలాగైనా సరే హరీశబాబును మనం ఈ సమయంలో కాపాడుకుని తీరాలి. వింటున్నారా మీరు ? వారిని పోగొట్టుకున్నామంటే మన సర్వస్వం కోలుపోయామన్నమాటే. కాబట్టి మనం అప్రమత్తులమై ఉండాలి. సమయానికి మీరుకూడా ఇక్కడ ఉన్నారు. చాలమంచిదైంది. ఒక అరగంట ముప్పావుగంటలో మనం ఈ గదిఅంతా విచిత్రంగా మార్చెయ్యాలి. అంతకంటే మనకు ఇక టైము లేదు. అలా చూస్తూ నిల్చుంటా రేమిటి ? ఫైలు, రిజిస్టరు తీయండి బైటికి. వీలైనంతవరకు అన్నీ తగలబెట్టెయ్యండి. కత్తెర ఒకటి పుచ్చుకోండి. కాగితాల్లో మనకు అవసరమని పించిన భాగాలు కత్తిరించి ఇవతల ఉంచండి. ఏక్షణంలో మనమీద దాడి జరుగుతుందో చెప్పలేం. నాకు ఎక్కువ టైములేదు. సమయానికి వచ్చిన వాళ్లు దేవతలతో సమానం. నువ్వు నిజంగా దేవతవే సుఖదా ! ఈ పని అంతా చకచక కానీ నేను యీలోగా సామాలు తీసుకువస్తాను. సామాను అంటే విలాసవస్తువులన్నమాట— సోఫా, పందిరిపట్టెమంచం, వేటఫోటోలు, అందమైన చిత్రాలు ఇత్యాదయః. మనిద్దరం కలిసి అవన్నీ గదిలో అమర్చుదాం. ఒక ధనస్వామి భోగ మందిరంగా తయారు చెయ్యాలి దీన్ని. ధనస్వామిలో విప్లవలక్షణాల పొడకూడా ఉండదుగా !”

ఈ మాటలన్నీ అతడు గబగబా చెప్పుకు పోయాడు. నాకు మతిపోయినట్టయింది. ఇలా పలుకుతూ అతడు నా మెడ మీద చెయి వేశాడు. తీసుకుపోయి అలమార ముందు నిల బెట్టాడు. అందులోనుంచి బొత్తులు బొత్తులుగా కాగితాలు ఇవ తలకు తీసి నా కాళ్ళమీద పడేశాడు. "ఊఁ. అవి తీసుకుపో. ఆలస్యం చెయ్యవద్దు. నేను వెడుతున్నాను" అంటూ ఒక చేత్తో నా గడ్డం పుచ్చుకుని ముఖం పైకి ఎత్తాడు; ఒక క్షణంసేపు అలా చూస్తూ నిల్చున్నాడు. "You are really grand Sukhada!" (నిజంగా నువ్వొక అద్భుత వ్యక్తివి, సుఖదా !) అని పలికి గబగబా గదిలోనుంచి బైటికి వెళ్ళిపోయాడు.

అతడు వెళ్ళిపోయిన కొన్ని క్షణాలవరకూ నాకు ఏమీ తోచక అలానే ఉండిపోయాను. ఆతరువాత కర్తవ్యంలో నిమగ్నురాలి నైనాను.

మరి కాసేపటికి సామాను తీసుకుని లాల్ బాబు వచ్చాడు. ఇద్దరు కూలివాళ్ళ సాయంతో సామానంతా లోప లికి చేర్చాడు. ఇదివరకు గోడలకు ఉన్న పటాలు ఒక్కొక్కటే ఊడబెరికి అవతల పెట్టాం. చిన్నగదిలో ఉన్న మంచం తీసేశాం; అక్కడి గుడ్డలూ మాయంచేశాం. కొత్త తివాచి పరిచాం, పట్టెమంచం వేశాం. కొత్తగా తెచ్చిన పటాలు గోడలకు తగిలించాం. ఈ పనులన్నీ చాల తొందరగా చేశాం. అంత గబగబా ఎలా చేయగలిగామో ఈనాటికీ నాకు తలచు కుంటే ఆశ్చర్యం వేస్తుంది. అతనిలో ఉన్న స్ఫూర్తి నాకు కూడా సంక్రమించినట్టు అనిపించింది. అతడు క్షణంకూడా ఊరకుండలేదు. యంత్రంలా పని చేశాడు. గుడ్డలు మట్టి

పోతున్నామన్న దృష్టిగాని, ఈ పని మనం చెయ్యవచ్చా, చెయ్యకూడదా అన్న విచక్షణగాని అతనికి లేనేలేవు. మధ్యలో ఒకమాటకూడ పలకలేదు. చకచక అన్ని పనులూ చేశాం.

అంతా అయాక "సెబాస్! You are mighty grand (నువ్వు చాల అద్భుతమైన వ్యక్తివి) సుఖదా! ఇక రా, తొందరగా రా. ఆలస్యం చెయ్యటానికి వీల్లేదు" అన్నాడు.

సామాను తెచ్చిన బండివాడూ, కూలీలు వెళ్ళిపోయారు. నన్ను గదిలోనుంచి బైటికి విసురుగా తోశాడు. "అక్కడ బైట ఉండు నేను ఇప్పుడే వస్తాను" అంటూ గది తలుపులోపల గడియ వేసుకున్నాడు. లోపల ప్లేటులో అతడు ఏదో తింటున్నట్టు చప్పుడైంది. మరికాసేపటికి గోడమీాదనుంచి దూకి బైటికి వచ్చాడు. నా దుస్తులు ఖరాబైనట్టుగా ఉందే! ఎక్కడైనా మట్టి కొట్టుకుని మరకలు పడివుంటే కాస్త తుడుస్తావూ ?" అంటూ వంగి నిల్చున్నాడు. అతని కోటు వెనక భాగాన, పంట్లానికి అక్కడక్కడా మట్టి మరకలు తుడిచి శుభ్రంచేశాను. "Good heavens! (అరి భగవంతుడా!) నా Hat (టోపీ) లోపలే చిక్కుకుపోయినట్టుందే! పోనీలే, పాడు టోపీ! ఊఁ ఇక పోదాం, పద!" అన్నాడు.

ఒక ఫర్లాంగు దూరాన కారు ఆగి ఉంది. అత్యావసరమని తోచిన కాగితాలు నేను తెచ్చినవి కారులో పెట్టాం. కారు అతనే తోలాడు. మాయింటిముందు కారు ఆపాడు. నేను దిగబోతూ "మీారుకూడా మాయింటికి రండి" అన్నాను.

"ఇప్పుడా! కాదులే సుఖదాదేవీ! ప్రస్తుతానికి క్షమించండి" అంటూ నా కుడిచెయ్యి తన రెండు చేతుల్లో తీసుకుని తన పెదవులకు హత్తుకున్నాడు.

నేను సామానంతా సర్దుకుని కారు దిగాను.

"క్షమించాలి సుఖదాదేవీ! సామాను నేను తెచ్చి మీ యింట్లోకి చేరవెయ్యాలి నిజంగా. కాని—"

"పరవాలేదులెండి. పరవాలేదులెండి" అన్నాను సిగ్గుపడుతూ.

నేను ఇంట్లోకి సాగిపోయాను.

"చీరియో" అన్నాడు అతను. కారు సాగిపోయింది.

# 15

ఆ సాయంత్రం నా స్థితి ఎలా ఉందని చెప్పను? కాగితాలు బీరువా అడుగు అరలో పెట్టి తాళం వేశాను. అది అద్దాల బీరువా. తలుపులు వేసి ఇవతలకు వస్తూంటే అద్దంలో నా ప్రతిబింబం కనిపించింది. దాన్ని చూచి ఆశ్చర్యంగా అలాగే ఆగిపోయాను. నేను అందగత్తెనన్న విషయాన్ని ఆ సమయంలో మరచిపోదామనుకున్నాను. కాని అద్దంలోని ఆ ప్రతిబింబం నాకు అటువంటి మరపు తగలనీయటంలేదు. నా కళ్ళకు నాకే మిరుమిట్లు గొలుపుతున్నది ఆ ప్రతిబింబం. ముఖానికి ఇరుప్రక్కలా కాంతిపుంజం వ్యాపిస్తున్నట్టుంది. ఆకృతి నవ్వుతున్నట్టుంది; ప్రసన్నంగా ఉంది. అలాగే చూస్తూ నిలుచ్చున్నాను. చూచాను. చూచాను. నిజంగా అది నా ప్రతిబింబమేనా?

అంత అందంగా తయారుకావాలని నేను అనుకోనేలేదు. నా రూపకాంతికి నేనే సిగ్గుపడిపోయాను. అక్కడినుంచి గబగబా దూరంగా వెళ్ళిపోయాను. 'మేకప్' (అలంకారం) అంతా కడిగివేశాను. (పాఠకుని సహానుభూతి అర్థిస్తున్నాను. ఎందు వల్లనంటే: హరీశ్ బాబు ఇంటికి వెడుతూ కొంచెం మేకప్ చేసుకున్న మాట వాస్తవమే) దుస్తులుకూడా మార్చేశాను. ఒక మామూలు చీర కట్టుకున్నాను. ఇక వెళ్ళి ఇంటిపనుల్లో జొరబడదామనుకున్నా. బైటగదిలోవెళ్ళి కాసేపు కూర్చున్నా. చుట్టూ నాలుగు గోడలకేసి చూచాను. ఇవాళ ఎందువల్లనో ఈ గది అంతా కొత్తగా ఉన్నట్టు కనిపించింది. కాని ఆ కొత్తదనం ఏమిటో నాకు స్పష్టంగా బోధపడలేదు. ఇంట్లో గదుల అందాన్ని ఎప్పుడూ శ్రద్ధగా పరికించే అలవాటు నాకు లేదు. నేనూ మావారూ యించుకున్న ఫొటో ఒకటి ఉంది గోడకు. కాసేపు ఆ ఫొటో ముందు వెళ్ళి నిల్చు న్నాను. చాలసేపు నిల్చుని ఆ ఫొటోకేసి చూచాను. చివరకు ఆ పక్కన ఉన్న ఒక పట్టెమంచంమీద బోర్లా పడ్డాను పోయి... తల రెండుచేతుల్లో పట్టుకుని. ఆ సమ యాన నా హృదయంలో మావారిపట్ల ఎంతో కరుణ, ప్రేమ పొంగివచ్చాయి. చాలసేపు అలాగే పడిఉన్నాను. వారింకా ఆఫీసునుంచి రానేలేదే! అబ్బ! ఎప్పుడూ ఇలా ఆలస్యంగానే వస్తుంటారు! తొందరగా ఎందుకు వచ్చెయ్యకూడదు? ఈ సారి గట్టిగా చెబుతాను: "ఏమండోయ్! ఐదుగంటలు అవటంతోనే కుర్చీలోనుంచి లేవండి. అంతదాకా పనిచేసి అలసిపోయింది చాలదూ! ఆఫీసుపని అయిదు గంటల

దాకానే. ఆ పైన ఎవరి అధికారం మీకెందుకు ? నేనిక్కడ ఇంట్లో ఒక్కతెనే కూర్చుని మీకోసం ఎదురుచూస్తూ ఉంటా నని మీకు స్ఫురించదా ? ఇంటిదగ్గర నే నొక్కదాన్నే ఉన్నా నని కాస్త మనస్సులో పెట్టుకోండి..." అని. ఇలా అనుకుం టూనే లేచి కూర్చున్నాను. చెదరిన తలవెంట్రుకలు సరిచేసు కున్నాను. గడియారంవైపు చూచాను. వెంటనే అక్కడి నుంచి లోపలికి వెళ్ళిపోయాను. వంటబ్రాహ్మడు సోమరి తనంగా పని చేసున్నట్టు కనిపించింది.

చెయ్యే మనోజాడ్యానికి మందు అని నేను అనేకసార్లు అనుకుంటూ ఉంటాను. ఏ పనిలోనో వెళ్ళి చెయి జొనిపితే చాలు, మనస్సుకు స్వాస్థ్యం ఇట్టే చేకూరుతుంది. నేను వెంటనే వంటపనిలో జొరపడ్డాను. దూరంనుంచి ఎవరో అతిథి రానున్నాడన్నంత శ్రద్ధగా వంటచేస్తూ కూర్చున్నాను. నిజా నికి ఏ అతిథీ వచ్చేదిలేదు.

కాని అలాగే జరిగింది. మా అమ్మ వచ్చింది. వినోద్‌ను కూడా వెంటబెట్టుకు వచ్చింది – "సుఖదా ! ఓ సుఖదా ! ఎక్కడ ఉన్నావే ?" – అంటూ.

వెంటనే పనిలోనుంచి లేచి బైటికి వచ్చాను. చేతుల నిండా శనగపిండి అంటుకుంది. అందుచేత బుజాలతోనూ, మోచేతులతోనూ ముఖంమీద పడుతూన్న ముంగురుల్ని పైకి సరిచేసుకుంటూ బైటికి వచ్చాను – "ఇక్కడ ఉన్నా నమ్మా ! ఇక్కడ" – అంటూ.

ముందుగా వినోద్ వచ్చాడు. వాడి చేతిలో కొత్త

తుపాకి ఒకటి ఉంది. గదిముందు ఆవరణలోకి రావటంతోనే వాడు గుర్రంలాగి తుపాకి 'టప్' మనిపించాడు.

"ఏంరా ! తుపాకితో మీ అమ్మను చంపివేయటానికి వచ్చావుట్రా ?" అంటూ వాడిదగ్గరకు వచ్చి గొంతు కూర్చుని...శనగపిండిచేతులు వాడి చొక్కాకు అంటకుండా...వాడిని నా భుజాలతో గుండెకు హత్తుకున్నాను. కాసేపటికి ముఖం ఎత్తి చూచాను. వాడికి ఇప్పుడు ఏడవ సంవత్సరం. నేను కూర్చుని ఉంటే నాకన్న చాల ఎత్తుగానే ఉన్నాడు.

"నన్ను విడిచిపెట్టవే అమ్మా ! ఈ తుపాకి ఎలా పేల్చాలో నీకు చూపిస్తా చూడు" అన్నాడు వాడు.

నాచేతుల్లోనుంచి వాడిని విడిచిపెట్టడం నాకు ఇష్టం లేదు. కాని ఇంతలో మా అమ్మకూడా ద్వారందగ్గరకు వచ్చేసింది. అందుచేత లేచి ఇవతలకు వచ్చాను. "చాలరోజులకు వచ్చావు అమ్మా" అని పలకరించాను.

"ఔను. నువ్వయితే అసలు రావటమే మానేశావు కదులే !"

"ఇల్లు, వాకిలి, సంసారం..." అని సమాధానం ఆరంభించాను.

కాని ఆమె అర్ధోక్తిలోనే అడ్డువచ్చింది. "అబ్బ ! ఏం పెద్దసంసారమమ్మా నీది ! సరే, ఇక నీ వినోద్‌ను నీ దగ్గరే అట్టిపెట్టుకో."

"కూర్చో అమ్మా ! ఇప్పుడే వస్తాను. నా చేతులు చూచావుగా !"

"కాంత్ ఇంకా రాలేదా ?"

"రాలేదింకా ఆఫీసునుంచి." నేను లోపలికి వెళ్ళాను. ఏమేం పదార్థాలు ఎలా చెయ్యాలో వంటమనిషికి తెలియ చెప్పాను. చేతులు బాగా కడిగేసుకుని మళ్ళీ గదిలోకి వచ్చాను. మా అమ్మకూ, నాకూ జరిగిన సంభాషణబట్టి నాకు ఒక అనుమానం కలిగింది. వినోద్‌ను ఇక తనదగ్గర ఉంచుకోదుట. నాదగ్గరే ఒప్పజెప్పి పోతుందిట. సరే బాగానే ఉంది. కాని ఇందులో ఏదో లోతు ఉన్నట్టే నాకు స్ఫురించింది. మావారు ఇదివరకే మా అమ్మను కలిసికొని ఈ విషయం సూచించినట్టు నాకు అర్థం అయింది. కాని మావారు వచ్చి తనను కలిసికొన్నట్టు మా అమ్మ స్పష్టంగా చెప్పలేదు. అందుచేత చివరకు నేను అన్నాను: "ఇక వినోద్‌ను నైనిటాల్‌కు ఎందుకు పంపించకూడదు. ఏడేళ్ళు వచ్చాయి కదా! మనల్ని విడిచి ఉండలేడూ ?"

కుర్రవాడిని నైనిటాల్‌కు పంపించటమనే విషయం ఆమెకు రుచించలేదు. "కుర్రవాడిని కంటిచూపులో ఉంచుకోవాలి. ఎక్కడికో పంపించటం మంచిపని కాదు. పైగా అందువల్ల డబ్బుకూడా చాల ఖర్చు ఔతుంది." అన్నదామె.

"నేనేదైనా ఉద్యోగం చూచుకోవాలనుకుంటున్నానే మరి !"

మా అమ్మ ఆశ్చర్యం ప్రకటించింది. ఏదో అనుమానిస్తున్నట్టుగా కూడా కనిపించింది. "ఉద్యోగం చూచుకుంటావా ? ఏమి ఉద్యోగం చేస్తావే నువ్వు ?"

"ఏదో ఒకటి. ఏది దొరికితే అది. ఉద్యోగాలు ఎన్ని లేవు ? ఎదోవిధంగా ఇంట్లో రాబడి పెరగటమేగా కావల్సింది! అప్పుడు అబ్బాయి చదువుకు కొంత ఖర్చుపెట్టాల్సివచ్చినా ఏమీ అనిపించదు."

మా అమ్మ నా మాటకు ఒప్పుకోలేదు. మావారు వచ్చాక ఈ విషయమై ఒక నిర్ణయానికి రావచ్చునని అంతటితో ఆ ప్రసంగం మానేశాం.

ఇలా సంభాషణ జరిగినతర్వాత నేనిక ఆమెసమక్షంలో ఉండలేకపోయాను. వంటింట్లోకి వచ్చాను. ఏదో పని కల్పించుకున్నాను. మనస్సు కొంచెం కుదుటపడ్డది. కాని నా ఆలోచనలు ఇల్లు, వాకిలి, సంసారం—ఈ వలయంలోనించి దాటి, బైట విశాల ప్రపంచం, దాని అవసరాలు, ఆకాంక్షలు, ఆవశ్యకతలు మొదలైన అంశాలమీదికి పరిగెత్తింది. అవతల దేశం ఉంది; విప్లవోద్యమం ఉంది; హరీశబాబు ఉన్నాడు, లాల్ బాబు ఉన్నాడు; ఇంకా ఎందరోకూడా ఉన్నారు. ఇంట్లో ఈ మూల కూర్చుని దూరంగా ఉన్న ఆ దృశ్యాన్ని చూస్తోంటే అది ఎంత చిత్రవిచిత్రంగా, ఎంత కమనీయంగా, ఎంత ఆకర్షణీయంగా గోచరిస్తోందో! నన్ను ఛాలెంజి చేస్తోంది; నన్ను సన్నగా ఆహ్వానిస్తోంది. అక్కడ నేనూ నిర్వహించాల్సిన కర్తవ్యం కొంత ఉంది. అనేకమంది మమకారాల్ని విడిచిపెట్టుకుని ఆ క్షేత్రంలో ప్రవేశించి తమ తమ కర్తవ్యాల్ని నిర్వహిస్తున్నారు. ఆ క్షేత్రం నీదీ, నాదీ మాత్రమే కాదు. మన అందరిదీని. అక్కడ నాకూ కొంత అవకాశం ఉంది;

అక్కడికి నాకూ పిలుపు ఉంది—వంటపనుల్లో ఉండికూడా ఇలాంటి ఆలోచనల్లో విహరింపసాగాను.

ఇంతలో మావారు ఆఫీసునుంచి వచ్చినట్టు కబురు తెలిసింది. "దబ్బున కాసీ వే అమ్మా! నాన్నగారు మళ్ళీ తొందరగా వెళ్ళాలట" అంటూ వినోద్ పరిగెత్తుకుంటూ వచ్చాడు.

ఆ మాట విన్నాను. దానికి కటువైన జవాబే చెబుదా మని నోటిదాకా వచ్చింది. కాని వెంటనే నిగ్రహించుకున్నాను.

"అయిదు నిమిషాల్లో తేనీరు తెచ్చి పెట్టాలిట. నాన్న గారు చెప్పారు. మళ్ళీ ఎక్కడికో వెడతారట" అన్నాడు వినోద్ మరొకసారి.

"సరే, అలాగేనని చెప్పు పో" అన్నాను. వినోద్ వెళ్ళి పోయాడు. మరి కాసేపటికి అన్నీ తయారు చేసుకున్నాను. ట్రే పుచ్చుకుని నేనే స్వయంగా గదిలోకి వచ్చాను.

మావారు కొంచెం వ్యస్తచిత్తులై ఉన్నట్టు కనిపించారు. నన్నెక్కువగా పలకరించలేదు పెట్టలేదు. కప్పులో తేనీరు కలుపుకుంటున్నారు. నేను తిరిగి వంటింట్లోకి వెళ్ళిపోయాను. మరికాసేపటికి నా వెనుకనే వినోద్ వచ్చాడు "నాన్నగారు నిన్ను పిలుస్తున్నారమ్మా!" అంటూ.

నేను మళ్ళీ గదిలోకి వచ్చాను "ఎందుకండీ!" అంటూ.

"నువ్వు ఇక్కడ కూర్చోకుండా వెళ్ళిపోయావేం? ఇంకో కప్పు కూడా తీసుకురా" అన్నారు ఆయన నా ముఖం లోకి చూస్తూ.

మా అమ్మ సమక్షంలో అక్కడ కూర్చోటం నాకు ఇష్టంలేదు. అందుచేత నేనేమీ సమాధానం చెప్పకుండా అలానే నిల్చున్నాను.

"ఇంకో కప్పు తెచ్చుకుని నువుకూడా వచ్చి కూర్చో" అన్నారాయన మళ్ళీ.

"కబురు చేసింది ఎందుకో చెప్పరేం ?"

వారు నా ముఖంలోకి అలానే చూస్తూ ఉండిపోయారు కాసేపు.

"చెప్పరేం ! ఏం చెప్పనూ ? వచ్చి కూర్చోవా యేమిటి ?"

"మీా రెందుకో కబురుచేస్తిరిగా మరి ! చెప్పదలచుకున్న దేమిటో చెప్పండీ !"

ఈసారి వారు తలెత్తి నావైపు చూడనేలేదు. అన్నారు : "ఔను. నే నిప్పుడే మళ్ళీ వెళ్ళిపోవాలి. మరి..." అంటూ ఆగిపోయారు.

ఇంకా ఏదో చెబుతారని నేను ఎదురుచూస్తున్నాను.

"అంతే" అన్నారు వారు.

వారు 'అంతే' అన్న శబ్దాన్ని ఏ భావంతో ఉచ్చరించారో తెలిసిపోయింది. ఇక అక్కడినుంచి తిరిగి వెళ్ళిపోదామనుకున్నాను. కాని మళ్ళీ వారు "నేను ఇప్పుడే మళ్ళీ వెళ్ళిపోవాలి. ఇంకా ఏమన్నా ఉన్నాయా ?" అన్నారు.

నేను వంటింట్లోకి వెళ్లి తాజా పకోడీలు పట్టుకొచ్చి ఇచ్చాను. "ఇంకా రెండు తీసుకురానా ?" అని అడిగాను.

"వద్దులే. అవసరంలేదు."

ఇందాకటినుంచీ చూస్తూ కూర్చుంది మా అమ్మ. ఇప్పుడు వెళ్ళబెట్టింది. "వినోద్‌నుకూడా తీసుకువచ్చాను కాంత్ ! ఇక వాడిని మీ దగ్గరే అట్టిపెట్టుకోండి."

మావారు మా అమ్మవైపు తిరిగారు. "అదేమిటి ? అలా అంటున్నారేం ?"

"మా అమ్మాయి వాడిని నైనిటాల్ పంపిస్తా నంటు న్నది. అలా చేస్తే నెలకు రెండువందలుపైగా ఖర్చుపోతుంది. అదీగాక కుర్రవాడిని ఎక్కడికో దూరంగా పంపించట మనేది——"

"నైనిటాలా? ఊహుఁ. అక్కడికెందుకూ పంపించటం?" అన్నారు మావారు.

"నేనేదైనా ఉద్యోగంలో కుదురుకుంటాను."

"ఉద్యోగంచెయ్యి, ఏమన్నా చెయ్యి. వాడిని నైని టాల్ పంపించటానికి వీల్లేదు."అన్నారు మావారు ఖచ్చితంగా.

ఆ మాటాడిన తీరుకు నాకు కోపంవచ్చింది. కాని నే నేమీ మాటాడలేదు. "నైనిటాల్‌కు ఎలా పంపించకుండా ఉంటారో చూస్తాగా !" అని మనసులో అనుకున్నాను. వారూ ఆతరువాత ఏమీ మాటాడలేదు. ఎక్కడికో వెళ్ళాల్సిన తొందరలో ఉన్నారు. తేనీరు తాగేసి లేచారు. దుస్తులు ఇది వరకే మార్చేసుకున్నారు. వారు ధరించిన దుస్తులు చూస్తే ఎక్కడికో వెడుతున్నట్టే కనిపించింది. నావైపు వారికి దృష్టే ఉన్నట్టు లేదు. మా అమ్మతో ఇలా అన్నారు : "మీరు అప్పుడే వెళ్ళిపోవటం లేదు కదా అత్తగారూ ! నేను తిరిగి వచ్చేంతవరకూ ఉండండి. ఈ రాత్రి ఇక్కడే ఉందురుగాని.

మీరు వినోద్‌ను మీ దగ్గరే ఉంచుకోటం ఇష్టం లేకపోతే—
"ఏంరా, వినోద్! అమ్మమ్మగారి దగ్గర ఉంటావా? లేక పోతే—"

"అమ్మమ్మ దగ్గరే ఉంటా."

"చూచారా అత్తగారూ! ఇంకేం? సరే, ఇక నేను వెడుతున్నాను" అంటూ వారు గడపదాటి వెళ్ళారు.

కాసేపటివరకూ మా అమ్మ ఏమీ మాటాడలేదు.
"అసలు సంగతేమిటే సుఖదా! ఎక్కడికి వెడుతున్నట్టు?"

"ఏమోనమ్మా! నాకేం తెలీదు."

ఆ తరువాత మా అమ్మ నాతో ఎంతో ప్రేమగా మాటాడింది. చాలా విషయాలు తెలియజెప్పింది. ప్రపంచంలో మంచీ చెడూ ఎలా ఉంటాయో చెప్పింది. అంతా వింటూనే ఉన్నాను. కాని హృదయంలో ఒక పక్కన...మా అమ్మ సమక్షంలో మావారు నాకుచేసిన అవమానం కెలకవేస్తూనే ఉంది.

"అమ్మా! కొన్నిరోజులపాటు నన్ను నీ దగ్గరికి పిలిపించుకోవే."

"నీయిల్లే కాదుటే! ఎప్పుడు తోస్తే అప్పుడే రా! కానీ ఈ పరిస్థితుల్లో ఎలా రాగలవు?"

"వారు నేనంటే ఎప్పుడూ అలాగే ఉంటారులే."

"అతనిదేముందే పాపం! నువు ఎలా నడిపిస్తే అలా నడుస్తాడు. నిజం చెబుతున్నాను సుఖదా! నీకు సాక్షాత్తు దేవుడులాంటి భర్త దొరికాడు. అతన్ని పోగొట్టుకున్నావంటే

ఇహపరాలు రెంటికీ చెడిపోతావు. నీకు పుట్టగతులు ఉండవు. అనవసరంగా దురభిమానం పెట్టుకోకు. నువ్వు తెలియనిదానివీ కాదు, నీకు నేను చెప్పాల్సిన అవసరమూ లేదు. నీ మొగుడు నిజంగా గోవులాంటివాడే. నిజంగా గోవే. మనస్సులో ఏమీ పెట్టుకోడు. లోపల ఏది ఉన్నా పైకి అనేయవలసిందే. అటువంటి మొగుడితో నువ్వు హాయిగా ఉండలేకపోతే ఇంకేమిటే నువ్వు చేసేది ?"

ఈ మాటల్ని బట్టి మా అమ్మకుకూడా నామీద సదభిప్రాయం లేదనే సంగతి స్పష్టపడిపోయింది. "పది పదిహేను రోజులపాటు నీదగ్గరే వచ్చి ఉంటానమ్మా" అన్నాను పట్టుదలగా.

"రా పోనీ; కాని అతను వెళ్ళమంటేనే రా."

"వెళ్ళద్దని ఆయన ఎప్పుడూ అనడు."

"అదే నాకు భయంగా ఉంది. ప్రతిదానికీ అతను 'సరే' అని అంటూంటే నిజంగా ఇష్టపడుతున్నాడనే నువ్వు అనుకోకు. ఎప్పుడూ అలా అనుకోకూడదు సుమీ !"

మా అమ్మ మరికాసేపు ఉండి వినోద్‌ను తీసుకుని వెళ్ళిపోయింది. మళ్ళీ ఇంట్లో నేను ఒక్కతినే అయినాను. ఇక నేను పూర్తిగా భర్తఅధీనంలో ఉండిపోడానికే మనసులో నిశ్చయం చేసుకున్నాను. మిగతా వ్యాసంగాలన్నీ మరచిపోదామనే నిర్ణయించుకున్నాను కాని లోలోపల ఎంతైతే అనుకుంటూ ఉంటానో పైకి అలా నడుచుకోవాలీ అంటే నాకు దుష్కరంగానే ఉంటోంది.

ఏమిటీ చిత్రం ? అని పలుసార్లు ప్రశ్నించుకుంటూ ఉంటాను. ఇప్పుడు నేను ఆఖరిఘట్టంలో ఉన్నాను. మృత్యువు ఎదురుగా ఉంది. మృత్యువు నాకు ముక్తిహేతువు కాదు. ఇప్పుడు నాలో ఏ విధమైన వికారమూ లేదు. ఇప్పటికీ నాకు సరిగా బోధపడటం లేదు : మానవుడు తానేది చెయ్యా లనుకుంటాడో దాన్ని ఎందువల్ల చెయ్యలేకపోతున్నాడు ? ఏ గమ్యాన్ని చేరుకోవాలనుకుంటాడో దానికి దూరంగానే ఉండిపోతున్నాడేమిటి ? దేనికి దూరంగా ఉండటమే శ్రేయస్కరమో, దాన్నే దగ్గరకు ఆహ్వానించుకుంటాడేం ? అతనికి ఈ దౌర్బల్యం ఎక్కడినుంచి వచ్చింది ? ఏ దురవగాహమైన శక్తికి అతడు లొంగిపోతున్నాడు ? ఇంత చంచలమైన స్వభావంతో భగవంతుడు మనల్ని ఎందుకు పుట్టించాలి ? అడుగడుక్కీ భయం కలుగుతూ ఉంటుంది; ఏమీ చేయలేక పోతున్నాం. ఆత్మావలోడన ఫలితంగా నాకు బోధపడిన అంశం ఏమంటే—ఎవడు ఎవడని అనుకుంటున్నామో, నిజంగా వాడు వాడు కాడు. పాపి పాపి కాదు. పుణ్యాత్ముడు పుణ్యాత్ముడు కాడు. దొంగ దొంగ కాదు. వేశ్య వేశ్యకాదు. ప్రతివాడు ఎలా రాసిపెట్టి ఉంటే అలా ఔతున్నాడు. ఈ సూత్రంతో నన్ను నేను క్షమించుకుని బైటపడుతున్నానని అనుకోవద్దు. ఒకడు ఒక రకంగా తయారైనాడూ అంటే ఆ దోషం అంతా అతని తలకే రుద్దటానికి వీల్లేదు.

సృష్టినిండా ఇంత చాంచల్యం, వైరుధ్యం నింపి పెట్టిన ఆ భగవంతుడు నాకెక్కడ దొరుకుతాడు ? ఎక్కడేనా కనిపిస్తే మాత్రం దోషమంతా అతని నెత్తికే రుద్దేసి "ఇక

నువు చెప్పేదేమిటో చెప్పవయ్యా" అని నిలవదీసి అడుగుతాను. ఆ భగవంతు డనేవాడు నిజంగా ఉండి, నాకు కనిపించటమే తటస్థిస్తే అతడు నాకేమి సమాధానం చెబుతాడు? బహుశా నవ్వి ఇలా అంటాడేమో ననుకుంటాను: "దోషమంతా నాకే అంటగడతావా? సరే కానీ. నిజంగా అంతా నేనే; అంతా నాదే. త్రిగుణాలూ నావే, గుణమే దోషం; దోషమే గుణం. దోషం నీ దేముందీ అసలు? ఏమైనా నాదే; నేనే."

ఆ సంగతి నాకు తెలుసు. అందుకనే నేను ఎవరికీ దోషం అంటగట్ట దలచుకోలేదు. ఉన్నదేదో నాలోనే ఉంచుకుంటాను. అందులోనుంచి లేశమాత్రంకూడా అటూ ఇటూ చెదరిపోనీను.

మావారు వచ్చేసరికి చాల పొద్దుపోయింది. అప్పటి వారి తీరు చాల విచిత్రంగా ఉంది. ముఖం ప్రసన్నంగా, ప్రఫుల్లంగానే ఉంది. కాని ఎంతో వైలక్షణ్యంకూడా కనిపిస్తోంది. నాకు భయం వేసింది.

వచ్చి సోఫాలో పడుకున్నారు. "హరీశ్ పారిపోయాడు. విన్నావా సుఖదా! హరీశ్ పారిపోయాడు."

ఆ మాట రెట్టించి పలకటంలో వారి భావం ఏమిటో నాకు బోధపడలేదు. దగ్గరకు వెళ్ళాను. మెడకు ఉన్న మఫ్లర్ విప్పాను. కోటు గుండీలు ఊడదీశాను.

వారు పకపక నవ్వారు. "విన్నావా! హరీశ్ పారిపోయాడు."

వారి మనస్సు స్వాస్థ్యం కోల్పోయినట్టు కనిపిస్తూనే ఉంది. లేవదీసికూర్చోబెట్టాను. మెల్లిగా ఒళ్ళు నిమిరాను. తీసుకుపోయి మంచంమీద పడుకోబెట్టాను.

మాటిమాటికీ హరీశ్‌ను గుర్తుకు తెచ్చుకుంటూనే ఉన్నారు. అతడు పారిపోవటాన్ని తలచుకుని పకపక నవ్వుతూనే ఉన్నారు. ఏదో భావావేశంలో పలవరిస్తూనే ఉన్నారు. ఆ పలవరింపులు ఒకదాని కొకటి సంబంధంలేకుండా ఉన్నాయి. వాటి అర్థం నాకేమీ బోధపడలేదు. రాత్రంతా ఇలాగే గడించింది. తెల్లవారుఝామున వారికి కాస్త నిద్ర పట్టింది. తరువాత మూడు రోజులవరకూ అసలు సంగతేమిటో, ఏమి జరిగిందో నాకు తెలియనేలేదు. అఖరికి నాలుగో నాడు...

# 16

మూడు రోజుల వరకూ మావారు అన్యమనస్కులుగానే ఉంటూ వచ్చారు. రెండుమూడుసార్లు ప్రయత్నించి చూచాను సంభాషణలోకి దించుదామని. కాని వారి గొడవే వారిదైంది. అందుచేత నా గొడవలో నేను ఉండిపోయాను. నాలుగోనాడు ఒక మహిళాసభకు అధ్యక్షత వహించవలసి వచ్చింది. నన్ను తీసుకుపోయేందుకు ప్రభాత్ కారు పట్టుకొచ్చాడు. అతడూ నేనూ వెనుకసీటులో కూర్చుని వెడుతున్నాం. పట్నంలో పోలీసులు ఎక్కడెక్కడ సోదాలు కొనసాగించారో, వాటి ఫలితం ఏమైందో...ప్రభాత్‌కు తెలిసి ఉంటుందని అడిగాను. మూడునాలుగుచోట్ల సోదాలైతే జరి

గాయి కాని మనకు వచ్చిన యిబ్బంది ఏమీ లేదని ప్రభాత్ చెప్పాడు. తరువాత మాటలసందర్భంలో...చాలరోజుల క్రితం రాజకీయ హత్య ఒకటేదో జరిగిందనీ...హంతకుడు హరీశబాబే అయివుంటాడనీ అనుమానించి పోలీసులు అతన్ని పట్టుకోవాలన్న ఉత్సాహంతో ఉన్నారనీ...హరీశ్‌ను పట్టి యిచ్చిన వారికి గొప్ప బహుమానం కూడా ఇస్తామని ప్రభుత్వం ప్రకటించిందనీ...ప్రభాత్ చెప్పాడు. హరీశబాబు హంతకుడన్న మాట నేను కలలోకూడా నమ్మలేను. శాంతగంభీరుడైన వ్యక్తి అతను. మాటలధోరణిలో ప్రభాత్ లాల్‌బాబును గురించి ఏమైనా ప్రస్తావన తీసుకొస్తాడేమోనని చాలసేపు ఎదురు చూచాను. అతను ఆ పేరే ఎత్తలేదు. చివరకు నేనే అడిగాను: "మీ సంఘంలో లాల్‌బాబు ఏం చేస్తుంటాడు ? ఎవరతను?"

"మీ రతన్ని ఎరుగుదురా ఏమిటి ?" ఆశ్చర్య పడుతూ అడిగాడు ప్రభాత్.

"ఎవరతనూ ?"

"మిమ్మల్ని ఎప్పుడేనా కలిశాడా ఏమిటి ?"

"అతను ఎవరో చెబుదూ !"

ప్రభాత్ నా ముఖంలోకి చూస్తూ "అతన్నిగురించి నాకూ ఎక్కువగా తెలియదు" అన్నాడు చెప్పటానికి సంకోచిస్తున్నవాడులాగ.

నేను అంతటితో ఊరుకోలేదు. గుచ్చిగుచ్చి అడిగాను. కాని లాల్‌బాబును గురించి ఏ అంశమూ ప్రభాత్ చేత

చెప్పించలేకపోయాను. ఏదో చెప్పబోతూ సంకోచించి ఆగిపోతు న్నట్టు కనిపించింది నాకు. ఏదో భయపడుతున్నాడల్లే ఉంది. లాల్‌బాబుతో నా కిదివరకు కొంత పరిచయం ఉన్నట్టు నేను బయటపెట్టలేదు.

సభకు వేలాదిగా వచ్చారు స్త్రీలు అన్నితరగతుల్లో నుంచి. నేను సభావేదకమీద సముచితాసనం అలంకరించాను. అందరి కళ్ళూ నామీదే కేంద్రీకృతమై ఉన్నాయి. అది నాకు ఒక అపూర్వ అనుభూతి. అంతమంది స్త్రీలు అంత ఆప్యా యంగా, సాదరంగా నన్నే అవలోకిస్తున్నారంటే...అది నాకు సామాన్య గౌరవమా? మొదట ఇద్దరు మహిళామణులు ఒకరి తరువాత ఒకరు ఉపన్యసించారు. ఇద్దరూ ఇంచుమించు గాంధీ గార్ని స్తుతించారు. గాంధీ విధానంలో నాకు విశ్వాసం లేదు. అది చాల తేలికైన విధానం. ఈ సమయంలో మనకు కావలసింది తీక్షణమైన, పటువైన కార్యక్రమం. గాంధీగారి విధానంలో ఔదార్యమే ఉంది; కాగా ఆంగ్లేయులపట్ల ఉండ వలసినంత కాఠిన్యం మనకు ఉండనక్కర్లేదన్నమాట! ఈ కోమ లత్వం, ఔదార్యం అనేవే మన భారతదేశానికి అనాదినుంచీ శాపాలై కూర్చున్నాయి. శత్రువును శత్రువులాగే చూడటం భారతదేశం నేర్చుకోలేకపోయింది. పైగా ధర్మం, ఆధ్యా త్మికం అంటూ శత్రువును మిత్రునికంటేకూడా ఎక్కువగా ఆదరించటం నేర్చుకున్నాం. తత్ఫలితంగా అడుగడుక్కీ పరాయి వాళ్ళ చేతుల్లో మోసం తింటూ వస్తున్నాం. ఎప్పే, అదికాదు పద్ధతి. శత్రువుపట్ల నిర్దాక్షిణ్యంగా, కఠినంగా ప్రవర్తించా ల్సిందే. శత్రువువన్నవాడిపట్ల పక్కలో బల్లెంలా ఉండా

ల్సిందే మనం. ప్రస్తుతం మనకు కావలసింది ఏదో శాస్త్ర సంస్కరణ కాదు. క్రాంతి కావాలి. సంస్కరణ విధానంలో సంప్రదింపులు, ఒడంబడికలు ఉంటాయి. మనస్సుకు శాస్త్ర వినోదం లభిస్తుంది! అంతకుమించిన ప్రయోజనం దానివల్ల మరేమీ ఉండదు. పైపై ఆకులు నాలుగు త్రుంచినందువల్ల ఏం ఒరిగింది. మూలందాకా వెళ్ళాలి. అనర్థం పాతుకుపోయిన చోట వేళ్ళదగ్గరనుంచీ తవ్విపారెయ్యాలి. గాంధిజీ నాయకత్వాన కాంగ్రెస్ సంస్థ ఇంకా బ్రిటిష్‌వారిమీదనే ఆశలు పెట్టుకుని ఉంది. తన కోరలమధ్య మన మెడ ఇరికించుకుని నమిలి వేయటానికి సిద్ధంగా ఉన్న పులిమీదనే ఆశలు పెట్టుకుని మనకేం లాభం?...నా మాటలకు సభికుల్లో ఉత్సాహం పొంగుతున్నట్టు గమనించాను. ఆ దెబ్బతో నాకు ఎక్కడలేని ఆవేశం వచ్చేసింది. అపుడు వారికి పూర్వ వీరనారీమణులను గుర్తుకు తెచ్చాను. అగ్నిగుండాల్లో దుమికి అమరకీర్తిని ఆర్జించుకున్న శక్తిస్వరూపిణులను జ్ఞాపకంచేశాను. ఇలా ప్రబోధించాను : "మీరు అబలలు కాదు. అలాగ ఎప్పుడూ అనుకోవద్దు. పురుషుల భోగవస్తువులుగా మాత్రమే దిగజారిపోకండి" అని. నామాటలు వింటోన్నవారి కన్నుల్లో వింత కాంతులు తొణికిసలాడాయి. ఒళ్లు పులకరిస్తున్నట్టుగా కనిపించారు. ఏదో ఒక మహాయుద్ధం చేరువలో ఉన్నట్టూ, నేను సేనానినైనట్టూ, వాళ్ళందర్నీ శత్రుసంహారానికి ఆహ్వానించాను. వేదిక యెక్కి ఉపన్యసించటం అదే ప్రథమం నాకు. మా సంఘ ఆశయాలకు అనుగుణంగా, భావావేశంతో ఉపన్యసించాను.

సభ ముగిసింది. చాలమంది స్త్రీలు నన్ను కారు దాకా వెంబడించి వచ్చారు. వినయవిధేయతలు ప్రకటించారు. ప్రభాత్ ఏమైనాడో నాకు ఆ దృష్టేలేదు అప్పుడు. కాని అతనే ఒకమూల గుంపులోనుంచి తోసుకుంటూ వచ్చి డ్రయివరుసీటులో కూర్చున్నాడు. చుట్టూ మూగిన మహిళామణుల నమస్కారాలు స్వీకరిస్తూ వెనుకసీటులో ఎక్కి కూర్చున్నాను. నా మెడలోనుంచి జారిపడిన ఒక పూల మాలను ఒకానిడ తీసి మళ్ళీ నా మెడలో వేసింది......

కారు ఆగింది. ప్రభాత్ లేచివచ్చి పక్కతలుపు తీశాడు. అప్పుడు తెలిసింది నాకు : ఇంటికి వచ్చేశామని. ఇంతసేపటి నుంచీ నా మనస్సు ఎక్కడ ఉందో మరి ! ఇంట్లోకి వెళ్లాను. మావారు వరండాలో కూర్చుని వార్తాపత్రిక చూస్తున్నారు. నన్ను చూడగానే ఏదో పలకరించాలికదా అని "సభ అయిపోయిందా ?" అన్నారు.

నా మనస్సు ప్రసన్నంగా లేదప్పుడు. "అయింది" అని క్లుప్తంగా పలికాను.

"ఒక్కతెవే వచ్చావా ?"

"ప్రభాత్ తీసుకువచ్చాడు."

"ప్రభాత్ ! వచ్చాడా ? ఏడీ ? లోపలికి పిలు !"

నేనేమీ సమాధానం చెప్పలేదు. వెళ్ళి ప్రభాత్ ను పిలవనూలేదు. వారే గబగబా పరిగెత్తుకుంటూ బైటికి వెళ్లారు. మరి కాసేపటికి ప్రభాత్ ను వెంటబెట్టుకుని లోపలికి వచ్చారు.

"కూర్చో ప్రభాత్ ! అదేమిటి ? వచ్చినవాడివి బైటి నుంచే వెళ్ళిపోవటమా ?"

"కారు మళ్లీ అక్కడ ఒప్పజెప్పి రావాలండీ !" అన్నాడు ప్రభాత్ సంకోచిస్తూ.

"ఎవరిది ఆ కారు ?"

"ఎవరిదో తెలియదు—దొరగారు పంపించారు."

"దొరగారు !...అంటే – లాల్ బాబేనా ?"

ఏదో విచికిత్సలో పడ్డవాడులా ప్రభాత్ "చిత్తం" అన్నాడు.

నేను అంతవరకూ నిల్చునే ఉన్నాను. లాల్ బాబు ప్రస్తావన రావటంతోటే నే నక్కడ ఉండలేదు. లోపలికి వెళ్ళిపోయాను. ప్రభాత్ ను దగ్గర కూర్చోబెట్టుకుని మావారు ఏమేమి విషయాలు మాటాడుతున్నారో తెలుసుకోవాలన్న కుతూహలం నేను పెట్టుకోలేదు. ఆఖరికి మావారు నన్ను పిలుస్తూ లోపలికి వచ్చారు.

"సుఖదా ! సుఖదా ! ఒకమాట !"

ఇద్దరం కలిసి మళ్లీ బైటికి వచ్చాం. ప్రభాత్ ఇంకా అక్కడే ఉన్నాడు. నేనూ ఒక కుర్చీలో కూర్చున్నా వచ్చి. ఇక మావారు ఆరంభించారు : "నీకు ఒక విషయం చెప్పకుండా దాచాను సుఖదా ! అందుకు చాల విచారంగా ఉంది. నీ సొమ్ములు కొన్ని బ్యాంకులో అట్టిపెట్టానే...వాటిమీద నేను రెండువేల రూపాయలు పట్టుకొచ్చాను. ఆ డబ్బు

అంతా ప్రభాత్‌కు ఇచ్చాను హరీశబాబుకు అందజెయ్యమని. హరీశ్ ఏమో ఎక్కడికో వెళ్ళిపోయాడుకదా! ప్రభాత్‌ను అడిగితే "ఇతర్ల డబ్బు ఒక్కపైసాకూడా ఆయన తన స్వంత ఖర్చులకింద తీసుకోరు, అంతా మా సంఘానికే వెడుతుంది; సంఘ కార్యక్రమాలకే వినియోగపడుతుంది" అంటాడు. పైకం హరీశ్ చేతుల్లోకి వెళ్ళిందంటే నాకు సంతోషమే. కాని— ఇంతకూ నీతో చెప్పకుండా చేశాను ఈ పని. ఎందుచేత నంటే—హరీశ్ పట్ల నీకు గౌరవం ఉంది; అదీగాక అతడు నా నా బాల్యమిత్రుడు. కాని—"

మావారు ఏదో అనుమానంతో మనస్సులో బాధ పడుతున్నట్టు అర్థమౌతూనే ఉంది. "ప్రభాత్! పైకం నువు హరీశ్‌కు ఇచ్చావా?" మావారు అడిగారు.

మధ్యలో నేను కల్పించుకుని "ప్రభాత్! ఆ సంగతి నువు నాకెందుకు చెప్పావు కాదు?" అని అడిగాను.

నా ప్రశ్న విని ప్రభాత్ చిన్నబోయాడు. అప్పుడు మావారు మళ్ళీ ఇలా అన్నారు: "నేనే చెప్పవద్దన్నాను... ఇంతకూ ప్రభాత్! పైకం హరీశ్ తనతో తీసుకుపోలేదని నువు నిశ్చయంగా చెప్పగలవా? అదే నాకు ముఖ్యంగా కావాల్సిన విషయం."

"తీసుకుపోలేదనే నా అనుమానం" అన్నాడు ప్రభాత్.

మావారికి కోపం వచ్చేసింది. "అనుమానం కాదు నాకు కావల్సింది... మీ సంఘాన్నీ సభ్యుల్నీ నేను ఎరగను. పైకం హరీశ్ చేతుల్లోకి వెళ్ళితే సరే; అదే కావాల్సింది. లేక

పోతే మాత్రం నేనొక క్షమించటానికి వీల్లేని అపరాధం చేశా వన్నమాట! తెలిసిందా? కాబట్టి ఆ విషయమై నిజం తెలుసుకువచ్చి నాకు చెప్పు."

ప్రభాత్ ఏమీ మాటాడలేదు. మావారు నావైపు తిరిగి తలవంచుకున్నారు. "సుఖదా! నువ్వు నన్ను క్షమించ గలవా? హరీశ్ నా చిన్ననాటి మిత్రుడు" అన్నారు.

"నాదగ్గర ఉన్న మూడువందల రూపాయలు నేనూ ఇచ్చాను."

మావారు ఆశ్చర్యపోయారు. "నువ్వా? ఎప్పుడు? ఎవరికీ? ఎక్కడ?"

"హరీశ్ బాబుకు ఇద్దామని వారి బసకు వెళ్ళాను. అక్కడికి లాల్ బాబు వచ్చాడు. అతన్ని నేను ఎరగను. కాని హరీశ్ బాబు ఒక ఉత్తరం అతని ద్వారా నాకు పంపించారు. అందుచేత డబ్బు అతనికే ఇచ్చాను."

మావారు ఆలోచనలో పడ్డారు. "నువ్వు లాల్ బాబును కలిశావన్నమాట!"

"ఔను. ఆనాడు కలిశాడు, హరీశ్ ఇక్కడినుంచి వెళ్ళిపోయిన సంగతి నాకు అతనే చెప్పాడు."

"ఊఁ. నువ్వు మళ్ళీ ఈమధ్య అక్కడికి ఎప్పుడన్నా వెళ్ళావా?"

ఈ ప్రశ్న అడిగిన తర్వాత మావారికి...అక్కడ

ప్రభాత్ ఉన్నట్టు స్పృహ వచ్చింది కాబోలు! అతనివైపు తిరిగి "ప్రభాత్! నీకు ఆలస్యం అయినట్టుంది పాపం! కారు ఒప్పజెప్పి రావాలి కాబోలు!...ఆసంగతి నిజం తేల్చాలి సుమీ! లాల్ బాబు అంటే నాకు ఎలాగైనా...ఇష్టంలేదు చెప్పద్దూ" అన్నారు.

ప్రభాత్ తల వంచుకునే "చిత్తం" అన్నాడు; లేచి వెళ్ళిపోయాడు.

వెళ్ళిపోయేటప్పుడు ప్రభాత్ తో కరచాలనం చెయ్యటానికి లేచిన మావారు మళ్ళీ కూర్చోలేదు. అటూ ఇటూ పచార్లు ఆరంభించారు. కొంతసేపటికి పచార్లు ఆపి నావైపు చూచి "ప్రతిరాత్రీ రెండుగంటలు ఒక పని ఏర్పాటు చేసుకున్నాను. రెండు సంవత్సరాల్లో నీ రెండువేలూ పూర్తి చెయ్యగలను."

దీనంగా వారు పలికిన ఆ మాటలకు నాకు రోషం వచ్చింది. రెండువేలకోసం నేను ఆయన్ను పీక్కుతింటానా? చేసుకున్న భర్తమీద అంతమాత్రం సానుభూతిలేని పాపిష్టిదాన్నా? "ఇప్పుడీ ఉద్యోగంతో నలిగిపోతున్నది చాలదనా? ఇంకా వేరే కత్తిపెట్టి కోసుకోవాలా?" అన్నాను.

"చేతిలో డబ్బు లేకపోతే నీకు మనస్సు కష్టంగా ఉంటుంది. విసుగుదలకూడా ఎక్కువౌతుంది" వారి కంఠస్వరం పూర్వంలాగ దీనంగానే ఉంది.

"అందుకని మీరు శిక్ష అనుభవిస్తారా నాకోసం? ఏదో ఉద్యోగం నేనే చెయ్యగలను."

ఈమాటతో వారి అభిమానం దెబ్బతిన్నట్టు అయింది కాబోలు! "ఊహుం. నువు ఉద్యోగం చెయ్యలేవు" అన్నారు.

"ఎందుకని? ఆడదాన్ని కాబట్టేనా?"

"ఔను, అందుకనే."

"ఇంట్లో కావలసిన ప్రతిదానికీ మీరే అవస్థపడుతూ ఉండటం చూస్తూకూడా నేను ఏమాత్రం సాయపడకూడ దన్నమాట! ఆడదాన్ని అయినందువల్ల అదేనా నా ధర్మం?"

మావారు ఆలోచిస్తూ అటునుంచి ఇటూ, ఇటునుంచి అటూ పాదచ్ఛాయలు వేస్తున్నారు. చివరకు ఆగారు. "నీ ఆలోచనలు పెద్దవి సుఖదా! నీ యోగ్యతకూడా గొప్పదే. మన ఆదాయం మాత్రం చాల స్వల్పం. దానికి సంబంధించిన బాధ్యత అంతా నాది. ఆదాయాన్ని వృద్ధిచెయ్యటానికి ప్రయత్నించాల్సిన బాధ్యతకూడా నాదే. నీ యోగ్యతకు తగినంతగా డబ్బు ఆర్జించి, నీకు యోగ్యుడైన భర్తనని అనిపించుకోవటమే నా ప్రధాన కర్తవ్యం."

వారు అటువంటి దైన్యపు పలుకులు పలుకుతూ ఉంటే...వారిపట్ల నాకు ఉండిన కరుణ యావత్తూ రోషంగా మారిపోసాగింది. "నేను మీదాన్ని కానట్టూ, ఎవరో పరాయిదాన్ని అయినట్టూ అలా మాటాడతారేం? మీరు ఎంత తెస్తే అంతలోనే గడుపుకుంటాను. ఎప్పుడన్నా ఏదన్నా

అన్నానూ అంటే సంఘంలో మీకు ఉండాల్సిన గౌరవాన్నీ, మన వినోద్ భవిష్యత్తునూ దృష్టిలో పెట్టుకుని అనిఉంటాను. అంతేగాని నాకొక ఎండు రొట్టె, మిరపకాయ చాలు."

వారు వెంటనే ఏమీ సమాధానం చెప్పలేదు. పచార్లు మాత్రం మానలేదు. నేను వారివైపే చూస్తూ ఉన్నాను. మానవస్వభావం విచిత్రమైనదికదా! తలవంచుకుని ఓడిపోయిన వాడులా అలా పచార్లు చేస్తున్న వారిని చూస్తోంటే నాలోని సద్భావం యావత్తూ దుర్భావంగా మారిపోసాగింది. ఆడ వాళ్ళ రీతి...అది ఏమిటో?...మగవాడిని వంచాలని కోరుతారు. వాడు నిజంగా వంగితే అదొక దోషంగా పరిగణించి కోపం తెచ్చుకుంటారు. వారు నామీద అధికారం చలాయించకుండా, కోప్పడకుండా ఉండాలని నే నెప్పుడూ కోరుకోలేదు. కాని వారు కోపం తెచ్చుకుని నన్ను బాగా నాలుగు చదువులు చరవవలసిన సమయంలో అలా చేయకుండా వినమ్రులై ఊరుకోటం నాకు అసహ్యమైపోయింది. వినమ్రత ఒక రకమైన దౌర్బల్యం. కాని ఈనాడు...అన్ని అనుభవాలు అయినమీదట...నాచేతుల్లో ఏమీ లేని ఈ సమయంలో...జీవితమనే పందెం సమాప్తమై అంతా ముగిసిపోయిన ఈనాడు...ఆ వినమ్రతే ఒక మహాబలం అని గుర్తించగలుగుతున్నాను. ఇప్పుడు ఆ వినమ్రతను నాలో పెంపొందించుకునేందుకు ఉపాయం ఏమీలేదు. అలా పెంపొందించుకున్నప్పుడే పునర్జన్మ. కాని పునర్జన్మ—

# 17

"వినోద్‌ను నైనిటాల్‌కు పంపిస్తే పంపించు" అన్నారు మావారు.

"మీకు ఇష్టంలేకపోతే ఇక్కడే ఉండనీయండి పోనీ."

"నా కొడుకైతే మామూలుగా అందరిలాగే పెరుగుతాడు. కాని వాడు నీ కొడుకుకూడా కదా! అటువంటప్పుడు మామూలు పెంపకం అయితే ఎలాగ ?"

ఆ వ్యంగ్యభాషణకు నాకు కోపం వచ్చింది. కాని ఏమీ మాటాడలేదు. వారే మళ్ళీ ఇలా ఆరంభించారు : "భగవంతుడు ఎవరికైనా ఒకటే జన్మ ప్రసాదిస్తాడనేదీ సరైన మాటే. చేయదలచుకున్నదంతా ఈ జన్మలోనే చేసుకోటం మంచిది. కాబట్టి వినోద్‌ను—"

"మీ ఉద్దేశం ఏమిటి ఇంతకూ ?" చాల దూకుడుగా అన్నాను ఆ కోపంలో.

క్షణంసేపు వారు నా ముఖంలోకి చూచారు. "పొరపాటు జరిగింది సుఖదా! నీ వివాహం ఇంతకన్నా చాల ఉన్నతమైన ఇంకో కుటుంబంలో జరిగి ఉండవలసింది."

"పోనీ ఇప్పుడైనా జరిగించుకోమన్నారా ?" అన్నాను విదిలింపుగా.

"ఊఁ, జరిగించుకో." అన్నారాయన నీరుగారిపోతున్నట్టుగా.

"ఆ మాట అనటానికి మీకు సిగ్గు ఎలా లేక పోయిందీ?"

"సిగ్గు ఔతూనే ఉంది. కాని దానివల్ల ఏం ప్రయోజనం?" ఇందాకటికంటే మెల్లిగా — ఇంకా నీరుగారిపోతున్నట్టుగా అన్నారాయన.

నా వొళ్ళు నాకే తెలియకుండా ఉన్న స్థితి అది. పూలమాలలన్నీ వాడిపోతూ నా పక్కనే ఉన్నాయి. అవి తీసి వారిమీద విసిరి కొట్టేదాన్నే, చేతిని ఉన్న గడియారం విసిరి నేలకు కొట్టేదాన్నే. కాని అటువంటి పనేమీ నిజంగా మాత్రం జరగలేదు. మామూలుగానే కూర్చున్నాను. పైగా మందహాసం చేశాను. "సిగ్గు ఔతోందికదా!" అన్నాను.

వారు ఒక నిట్టూర్పు దీర్ఘంగా విడిచారు. "ఆఁ, అసలు నేను ఉన్నందుకే సిగ్గు ఔతోంది. ఏమైనా నువు వినోద్‌ను నైనిటాల్‌కు పంపదలిస్తే తప్పకుండా పంపించు. నీ సొమ్ములన్నీ తప్పకుండా పూర్తి చేస్తాను. నేను లేకపోవటం అంటూ ఉంటే ఆ తరవాతనే. ఉన్నన్నాళ్ళూ మాత్రం—"

"చాల్లెండి — అటువంటి ఎత్తిపొడుపుమాటలు నాతో మాటాడకండి. నగలు మీవే — వినోద్ మీ కొడుకే. ఏ రోజున నేను ఈ యింట్లో ఉండటం మీకు ఇష్టం లేక పోతుందో ఆనాడే చెప్పెయ్యండి. మీ కళ్ళముందునుంచి దూరంగా వెళ్ళిపోతాను. నాకూ తెలుసు: సంపాదిస్తున్నది మీరు; తినేదీ, ఖర్చు చేసేదీ నేను. ఈ మీరు చేసేదంతా తక్కువని నే నెన్నడూ అనలేదు. అయినా మీ ఎత్తిపొడుపు

మాటలకు బొత్తిగా హద్దూపద్దూ లేకుండా ఉంది. నా నెత్తి నేదో పెద్ద భారం మోపాలని చూస్తారేం?"

మావారు వెంటనే జవాబేమీ చెప్పలేదు. నా మాట విని లేచి పచార్లు సాగించారు. మరికాసేపటికి ఆగి పక్కన నవ్వారు. "మహిళాసభకు అధ్యక్షత వహించి ఇప్పుడే వచ్చావు. నువు తెచ్చిన పూలమాలలన్నీ ఇక్కడే పడి ఉన్నాయి, చూస్తూనే ఉన్నాను. ఇటువంటి సమయంలో నిన్ను అభినందించవలసింది పోయి నీతో పోట్లాట పెట్టుకున్నా నేమిటి? దాని కేం గాని...ఆ రెండు వేల రూపాయల్ని గురించిమాత్రం నాకు భయంగానే ఉంది. హరీశ్ ఉత్తరం తీసుకొచ్చాడు ప్రభాత్ నా దగ్గరకు. నేనేం చెయ్యను. రెండు వేలు అవసరంగా కావాలని రాశాడు హరీశ్. అతని కోరిక నేను తోసివెయ్యలేకపోయాను. అతడు నాకు ఎంత ఆప్తుడో నీకుకూడా తెలీదు సుఖదా! నాకు చదువు అబ్బిందీ అంటే అతనివల్లనే. నేను ఈనాడు ఇలా ఉన్నానూ అంటే అతని వల్లనే. అతనిమాట ఎలా కాదనేదీ? నువు నాదానివే అనీ, నీ సొమ్ములూ నావే అనీ అనుకున్నాను. ఇక ఒక్క క్షణంకూడా ఆలోచించలేదు. వెళ్లాను; బ్యాంకులోనుంచి రెండు వేలూ తెచ్చాను. ప్రభాత్ చేతికి ఇచ్చాను. ఆ తరువాత నువు ఏమన్నా వేరుగా భావిస్తావేమో నని భయపడ్డాను. మరి రెండు రోజులకల్లా హరీశ్ మాయమైపోయాడు. ఇవాళ ఆ పెద్దమనిషి మాటల్ని బట్టి ఆ రూపాయలు—"

ఇక్కడ వారు ఆగారు.

"ఊం, చెప్పండి—"

"ఆ రూపాయలు మరెంకెవరి చేతుల్లోకన్నా వెళ్ళి పోయాయేమో నని నాకు అనుమానంగా ఉంది." అని పలికి మళ్ళీ పచార్లు చేయసాగారు. మరి కాసేపటికి ఆగి "నువ్వు లాల్‌బాబును ఎప్పటినించీ ఎరిగున్నావు?" అని అడిగారు.

"నేను ఎరగను అసలు."

ఆ మాట వారు వినిపించుకున్నట్టూ లేదు, నా జవాబు కోసం వారు ప్రతీక్షించినట్టూ కనిపించలేదు. అన్నారు: "ఈ లాల్‌బాబు హరీశ్‌ను రాహువులా పట్టి తినేస్తున్నాడు. ప్రభావం హరీశ్‌ది. కార్యకలాపం లాల్‌బాబుది అసలు సూత్రం లాల్‌బాబు చేతుల్లోనే ఉంటుంది. పైకం అతని చేతుల్లోకే పోయివుంటుందని నా భయం. అలాగే జరిగివున్నట్టయితే నాకన్నా పరమ మూర్ఖుడు ఇంకెవరుంటారు చెప్పు!"

"ఎవరు ఈ లాల్‌బాబు?"

"నేనూ స్వయంగా అతన్ని ఎరగను. ఒక పెద్ద దొర గారులాగ కనిపిస్తూ కాలక్షేపం చేస్తుంటాడు. దొరగారనే చలామణీ ఔతున్నాడు. అంతకంటే అతన్ని గురించి నాకింకేమీ తెలియదు. కాని లోకులు అతనంటే భయపడతారు. అందుచేత అతన్ని గౌరవిస్తారు. ఎక్కడికి బడితే అక్కడికి తయారౌతూ ఉంటాడు. మంచి సాహసికుడని చెబుతారు."

"అయితే ఏం?"

"ఏమీలేదు సుఖదా! నాకు అటువంటి వాళ్ళంటే అసహ్యం వేస్తుంది. వాళ్ళ వ్యవహారాలు చూచినా రోత కలుగుతుంది. ఇంతకూ...ఒక్కొక్క పైస ఒక్కొక్క

రూపాయిలా చూచుకోవలసిన మనకు రెండువేల రూపాయలు నష్టం కలిగిందంటే నాకు చాల విచారంగా ఉంది."

నేను మెల్లగా కొన్ని సాంత్వనవాక్యాలు పలికాను. వారి మనస్సుకు కొంత ఊరట చేకూర్చగలిగాను. "అయిం దేదో అయిపోయింది. గడచినదాన్ని గురించి విచారించి లాభం లేదు. మనలో మనం భేదంలేకుండా కలిసిమెలిసి ఉందాం, మిత వ్యయం అలవరచుకుందాం, అంతా చక్కగా సాగిపోతుంది" అని ధైర్యం చెప్పాను.

మావారికి చాలవరకు మనస్సు స్థిమితపడింది. ఇంతలో బైట ఎవరో తలుపు తట్టిన చప్పుడైంది. "రండి, లోపలికి రావచ్చు" అన్నారు మావారు. నేను లేచి వెళ్ళిపోదా మను కుంటూ ఉన్నాను.

లోపలికి వచ్చిన వ్యక్తి లాల్‌బాబు. వెడుతున్నదాన్ని ఆగిపోయాను, అతన్ని చూడగానే. అతడు నిస్సంకోచంగా నాదగ్గరకు వచ్చాడు: "మీకు అభినందనాలు చెప్పిపోదామని వచ్చాను సుఖదాదేవిగారూ!" అన్నాడు.

కరచాలనంకోసం అతడు చాచిన చేతిని నేను అంది పుచ్చుకోలేదు. మామూలుగా చేతులు జోడించి నమస్కారం చేశాను.

"కూర్చోండి - నిల్చున్నారేం ? మీరు నిల్చునిఉండగా నేను—పోనీలెండి, నేను కూర్చుంటాను. తమరు—ఓ... క్షమించండి ! మీరెవరో నాకు పరిచయం లేదే !" అన్నాడు.

"మావారే" అన్నాను నేను.

"అలాగా ! అలాగా ! ఓహో ! క్షమించాలి. సభ జయప్రదంగా సాగిందిటగా ! ప్రభాత్ చెప్పాడు. మీ ఉపన్యాసం చాల గొప్పగా ఉందన్నాడు-Congratulations! It was really Grand! అద్భుతంగా ఉందిట ! మీకు నా అభినందనాలు ! ఇక పోతే... మూడువందల రూపాయలు ఇచ్చారుకదూ ! అందుకుకూడా ధన్యవాదాలు అర్పిస్తున్నాను. తరువాత రెండు వేల రూపాయలుకూడా పంపించారెందుకూ ! (మావారివైపు తిరిగి) ఈ విషయంలో మీ ఆవిడగారి మాట లెందుకు పాటించారండి మీరు ? ఎబ్బే, అలా చెయ్యకూడదండి. స్త్రీలకు భావుకత్వం, ఆవేశం ఎక్కువగా ఉంటాయి. ఇంటికైన మగవాడుమాత్రం దుబారాగా ఉండకూడదు; కొంచెం బిగువుగానే ఉండాలి. నగలు ఆవిడగారివే అనుకోండి, నాకు తెలుసా సంగతి, కాని అవి కుటుంబానికి చెందిన సొత్తు. వాటిని ఏ గొయ్యిలోనో విసరిపారేసే అధికారం ఆమెకూ లేదు. ఇటువంటి వ్యవహారం ఏమీ బాగులేదని మీకు తెలియజెప్పటానికే వచ్చాను. మాకే డబ్బు కావల్సివస్తే లక్షాధికార్లు, కోటీశ్వరులు చాలమందే ఉన్నారు... రూపాయలు కుప్పలు పోసుకు కూర్చుని లక్ష్మీపూజలు చేస్తున్న వాళ్ళు. వాళ్ళంతా మాకోసమే ధనం ఆర్జించి పెంపు చేస్తూ ఉంటారు. వాళ్ళందర్నీ మేం విడిచిపెడతామా-యేం ? దేవుడు, దయ్యం, ధర్మం అంటూ చేతులు ముడిచిపెట్టుకుని కూర్చునేవాళ్ళం కాదు మేం. ఇతర్లకు సహాయం చెయ్యటమే మా ధర్మం. అందుకోసమే మాదగ్గర అస్త్రాలు, శస్త్రాలు ఉంటూ ఉంటాయి. అదిగో ఆ దోవ మాకు ఉన్నంత

కాలం విచారం ఏముంది ? కొదవ ఏముంది ? "ఈ డబ్బు ఎక్కడిది" అని అడిగాను హరీశ్‌ను. మీ పేరు చెప్పాడు. అప్పుడు అనుకున్నాను : ఆడవాళ్ళు వట్టి ఆవేశపరులూ అని. వెంటనే హరీశ్‌కు చెప్పేశాను : 'ఈ డబ్బు మనం పుచ్చుకో కూడదు' అని. బాహుబలంమీద ఆధారపడవలసినవాళ్లు ఇంకొకళ్ళను యాచించవలసిన పనేముంది ? తలవంపుల పని ! కాని హరీశ్ స్వభావం వేరు లెండి. ఏమైనా నాదే సరైన మాట. లూటీ చెయ్యటం తప్పు అంటాడు హరీశ్. ఒకని ముందు తలవంచి యాచించటమే తప్పు అంటాను నేను. ధన స్వాముల దగ్గర అంతంత డబ్బు ఎలా వచ్చిందని ? నిజంగా ఆలోచిస్తే... పెకి శిష్టజనులుగా కనిపిస్తూ అసలు లూటీలు చేస్తున్నది వాళ్ళే. లూటీలు కాకపోతే దొంగతనాలు; దొంగ తనం కాకపోతే ఏదో తుచ్ఛవృత్తి. మొత్తంమీద ఏ రూపంలో నైనాసరే ప్రజల రక్తాన్ని పీల్చటమే వాళ్ళ వృత్తి. కాబట్టి సుఖదా దేవిగారూ ! మమ్మల్ని అనవసరంగా తప్పుడు మార్గంలో పెట్టకండి. ఇవిగో ! మీ రెండు వేల రూపాయలూ మీరు తీసుకోండి" అంటూ రూపాయలసంచీ నాకు అందించ బోయాడు.

"నేనేమీ డబ్బుకోసం మిమ్మల్ని అడగలేదే !" అన్నాను.

లాల్‌బాబు పకపకా నవ్వాడు. "I understand ! I understand ! అదేకదూ గృహస్థధర్మం అంటేను !

ఇంటి యజమానులవారికే ఇవ్వమంటారన్న మాట! (మా వారివైపు తిరిగి) ఇదిగోనండి, డబ్బు మీరే పుచ్చుకోండి."

మావారు ఇప్పుడు పెదవులు విప్పారు. "నా చేతి మీదుగా మీకు నేనేమీ డబ్బు ఇవ్వలేదే!"

"ఓహో! That is grand! మీకు డబ్బు అంత పనికిమాలిన వస్తువుగా కనిపిస్తున్నదా ఏమిటి! కాదు కాదు. అది పనికిమాలిన వస్తువు కాదు సుమండీ! తీసుకోండి; దాచి పెట్టుకోండి."

లాల్‌బాబు చాచిన చేతుల్లోనుంచి రూపాయల సంచీ తీసుకోటానికి మావారు ఎట్టి ప్రయత్నమూ చేయలేదు.

లాల్‌బాబు నవ్వుతూ నావైపు తిరిగాడు. "సుఖదా దేవిగారూ! నన్ను భలే ఇబ్బందిలో పెట్టారే! కాస్త నా బాధ తొలగించుదురూ, మీకు పుణ్యం ఉంటుంది. దయచేసి మీవారితో చెప్పండి: డబ్బు పుచ్చుకోమని."

నాకూ నవ్వొచ్చింది. "తీసుకోండి పోనీ! తీసుకోరేం?" అన్నాను మావారితో.

మావారు ఏమాత్రమూ చలించలేదు. "నా చేతి మీదుగా నేను ఈయనకు ఎప్పుడూ డబ్బు ఇవ్వలేదు."

లాల్‌బాబు వినమ్రుడైపోయాడు. "న్యాయం ఆలోచించండి సుఖదా దేవిగారూ! అమాయకుడిని, నాకు లేనిపోని అపరాధం అంటగట్టకండి."

నేను నవ్వాను. "ఇందులో అపరాధం ఏముందనీ ?"

"మీలో ఎవరుగాని ఈ పైకం తిరిగి పుచ్చుకోకపోతే అపరాధం నా తలకే చుట్టుకుంటుంది. డబ్బు నే నెలా నాశనం చేస్తానో మీకు తెలీదు కాబోలు ! ఇష్టంవచ్చినట్టు డబ్బు పాడుచేసేవాడికే డబ్బుమీద ఆపేక్ష ఎక్కువగా ఉంటుంది. అపేక్షేగాని నాకు డబ్బుమీద ఆశలేదు సుమండీ ! ఈ డబ్బు నాదగ్గరే ఉంటే మూడునిమిషాల్లో అంతా క్షవరం ఐపోతుంది. అందుకనే చెబుతున్నాను : దయవుంచి మీ డబ్బు మీరు తీసుకుని నన్ను ఉద్ధరించండీ అని.

"అయితే ఇలాతే, నాకు ఇచ్చెయ్యి" అన్నాను చెయి చాచి.

ఏకవచనం ఎలా ఉపయోగించానో, ఎందుకు ఉపయోగించానో నాకే తెలియదు. మాట అనేశాక పస్తాయించాను. లాల్‌బాబు క్షణమాత్రం నా ముఖంలోకి చూచాడు. "తమకే ఇవ్వమంటారా?" అన్నాడు. మళ్ళీ మా వారివైపుతిరిగి "ఏమండీ ! మీ ఆడవారికి ఇవ్వమన్నారా ? లేదా, మీరు—" అన్నాడు.

అప్పుడు మావారు "సరే, ఇలా తెండి" అంటూ చెయి చాచారు.

"That is correct" (అదీ, అలా ధార్లోకి రండి మరి) అంటూ లాల్‌బాబు రూపాయలసంచీ మావారి చేతిలో పెట్టాడు. "లెక్క బెట్టుకోండి" అన్నాడు. మళ్ళీ ఏవ

నావైపు తిరిగి "క్షమించండి. ఎవరికి ఇస్తేనేం? ఇద్దరూ ఒకటే కదా—అని నా ఉద్దేశం" అన్నాడు.

నేను మందహాసం చేశాను. "ఒకటే ఎలాగౌతుంది ? మగవాళ్ళు మగవాళ్ళమీదే పక్షపాతం చూపిస్తారు."

"చూపించకపోతే ఎలా మరి !" అంటూ లాల్‌బాబు కూడా మందహాసం చేశాడు. వెంటనే మావారివైపు తిరిగి "లెక్కబెట్టుకున్నారా ? సరిగా ఉన్నాయా ?" అని అడిగాడు.

మావారు లెక్కపెట్టుకోటం అయింది. సరిగ్గానే ఉన్నాయి. జేబులో పెట్టేసుకున్నారు. ఏమీ మాటాడలేదు.

"అమ్మయ్య ! ఇక నేను వెళ్ళిపోతాను. మీకు అభినందనాలు తెల్పిపోదామనే వచ్చాను. ఇంకా చాల చోట్ల నుంచి కూడా రిపోర్టులు విన్నాను : మీ ఉపన్యాసం— It Was really grand. ఏ పనిచేసినా అనుమానిస్తూ, జంకుతూ చెయ్యటం నాకు బాగుండదు. దూరదూరంగా, దాగిదాగి ఉండటం విప్లవకారులకు తగని పని. ప్రజాబాహుళ్యంలో కలిసిపోవాలి. ప్రజలతో సాన్నిహిత్యం లభించగల అవకాశాన్ని జారవిడుచుకోరాదు. చాటుగా చేతులు ముడిచిపెట్టుకుని కూర్చోటం మంచిదికాదు. ఈ అభిప్రాయంతో ఏకీభవించనివారు సమితిలో కొందరు లేకపోలేదు. ఏమైనా నేను చెప్పేది ఏమంటే—సిద్ధాంతాలూ, ఆదర్శాలూ అంత ఎత్తున దూరంగా ఉండాల్సిందే. కాని మనం మాత్రం దూరంగా ఉండకూడదు. ప్రజలతో సాన్నిహిత్యం - అన్ని

రకాల, అన్ని తరగతుల ప్రజలతోనూ సాన్నిహిత్యం - అదీ నా లక్ష్యం. అప్పుడే మన కార్యక్రమం ఫలిస్తుంది. మనిషికి వికాసం వస్తుంది. లేకపోతే మన కార్యక్రమం అంతా నిష్ప్రయోజనమై ఊరుకుంటుంది. ఎక్కడ చూచినా వర్గభేదాలు, నీతిభేదాలు, మతభేదాలున్నా. మీరు అవన్నీ ఏమీ పాటించకండి; సరా సరి ఎక్కడికిపడితే అక్కడికి వెళ్ళిపోండి...అగ్రజులు, అంత్యజులు, ఉచ్చస్థులు, నీచ స్థులు...అందరిదగ్గరికీని...(మావారి వైపు తిరిగి) మీరు నా మాటలకు సంతోషిస్తున్నట్టు లేదేమండీ! నేనేమన్నా పొరపాటు మాట పలికానా? సుఖదాదేవిగారు మీకు భార్య. అయినా మీ సమక్షంలోనే చెబుతున్నాను; ఈవిడగారు ఇంటిపనులు నిర్వహిస్తున్నట్టుగానే బైట దేశకార్యాలూ నిర్వహించాలి. మేమంతా దేశానికే చెందిన వ్యక్తులం— చిత్తం ఇక నేను వెళ్ళిపోవాలి. సెలవండీ దేవిగారూ! మహాశయా!—"

మావారు హఠాత్తుగా ఇలా అన్నారు అతనితో: "నేను ఒక్క ప్రశ్న అడగవచ్చా మిమ్మల్ని? మీ బ్రతుకు తెరువుకు ఆధారం ఏమిటి?"

లాల్‌బాబు మందహాసం చేశాడు. "మీకు నా ధన్యవాదాలు! మీరు అడిగింది సబబైన ప్రశ్న అయినా కాకపోయినా, జవాబుమాత్రం సబబైంది చెప్పలేను నేను. నా బ్రతుకు తెరువుకు ఆధారం—డబ్బు. మనందరికీ అదే ఆధారం పట్నాల్లో మనం ఎవరమూ కాయకష్టంచేసి బ్రతకటంలేదు.

రైనా డబ్బు దొరుకుతుందన్న ఆశతోనే కాయకష్టం చేస్తారు. అంతేగాని కష్టంచెయ్యాలన్న ఉత్సాహం ఎవరికీ ఉండదు. ఇక పోతే...మహాశయా! నిజం చెప్పాలంటే – డబ్బు అనేది అన్నివైపులనుంచీ వస్తుంది నాకు. మురికి కాలువలోనించి వచ్చినా...మురికికాలువ దుర్వాసన కొడుతుందిగాని, డబ్బులో దుర్వాసన ఎందుకుంటుందీ ? అందువల్ల డబ్బు అనేది ఏ ప్రదేశంనుంచి వచ్చినాసరే స్వీకరించటమే మన పద్ధతి. కాబట్టి బ్రతుకు ఎలా గడుస్తుందీ అన్న ప్రశ్నే ఉదయించదు మనకు. మహోల్లాసంగా, మహానందంగా ఉంటాను ఎప్పుడూ. డబ్బు లేదన్న భయంగాని, డబ్బుకోసం ప్రయత్నించటం, ఆయాసపడటంగాని మనం ఎరగం అసలు. డబ్బు దాని యిష్టప్రకారం ఇటునించి అటు ప్రవహిస్తూ ఉంటుంది. మనం ఎప్పుడూ ఆ ప్రవాహం మధ్యలోనే ఉంటాంగా! ఒడ్డునకూడా ఉండం. ఇప్పుడు నేను చెప్పింది మీకు బాగా అర్థం అయిందనుకుంటాను. ఏం ?"

"తమరు ఏం చేస్తూ ఉంటారు ?" గంభీరంగా మరో ప్రశ్న అడిగారు మావారు.

"అబ్బ! నన్ను మీరు విడిచిపెట్టేట్టు లేరే! ఏం చేస్తుంటానా ? చెప్పానుకదూ : మహోల్లాసంగా ఉంటూంటూ నసీ. అదేం కాస్తాకూస్తా పని అంటారా ? సరే, సుఖదగారూ! Good bye! మహాశయా !' నమస్కారం !"

తలవంచి నవ్వుతూ, నావైపు చూచుకుంటూ అతడు వెళ్ళిపోయాడు. బైట మోటారుకారు స్టార్టు చేసిన శబ్దం స్పష్టంగా వినిపించింది.

# 18

లాల్‌బాబు వెళ్ళిపోయాక ఒకరకమైన శూన్య వాతావరణం ఏర్పడింది. చాలసేపు మావారూ మాటాడలేదు; నేనూ ఏమీ పలకరించలేదు. వారు అతడు వెళ్ళిన వీధిగుమ్మంకేసే చూస్తూ కూర్చున్నారు. నేనూ అలే చూస్తూ ఉండిపోయాను. కొంతసేపటికి నేను లేచాను. వారిదగ్గరనుంచి డబ్బు అడిగి తీసుకుపోయి భద్రంగా దాచిపెట్టి వద్దామని నా ఆలోచన. ఇంతలో వారు అన్నారు: "వట్టి ధూర్తుడు!"

ఆ మాట వినీవినకుండా నేను "డబ్బు ఇలా ఇవ్వండి, పెట్టెలో పెట్టివస్తా" అన్నాను.

వారు నావైపే చూడకుండా "సుఖదా!—" అన్నారు.

"డబ్బు ఇలా ఇవ్వండి. లోపల పెడతాను."

ఆయన ఇంకా అటు గుమ్మంకేసే చూస్తున్నారు. "ఈ మనిషి హరీశ్‌కు పరమ శత్రువు సుమా!"

"ఆ మాటలు మనకెందుకులెండి, లేవండి, లోపలికి పోదాం."

వారు లేవలేదు, ముఖం తిప్పి నావైపు చూచారు. "హరీశ్‌కు ఈ మనిషిమీద ఉన్న నమ్మకాన్ని మనం తొలగించాలి. అతనికి వీడు తగిన అనుచరుడు కాదు."

నాకు మాత్రం అటువంటి అనుమానానికి కారణం కనిపించలేదు. నవ్వాను. "లేవండీ, ఆ ప్రసంగం వదిలెయ్యండి, పోదాం రండి."

"సుఖదా ! నీకు నవ్వులుగా ఉందా ?"

"మీరు లేచి లోపలికి రండి; చెబుతున్నాను, మీరు అలా ఈర్ష్య పడటానికి కారణం ఏమీ లేదు."

స్తబ్ధచిత్తులై మావారు నా ముఖంలోకి చూస్తూ ఉండిపోయారు. చాలసేపు అలాగే చూస్తూ ఉన్నారు. నేనేమీ మాటాడలేకపోయాను. చివరకు ప్రయత్నపూర్వకంగా అన్నాను: "ఇక మీరిక్కడినుంచి లేవండీ – లోపలికి పోదాం పదండీ."

మావారు నోట్లసంచీ నాముందుకు తోశారు. ఏమీ మాటాడలేదు.

"మీరుకూడా లోపలికి రారా ?"

"తీసుకుపో !" నోట్లసంచీ చూపిస్తూ చాల దూకుడుగా అన్నారు.

ఆ మాటలోని తీక్షణతకు నేను అనుమానిస్తూ నిలబడిపోయాను.

"తీసుకుపోవేం ? ఊఁ" అంటూ నోట్లసంచీ ఎత్తి నా వైపుకు విసిరివేశారు. అది నాకు తగల్లేదు. విసురుగా నేలమీద పడి చప్పుడైంది. నేను దాన్ని ఇక ముట్టుకోలేదు. లోపలిగదిలోకి వెళ్ళిపోయాను.

మరికాసేపటికి లాల్‌బాబు తిరిగి వచ్చినట్టు తెలిసింది. నేను లోపలగదిలో పడకకుర్చీమీద వెల్లకిలా పడుకుని ఉన్నాను. టకటక బూట్ల చప్పుడు వినిపించింది. "సుఖదాదేవిగారూ ! వదినెగారూ !" అంటూ పిలుపుకూడా వినిపించింది.

"అరె, ఏరీ! ఆవిడగారు ఏరీ!" అన్న మాటలు కూడా నాకు లోపలికి వినిపించాయి.

"ఆ నోట్లు అక్కడ పారేసి ఆమె లోపలికి వెళ్ళింది" మావారు సమాధానం చెప్పారు మెల్లిగా, అలసిపోయిన కంఠస్వరాన.

"లోపలికా?" అంటూనే లాల్‌బాబు పరదా తొలగించి లోపలిగదిలోకి రానేవచ్చాడు "వదినగారూ! వదిన గారూ! ఓ వదినగారూ!" అనుకుంటూ.

వెంటనే నే నెక్కడ ఉన్నదీ అతనికి కనిపించలేదు. నేను ఉన్న కుర్చీ దాటేసుకుని అవతల మూలదాకా వెళ్ళాడు. అప్పుడు నేనే పలుకరించాను. "ఏమిటీ? ఎందుకూ?" అని.

"ఓహో! మీరు ఇక్కడే ఉన్నారా? మీతో ఒక చిన్న పని వచ్చింది. (దగ్గరకు సమీపించి) అక్కడికి మీరు ఎప్పుడు వస్తారూ?"

"ఎక్కడికీ?"

"అక్కడికే, విలాసభవనానికి. చక్కగా లేదూ పేరు? మీకింకా తెలియదేమో! ఆ చోటు ఇప్పుడు విలాసభవనంగా తయారైంది. సార్థకనామధేయంలే. ఎల్లుండి ఒక చిన్న సమావేశం ఏర్పాటు చేస్తున్నాం, నాలుగు గంటలకు. అత్యావసరమైన సమావేశం. మీరూ రావాలి. ముందుగానే రావాలి. లేకపోతే నేనే వచ్చి తీసుకువెడతాను. తయారుగా ఉండండి—మూఢుగం టలకల్లా...అలా చూస్తారేమిటి?

మీరు రాకుండా ఉండటానికి వీల్లేదు. నేను వస్తాను తీసుకు పోడానికి. ఇక ఇప్పుడు చెప్పండి: డబ్బు అలా కింద పారేసి ఉందేం? అంత పనికిమాలిన వస్తువెందా? ఊఁ, లేవండి, రండి; వచ్చి పైకం తీసి జాగ్రత్త చేసుకోండి" అంటూ నిజంగానే నా చెయ్యి పట్టుకున్నాడు. బైటికి లాక్కుపోవటానికి ఉద్యుక్తుడైనాడు.

తన గొడవేమో తనదేగాని ఇతర్లకు ఏమాత్రం అవకాశంకూడా ఇవ్వని అతని స్వభావం, ప్రవర్తన చాల విలక్షణంగా కనిపించాయి. "ఏం పని అది? దూరంగా ఉండండి" అన్నాను గుసగుసగా.

అతడు చిరునవ్వు నవ్వి చెయ్యి వదిలాడు. కాని ఒకచేత్తో నా గడ్డం పుచ్చుకుని ముఖం పైకి ఎత్తి "ఏం కథ? కోపం వచ్చిందా?" అన్నాడు.

"మీరు వెళ్ళిపోండి—"

"ఆ డబ్బు తీసుకునే వెళ్ళిపోనా?"

"వెళ్ళిపోండి ఇక్కడినించి."

"మిమ్మల్ని విడిచిపెట్టి రూపాయలుమాత్రమే తీసుకుని నేను పోలేను. రండి, సంధిచేసి పోతాను."

అంటూ మళ్ళీ నా చెయి పుచ్చుకుని రెండు అంగల్లో గడపదగ్గర పరదాదాకా తీసుకువచ్చాడు. పెనగులాడే అవకాశంకూడా నాకు లేకపోయింది. అప్పుడు చెయి విడిచిపెట్టాడు. తాను ముందుకు పోయి మావారితో "అదిగో

నండి, ఆవిడగారిని తీసుకువచ్చాను. ఇక మీరు కోపం మానేయండి" అన్నాడు.

గడపదాకా వచ్చినదాన్ని తిరిగి ఎలా వెళ్ళిపోయేదీ! "మీరు నన్ను పిల్చారా ?" అడిగాను మావారిని.

"నేనా? లేదే !"

"చెప్పండి ఎందుకు పిల్చారో !"

"నేనేం పిలవలేదు. వీరే నీకోసం ఏదో మాట్లాడ్డానికి వచ్చారు. (లాల్‌తో) ఊఁ, కానీయండి, మీరు వచ్చిన పని అయిపోయిందా ?"

"చిత్తం. ఎల్లుండి మూడుగంటలకు వదినెగారిని తీసుకుపోవటానికి నేను వస్తాను. ఆ సంగతే చెప్పిపోదామని వచ్చాను. ఒక సమావేశంలో వారు పాల్గొనాల్సి ఉంది."

"ఏ సమావేశంలోనూ ఆమె పాల్గొనవక్కర్లేదు" అన్నారు మావారు స్థిరమైన కంఠస్వరంతో.

లాల్‌బాబు విచికిత్సలో పడ్డాడు. తల గోక్కుంటూ నావైపు తిరిగాడు. "చూచారా ! మీరేమంటారు మరి ?"

"సమావేశం మీరు కానిచ్చుకోండి. నన్ను వదిలెయ్యండి" అన్నాను.

"సమావేశం నా సొంతం ఏమీ కాదు. మిమ్మల్ని వదిలెయ్యటానికి నే నెవరిని ? అయినా ఆలోచించుకోండి..."

మావారు మళ్ళీ కల్పించుకుని చాల గంభీరంగా "లాల్ బాబూ! నేను చెప్పేది వినండి: ఆమె సమావేశానికి రాదు. తమరు ప్రయాసపడి రానూ అక్కర్లేదు" అన్నారు.

లాల్ బాబు నవ్వాడు. "ఇప్పుడైతే రానే వచ్చానుగా! కూర్చుంటాను కూడాను. వదినగారూ! మీరు కూర్చోండి. ముందు నేలమీదనుంచి ఆ నోట్ల సంచీ తీయండి."

నేను వంగి నోట్ల సంచీ చేతిలోకి తీసుకున్నాను. వచ్చి ఒక కుర్చీలో కూర్చున్నాను. "నేను సమావేశానికి ఎక్కడ వెడుతున్నాననీ మీరంత కోపం తెచ్చుకుంటున్నారు?" అన్నాను మావారివైపు తిరిగి.

"అదేమిటి? మీరు వస్తారుగా!" అన్నాడు లాల్ బాబు.

"ఆమె రాదు" అన్నారు మావారు.

"నేను రాను" అన్నాను నేనున్నూ.

"వినిపిస్తున్నదా మీకు? ఆమె రాదు" అన్నారు మళ్ళీ మావారు.

అప్పుడు లాల్ బాబు నావైపు తిరిగి ఇక ధోరణి ఆరంభించాడు:

"రావటం రాకపోవటం మీ యిష్టం. కాని నే నిక్కడ ముఖ్యమైన మాటలు నాలుగు చెప్పాలి. స్త్రీలవల్ల చాలానే

ఉపయోగం ఉందని హరీశ్ గుర్తించాడు; కాని వారితో పరామర్శ పనికిరాదంటాడు. నేనుమాత్రం వారివల్ల ఉపయోగమే కాదు, వారితో సహయోగంకూడా పొందాలి అంటాను. పరాక్రమం పురుషుల హక్కు అనీ, సౌశీల్యం స్త్రీల సొత్తు అనీ ఒక పొరపాటు అభిప్రాయం మనలో ప్రచలితమైఉంది. తదనుగుణంగా 'రొమాన్సు' ఉత్పన్న మౌతుందీ అనుకుంటున్నాం. ఒక రకంగా ఆ పద్ధతిమీదే సాగిపోతున్నాం. వ్యక్తివాదం పెరుగుతున్నట్టుగా సామాజిక వాదం పెరగటంలేదు. అందుచేతే మనం ఆ పద్ధతిని విడిచి పెట్టాలని నా పట్టుదల. ఎవరైనా స్వేచ్ఛగా ముందుకు రావాలి. సమాజం ఆధారంగా సాగిపోతూ ఉండాలి. హరీశ బాబును పట్టి అప్పగిస్తే బహుమానం ఇస్తామని ప్రకటించారు. పరాక్రమమే ప్రధానంగా పెట్టుకుంటే చివరకు బలియై పోవలసివస్తుంది; అంతేగాని సామాజికతత్వం సిద్ధించదు. మన నీతికీ, నడవడికీ సామాజికవాదం పునాదిగా ఉండాలి... ఇదంతా నేనేం చెబుతున్నానో నాకే తెలియటం లేదు. అయినా ఇటువంటి మాటల ఆవశ్యకతా లేదిక్కడ. ఇంతకూ మన ఉద్యమాన్ని ఒక సాంక్రామికమైన 'రొమాన్సు' ఆధారంగా ఎక్కువకాలం నడపలేము. దానికి సార్వజనికమైన ఆధారాన్ని చేకూర్చాలి. స్త్రీలూ, పురుషులూ విడివిడిగా పరుగులు పెడితే లాభంలేదు. స్త్రీ పురుషవిచక్షణ పాటించని పారివారికమైన ఆధారాన్ని మన ఉద్యమానికి చేకూర్చాలి. అందుకనే చెప్పాను: మీరు సమావేశానికి రావాలి అని. వింటున్నారా వదినగారూ! నేను మిమ్మల్ని 'వదినగారూ'

అని పిలవటం సంప్రదాయ విరుద్ధమైనంతమాత్రాన మీరు నా మాట త్రోసివేయరని నా నమ్మిక. ఇల్లంటే జైలు కాదు. బైట ఉన్న విశాల ప్రపంచంలోకి సాగిపోటానికి అదొక ద్వారం—

అంటూ ఇలా చాలసేపు ఏదేదో చెప్పుకు పోయాడు. నాకు సరిగా ఏమీ అర్థం కాలేదు. ఉండిఉండి మావారు మధ్యలో ఇలా అడ్డుప్రశ్న వేశారు : "ఈ విషయంలో మీరు హరీశబాబు ఆదేశం ఏమిటో తెలుసుకున్నారా ?"

"తెలుసుకోవలసిన అవసరంలేదు."

"అవసరముంది. బహుశా నాకూ హరీశ్ కూ గల సంబంధం మీకు తెలియదనుకుంటాను."

"బహుశా తెలుసును."

"హరీశబాబు మీపై ఉంచిన నమ్మకాన్ని దుర్వినియోగం చేస్తున్నారు మీరు. విశ్వాసఘాతకులు !"

"క్షమించండి. మీరు నన్ను ఎరగరు. ప్రపంచం మారుతున్న సంగతి గమనించండి. వ్యక్తి కాదు ప్రధానం ఇప్పుడు; సమాజం. వ్యక్తి గుణాలతో పనిలేదు; సామాజిక ధర్మాలే కావాలి. కాబట్టి మీ ధర్మాలు, నీతులు నిర్జీవాలు. సామాజికే శక్తిమంతమైంది. అదే రాజనీతి ఔతుంది."

"లాల్‌బాబూ ! మీరిక వెళ్ళిపోండి. నేను సమావేశానికి రాను" అన్నాను నేను.

"ఇక మీయిష్టం. నోట్లు ఇంకా నేలమీదనే లేవుగా! తీశారు కదూ! మంచిది. నమస్కారం!" అంటూ లాల్ బాబు వెళ్ళిపోయాడు.

డబ్బు నేను మావారి చేతికి అందిస్తూ "మీరు అతన్ని 'ధూర్తుడు' అన్నారు. ధూర్తలక్షణాలు అతనిలో మీకు కని పించి ఆ మాట అన్నారా? లేక నేను కారణంగా అతన్ని ధూర్తుడిని చేశార్థా?" అన్నాను.

మావారు డబ్బు నాచేతిలోనుంచి అందుకున్నారు. "నేను కారణంగా నువు సమావేశానికి వెళ్ళవా యేం?"

"మీకు ఇష్టంలేకపోతే వెళ్ళను."

"నాకుమాత్రం ఇష్టంలేదు. కాని నువు మాటిమాటికీ 'మీకు ఇష్టంలేకపోతే వెళ్ళను' అంటావు. నా కదేమీ బాగుండలేదు."

"నాకు వెళ్ళటం ఇష్టమేనని మీరు అనుకుంటు న్నారా? లాల్ బాబు అంటే నాకు యిష్టం కాబట్టి వెళ్ళా లనుకుంటున్నాననా మీ ఉద్దేశం? అతన్ని ఇక్కడికి మళ్ళీ రావద్దని మీరు బాగానే చెప్పారులెండి. మళ్ళీ అతని ముఖం కూడా చూడను. నేనంటే ఎవరనుకున్నాడో ఏమిటో!"

మావారు విచారభావ సూచకంగా "ఏం? అలా అంటున్నావేమిటి సుఖదా? అతడేమన్నా అమర్యాదగా ప్రవ ర్తించాడా?"

"ప్రవర్తించలేదా మరి? నన్ను వదినా అని పిలవ

టానికి తాను ఎవరనీ ? మీరు అడ్డగించలేదా యేమిటి ? ఏకాయెకి లోపలికే తోసుకుని వచ్చేశాడే! నేనప్పుడు ఏ పరిస్థితిలో ఎలా ఉంటానో అన్నైనా మీకు స్ఫురించలేదా?"

"అయితే నువ్వు..."

"లేదనుకోండి. కాని మీరు ఇక్కడ ఉండగానే 'వదినా, వదినా' అని అరుచుకుంటూ గబగబా లోపలికి వచ్చేస్తాడా? అది మర్యాదేనా? మీరేమో చూస్తూ ఊరుకుంటారూ ?"

"నాకు తెలీలేదు..."

"ఏం తెలీలేదు ?"

"మరి – మరి..."

"మరి...? నే నతనికి అటువంటి చనువు, అధికారం ఇవ్వలేదని మీకు తెలీదా ? ఇటువంటి అధికారాలన్నీ అతనికి ఉన్నాయనేనా మీ రనుకున్నారు? చెప్పండి – మాటాడరేం?"

"సుఖదా !" చింతాసూచకంగా నా ముఖంలోకి చూస్తూ ఉండిపోయారు.

"మీరు నా భర్త. కాని నన్ను రక్షించుకో లేరన్న మాట ! అంతేనా ? కోపగించుకుని నన్ను వెళ్ళగొట్టేస్తారన్న మాట ! ఎవరన్నా ధూర్తుడు వచ్చి ఏమన్నా — అంతేకదూ?"

వారు ఆశ్చర్యంగా నా ముఖంలోకి చూచారు. "అదేమిటి సుఖదా! అలా అయిపోతున్నా వేమిటి ?"

ఎలా అయిపోతున్నానో నాకే తెలియలేదు. అన్నాను: "అతడు ఈ డబ్బును మనకు సదుద్దేశంతో తిరిగి ఇవ్వటంలేదని మీ రన్నమాట నిజమే. అదేగా మీ రనేదికూడా."

"అతడు హరీశ్‌నూ, మనల్నీ క్షుద్రులకింద కట్టేస్తున్నాడు. పైగా..."

"చెప్పండి—ఆగిపోయారేం ? ఊఁ, పైగా...?"

—"

"చెప్పదలచిన మాట చెప్పరేం ? చెప్పండీ. పైగా... ఏమిటీ ?"

"ఏమీ లేదులే. అతడు మంచివాడుమాత్రం కాదు."

"నేను అనేదీ అదే. మంచివాడు కానేకాదు. మళ్ళీ ఈ యింట్లో అడుగుపెట్టాడంటే చూడండి! విన్నారా! అతను ఈ యింటికి రానేకూడదు ఇంకెప్పుడూ. ధనవంతుడైతే తన యింట్లోనే కులకమనండి."

మావారు ఆశ్చర్యపోయారు. "ధనవంతుడా ? ఎవరు చెప్పారు నీకు ?"

"సింగారం ! ఆడంబరం ! తిరిగటానికి ఒక మోటారు ! ధనవంతుడైతే ఔతాడు. ఇక్కడెందుకూ తన ప్రతాపం చూపించటం వచ్చి ?"

"అతడు ధనవంతుడేమీ కాదు సుఖదా ! అతన్ని గురించి ఎవరికీ ఏమీ తెలియదు."

"మరెందుకూ అతని ప్రసంగం ఇంకా మనకు ? అతని పేరుకూడా ఎత్తబోకండి...రూపాయలు బ్యాంకులో మళ్ళీ ఇవ్వబోకండి. ఇస్తే హరీశ్ బాబు చేతికి స్వయంగా ఇవ్వండి. అంతేగాని మనం ఉంచుకోవద్దు. వెదజల్లిపారేద్దాం."

"ఈ డబ్బు బ్యాంకులో తెచ్చాను మరి ! నగలు తాకట్టుపెట్టి. వాటిని విడిపించుకోవద్దూ ?"

"నాకేమీ అక్కర్లేదు నగలు. అమ్మిపారేయండి. లేకపోతే ఎందుకూ, ఈ డబ్బుతో వినోద్ నైనిటాల్‌లో రెండు సంవత్సరాలు చదువుకోవచ్చు."

"నైనిటాల్లోనా !"

వారి కంఠస్వరంలో అనుమానం, ఆశ్చర్యం కనిపించాయి. నేను ఇంకా గాయపడ్డాను. "నైనిటాల్‌లో గొప్ప గొప్పవాళ్ళ పిల్లలు చదువుకుంటూ ఉంటారు, మనం అంత గొప్పవాళ్ళం కాదు అనేగా మీ అనుమానం ? కాని కుర్ర వాళ్ళు కుర్రవాళ్ళే. ఉత్తమమైన శిక్షణ పొందటానికి వాళ్ళకు హక్కు ఉంది. మీ స్థితిని గురించి ఆలోచించుకుంటూ మీరు కూర్చుంటే ఏం లాభం ? ఈ ప్రపంచంలో నాకేం స్థితి ఉందీ? కూలిపనైనా చేస్తాను. ఏదో చేస్తాను. పిల్లల్నిమాత్రం ఉచ్చ స్థితికి తీసుకురాకుండా ఉండలేను...మీరు రాత్రిళ్ళు ఇంకేదో పని చూచుకుంటానన్నారే ! ఏమైందది ?"

"నువు ఒప్పుకోలేదుగా ! వద్దన్నావుగా !"

ఆ సమయంలో నా భావాలు ఏ దారిలో పరిగెడుతున్నాయో నాకే సరిగా తెలియ లేదు. కిలకిలా నవ్వాను.

"ఔనౌను. నేను ఒప్పుకోను. కాని నే నేదైనా కూలిపని చెయ్యటానికి మీారైనా ఒప్పుకోండి."

నేను వారివైపు కొంచెం తీక్షణంగా చూస్తూ ఇంకా ఇలా అన్నాను: "చూడండి! డబ్బు ఎలాగో కూడబెట్టాల్సిందే మనం! వినోద్ నైనిటాల్‌లో గొప్పవారి బిడ్డలా చదువుకు ఉండిపోవల్సిందే; వాడికి ఏ లోటూ కలగకూడదు. నగలు తాకట్టు విడిపిస్తానంటిరే, అటువంటి పని మాత్రం చెయ్యకండి. పూర్తిగా అమ్మి పారెయ్యండి; రెండు సంవత్సరాలవరకూ మళ్లీ మనకు ఇబ్బంది లేకుండా పోతుంది."

"కాని మరి..." ఏమో చెప్పబోయారు.

నేను ఆవేశంగా మధ్యలోనే అడ్డువచ్చి అన్నాను: "కాని లేదు, ఏమీలేదు లెండి. మీారేమీా చింతించకండి. ఏమన్నావస్తే నేను అనుభవిస్తాలెండి."

ఆ క్షణాన నా మనస్సు ఏమికోరుతోందో ఏమిటో నాకు సరిగా గ్రాహ్యం కాలేదు. బహుశా అందరిమీాదా విజయంపొందాలని ఆకాంక్షిస్తున్నానేమో! ఇటువంటి విజయకాంక్ష ఒకటి ఈ రీతిగా బహిర్గతం ఔతున్నదంటే నాలో ఎక్కడో ఓడిపోయిన దుగ్ధ ఉండి ఉండాలికదా! ఏమో మరి! నాకేమీా బోధపడటంలేదు. ఏదో ఒక ప్రచండమైన కర్తృత్వం మీాద వేసుకోవాలన్న సంకల్పం నా మనస్సునంతా ఊగించి వేయసాగింది. నా పరిస్థితుల్నీ, నియమాల్నీ, హద్దుల్నీ, ఆటంకాల్నీ అతిక్రమించి పైకి...పైపైకి ఎగిరిపోవాలనుకుంటున్నాను. నన్ను ఏదీ అడ్డగించలేదు. ఎవరూ వెనక్కు మరలించలేరు. నా

ప్రచండమైన సంకల్పం ముందు ఈ సమస్తమూ క్షుద్రంగా, శూన్యంగా, వివశంగా కనిపించసాగింది. ఆ సమయంలో మా వారు ఒక జడుడు, చకితుడు, అశక్తుడులా కనిపించారు. "ఏదీ, పైకం ఇలా తెండి" అన్నాను.

వారు సంచీ నా చేతికి అందించారు.

"నగలు అమ్మిపారేయండి."

"అలాగే."

"అబ్బాయిని నైనిటాల్‌లో చేర్చటానికి ముందు మీరు వెళ్ళి మాటాడి రండి...ఎప్పుడు వెడతారూ ?"

"ఇప్పుడు మరి..."

"ఇప్పుడు మరి 'సెషన్' లేదనుకోండి. పోనీ, మళ్ళీ సెషన్ ఆరంభం చేసినప్పుడు మన అబ్బాయిని చేర్చుకునేట్టు ఏర్పాటు చేసి రండి. లేకపోతే..."

"సరే..."

"సరే...ఏమిటి ? 'అలాగే వెడతా'నని చెప్పండీ !"

"అలాగే, వెడతాను."

"సరే - ఎల్లుండి సమావేశానికి—నేను వెళ్ళను. మా అమ్మగారింటికి వెడతాను. లేకపోతే మీరన్నా వెడుదురు గాని. వెళ్ళి మా అమ్మతో చెప్పిరండి: బిన్నూను నైనిటాల్‌కు పంపించేందుకు నిశ్చయం చేశాం అని. సొమ్ములు ఎప్పుడు అమ్మేస్తారూ ?"

ఆ సమయంలో నన్ను ఏమి ఆవేశించిందో నాకే తెలియదు. నా సమంతలో మావారు అక్కడ ఉండటం

నాకు దుస్సహంగా ఉందా? వారిని చూస్తోంటే నాలో ఏవేవో భావతరంగాలు ఉబికి ఉబికి వస్తున్నాయి. ఈ తరంగాల్లో వారిని ముంచేసి అక్కడనుంచి అదృశ్యులను చేయాలనా నా ఉద్దేశం? "నగలు అమ్మేస్తారుకదూ! ఇప్పుడే వెళ్ళి కనుక్కోరాదూ: ఎంత ధర వస్తుందో! ఆ బంగారంలోవే ఈ గాజులున్నాయి. ఇదిగో ఒక గాజు తీసుకుపోయి బజారులో చూపించి ధర ఎలా పలుకుతుందో కనుక్కు రండి. బ్యాంకులో నలభై తులాలుకదూ ఉంది బంగారం?"

మావారు అభ్యంతరం ఏమీ చెప్పలేదు. చెప్పి ఉండాల్సింది. ఆడదాన్ని ఆమె యిష్టం వచ్చినట్లు నడుచుకోనివ్వటం స్త్రీ తత్వం తెలియకనే. తన యిష్టం వచ్చినట్లు సాగించుకోవాలని కోరుకోటంకంటే... ప్రతి విషయంలోనూ మగవాడి అధికారికమైన అనుమతికోసమే ఆమె ఎక్కువగా వాంఛిస్తుంది. మగవాడి పెద్దరికం, ప్రభుత్వం ఆమెకు కావాలి. అటువంటి పెద్దరికాన్నీ, అధికారాన్నీ వదలివేసుకుని మగవాడు కేవలం ఆమె చెప్పినదానికెల్లా 'ఊఁ' కొడుతూ, అనుసరిస్తూ ఉండేట్లయితే ఆమె హృదయక్షోభకు అంతూపంతూ ఉండదు. మావారు అలాగే నా మాట కాదనకుండా విమూఢంగా నాకేసి చూస్తూ ఊరుకునేసరికి గాజు వారి ముందుకు విసిరేసి "బజారులో ఎవరైనా షరాబుకు చూపించి, బంగారం ధర ఎలా పలుకుతున్నదో కనుక్కు రండి" అని తప్పనిసరిగా అనేశాను.

చివరకు మావారు లేచి గాజు పుచ్చుకుని బజారుకు వెళ్ళారు.

అబ్బబ్బబ్బ! అదేమిటో వారి పద్ధతి!

ఆతరువాత...నాకు ఇప్పటికీ జ్ఞాపకం ఉంది...నా మీద నాకే చెప్పటానికి వీల్లేనంత కోపం వచ్చింది. పైకం బీరువాలో పెట్టి తాళం వేశాను. నెత్తి బాదుకున్నాను. జుట్టు పీక్కున్నాను. పోయి మంచంమీద బోర్లా పడ్డాను. మాటి మాటికీ ముఖం దిండుకేసి కొట్టుకున్నాను. ఏమి చేసినా నా మనస్సుకు ఊరట కలగలేదు. ఒళ్ళంతా తగలబడుతున్న ట్టుంది. ఆ మంటలతో కలిసి నేనూ ఒక జ్వాలగా లేచి తగులబడి బూడిదగా అయితే బాగుండు ననిపించింది. కాని అలా జరగలేదు. అవయవాలు కుమిలిపోతున్నాయి. గుండె తపించిపోతున్నది. ప్రాణాలు వేగిపోతున్నాయి. నేను వ్యాకుల పాటుతో తలకాయ బాదుకుంటూ పడివున్నాను.

కొంతసేపటికి నౌకరు వచ్చి కేకవేసి పిల్చాడు: "అమ్మగారూ!"

నేను తలెత్తిచూచాను. ఏం ప్రపంచంరా స్వామీ ఇది! దుఃఖమే దుఃఖం! ఎప్పుడూ దుఃఖమే. కాస్త ఉప శమనం పొందుదామన్నా తీరిక లభించదుకదా!

# 19

నాలుగు రోజులు గడిచాయి. నేనూ వేరే ఏమీ గొడవ పెట్టుకోలేదు. మావారు ఈలోగా నగలు అమ్మేశారు. మూడువేల రూపాయలకుపైగా వచ్చాయి. పైకం అంతా మా అమ్మదగ్గర అట్టిపెట్టాం. "ఇక మీరు ఒకసారి నైనిటాల్ వెళ్ళి రారూ?" అన్నాను మావారితో.

నా యిష్టప్రకారం మావారు సొమ్ములు అమ్మినా, ఏం చేసినా, అయిష్టంగానే చేశారు. ఇప్పుడు మాత్రం ఇలా అన్నారు: "ఈ గొప్ప గొప్ప చదువులనబడేవి లాభం లేదు సుఖదా! వాటివల్ల జాతీయత నశిస్తుంది. పాశ్చాత్య భావాలు అలవడతాయి. నువ్వు మరి దేశభక్తురాలివి!"

నాకు కోపం వచ్చింది. "ఇక చాలు, ఆగండి. మీకు పెద్ద పెద్ద కోరికలు లేవు కాబట్టి హాయిగా సంతోషంగా ఉంటారు. కావలసినంత ఎక్కువగా సంపాదించటం చాతకాక పోయేసరికి ఉపదేశాలకు దిగుతారు! నైనిటాల్ వెళ్ళనిస్తారా లేదా చెప్పండి. లేకపోతే నేనన్నా వెడతాను.

"నువ్వూ వెళ్ళక్కర్లేదు; ఇంకెవరూ వెళ్లరు కూడాను." అన్నారు మావారు అధికారకమైన కంఠస్వరాన.

నా పట్టు నేను విడువలేదు. "ఏం? ఎవరూ ఎందుకూ వెళ్ళరూ?"

"బాగా ఆలోచించు. ఇది రెండేళ్ళ వ్యవహారం మాత్రమే కాదు. యావత్తు జీవితానికీ సంబంధించిన ప్రశ్న. ఇంగ్లీషుభాష మన దేశంలో ఎల్లకాలము ఉండదు. ఇంగ్లీషు వాళ్ళ పరిపాలనా ఉండదు. మూడు వేల రూపాయలు చేతిలో ఉన్నాయికదా అని ఇప్పుడీ గంతు వేయటం తగినపని కాదు. అక్కడ చదువు పదోక్లాసుతో ఆఖరు. ఆ తరువాత కాలేజి చదువుకోసం మళ్ళీ ఇక్కడికే రావాలి. కాబట్టి ఈ వ్యసనం వల్ల ఏం ప్రయోజనం?" అంటూ మావారు నాకు తెలియ జెప్పటానికి ప్రయత్నించారు.

"వ్యసనం అయితే అయింది. నా ఉత్సాహానికిమాత్రం మీరు అడ్డురాకండి"

వారు క్షణమాత్రం నా ముఖంలోకి స్థిరంగాచూచారు: "ఎవరు నిన్ని తప్పుడు దారిలో నడిపిస్తోంది!"

నాకు వొళ్ళు మండిపోయింది. "చెప్పమన్నారా ?"

నా కంఠస్వరం తీక్షణంగా వచ్చింది. వారు కొంచెం వెనక్కు తగ్గారు. అన్నారు: "కొంచెం బాగా ఆలోచించుకుని మాటాడు సుఖదా ! బండి గాడి తప్పిందంటే, ఇక దాన్ని ఆపుకోటం నీ వశం కాదు."

"బోల్తా పడుతుందేం? ముక్కలు ముక్కలై పోతుందేం ? అంతేనా ? ఓయబ్బ ! ఆబండి ఇప్పుడు మహా గొప్పగా సాగిపోతున్నట్టు !...ఏమైనా కానీయండి. నేను పంపించి తీరతాను. అయే ఖర్చు నేనే తీసుకొస్తాను. మీరు హాయిగానే ఉందురుగాని."

"నువు శ్రీమంతుల ఆడపడుచువు అయితే కావచ్చు. కాని శ్రీమంతుల యింటి కోడలివిమాత్రం కావు. నా యింటి పద్ధతి ప్రకారమే నువు నడుచుకోవాలి."

"లేకపోతే ఎవరింటి పద్ధతి ప్రకారం నడుచుకుంటున్నానూ ఇంతవరకు ? చెప్పండీ మీరే !"

"నీ హఠం మానెయ్యవా ?"

ఆ సమయాన బైట ఎవరో వస్తున్నట్టు చప్పుడైంది. నా నోరు కాసేపు కట్టేసుకుందా మనుకున్నాను; కాని ఆవేశం ఆగలేదు. "నా హఠం చెల్లి తీరాల్సిందే" అన్నాను.

"బాబుగారూ !" బైటినుంచి పిలుపు.

వెదురు పరదాకు అవతల యూనిఫారం ధరించి చప్రాసీ నిల్చి ఉన్నాడు. కనిపించాడు.

"ఎవరదీ ?"

"ఉత్తరం ఒకటి తెచ్చాను బాబూ !"

"లోపలికిరా."

వెదురుపరదా తొలగించుకుని అతడు లోపలికి వచ్చాడు. సలాంచేశాడు. ఒక కవరు ఉంచాడు నాముందు.

"ఎవరు పంపారు ఈ ఉత్తరం ?"

"దొరగారు."

జవాబు వినిపించుకోకుండానే కవరు చింపాను; ఉత్తరం తీసి చదివాను. ఒక్క చూపులోనే అంతా చదివాను. "ఇక వెళ్లు" అన్నాను చప్రాసీని.

"జవాబు దయచేయించరూ?"

"వెళ్ళిపో. . ." కోపంగా ఉరిమాను.

వాడు ఇక క్షణం ఉండలేదక్కడః వెనక్కు తిరిగి వెళ్ళిపోయాడు. నేనా ఉత్తరం చించబోతోంటే మావారు అడిగారు : "ఎవరిదా ఉత్తరం ?"

"చూసారా ?"

'అది నీకు చాల కోపం తెప్పించినట్టుందే."

'లాల్ రాశాడు" అంటూ కాగితం రెండు ముక్కలు చేశాను.

"అరె, అదేమిటి ? చింపేస్తావేం ?"

రెండు ముక్కలూ నాలుగైనాయి. అవి తీసుకుపోయి మావారి ముందు పెట్టాను. "నాలుగు ముక్కలూ జోడించి చదవటానికి వీలౌతుంది. కావలిస్తే చదువుకోండి."

నిజానికి వారు ఆనాలుగు ముక్కలూ చేతిలోకి తీసుకున్నారు. వాటిని ఇంకా చిన్న చిన్న ముక్కలుగా చింపేసి నేను కూర్చున్నవైపు విసిరి పారేశారు. ఆ ముక్కలన్నీ గాలికి ఎగిరి ఎగిరి ఇంటినిండా వ్యాపించాయి. వారు చేసిన పనికి నాకు చాలసంతోషం అయింది. మందహాసం చేశాను. "అంత కోపమా ?" అన్నాను.

"ఏం రాశాడేమిటి అందులో ?"

"నన్ను రమ్మంటాడు."

"ఎక్కడికీ ?"

నా పెదవిమీద ఆ మందహాసం అలాగే ఉంది. "ఎందుకూ మీకు ?"

"ఎక్కడికి రమ్మంటాడూ ?"

"ఎందుకూ ? మీరు వెడతారా ?"

"ఎక్కడికి రమ్మన్నాడూ ?"

నేను నవ్వాను. "ఇదివరకు హరీశబాబు ఉండేవాడు

చూచారూ ! ఆ యిల్లు ఇప్పుడు విలాసభవనంగా మారింది లెండి. అక్కడికి రావాలిట నేను.''

"ఎప్పుడూ ?''

"సాయంత్రం ఆరుగంటలకట.'' నేను మళ్ళీ నవ్వాను· "కాని ఏదన్నా చేతిలో పట్టుకుని వెళ్ళాలి. హుఁ, పోనీండి ఆ గొడవ, మీరేమీ ఈర్ష్యపడాల్సిన అవసరం లేదు.''

ఆ మాటకు వారి ముఖం బాగా పాలిపోయింది· "సుఖదా !——''

నేను నా కుర్చీలోంచి లేచాను. వారి కుర్చీ చేతిమీద వచ్చి కూర్చున్నాను. వారి మెడమీద చెయివేసి తడువుతూ "అలా అయిపోయినా రేమిటి? ఎందుకూ ? ఏమైందీ?'' అని బుజ్జగింపుగా అడిగాను.

వారు కొంతసేపు మౌనంగా, అన్యమనస్కులుగా ఉన్నారు. తలవంచుకుని తివాచీవైపు చూస్తూ కూర్చున్నారు. ముఖం ఎత్తనేలేదు.

"ఏమండీ మిమ్మల్నే, ఏదీ, ముఖం ఎత్తి ఇలాచూడండి!''

వారు మెల్లిగా, నాకు కష్టం కలక్కుండా నా చెయ్యి తమ మెడమీదనుంచి తీసేశారు. "నిన్ను పిలుస్తున్నాడంటే ఏదో కారణం ఉండి ఉండాలి. వెళ్ళటానికి నువు ఎందుకు భయపడుతున్నావో నాకు అర్థం కావటంలేదు. భయంచేతనే కదూ నువు వెళ్ళటం మానేస్తున్నావు ? అది నాకేం బాగా

లేదు. దాన్నేనా నువ్వు ఈర్ష్య అనుకుంటున్నావు ? అనుకుంటే అనుకో."

"అతడు నన్ను పిలుస్తున్నాడంటే పనేమీలేదు."

"ఉత్తరం రాశాడే మరి ?"

"అంత తెలివితక్కువవారేమండి మీరు ! పనేం లేదని చెబుతుంటేనూ !"

నాకు కోపం రాసాగింది. వారు నావైపే చూస్తూ "పనేమీ లేకపోయినా పిలిచినప్పుడు వెడితే—అది అతని మూర్ఖత్వాన్నే బయట పడేసినట్టవుతుందిగా ?"

"మీాసు అనేది ఏమిటో తెలిసే అంటున్నారా ?" కోపంగా అడిగాను.

వారు స్థిరమైన కంఠస్వరాన మళ్ళీ ఇలా చెప్ప సాగారు: "నువ్వు భయపడతావని నేను అనుకోలేదసలు. అంటే—దాని అర్థం సంశయం అన్నమాట !—నన్ను గురించీ, నిన్ను గురించీ, ఇంకా అందర్ని గురించీని. 'ఎందుకు అలా భయపడతావు ?' అని అతన్నే వెళ్ళి అడుగుదా మని పిస్తున్నది నాకు. నిన్ను నేను వివాహం చేసుకున్నాను. అపహరించి తెచ్చుకోలేదు. వివాహంలో ఇవ్వబడిందేదో అదే వస్తుంది; పరాధీనత ఏమీ రాదు. విన్నావా సుఖదా ! నీ స్వాతంత్ర్యం నీకే ఉంటుంది. నువ్వు ఎక్కడికేనా వెళ్లి రావల సిన అవసరం ఉండి...నన్ను గురించి ఆగిపోతున్నావంటే మాత్రం...నా మీద నేరం మోపుతున్నావన్న మాట !

నన్ను గురించి నువ్వు ఒకానొక పనినుండి విరమించుకోవలసిన అవసరం ఏమీ లేదు, చెబుతున్నాను.”

నాకు చాల ఆశ్చర్యమైంది వారి మాటలకు. “అలా మాటాడతారేమిటి ? నే నెక్కడికీ వెళ్ళవలసిన అవసరమూ లేదు, అతనికి నాతో పనీ ఏమీ లేదు.”

మావారు మెత్తబడ్డారు. “లాల్ మంచివాడు కాదని చాలసార్లు చెప్పాను కదూ! అది పొరపాటే. ఆ మాట నేను ఇప్పుడు ఉపసంహరించుకుంటున్నాను. మంచిగాని చెడుగాని ఆ మనుష్యుల్లో ఉండవు. చూచే వాళ్ళ కళ్ళలో ఉంటాయి. అతనిలో చెడు చూచానంటే ఆ ‘చెడు’ నాదే. కాని హరీశ్ నాకు మిత్రుడు. ఇతడు హరీశ్‌కు భిన్నంగా కనిపించాడు. హరీశ్ మీద నాకు ఉండిన సానుభూతివల్ల ఇతన్ని చెడ్డ వాడుగా భావించి ఉంటాను.” ఇలా అంటూనే మావారు భావతీవ్రతలో పడిపోయారు కాబోలు: “వివాహం అంటే యేమిటి ? – ఈ విషయం తరచుగా ఆలోచిస్తూ ఉంటాను. వివాహం మన స్వత్వాల్ని బంధించివేస్తుందా ? లేదా అపహరించేస్తుందా ? పరస్పర సమర్పణలోనే వివాహంయొక్క సార్థకత. కాని సమర్పించుకోటం అంటూ వచ్చేసరికి వ్యక్తిత్వమనేది హరించిపోతుంది. సరే, ఆ విషయం అలా ఉంచుదాం. అబ్బాయిని నైనిటాల్‌కు పంపించటానికే నువ్వు నిశ్చయించుకున్నావా ? నన్నడిగితేమాత్రం నే నందుకు ఒప్పుకోను. నువ్వు ఆ నిశ్చయాన్నే ఖాయంచేస్తే మాత్రం నేనూ సరే అంటాను.”

"నేనేమీ చెప్పను. కాని—"

మామగారు నవ్వారు. "కాని వినోద్ ఇతర పిల్లలకంటే ఏమాత్రం లోచ్చుగా కనిపించకూడదు. అంతేకదూ! సరే, కాని అటువంటి ఉద్దేశంలో ఇతర పిల్లల యెడల అనాదరం గర్భితమై ఉన్నదంటావా, లేదంటావా? డబ్బుమూలంగానే సంఘంలో అనేక వర్గాలు ఏర్పడ్డాయి! మనం ఎపుడూ మన పైవర్గంవారివైపు చూస్తూ ఉంటాం. మన కిందివర్గంవారి దెస కూడా చూడవలసిన కర్తవ్యం మనకు లేదా? అది మన కర్తవ్యం కాకపోతే ఇంకెవరి కర్తవ్యం ఔతుంది చెప్పు. మనం పుస్తకాల్లో చదువుతూండే మహాపురుషులదేనా కేవలం, ఆ పని అంతా? కాదుకాదు. ఆ కర్తవ్యం మన అందరిదీని. మహాత్ములది కాదు; వారు వేరుగా ఒక ఉన్నతమైన అంతస్తులో ఉండగలరు. అందరితో కలిసిమెలిసి, సహించి జీవయాత్ర సాగించవలసిన మనవంటి గృహస్థులదే ఆ కర్తవ్యం."

ఆసమయాన నాలో తర్కం బయలు దేరింది. కాని నేనా గొడవలో లీనం కాలేదు. ఇంతకుముందు వారు పలికిన మాటల్లో నాకు సుఖం లభించింది, అవి నా అంతర్యానికి సంబంధించినవే కాబట్టి. నానుంచి వేరై నేను దూరంగా ఉండి ఆ భావప్రపంచంలో నన్ను విహరింపనిచ్చాను. అదొక సుఖానుభూతి కలిగించింది. కాని ఆ భావాల్ని నన్ను పెనవేసుకోనిచ్చినట్టయితే మరోవిధంగా ఉండేది. శాయశక్తులా ప్రయత్నించి వినోద్‌ను అన్నింటికన్నా ఉన్నతమైన చోటికే పంపించి ఎందుకు చదువు చెప్పించకూడదు? అన్న తలంపు నా హృదయంలో బాగా పీఠం పెట్టుకుని కూర్చోలేదు.

అందుకు ఒక కారణం: ధనాభావం. ఈ కారణాన్ని నేను ఎక్కువగా పాటించలేదు. కాని ఇప్పుడు మావారి సౌజన్యాన్ని శంకించలేని స్థితిలో పడ్డాను. "ఉన్నతి కోరుకోటం ధర్మమేగా ఎవరికైనా?" అన్నాను మెల్లగా.

మావారు చాల సౌమ్యంగా సమాధానం చెప్పసాగారు: "అది ఎవరికి వారు చూచుకోవలసిన విషయం. మనకింద కొందరు ఉంటున్నారన్నప్పుడే మనం పైకి ఎక్కుతున్నామని అనుకోటంలో ఆనందం ఉంది. కింద ఉన్నవారి దృష్ట్యా ఆలోచిస్తే ఈ ఊర్ధ్వగమనాన్ని ఏమనాలో తెలుసా? 'ఈ పై అంతస్తువాళ్ళకు హృదయంలేదు. మా తలలమీద ఎక్కితొక్కుతున్నారు' - అంటారు వాళ్ళు. కాబట్టి ఉన్నతి అనబడేది - అది వేరే వస్తువు. అసలైన ఉన్నతి బాహ్యమైనది కాదు; ఆంతరంగికమైనది."

నేను నవ్వాను. "అంటే భౌతికం కాదు; నైతికం. అదేగా మీ భావం?"

వారూ కొంచెంగా నవ్వారు. నావైపు చూచారు. నా మాటలో, నవ్వులో వ్యంగ్యం స్ఫురించిందా వారికి? కొన్ని క్షణాలు వారు సాలోచనగా ఉండిపోయారు. చివరకు గంభీరంగా మళ్ళీ ఇలా ఆరంభించారు—

"అవి శబ్దాలు మాత్రమే సుఖదా! పుస్తకాల్లో ఉపయోగించేవి. నాకు అవి బాగా తెలియవు. శబ్దాలు భలే తంటాలే తెచ్చిపెడతాయి. ఇంతకూ అవి ఒకానొక భావాన్ని సూచించేవి మాత్రమే. అంతకు తప్పితే వాటిలో వేరే సారం

ఏమీ ఉండదు. పోనీ, ఈ మాటలవల్ల ప్రయోజనం ఏమిటి ? ఆ ప్రసంగం వదిలేద్దాం. 'భౌతిక ఉన్నతిని సాధించే సామర్థ్యం లేనప్పుడే నైతిక విషయాలు ఏకరువుపెడతాం' అని కదూ నువ్వు అంటావు ? నేను ఎక్కువ డబ్బు సంపాదించలేను; అందు వల్లనే ఆ యీ విషయాల్ని గురించి అధికప్రసంగం చేస్తూ ఉంటాను—అని నువ్వు అనే మాట బహుశా నిజమేకావచ్చు. నేను అధికంగా, వీలైనంత అధికంగానే ధనం సంపాదించాల్సిందే. లేకపోతే పెళ్ళి ఎందుకు చేసుకున్నాను ? పిల్లల్ని ఎందుకు కన్నాను ? ఇవన్నీ చేశాను కాబట్టే డబ్బు అవసరం అయింది. దాన్ని సంపాదించటం ప్రథమ కర్తవ్యం - అంతిమ కర్తవ్యంకూడా అయింది. నేను వ్యంగ్యంగా మాటాడు తున్నాననుకోకు సుఖదా ! నిన్ను గురించిన ఎత్తిపొడుపు ఏమీ లేదు ఇందులో. పరిస్థితిని తర్కించి చెబుతున్నాను; అంతే.

కొందరు ఉంటారు : వాళ్ళకు కొన్ని ఆదర్శాలు ఉంటాయి. ఆ ఆదర్శాలకోసమే వాళ్లు జీవిస్తారు; వాటికోసమే మరణిస్తారు. వాళ్ళను తలచుకుంటే మనకు ఆశ్చర్యం వేస్తుంది. మన తల పులు, కోరికలు వారి వైపే ప్రవహిస్తూ ఉంటాయి. చాల ఉత్తమమైన పురుషుల్నిగా వారిని గౌరవిస్తాం. బహుశా వాళ్ళే భగవంతుడేమో ! కాని వాళ్ళే భగవంతు డన్న విషయం నాకు అనుమానాస్పదమే, అయినా వాళ్ళు మనకు ఉన్నతికి మార్గం చూపిస్తారు. ఎక్కడినించి బయలుదేరి ఎటు వెడితే ఎక్కడికి చేరుకుంటామో తెలియజెబుతారు. వారంతా వీరులు, సేనానులు, సామ్రాట్టులు. వాళ్ళ ప్రతిభకు చరిత్ర క్షణకాలం కంపించిపోతుంది. కాని ప్రపంచంనిండా

అటువంటివాళ్ళే ఉండరు. వాళ్ళు వ్యతిక్రములు-Freaks-వికాసమనే వృత్తానికి tangent (స్పర్శరేఖ) వంటివాళ్ళు. మామూలు లెక్కలోకి రారు. ప్రతిభ విరళం, విలక్షణం. అందుచేత చమత్కారంగా కనిపిస్తుంది. కాని ఏం లాభం. వైలక్షణ్యం మనోహరంగానే ఉంటుంది, కాని అది నిష్ఫలం. ఒకేరకంగా కన్పిస్తూ, అసంఖ్యాకంగా, విస్తారంగా ఉన్న సాధారణప్రజే మానవజాతికి వెన్నెముక. మానవజాతి స్థిరత్వం అక్కడే ఉంది. ఈ సాధారణ ప్రజతో కలిసిపోయి, వాళ్ళే మనం, మనమే వాళ్ళు అన్నభావంతో జీవించటం అలవరచుకోవాలి. అట్టి సాధనలోనే ఉన్నతి ఉంది. అసలైన ఉన్నతి అదే అని నా అభిప్రాయం. నరపుంగవులు, నరకేసరులు అనబడే వారిలో పైపై శోభే కనిపిస్తూ ఉంటుంది; జాతి సౌష్ఠవం, స్వాస్థ్యం, శక్తి వారివల్ల పెంపొందదు. ఈ రహస్యాన్ని ఆ పైపై మెరుగులు చూచి మరచిపోతూ ఉంటాం; కాని నెమ్మదిమీద గ్రహించక పోము..."

ఇలా చెప్పుకుపోయారు. ఇటువంటి భావతీవ్రత వారిలో తరచుగానే చూస్తూంటాను. మామూలుగా ఎప్పుడూ మౌనంగానే ఉంటారు. ఇలా ఎప్పుడోగాని దీర్ఘ ప్రసంగం చెయ్యరు. "చాల దీర్ఘంగా వ్యాఖ్యానిస్తున్నారే!" అన్నాను నవ్వుతూ.

"ఓహో, క్షమించాలి సుఖదా! నన్ను నేనే మరచాను సుమీ! నువు—ఎవరో వస్తున్నారల్లే ఉంది."

బైట కారు ఆగిన చప్పుడు నేనూ విన్నాను. తరువాత బూట్ల చప్పుడు. ఇదివరకు విన్న చప్పుడు లాంటిదే. మరచి పోలేదు.

"రావచ్చా వదినగారూ ?" అంటూనే లాల్ గుమ్మం దాటి లోనికి వచ్చాడు.

నేను మేలిముసుగు సవరించుకుంటూ అక్కడినించి వెళ్ళిపోవటానికి లేచాను.

మావారు అక్కడే ఉన్నాకూడా అతడు "చూడండీ, వదినగారూ ! మీరు వెళ్ళబోకండి; మీతో నాకు కాస్త పని ఉంది. పని ! కోపాలు తరువాత చూచుకోవచ్చు. మాకు తీరుబాటు ఉండే రోజులు కావు ఇవి. తీరుబాటు సమయా ల్లోనే కోపాలూ అవీ చూచుకోవచ్చు. (మావారివైపు తిరిగి) మీరు ఏమనుకుంటారో అనే కాబోలు ఈవిడగారు మా చాయలకు రావటానికే ఇష్టపడటంలేదు—" అన్నాడు.

"నిల్చున్నారేం, కూర్చోండి" అన్నారు మావారు.

"ఆఁ. కూర్చుంటాను. కాని నేను వెళ్ళిపోవాలి. చూడండీ...ఇదిగో, ఇది తీసుకోండి."

అతడు నా బుజం గట్టిగా పట్టుకున్నాడు. నన్ను బలంగా పక్కకు తిప్పి, అతడు నాచేతికి ఒక చిన్న తోలుసంచి ఇచ్చాడు. "ఉంచండి, దాన్ని మీ దగ్గర" అన్నాడు.

నేను ఆశ్చర్యంగా చూచాను – ఉద్ధతుడైన ఆ యువ కుని కేసి.

"ఉంచండి దాన్ని మీ దగ్గర. అది మీదే. నేను తొందరగా వెళ్ళిపోవాలి. పని ఉంది. రేపు ఉదయానికల్లా ఇక్కడినుంచి దాటిపోవాలి." అన్నాడు.

"కాస్త కూర్చోండి. అంత తొందరేమిటీ?" అంటూ మావారు నావైపు తిరిగి "సుఖదా! కొంచెం—" అన్నారు.

"సరే, అలాగే కూర్చుంటాలెండి. మీరు నాకు ఆతిథ్యం ఇస్తారుకాబోలేం? సరే ఇవ్వండి. కాని వదినగారు కోపంగా ఉన్నారుగా!"

"పట్టుకురా! అది నాకు ఇచ్చేసి నువు—" అన్నారు మావారు నావైపు తిరిగి.

తోలుసంచీ మావారి చేతికి ఇచ్చి నేను లోపలికి వెళ్ళిపోయాను. అమ్మయ్య! కాస్త ఊపిరి పీల్చుకోటానికి వెసులుబాటు చిక్కింది. నాకు అప్పుడు కావలిసింది ఏకాంత స్థితి. కాస్త ఒక్కతెనే మనస్సుకు ఊరటగా ఒకచోట కూర్చోవాలనిపించింది. కాని అందుకు అవకాశం ఏదీ? ఫలహారాల ఏర్పాటుచేసి మళ్ళీ గదిలోకి వచ్చాను. పెట్టె తెరచిఉంది. చుట్టూ చాల డిబ్బీలు పడిఉన్నాయి. కొన్ని మూసేఉన్నాయి. కొన్ని తెరచి ఉన్నాయి. అవన్నీ నా నగలు పెట్టిఉన్న డిబ్బీలు; కనిపిస్తూనే ఉంది. వాటినిగురించే ఇద్దరిమధ్యా చర్చ సాగుతోంది. నేను రావటంతోనే లాల్ ఇలా అన్నాడు. "రండి, వదినగారూ! మీరు న్యాయం చెప్పండి. ఈ నగలు నేను కొన్నాను. కాని వీటిని అమ్మటానికి వీరికి హక్కు ఎక్కడిదీ? అని అడుగుతున్నాను.

"వారు అమ్మలేదు నగలు"అన్నాను నేను సంక్షిప్తంగా.

"మరి ?"

"నేనే అమ్మాను."

"మీరా ? అమ్మటానికి మీకు మాత్రం ఏమి హక్కు ఉంది ? మొదట వాటిని తాకట్టు పెట్టటమే తప్పు. పైగా అమ్మేస్తారు కూడానా ? డబ్బుకోసం నగలు అమ్ముకున్నారూ అంటే అర్థం ఉంది. కాని డబ్బు మీచేతికి వచ్చేసిందిగా ! మళ్ళీ ఇదేంపని చేశారు మీరు ?"

"అదంతా అడగటానికి మీరెవరూ ?" గంభీరంగా ప్రశ్నించారు మావారు.

లాల్ విచికిత్సలో పడ్డాడు. "నే నెవరా ? బాగానే అడిగారు. చెప్పండి మీరు వదినగారూ ! – నే నెవరోను."

"ఇది నవ్వులాట అనుకోకండి. ఈ వ్యవహారంలో జోక్యం కల్పించుకోటానికి మీరెవరు ?—అని వారు సరిగ్గానే అడిగారు. చెప్పండి సమాధానం" అన్నాను నేనూ గంభీరం గానే.

"సరే, ముందు మీ నగలన్నీ జాగ్రత్తచేసుకోండి. అదీ కావల్సింది. మీ సొత్తు మీకు అప్పగించటం అయిపోయాక నా ప్రమేయం ఏమీ ఉండదు. కాని సొత్తు నా అధీనంలో ఉన్నంతవరకూ మాత్రం నాకు పూర్తి బాధ్యత ఉండనే ఉంది. మీరు నాతోకూడా వచ్చేట్టయితే అంతా చెబుతాను (మావారివైపు తిరిగి) ఏమండీ ! మీరు అనుమతి ఇస్తారా ?"

మావారు నవ్వారు. "ఇప్పుడే కాదు—ఏవీ? ఫల హారాలేమీ రావా ఏమిటి?"

"వస్తున్నాయి."

"అరె, నే నా సంగతే మరచిపోయాను సుమా! మొద్దులా కూర్చున్నాను. (నావైపు తిరిగి) చూడండి... మీరు నాతో కూడా రావాల్సిఉంది. ముందు అవన్నీ జాగ్రత్త చేసుకోండి."

ఆతరువాత ఏమి మాటలు వచ్చాయో, ఏమి జరిగిందో...నా కిప్పుడు బాగా జ్ఞాపకం లేదు. మావారు నన్ను వెళ్ళిరమ్మని బలవంత పెట్టారు. వారి అనుజ్ఞే రక్షణకవచంగా బయలు దేరి లాల్‌తో పాటు కారులో ఎక్కి బయలు దేరాను. కారు నడుపుతూ లాల్ "మీరు రాకుండా ఆగిపోయారేం? ఎందువల్ల?" అని అడిగాడు.

"సమావేశానికా?"

"సమావేశానికి కాదు, ఇవాళ."

"అది నాకు అసహ్యమనిపించింది."

"ఏమిటి అసహ్యం అనిపించింది?"

"మీరు అలాంటి ఉత్తరంద్వారా పిలవటం."

"ఓహో! అయితే సరైన విధానం ఎలా ఉండాలో మీరు చెప్పండి. నేర్చుకోటానికి ప్రయత్నిస్తాను. కాని నా కిప్పుడు చాల సంతోషంగా ఉంది; మీరు చూస్తున్నారుగా! నచ్చటం, అసహ్యం కలగటం అనేవి సొసైటీ (సంఘం)ని బట్టి

ఉంటాయి. అక్కడ కొన్ని పద్ధతులు, నియమాలు, సంప్రదాయాలు ఉన్నాయి. కాని సొసైటీ మారిపోయినప్పుడు అవన్నీ కూడా మారిపోతాయి. సంప్రదాయాలనేవి కొద్దికాలంఉండేవే. పుడుతుంటాయి, మాడిపోతుంటాయి—సరేగాని you love him? (నువు అతన్ని ప్రేమిస్తున్నావా?)"

నేను ఆశ్చర్యంగా అతనికేసి చూచాను. ఏమీ మాట్లాడలేకపోయాను. స్వేచ్ఛగా ఇష్టంవచ్చినట్లు ఎలామాటాడతాడో! అతని వాగ్ధోరణి ఎలా ఉండబోతుందో ఊహించటానికికూడా వీలుండదు. హఠాత్తుగా ఏమాట అంటాడో ఎవరికీ తెలియదు.

"లేదని నా అభిప్రాయం" – మళ్ళీ అతడే అన్నాడు.

అప్పటికీ నే నేమీ మాటాడలేదు. చెబితే పెద్దగా అరిచి చెప్పేదాన్ని. కాని అది బాగుండదు.

"వివాహం వేరు; ప్రేమ వేరు. ఏమంటారు? మీ ఉద్దేశం ఏమిటి?"

"హాయ్ వెళ్ళమంటే మీతో వస్తున్నాను; తెలుసా ఆ సంగతి? మరచిపోయారా?"

"జ్ఞాపకం ఉంది. నేను వారికి చాల కృతజ్ఞుడను. కాని నిజం నిజమే. ఒక మిథ్యాసంకల్పంతో కర్తవ్యానికి నువు అంటిపెట్టుకుని ఉండలేవు."

"చూడండి...నన్ను ఇంటిదగ్గర దిగబెట్టెయ్యండి, తీసుకుపోయి."

"తప్పకుండా, తప్పకుండా. ఇంటి తాళంచెయ్యి మీకు ఒప్పచెబుతాను. తరువాత చెయ్యవలసిన పని చెబుతాను. తెల్లవారేసరికి... చెప్పానుకదూ!... నేను ఇక్కడినుంచి దాటి పోవలిసిందే."

నేను మాటాడకుండానే ఉందామనుకున్నాను, కాని వివశనై అనేశాను: "ఎక్కడికీ?"

"ఎక్కడికా? భగవంతుడికి తెలియాలి. నామటుకు నాకే తెలియదు."

"ఏమిటీ?" గాభరాపడుతూ అడిగాను.

నా గాభరా చూచి అతడు నవ్వాడు. ఏమీ మాటాడ లేదు.

కారు జాగ్రత్తగా ఫర్లాంగుదూరాన విడిచిపెట్టాడు. వెనుకనుంచి ఎంతో మెళుకువగా గోడ దూకి ఇంట్లో ప్రవేశించాడు. తరువాత నాకోసం ద్వారం తెరిచాడు. నేను లోపల అడుగు పెట్టాక మళ్ళీ తలుపు బందు చేశాడు. నిర్మానుష్యంగా ఉంది ఇల్లంతా. ఆనాడు మేమిద్దరమూ కలిసి అమర్చిన సామానే ఇప్పుడూ అలాగే ఉంది. పెద్ద గదిలో సోఫామీద నన్ను కూర్చోపెట్టి, తనను తాను తేలిక పరుచుకుంటున్నట్టుగా పచార్లు చేయసాగాడు. అతడు నిండుగా-గంభీరంగా కనిపిస్తున్నాడు, నేను మాత్రం కేవలం ఒక ఉపలక్ష్యంగా ఉన్నాను. ఇక ధోరణి ఆరంభించాడు—

"సుఖదా! ఈమధ్య చాల గొడవే జరిగింది. ఇప్పుడు

నా ప్రాణాలకే అపాయం కలిగేట్టుగా ఉంది. ఇది నాకు కొత్త విషయం ఏమీ కాదనుకో. కాని ఇక్కడ విచిత్రం ఏమిటంటే ఈ కార్యభారం ప్రభాత్ నెత్తిమీద వేసుకున్నాడు. నాకు అనిష్టం రానైఉంది. నామీద అభియోగం ఏమిటో చెప్పనా? నేను ఆర్యఋషుల సాంప్రదాయాల్ని పాటించి నడుచుకోటం లేదట! విన్నావా సుఖదా! ఋషి ఆయన కాలంలో ఏదో చెప్పాడు; వెళ్ళిపోయాడు. అదే పద్ధతి ఎల్లకాలం ఎందుకు సాగిపోతూ ఉండాలో నాకు బోధపడకుండా ఉంది. తు. చ. తప్పకుండా సంప్రదాయాల్ని పాటించవలసిందే నంటావా? అది సంభవమేనంటావా? ఇదిగో, కొత్తవిప్లవం రానైఉంది. లేచింది పశ్చిమ ఖండంలో; అంటే తూర్పుఖండంలోనూ అన్న మాటే. దానికి ప్రాక్ పశ్చిమాలు రెండూ ఒకటే; ఒకటి కావాయికూడా. అక్కడ సంప్రదాయాలు ఉండవు. ప్రాచీన తను ప్రతిష్ఠించటం కాదు; భవిష్యత్తును నిర్మించటమే విప్లవం లోని ఆశయం. మన సంప్రదాయాలు, మర్యాదలు, ఆచారాలు, సభ్యతలు—ఇవన్నీ మన ప్రభువులు ఒక మూసలో కరిగించి రూపొందించారు. మనం వాటి బరువుతో అణగి పోయి చిగిర్చటంలేదు, వికసించటంలేదు. ప్రాచీన సంప్రదాయాలు మనలో కరుడుగట్టుకుని ఉండకూడదు. మనం దేశ స్వాతంత్ర్యం కోరుతున్నాం. ప్రాచీనభావాలతో ముద్దగట్టుకు పోయిన మనం స్వతంత్రం తీసుకురాలేము. నువ్వు ఆనాడు రాలేదుకదూ! రాకపోవటమే మంచిదైంది... నేను గట్టిగా చెప్పాను: కేవలం భావుకతే పునాదిగా పెట్టుకుని మనం ప్రజాందోళన తీసుకురాలేము అని. ఆత్మత్యాగం మొదలైన

పదాలన్నీ శ్రవణ పేయంగానే ఉంటాయి. కాని అవి...సింహం నోట్లో తల దూరినతరువాత నిశ్చింతగా చచ్చిపోవటానికి ఉపకరిస్తాయి. సింహంగోరలు ఊడబెరకటానికిమాత్రం పనికి రావు. వాటి సహాయంతో సింహాన్ని ఓడించి, సంహరించ లేము. ఆ సింహమే సామ్రాజ్యవాదం. ప్రధానంగా దానిది బూర్జువావాదం; పెట్టుబడిదారీ విధానం. మనకు ఒక ఆర్థిక కార్యక్రమం ఉండి తీరాలి. రాజనీతికి ఆర్థికవిధానమే అసలైన పునాది. ఇలాగే నేను ఇంకా చాలాచెప్పాను : మన కార్య పద్ధతి ఇంతవరకూ భావనాత్మకంగానే ఉంటూవచ్చిందనీ... హరీశబాబుపట్ల నాకు చాలానే గౌరవముంది; అయినాకూడా ఇకముందు వారి నాయకత్వంవల్ల ఎక్కువ ప్రయోజనం ఉండ దనీ...ఇలా నేను చెప్పేసరికి ఏమైందో తెలుసా? సభలో నా మనుషులూ ఉన్నారు; నా మనుషులు కానివాళ్లూ ఉన్నారు. నావాళ్లు—అనుకున్నవాళ్ళంతా నాకు ఎడమై పోయారు; నేను తమ మనిషి కాదు—అనుకున్నవాళ్ళంతా పూర్తిగా నాకు శత్రువులే అయిపోయారు. చాల చిత్రమైన ప్రపంచం సుఖదా, ఇది! ఒకప్పుడు వాళ్ళందరిమీదా నాకు అధికారం ఉండేది—వాళ్ళందర్నీ నేను శాసించేవాడిని. సరే, పోనీలే. నేను ఎవరినో, ఎటువంటివాడినో నీకు తెలుసా సుఖదా! నేను అన్నివిషయాల్లోనూ మరీ స్వతంత్రం తీసుకుంటున్నానని నువ్వుకూడా అంటే అనవచ్చు. స్వతంత్రమే నాకు కావాలి... స్వతంత్రుణ్ణే నేను కాగోరేదీను. అంతకుతప్ప నాకింకేమీ తెలీదు—నేను మరేమీ కాలేనుకూడాను. అయినా నన్ను గురించి నేనేమీ చెప్పకోను; స్వార్థం ఔతుంది...ఊఁ, ఇల్లు

చూచుకో. ఇదిగో తాళంచెవి. నేను ఇక—దానికేంలే. ముందు సంగతి ఇప్పుడేమీ చెప్పలేం. ప్రభాత్ నిన్ను కలుసుకుంటాడు; లేకపోతే కబురుచేసి పిలిపించు. బాగా చదువుకుని బుద్ధిమంతుడు కమ్మని చెప్పు. ఈ పాడుగొడవల్లో చిక్కుకో వద్దని చెప్పు. నన్ను చంపటం పెద్ద కష్టమైన పనేమీ కాదు. కావలిస్తే నేనే అతని పని చాల తేలిక చేసేస్తాను. ఈ నా జీవితమంతా ఉదరపోషణకిందే వ్యయమైంది. దీనికి పెద్ద విలువేమీ లేదు. దీన్ని కాపాడుకోవాలన్న కోరికా నాకు లేదు. ఎవడు కావలిస్తే వాడు దీన్ని పుచ్చుకోవచ్చు. దీనికోసం కూడా పొంచి ఉన్నవాళ్ళు ఉన్నారు, నాకు తెలుసు. వారు తప్పు త్రోవలో ఉన్నట్టు మున్ముందైనా తెలుసుకుంటారు. కాబట్టి అనవసరంగా వాళ్ళకు పాపపుణ్యాం అంటగట్టటం నాకు ఇష్టంలేదు...ఇక వచ్చి ఇల్లు చూచుకో. ఆనాడు మనం దీన్ని ఏ స్థితిలో విడిచిపెట్టి వెళ్ళామో ఇప్పుడూ అదే స్థితిలో ఉంది. ఔను. ఆనాడు ఎంతో చురుకుగా, గబగబా, చాల పని చేశాంకదూ! లేకపోతే ఏమయ్యేదో కదా! రహస్యం అంతా బైటపడిపోయేది. పైగా—ఇదంతా నీ కిప్పుడు ఎందుకు చూపిస్తున్నానో తెలుసా? ఇక ముందు చెయ్యవలసిన వ్యవహారం ఏమిటో నువ్వు ఈలోగా ఆలోచించుకోవాలి. ప్రభాత్ ఎక్కడా కాస్తయినా నిలువ నీడ లేకుండా ఉన్నాడు. అతని బస నువ్వు ఇక్కడ ఏర్పాటుచెయ్యవచ్చు. పనిపాటలు చెయ్యాటానికి ఒక కుర్రవాడిని ఉంచాను ఇదివరకు. ఇల్లంతా ఊడ్చి శుభ్రంగా, అందంగా ఉంచేందుకోసం ఒక స్త్రీనికూడా అట్టిపెట్టాను. ఆ యిద్దరికీ సెలవు ఇచ్చి పంపించేశాను. ఇప్పుడు

ఎవరైనా నా యెదుటికి రానటం, నా దగ్గర ఉండటం అనేది ఆపత్తు కొని తెచ్చుకోటం అన్నమాటే. ఎందువల్లనంటే నేను భాగ్యవంతుడిని, దేశద్రోహిని, చరిత్రహీనుడిని ... సరే, ప్రభాత్ బస నువ్వు ఇక్కడ ఏర్పాటు చెయ్యొచ్చు. అతనితో పాటు, అతనివంటి విద్యార్థులు ఇంకా ముగ్గురు నలుగురు ఇక్కడ ఉండిపోవచ్చు. ఇద్దరికి మాత్రం ఖర్చు సరిపోతుంది; హాయిగా ఉండవచ్చు. ఇకపోతే—కాని అంతా చూడు ముందుగా ఒకసారి."

నన్ను రెక్కపుచ్చుకుని తీసుకుపోయి ఈ పక్కనుంచి ఆ పక్కవరకూ ఇల్లంతా నాలుగు మూలలా చూపించాడు. ఆ పటాలు తగిలించినచోట ఆగాడు. ఆ పటాలకేసి చూస్తూ "ఊహుఁ, ఇక వీటి అవసరం లేదు. చరిత్రహీనుడిని – నాకు అవసరమైనాయి ఇంతవరకు. ఇక నేను వెళ్ళిపోతున్నానుగా. ఇక వీటిని తీసిపారేయాల్సిందే." అంటూ పటాలన్నీ ఊడదీసి పారేశాడు. ఏదో వాగుతూనే ఉన్నాడు. ఏమి మాట్లాడ్డానికీ నాకు అవకాశమే లేకుండాఉంది. అంతా వింటూ, చూస్తూ, సహిస్తూ ఉన్నాను; అంతే. నేనక్కడ ఆసమయాన ఉన్నట్టే లేదు. అంతా అతనే. లోపల ఏదో ఆవేశం పట్టలేకుండా ఉన్నాడు. మళ్ళీ ఇలా ఆరంభించాడు : "నన్నుగురించి నేనేమీ చెప్పుకో దలచుకోలేదు. మీ పైకం నేను మీకు అప్పజెప్పినందుకు మీరు నాయెడల కృతజ్ఞత చూపవలసిన అవసరంలేదు. ఇంటికి వెళ్ళాక మీ వారిని కూడా ఈవిషయమై అసలు ఏమీ తలచుకోవద్దని చెప్పు. నేను ఒంటరిగాడిని. డబ్బే ప్రధానంగా ఎంచుకోవలసిన

ఆవశ్యకత నాకేంలేదు. మీ ఆదాయం పరిమితమైంది. ఆదాయానికి మించని ఖర్చులతో వెళ్ళదీసుకోటం మీవర్గం వారికి ధర్మం అని భావించబడుతున్నది. అదంతా బూటకం. పిల్లలకు పాలు దొరకటం లేదనీ; చదువు సంధ్యలు చెప్పించలేకపోతున్నామనీ - ఇలా విచారాలు పెట్టుకోవద్దు. సంతోషంగా కాలక్షేపం చెయ్యటానికి ప్రయత్నించు. ఇటువంటి అర్థంలేని, అనవసరమైన విచారాలే మన సంఘంలో మధ్యతరగతి కుటుంబాల్ని పీడించి పిప్పిచేస్తున్నాయి; లోపల్నుంచి పీక్కుతినేస్తున్నాయి. పైకి నలుగురిలో మర్యాద కాపాడుకుంటూఉండాలి. మనస్సుకు సంతోషంగా కాలం వెళ్ళదీస్తూ ఉండాలి. ఈ ద్వంద్వంతో జీవితం నానా యాతనలకు గురిఔతున్నది. నువ్వు డబ్బు విషయమై ఏవిధమైన చింత పెట్టుకోవద్దు. నేనుండగా నీ కా విచారం వద్దనే వద్దు. దరిద్రంలోనే ఆనందం ఉన్నదని అనుకుంటూ తృప్తిపడి భాగ్యవంతుల సంపదను అలాగే అట్టిపెట్టుకోనిస్తామా? నగలు నీదగ్గరే అట్టిపెట్టుకో. అవి నీవే. కష్టం వచ్చినప్పుడు ఉపయోగిస్తాయి. సంసారంలో డబ్బు ఇంకో విధంగా నిలవ ఉండదు. 'నువ్వు ఎవరు?' అని అడిగావేం ఇందాక? ఆ ప్రశ్న మళ్ళీ ఎప్పుడూ రానీకండి. నేను నా యిష్టంవచ్చినట్టు ఉల్లాసంగా సంచరించే మనిషిని. డబ్బు అనే రాకాసి తన వాడికోరలతో సమాజంలో పలుతావుల గాయాలు చేసి పెడుతుంది. ఆ గాయాల్ని శుభ్రంగా కడిగి, మందువేసి కట్టుకట్టటం నాకు ఒక సరదా అయిపోయింది. మీ మధ్య వర్గీయులలో ఉండే స్వాభిమానంవల్ల ఈ నా పని కొంన సాగటం ఎంత కష్టం అయిందో నాకే తెలుసు. కాని ఈ నాగర

కత అంతా బూర్జువా సభ్యతను అనుసరించినట్టిది. ఆర్థికంగా ఏర్పడిన ఈ వర్గాలవల్ల, సమానావకాశాలు లేక పనిపాటల్లో సంభవించే అవరోధాలవల్ల మన సంఘంలో వేలకు వేలు నిందలూ – నైచ్యాలూ సంభవిస్తున్నాయి.''

నేను చిన్నగదిలో కుర్చీలో కూర్చుని వింటున్నాను. వింటూ కూర్చున్నాను. ఈ యింట్లోకి వచ్చినప్పటినుంచీ అతడు కాసేపుకూడా కూర్చున్నదిలేదు. పచార్లు చేస్తూ మధ్య అప్పుడప్పుడు కాస్త నిల్చిపోతాడు. మళ్ళీ పచార్లు చేస్తుంటాడు. ఎప్పుడన్నా కుర్చీ పట్టుకుని నిల్చుంటాడు నా ముఖంలోకి అలాగే చూస్తూ. అతని వాగ్ధోరణి రకరకాలుగా సాగిపోతూ ఉంది. కాసపు స్తబ్ధచిత్తుడులా మాటాడతాడు. ఒకప్పుడు కంఠస్వరం చాల నెమ్మదిగా ఉంటుంది. మరొకప్పుడు చాల వేగంగా, తీక్షణంగా చెప్పుకు పోతూ ఉంటాడు. నేను కేవలం ఉపలక్ష్యంగా ఉన్నాను, అంతే. రెప్పవాల్చకుండా నన్ను అతడు చూస్తూ ఉన్న సమయంలో క్షణమాత్రంగా నా స్త్రీ – శరీరం ప్రకాశవంతం అయిపోతున్నది—ఈ శరీరాన్ని గురించిన జ్ఞానం కలుగుతున్నది. కాని కనిపెడుతున్నాను కదా : అతని చూపు ఒకచోట నిల్చి ఉండటానికి అవకాశంగా మాత్రమే కొన్ని లక్షణాలపాటు నేను ఆధారబిందువును ఔతున్నాను; ఆతరువాత మళ్ళీ మామూలు 'శూన్యం' గానే మారిపోతున్నాను. అక్కడ నాదేంలేదు; నేను చేస్తున్నదేంలేదు. నన్నూ, నా ఉనికినీ నిరూపించుకునేందుకు నేను చేసిన ప్రయత్నమూ లేదు. నాలో నేను ఎన్నోసార్లు అనుకున్నాను : "ఈ నితాంత ఏకాంత వాతావరణంలో

నేను నిశ్శబ్దంగా, నీరసంగా, నిశ్చేష్టనై, ఆత్మవిస్మృతురాలినై పోతున్న ఇతన్ని—ఇతని విచిత్ర వాగ్ధోరణిని—సహిస్తూ ఎందుకు ఇలా కూర్చున్నాను ఇక్కడ? నా స్వకీయమైనది ఎంతో ఉన్న 'నాది' అనబడే - నేను ఉన్న నా చోటికి నన్ను నేను తీసుకుని పోనేం?" కాని నేను కదల్లేకపోయాను—నిశ్శంకమూ, నిర్వ్యాజమూ, అనివార్యమూ అయిన అతని ఆత్మక్షేపాన్ని సాక్షిమాత్రంగా చూస్తూ అలాగే కూర్చున్నాను. ఏం మాటాడ్డానికీ, ఏం చెయ్యటానికీ నా కేమీ తోచలేదు పెట్టలేదు.

మూడు నాలుగు నిమిషాలు అతడు తన ధోరణి ఆపి, నిశ్శబ్దంగా ఆ చిన్న గదిలో ఇటునుంచి అటూ, అటునుంచి ఇటూ తిరుగుతూ ఉన్నాడు. ఆ సమయంలో వచ్చాయి నాకు పైన చెప్పిన నన్ను గురించిన ఆలోచనలన్నీ. వచ్చాయి ఆ ఆలోచనలు ఆ కాసేపు; మళ్ళీ మాయమైపోయాయి. నేను అతనివైపు చూస్తూ అలాగే కూర్చున్నా. అతడు పచార్లు చేస్తూఉన్నాడు. మనిషి. విభ్రాంతస్థితిలో ఉన్నాడు. కాని శాంతంగా కనిపిస్తున్నాడు. ఏం కానున్నదో కదా! నే నిక్కడికి ఎందుకు వచ్చాను? అతనిక్కడ ఎందుకు ఉన్నాడు? ఏం కావలసి ఉన్నదో కదా!

హఠాత్తుగా అతను ఆగాడు, ముందుకు సాగాడు, "సుఖదా!" అని పిల్చాడు.

కంఠంలో గాద్గదికం కనిపించింది-

"సుఖదా!"

ఈలోగా నా కుర్చీకి చాల దగ్గరగా వచ్చాడు. అతని ఎట్టూర్పులోని వెచ్చదనం, బాష్పబిందువుల వేడి నా శరీరాన్ని వచ్చి స్పృశించాయి.

"సుఖదా !"

నా గడ్డం పుచ్చుకుని ముఖాన్ని పైకి ఎత్తాడు. నా కన్నుల్లో భయం ద్యోతకమైందా ? నా గడ్డం విడిచిపెట్టాడు. ఎత్తిన నా ముఖం ఎత్తినట్టుగానే ఉండిపోయింది. అతడు ముందుకు వంగాడు. నిశ్చేష్టనై ఉన్న నా ఎడమచెయ్యి తన రెండు చేతుల్లో గట్టిగా పట్టుకుని నలుపుతూ "నన్నేం చేయమంటావు సుఖదా ! నువు చెప్పు ! నే నేం చేసేది ?"

ఆ మాటల్లోని మిక్కుటమైన ఒకానొక బాధ చీల్చుకుంటూ నాలోకి జొరబారింది. నే నేమీ మాటాడలేదు.

హఠాత్తుగా అతడు క్రింద కూలబడిపోయాడు. నా మోకాళ్ళమీద తల మోపి కూలబడ్డాడు. "నే నేంచెయ్యను సుఖీ ! ఏం చెయ్యను ?" అన్నాడు ఆర్ద్రకంఠంతో – ఆర్త స్వరంతో.

నాలోనుంచి ఒక్క శబ్దంకూడా పెదవిమీదుగా బైటికి రాలేదు. అలా నా ఒడిలో తలపెట్టుకుని పడివున్న ఆ పురుషుని తలవెంట్రుకలు నిమురుతూ అలాగే కూర్చున్నాను. బాధ అనుభవించెయ్యటంకంటే వేరే ఓదార్పు ఏముంటుంది ? నేనూ కన్నీళ్లు విడిచానో లేదో నాకు జ్ఞాపకం లేదు. విడిచినా, విడవక పోయినా—రెండూ ఒకటే. కాని నా ఒడిలోమాత్రం కన్నీళ్లు

విరివిగా ప్రవహించాయి. నాకు తెలియకుండానే నా రెండు చేతులతో అతని తల నిమురుతూ ప్రేమగా అన్నాను : "లే, లాల్ ! లే."

అతను తలెత్తాడు. నావైపు చూచాడు. అశ్రుసిక్తములైన నేత్రాలు ! లజ్జారుణములైన నేత్రాలు ! ఒక నీరసమైన, వ్యాకులమైన, అలసిపోయిన, తృప్తి సూచకమైన మందహాసం!

ఆసమయాన నాకు అర్థం అయింది : "పురుషుడు ఎంత దుర్దముడు, దుర్ధర్షుడు అయినా, ఒకప్పుడు ఎంత ఉపాయ శూన్యుడు అయిపోతాడో కదా !

"సరిగ్గా అదే సమయంలో నిస్సహాయురాలు, అబల అయినా స్త్రీకి ఎంత ఓర్పు ! ఎంత సామర్థ్యం !"

"ఇక వెడదామా ?" అడిగాను నవ్వుతూ.

"వెడదాం."

"ఉదయాన వెళ్ళిపోవటమేనా ?"

"ఆఁ."

"ఎక్కడికి వెడతావు ?"

"చెప్పలేను."

"ఎందుకూ వెళ్ళటం ?"

"ప్రభాత్ తన అనిష్టాన్ని కోరి తెచ్చుకుంటున్నాడు. అతన్ని కాపాడాలి."

"అతనికోసం నువ్వు వెళ్ళిపోవలసిన అవసరం లేదు. అతన్ని నేను దారిలో పెడతాను."

"వద్దు. నీకు తెలీదు అతని సంగతి. తాను విశ్వసించిన హారీశ్ కోసం ఖూనీ చెయ్యగలడు అతను."

"ఎరుగుదును. కాని నా ముఖం చూచి అతడు ఒక హత్య మానివేయగలడు."

"ఊహుఁ. నీకు వాళ్ళసంగతి బాగా తెలియదు—"

అంటూనే తన చేతి గడియారం చూచుకున్నాడు. పురుషునిలో ఉండే ఈ పౌరుషానికే నాకు ఆశ్చర్యంవేస్తూ ఉంటుంది. క్షణకాలం అతడు బాహ్యప్రపంచాన్ని విస్మరించ గలడు. ఆవెంటనే మళ్ళీ గుర్తుకు తెచ్చుకుంటాడు; మరుపు మరుపుగానే ఉండిపోదు. ఇక్కడే మా స్త్రీలు అసమర్థలు; ఓడిపోతారు. ఇక మా అవరోధం అతనికి ఉండదు. అందుకే అతనికి కృతజ్ఞులం ఔతాం.

"అబ్బా!"

"ఏం?"

"పదిహేను నిమిషాలు ఎక్కువే అయిపోయింది. కాబట్టి సుఖదా! ఇక నువ్వు ఇంటికి నడిచి పోవల్సిందే. తాళం చెవి నీదగ్గరే ఉందిగా! నిన్న నేను తెచ్చియిచ్చిన తోలు పెట్టెలో వెనుకభాగంలో ఒక రహస్యపు సొరుగు ఉంది. అది మీవారుగాని, నువ్వుగాని గమనించినట్టులేదు. అందులో పైకం

ఉంటుంది చూడు. మీవారికి ఆ సంగతి చెప్పవలసిన అవసరం లేదు. ఇంకో విషయం : క్షమించాలి, నాకూ కొద్దిగా తెలిసింది: మీ అబ్బాయిని నైనిటాలుకు పంపించి చదివించే ఆలోచన మానుకోనక్కర్లేదు. నేను ఇప్పుడు కాకులో చాల దూరం వెళ్ళిపోవాలి. నిన్ను ఇంటిదాకా తీసుకుపోయి దిగబెట్టలేకపోతున్నందుకు చాల విచారిస్తున్నాను. జరిగినదంతా మరచిపో. I am Sorry."

సావధానుడై, కృతసంకల్పుడై లేచి నిల్చున్నాడు.

కాతరమైన కంఠస్వరాన "ఎక్కడికి వెడతావు ? వెళ్ళద్దు" అన్నాను బ్రతిమాలుతున్నదానిలాగ. కాని పురుషుడు ఆడదాని తర్కానికి ఎప్పుడు తల వంచాడు ?

అతడు నవ్వాడు. "పద, వెడదాం."

నా మెడమీద తన బలిష్ఠమైన చేయి వేసి నన్ను తీసుకువెళ్ళాడు. ఓదార్పుమాట ఒక్కటికూడా పలకలేదు. వాకిలి తలుపు తెరిచి నన్ను బైటికి పంపించాడు. తాను లోపలే ఉండి తలుపు వేసేశాడు. నేను బైట దిగాలుపడి నిల్చున్నాను. అతడింకా గోడదూకి వస్తాడనీ, కొంతదూరం నన్ను వెంటవచ్చి పంపిస్తాడనీ అనుకున్నాను. సరిగా నేనతనికి వీడ్కోలు చెప్పలేదు కూడాను. కాని అయిదారు నిముషాల వరకూ అతడు రానేలేదు. నా తెలివితక్కువకు నేనే నవ్వుకుని ఇంటిదారి పట్టాను "అయ్యో ! ఆడదానా !" అనుకుంటూ.

# 20

భగవంతుడు స్త్రీ హృదయాన్ని ఎలా తయారుచేశాడో కదా! లాల్ నామీద ఎంతో విశ్వాసం పెట్టుకుని పోయాడు. అది ఒక తాకట్టు వస్తువుగా నా దగ్గరే భద్రంగా అట్టిపెట్టుకున్నాను. మావారికి కూడా చెప్పదలచుకోలేదు. తోలుపెట్టె వెనక సొరుగులో అయిదువేల రూపాయలు ఉన్నాయి. అవి జాగ్రత్తగా దాచిపెట్టాను. ఈ సంగతి ఎవరికీ చెప్పదలచుకోలేదు నేను. ఒక వ్యక్తి మరో వ్యక్తికి అప్పగించి పోయిన తాకట్టు వస్తువులాంటిది ఇది. ఇంకెవరికీ ఈ వ్యవహారంలో జోక్యం ఉండవలసిన అవసరంలేదు. ఆ వ్యక్తిని నేను ఇంతవరకూ సరిగా ఎరగను. రెండుమూడుసార్లు మాత్రమే అతన్ని కలిశాను. అయినా తన సర్వం ఒక్కసారిగా నాకు అప్పగించేసి వెళ్ళిపోయాడే! ఏం మూర్ఖత యిది! అతని యీ మూర్ఖత నాలోనే అట్టిపెట్టుకోటంకంటే నేనేం చెయ్యగలను? చుట్టాలు, స్నేహితులు, ఎరిగిన వాళ్ళు—ఎవరికీ ఈ రహస్యం తెలియదు. ఈ వ్యవహారమంతా నా ఒక్క హృదయం లోతుల్లోనే దాగిపోయి ఉంది. ఎవరికీ ఏమాత్రమూ దీని పొడకూడా అంతుబట్టదు. ఇది కేవలం నాది, నాకు సంబంధించింది. ఇక్కడా అక్కడా పెగిలి బైటపడవలసిన అవసరంలేదు. సంసారసంబంధమైన, సమాజసంబంధమైన కర్తవ్యాల భూమికకూ దానికీ ఏ సంబంధమూ లేదు.

"ఏమైంది సుఖదా ? ఏమిటి సమాచారం ?" మావారు అడిగారు.

సుఖద కృతజ్ఞతాసూచకంగా మందహాసంచేసింది. "అతడు ఎక్కడికో వెళ్ళిపోవాల్సిన పని పడింది. బహుశా దేశాంతరం ! హరీశబాబు ఇంటి తాళంచెవి నాకు ఇచ్చాడు."

"నీకా ? ఎందుకూ ?"

"ఏమో మరి ! ఇవ్వటానికి ఇంకెవరూ కనిపించ లేదేమో ! సంఘసభ్యులు చాలమంది అతనికి శత్రువులై పోయారని విన్నాను."

మావారు నిశ్చలంగా, ప్రసన్నంగా ఇలా అన్నారు. "ఎందువల్లనో నాకు తెలుసు. నువ్వు ఇప్పుడు ఎలా ఉన్నావో నీకు తెలుసా సుఖదా ! యతీశ్వరుడుకూడా నిన్ను చూస్తే ముగ్ధుడైపోవాల్సిందే !"

నాలో ఒక గంభీరమైన వ్యథ ఉదయించింది. సిగ్గు పడ్డాను. "చాల్లెద్దురూ ! మరీను !"

మావారు అంతటితో విడిచిపెట్టలేదు. ఇంకా వినోదం సాగించారు. వారి నిర్దాక్షిణ్యత నిర్దాక్షిణ్యత అనటానికి వీల్లేదు. వారిమాటల్లో వ్యంగ్యమూ ఏమీ లేదు. "నిజం చెబుతున్నాను సుఖదా ! నీ రూపం చూస్తుంటే...నువ్వు నిజంగా నా దగ్గర ఉండవలసినదానివేనా ? అని అనిపిస్తున్నది. ఒకవేళ——"

నేను కోపం తెచ్చుకున్నాను. "మీరు అలాంటి మాటలు అంటూంటే నే నిక్కడినించి వెళ్లిపోతాను."

వారు అరమోడ్పు కన్నులతో నాకేసి చూచారు· "సరేలే, ఇక అననులే, కాని నా మాట యథార్థం సుమీ !... ఇంతకూ లాల్ కోరిక ఏమిటి ?"

"అతను వెళ్ళిపోయాడు. మీరు నాకు ఒక్క పని చేసిపెట్టాలి. వార్తాపత్రికల్లో ఒక ప్రకటన వేయించండి : కాలేజిలో చదువుకుంటూ ఉండే యోగ్యులూ, ఉపాధిలేని వాళ్ళూ అయిన నలుగురు విద్యార్థులకు ఉండటానికీ, భోజ నానికీ ఉచిత వసతి ఏర్పాటు చేయబడుతుందనీ; వలసినవారు దరఖాస్తు పెట్టుకోవచ్చుననిన్నీ...ఆఁ మీకు తెలుసునా – ప్రభాత్ ఎక్కడ ఉంటున్నాడో ?"

"నాకేం తెలుసు ?"

"అతన్ని పిలిపించాలి ఒకసారి."

"వస్తూపోతూనే ఉంటాడుగా ! విచారం ఎందుకూ ?"

"విచారమే మరి ! పాపం ! ఎక్కడ ఏ మురికికూపంలో గడుపుకుంటున్నాడో యేమో ! అతనికి బస అది ఆ యింట్లో ఏర్పాటు చేయవలసిందిగా చెప్పాడు లాల్. తాళంచెవి అతనికి అప్పగించేస్తే నా భారం వొదిలిపోతుంది."

నా మాటల్లో అర్థం వారికి ఎలా తోచిందో మరి. అడిగారు : "బస అది ఏర్పాటు ! అంటే ?"

"అతను కొంత డబ్బు ఇచ్చి వెళ్ళాడు."

"డబ్బు! ఎంత ఇచ్చాడు? ఏదో నిధి అప్పగించి వెళ్లి నట్లు మాటాడుతున్నావే! అదీగాక—"

"ఔను. అప్పగించే వెళ్లాడు."

"సుఖదా!"

మావారు స్తబ్ధచిత్తులై, చకితులై నావైపు చూచారు. నా మనస్సుకు బాధ కలిగింది. వారికి కష్టం కలగకుండా చూడటం ఎలాగ? వారిది చాల ఉదారమైన, నిశ్చలమైన, కోమలమైన హృదయం. చెప్పేశాను: "తోలుపెట్టె వెనక అరలో అతను కొంత డబ్బు పెట్టాడు. బహుశా మీరు చూడలేదు కాబోలు!"

"బహుశా నువ్వు చూపించలేదు కాబోలు! సుఖదా... నిజం చెప్పు. ఏమిటి ఇదంతా?"

"ఔను. ఇదివరకు మీకు ఈ సంగతి చెప్పలేదు; ఇప్పటికే మీకు ఎంత కష్టం కలిగిందో చూడండి! అటువంటి కష్టం మీకు నే నెలా కలిగించటానికి ఇష్టపడేదీ?"

మావారు ఆలోచనలో పడ్డారు. కూర్చున్నవారు లేచారు. అటూ ఇటూ తిరగటం ఆరంభించారు. "అతను ఎవరో నీకు తెలుసా? డబ్బు ఎక్కడినించి ఎలా తెస్తాడో నువు ఎరుగుదువా?"

"నాకు తెలియదు."

"మరి చెయి చాచి ఆ డబ్బు ఎలా తీసుకున్నావు సుఖదా ? అది సిగ్గుచేటు సుమా !"

"ఔను, నిజమే."

"మరి ?"

"మరి...నాకేం తెలీదు. అయిందేదో అయింది. అతను ఇక్కడ లేడు. వెళ్లిపోయాడు. చాటున అతన్ని గురించి మనం చెడుగా అనుకోకూడదు."

మావారు కాసేపు మౌనంగా పచార్లుచేస్తూ ఉండి పోయారు. చివరకు హఠాత్తుగా "సుఖదా! నువ్వు నానుంచి ఆశించేదేమిటో చెప్పు ?" అని అడిగారు.

ఆయన మనస్సులో చాల కష్టపడుతున్నారని నేను గ్రహించాను. లేచి వచ్చి వారి పాదాలమీద వాలిపోయాను. "నన్ను మీరెందుకు శిక్షించరు ?"

మావారు అలాగే నిల్చిపోయారు. గాభరాపడుతూ అడుగు వెనక్కు వేశారు. వారి పాదాలమీదనుంచి నా చేతులు నేల కరచుకుని ఉండిపోయాయి. కొన్ని క్షణాలు వారు అలాగే నిల్చి ఉన్నారు. చివరకు వచ్చి నా బుజాలు రెండూ పుచ్చుకుని లేవదీశారు. ఏమీ మాటాడలేదు. నా రెండు చెంపలూ తన రెండు చేతుల్లో ఇముడ్చుకుని నా ముఖాన్ని తమవైపుకు తిప్పుకున్నారు. నా కన్నుల్లోకి చూస్తూ నిల్చున్నారు. ప్రకృతిసిద్ధంగా పురుషునికి స్త్రీకన్నా ఆధిక్యత ఎందుకు లభించిందో నాకు అప్పుడు అర్థం అయింది. ఇద్దరి

మధ్యా ఇటువంటి అవసరం సిద్ధించేందుకే. వంగివున్న వారి ముఖానికీ, ఎత్తివున్న నా ముఖానికీ మధ్య ఒక అంగుళం ఎడం మాత్రమే ఉంది. ఆ కాస్త దూరం నుంచే వారు నా కన్నుల్లోకి స్థిరంగా చూస్తూ నిల్చున్నారు. అప్పుడు నా కళ్ళు పూర్తిగా తెరచుకుని ఉండలేక పోయాను. కొంచెం ఎత్తున వారి ముఖం...తీయని జలాలు నిండిన మబ్బునీడవలె కనిపించింది. వారు వేరు, నేను వేరు అన్న భావమే లేదు.

ఏమి క్షణం అది ! ఒక్క క్షణం ! కాని ఆ క్షణమే అనంతం ! అనంతమైన ప్రేమ ! అనంతమైన ధైర్యం ! ఆ క్షణం అయిన తర్వాత నేను ఇవతల నిల్చుని ఉన్నాను. మావారు అంటున్నారు : "ఊహుఁ. నేను లోతు కనిపెట్టలేను. అందుకు ప్రయత్నం చెయ్యను కూడా. ఏమంటావు మరి ! నైనిటాల్ వెళ్ళాల్సిందేనా ?"

"ఆఁ-

ఆ సమయంలో అంత తేలిగ్గా 'ఆఁ—' అని ఎలా అనేశానో ఇవాళ నేను ఊహించలేకపోతున్నాను. భర్తకు తనను తాను సమర్పించుకుని, అతనిలో లీనమౌతున్నప్పుడుకూడా తన పంతాన్ని విడవలేకపోవటం—అదేనా స్త్రీత్వం ? ఈ దురభిమానమే కారణంగా ప్రపంచంలో స్త్రీ ఎంత అభాగ్యురాలౌతున్నది !

"సరే అయితే, రేపే వెడుతున్నాను." అన్నారాయన.

"ట్రోలుపెట్టె వెనక సొరుగులో అయిదువేల రూపాయలు దొరికాయి." అన్నాను.

"అందులో ఒక్క పైసకూడా నైనీటాల్‌కు ఉపయోగించవచ్చునని అనుకోవద్దు."

నేనేమీ మాటాడలేదు. ఎందుచేతనంటే—ఆ డబ్బు నామటుకు నాకు నిషిద్ధంగా ఏమీ కనిపించలేదు. మనస్ఫూర్తిగా అతడు నాకు డబ్బు, తాళంచెవి ఇచ్చి ఎక్కడికో మాయమైపోయాడు. చుట్టం అనిగానీ, పరాయివాడనిగానీ, అనుకోటానికి ఎదుట లేడు కదా! నేను మాటాడకుండా వారిని తీసుకుపోయి అయిదువేల రూపాయలూతీసి చూపించి వారికి ఇచ్చాను.

"అదేమిటి? నా కిస్తావేం?"

"నే నెక్కడ దాచిపెట్టేదీ మరి?"

"పెట్టావుగా 'సేఫ్' లో."

"మీరు నా 'సేఫ్' కాదా?"

వారు నా ముఖంలోకి చూచారు. ఆ చూపు ఎదుర్కొనేసరికి ఏదో భయం ఆవేశించినట్టయింది నాకు. అట్టే కౌగలింతలో నన్ను బంధించేసుకున్నారంటే ఏంచెయ్యను? రెండు చేతుల్లో నన్ను పుచ్చుకుని, పిండిపిండిగా నలిపి, తమలో లీనంచేసుకుందామన్న తాపత్రయంతో ఉన్న మనిషిలా కనిపించారు. ఒకానొక భయంతో కూడుకున్న ప్రేమత్రో నా శరీరం పులకరించింది. వారి కన్నుల్లోని వాంఛ నా హృద

యంలో జ్వాలలు రేపింది. కాని వారు హఠాత్తుగా ఒక నిట్టూర్పు విడిచారు. ఒడలు ముడుచుకున్నారు. అక్కడ నించి దూరంగా వెళ్లారు. నేను క్షణకాలం అక్కడే విస్తుపోయి, స్తంభంలా నిలవబడిపోయాను...ఏదో ఆశాభంగం కలిగినదానిలాగా. నామీద నాకే ధిక్కృతి కలిగింది. నన్ను నేనే బాదుకుందామనుకున్నాను. కాని అటువంటి పనేమీ చెయ్యలేదు. కాసేపటికి వారే తిరిగివచ్చారు. కేవలం వ్యవహార పద్ధతిలో వలె, పైకం నాచేతికి అందిస్తూ అన్నారు: "తీసుకో; దాచిపెట్టు."

ఆ సమయంలో ఇక మా యిద్దరి మధ్య కేవలం వ్యవహారరీత్యా ఉండే సంబంధం లాంటిది తప్ప మరోలాంటిదేమీ మిగిలి ఉండలేదు. మాట్లాడాం చాల విషయాలే: నైనిటాల్‌కు ఎప్పుడు ఏ బండికి వెళ్లాలి? వార్తాపత్రికలకు ప్రకటన ఎప్పుడు ఇవ్వాలి? ఆ యింట్లో విద్యార్థులకు బస ఏర్పాట్లు ఎలా చేస్తే బాగుంటుంది? నౌకర్లను ఎప్పుడు నియమించాలి? ప్రభాత్, ఇంకా ఇతర విద్యార్థులు వచ్చాక ఎంత జీతం మీద వంటమనిషిని కుదర్చాలి? ఇత్యాది విషయాలు.

వ్యవహారపద్ధతిలో మంచి పదును, బలం ఉన్నట్టు నాకు తెలియవచ్చింది ఆ సమయాన. అది ఇద్దరు వ్యక్తులను కలుపుతుంది; కలిపినా వేరువేరుగా, ఎడమెడంగానే ఉంచుతుంది. వారు అవతల ఒడ్డు, నేను ఇవతల ఒడ్డు. మధ్యన వ్యవహారం ఇద్దర్నీ కలుపుతోంది, కాని కలపటం ఎక్కడ? వేరువేరుగా దూరంగానే ఉంచుతోందిగా!

నా విషయంలో నా అంతట నేను ఏమీ చేయలేక పోయాను. చూస్తూ ఉన్నాను. ఒక్కొక్క అంశమే నిర్ణయం జౌతూ వచ్చింది. మావారు...రేపటిదాకా ఎందుకూ ? ఇవాళే, ఇవాళ సాయంత్రమే, ఇప్పటికిప్పుడే ప్రయాణమై వెళ్ళటానికి సిద్ధంగానే ఉన్నారు...కాదు కాదు, ఆత్రతగా ఉన్నారు.

ఇదంతా చూస్తోంటే నా హృదయంలో ఒకవిధమైన వ్యధ పొడసూపి, పరివ్యాప్తమై, దుర్భర మనిపించింది.

ఆజ్ఞాపాలన నిమిత్తం మావారు నిజంగా ఆ సాయంత్రమే నైనిటాల్‌కు బయలుదేరి వెళ్ళారు. తీవ్రమైన గాయం తగిలిన మనిషిలా నిశ్చేష్టనై చూస్తూ కూర్చున్నాను నేను. లేచి ఆయన పాదాలమీద పడలేకపోయాను. వెళ్ళవద్దని ప్రతిమాలలేకపోయాను.

"మీరు నా ప్రభువులు. నన్ను దాసీదానిలాగే చూడండి. నా మాట వెంటనే మీరు ఏదీ పాటించబోకండి. నేనే మీ మాట పాటించి నడుచుకునేలాగ అధికారికంగా ఆజ్ఞాపించండి లేకపోతే లాభంలేదు" అని ఇలాగ విజ్ఞప్తి చెప్పుకోలేక పోయాను.

ఇవాళ అనిపిస్తోంది నాకు ; ఆనాడేగనక వారు... పురుషోచితమైన ఆత్మవిశ్వాసంతో 'ఇది ఇంతే' 'అది అలా జరగాల్సిందే' అని స్వాధికారం చలాయించుకునే ఉన్నట్టయితే... నేను లోలోపల ఎంత గింజుకున్నా, పైకి ఎంత మారాం

చేసినా...చివరకు వారి మాటకే విలువ ఇచ్చి ఉండేదాన్ని, వారిదే పై చేయిగా అంగీకరించి ఉండేదాన్ని; నాకు నేను ధన్యవాదాలు చెప్పుకుండేదాన్ని. కాని విధవిహితంగా జరగవలసిందేదో అదే జరిగింది; జరగరానిది జరగనే లేదు. నేను ఈ ఒడ్డులేని మహాసముద్రంలో పడి కొట్టుకు వచ్చి వచ్చి...ఈ నా కథ చెప్పుకోవలసిన ఈ గతికి వచ్చాను.

# 21

రెండు వారాలు గడిచాయి. ప్రభాత్ రానేలేదు. అతను ఎక్కడ ఉంటున్నదీకూడా జాడ తెలియలేదు. ఇంకా జరగవలసిన పనులు కూడా ఏమీ జరగలేదు. మావారు నైనిటాల్ వెళ్ళి వచ్చారు. వినోద్‌ను చేర్చుకోటానికి వాళ్ళు అంగీకరించారట. అక్కడ అన్ని ఏర్పాట్లూ చేసుకొనే వచ్చారట. ఆ కబురు విన్న తరువాత నాలో ఇదివరకు ఉండిన పంతం అంతా ఏమైందో మరి! వినోద్‌ను అక్కడికి పంపించకుండా ఉంటేనే బాగుంటుందనికూడా అనిపించింది.

"సెషన్ ఎప్పటినించి ఆరంభిస్తారట?"

"మార్చినించి."

"మార్చి! మార్చిలో ఎలా వెళ్ళటానికి వీలుపడుతుందబ్బా! ఫీజు కట్టి రాలేముకదా!"

"అన్నియేర్పాట్లూ చేసే రమ్మన్నావుగా! పేరు ఎక్కించాను. నూరు రూపాయలు జమకట్టించాను."

నేను ఆ విషయమై ప్రసంగించలేదు. నా మనస్సు నీరసపడిపోయింది. వ్యాకులత పైకి ఎలా చెప్పమనేది? ఆ యింట్లో ఇంకా చెయ్యవలసిన ఏర్పాట్లేమీ చెయ్యనేలేదు. నాటినించి నేటివరకూ ఒక్కసారైనా నేనక్కడికి వెళ్ళి చూడ నేలేదు. మనస్సుకు ఏదోవిచారంగా ఉంటోంది. సోమరితనం ఎక్కువైంది. నా స్థితి ఇంత విలక్షణంగా ఉన్నదేమిటి? అని మాటిమాటికీ అనుకుంటూ ఉంటాను; నాకు నేనే నవ్వుకుంటూ ఉంటాను. ఏదో బాధ్యత నెత్తిమీద ఉన్నట్టు అనిపిస్తూ ఉంటుంది, కర్తవ్యం మాత్రం ఏమీలేదు!

ఒక ఉత్తరం ఇచ్చారు మావారు నా చేతికి.

నా ఉత్తరాలు నాకే నేరుగా రావటం ఇంతవరకూ ఆచారం లేదు. "ఎవరిదా ఉత్తరం?"

"నీదే."

"చదివే ఉంటారుగా! ఎవరు రాసింది?" - కోపంగా అడిగాను.

"నేను చదవలేదు."

కవరు చించిలేదు. ఇప్పుడు చూచాను ఆ సంగతి ఇదివరకు ఎన్నడూ లేదు ఈ పద్ధతి. నేను ఉత్తరం చేతికి తీసుకున్నానో లేదో మావారు అక్కడినించి దూరంగా వెళ్ళిపోయారు. "వెళ్ళిపోకండీ, రండి, కవరు మీరే చించి నాకు వినిపించండి" అని బిగ్గగా అరుద్దామనుకున్నాను. కాని ఆ కవరు, కవరుమీది అక్షరాలూ చాల కొత్తగా ఉన్నాయి. విప్పి చదువుకున్నాను.

చదువుకున్న తరువాత నాకు చాల సిగ్గయింది. దగ్గర ఎవరూ లేనందుకు సంతోషించాను. ఆ సమయంలో నన్ను ఎవరైనా చూచి వుండటం నాకు దుస్సహమనిపించేది. సిగ్గుచేత నా ముఖం కందగడ్డ అయిపోయిందంటే ఆశ్చర్యం ఏమీ లేదు. ఉత్తరం మరోసారి చదువుకోలేకపోయాను. అది లాల్ రాసిన ఉత్తరం. కాని ధైర్యంగా మావారికోసం వెతుక్కుంటూ లోనికి వెళ్ళాను. "ఏమండీ! చూస్తారా ఈ ఉత్తరం? లాల్ రాశాడు" అన్నాను.

"నా సంగతేమన్నా ఉందా అందులో?"

"విశేషం ఏమీ లేదు."

"అయితే నేను చూడనక్కర్లేదు."

"జపాన్ వెడతాట్ట. మిమ్మల్ని అడిగానని చెప్పమన్నాడు."

"అలాగా!" అంటూ వారు నా సమక్షంలోనుంచి వెళ్ళిపోయారు. ఏదో పని కల్పించుకుని అందులో నిమగ్నులైనారు.

ఏ విధంగానూ ఉత్తరం మావారి చేతికి ఇవ్వనే లేకపోయాను. అది రాసిన తీరులో సభ్యత చాల తక్కువగానే ఉంది. అతనికి నాయందు గల విశ్వాసానికి మాత్రం నా హృదయం కృతజ్ఞతతో నిండిపోయింది. తాను జపాన్ వెళ్ళే ప్రయత్నంలో ఉన్నట్టు రాశాడు. మన దేశంలో విప్లవోద్యమం పాత పద్ధతుల మీదే సాగించదలచటం లాభంలేని పని. దానికి

కొత్త శక్తిని జోడించవలసిన అవసరం ఉంది. ఇక్కడ మానవుడు ఇల్లు-వాకిలి-సంసారం గోడల్లో కంఠదఘ్నంగా మునిగిపోయి ఉంటాడు. ఈ సంకుచితమైన పరిధిలో భారతీయ నైతిక శక్తి నిర్బంధితమై ఉంటున్నది. కాగా వ్యక్తిలో కనిపించదు; మందంగా ఉంటాడు. ఇప్పుడు కౌటుంబిక సంస్కృతి కాదు కావలసింది; సామాజిక సంస్కృతి అవసరం. కౌటుంబిక వ్యవస్థ స్వార్థాన్ని పెంచుతుంది. అది సార్వజనిక సమైక్యతకు పెద్ద ఆటంకం ఔతున్నది. మన సంస్కృతి మనల్ని సంసారం అనే ఊబిలో పాతేసింది. అందుచేత వెనకబడేవున్నాం. చిన్న చిన్న స్వార్థాలు అనే సుడిగుండాల్లో పడి కొట్టుకుంటూ ముందుకు పోలేకపోతున్నాం. అందరం ఎవరికి వారుగా విడివిడిగా ఉంటున్నాం చెదరిపోయి. ఒకటిగా కలిసికట్టుగా సమీకరించుకోలేకపోతున్నాం. ఈ అనర్థానికంతకూ మూలం వివాహం. ఇది ప్రేమను ఒకచోట బంధించివేస్తోంది; విడుదల ప్రసాదించదు. ప్రేమ అనేది ఒక బలవత్తరమైన శక్తి. అదే నిర్బంధితమై ఉంటే ఇక సర్వం నాశనమైపోయినట్టే. కొన్ని కుటుంబాలవారు నన్ను తమ ఇండ్లకే రానీయరసలు. అటువంటి వ్యక్తిని - నన్ను - నువుకూడా సుఖదా, దూరంగా అట్టిపెట్టటమే మంచిది! అతడు దగ్గరకు రావాలనే చూస్తాడు; నువు మాత్రం అతన్ని దగ్గరకు రానీకు...తాను చావుకు భయపడే మనిషి కాదనీ; ప్రజల్లో ఉన్న అనైక్యతకూ, తుచ్ఛభావాలకూ మాత్రమే భయపడతాననీ, అందువల్లనే ఇక్కడినుంచి దూరంగా వెళ్ళిపోతున్నాననీ రాశాడు. 'లోకులముందు నువు నన్ను గురించి దయగా ప్రసంగించనక్కర్లేదు. నేను

సరైన మనిషిని కాదు; సరైన మనిషినిగా నన్ను ప్రజలు భావించాలని కోరుకోటమూ లేదు. ప్రభాత్ తన పనిలో కృతార్థుడు కాలేకపోతున్నాడే అని మాత్రం నాకు విచారంగా ఉంది. కాని అతనితో చెప్పు : ఆ పనికి ఇంకా ముందు ముందు అవకాశం వస్తుందనీ, అప్పుడు లాల్ అతనికి అన్ని విధాలా సౌకర్యాలు కలిగిస్తాడనీన్నీ...' ఇలా రాసుకుపోయాడు.

ఉత్తరంలో ప్రధానవిషయం ఏమిటో నాకు బోధపడలేదు. తీయనిమాట లేమీ లేవు. భాష చిందరవందరగా ఉంది. అది నా హృదయపు లోతుల్లోకి చొచ్చుకుపోయింది. అది కేవలం ఉత్తరం కాదు. అందులో అతని స్వకీయ వ్యక్తిత్వం ప్రస్ఫుటంగా అంకితమై ఉంది.

నాడు సాయంత్రం ప్రభాత్ వచ్చాడు. అతని యోగ్యతలు నాకు అంతవరకూ ఎక్కువగా ఏమీ తెలియవు. మంచి వాక్చాతుర్యం గల మనిషని నాకు ఆసమయాన తెలిసింది. "ఎక్కడ ఉంటున్నావు ? ఏం కథ ? బాగా చదువుతున్నావా ?" అని అడిగాను.

"ఆఁ, చదువుతూనే ఉన్నాను. ఫైనల్ ఇయర్ కదా !" అన్నాడు.

లాల్‌ను గురించిన ప్రసంగం ఇప్పుడు కాకపోతే ఇంకా సేపటికైనా అతడు తీసుకువస్తాడనే నా నమ్మకం. అందుచేత నేనే ముందుగా అడిగాను : "ఏం ప్రభాత్ ! హరీశ్ బాబు ఎక్కడ ఉన్నట్టు ? లాల్ బాబు సమాచారం ఏమిటి ?" అని.

"తన జాడ ఇతర్లకు తెలియటం హరీశబాబుకు ఇష్టం లేదు. లాల్‌బాబు సమాచారం నాకేమీ తెలియదు."

"ఏం? లాల్‌బాబు మీకు కలవటం లేదా? ఎక్కడి కేనా వెళ్ళిపోయాడా ఏమిటి?"

"కొన్నాళ్ళనుంచి నా చదువులోనే నేను పడి ఇస్తా తున్నాను. మిగతా విషయాలేవీ పట్టించుకోటం లేదు. అయినా అతని సమాచారం మీకు తెలియకుండా ఉందా?"

"ఎలా తెలుస్తుంది చెప్పు? ఎన్నాళ్ళనుంచో నువ్వు ఈ చాయలకే రాకపోతివి. ఏ సంగతీ నాకేం తెలుస్తుంది?"

ఇలాగే కొంతసేపటివరకూ ఆకుకూ పోకకూ అందకుండా మాటలు సాగాయి. చివరకు అతను అన్నాడు: "ఇప్పుడు లాల్‌బాబు మన సంఘ విద్రోహిగా పరిగణింపబడుతున్నాడు. మీరు అతనితో ఎలాట్టి సంబంధమూ పెట్టుకోకండి."

"ఏం? ఎందువల్ల? ఏమైందీ?" ఆశ్చర్యంగా అడిగాను.

"అతడు మన సంఘ శాసనాన్ని ఉల్లంఘించాడు."

"అలాగనా?"

"అతని జాడ కనిపెట్టి తెలుసుకోవలసిన బాధ్యత నామీద ఉంది. అతడు మిమ్మల్ని కలిశాడని విన్నాను. నిజమేనా?"

"ప్రభాత్! ఇప్పుడు నువ్వు బి. ఏ. రెండో సంవత్సరం చదువుతున్నావు. ఒక పని చెయ్యి. నీకు అన్ని సౌకర్యాలూ

నేను ఏర్పాటు చేస్తాను. చదువుమీదే మనస్సు పెట్టి బాగా కృషి చెయ్యి. బి. ఏ. ప్యాసు అయినతర్వాత నీ యిష్టం ఏమన్నా చేసుకో! నా మాట విను. నేను నీకు అక్కయ్యను కదూ!"

ఒక ధీశాలి లాగ గంభీరంగా కూర్చున్నాడు ప్రభాత్.
"మీకు అతను కలిశాడా?" మళ్ళీ అడిగాడు.

"ప్రభాత్! నువ్వు ఇంకా చిన్నవాడివి. నా మాట వింటావు కదూ!"

నేను ఇలా బుజ్జగింపుగా మాటాడుతున్నందువల్ల అతని స్థయిర్యం ఇంకా ఎక్కువైంది. అతని నెత్తిమీద పైవారి ఆజ్ఞ ఉంది. లాల్‌ను వెదకి పట్టుకోవలసిన భారం అతనికి అప్ప గించారు. ఈ విషయంలో...అందరికన్నా పైవాడైన హరీశ బాబు అనుమతికూడా ఉన్నట్టే కనిపిస్తుంది.

"ఈ విషయంలో హరీశ్ బాబు స్వయంగా ఏమన్నా చెప్పాడా?" కుతూహల చిత్తనై అడిగాను.

"స్థానికంగా ఉన్న ప్రధాననాయకుల ఆజ్ఞ తీసు కున్నాను. లాల్ ఎక్కడ ఉన్నదీ జాడ తెలుసుకుని తీరాలి. ఆ యింటి తాళపుచెవులు మీదగ్గర ఉన్నాయని విన్నాను, నిజమేనా?" అన్నాడు తెలివితేటలతో, మెళుకువగా.

"ఔను, నాదగ్గరే ఉన్నాయి. నువ్వు ఆ యింటితాళాలు పగలగొట్టటానికి వీల్లేదు."

"తాళంచెవులు నాకు ఇచ్చెయ్యండి. మీ దగ్గర ఉన్న కాగితాలు వగైరా కూడా ఇలా తీసుకురండి."

"ఇస్తాను. కాని ఒక మాట: నువు ఆ యింట్లో వచ్చి ఎందుకు ఉండకూడదూ? నీతోపాటు ఇంకా ముగ్గురు నలుగురు విద్యార్థులను కూడా తెచ్చుకో. మీకు అయే ఖర్చు అంతా మేమే భరిస్తాం."

ప్రభాత్ ఇంకా ఘనీభవించాడు. "ఇలా తెండి—" అన్నాడు.

"ఏమిటి?"

"తాళంచెవులూ, కాగితాలూ."

నాకు అసహ్యం వేసింది. "తాళంచెవులు తీసుకుపోయి మీరంతా అక్కడ ఏం చేద్దామనీ?"

"ఆ యిల్లు సంఘానిది. పేరు మాత్రమే అతనిది."

"అద్దె ఎవరు చెల్లిస్తున్నారు?"

"నాకు తెలియదు. బహుశా అతనే ఇస్తున్నాడేమో! డబ్బుతో సంబంధించిన వ్యవహారాలన్నీ అతడే చూస్తుంటాడు...ఇచ్చెయ్యండి. నేను వెళ్ళిపోవాలి."

ఆ కుర్రవాడిని అప్పటికప్పుడు బైటికి పంపించెయ్యాలనిపించింది. కాని, "కొంచెం ఫలహారం అదీ చేసి వెదుదువుగ్గాని ఉండు" అన్నాను. అంటూ లోపల నౌకరును కేకవేశాను.

ప్రతిమలా కూర్చున్నాడు ప్రభాత్ — ఆజ్ఞాపాలన దీక్ష రూపొందినట్టు. "నే నిక్కడ ఫలహారాలేమీ పుచ్చుకోను" అన్నా"

నాకు చాల కోపం వచ్చింది. "సరే అయితే. ఆ యింటిని ఇక ముందు ఎలా ఉపయోగించాలో నాకు వేరే ఉద్దేశాలు కొన్ని ఉన్నాయి."

"ఆ యిల్లు తమదేం కాదు."

"తాళంచెవి నాదగ్గరే ఉంది. ఆ యింటి యజమాని ఇచ్చిన హక్కులు అన్నీ నాకు ఇచ్చినట్టే."

ప్రభాత్‌కు ఆ సమయంలో ఎంత కోపం వచ్చిందో మరి! అన్నాడు: "మిమ్మల్ని నా అక్కయ్యగా భావించాను. లేకపోతేనా !—"

నేనూ కొంచెం గట్టిగానే ఉన్నాను. "లేకపోతే!— ఏమిటి ?"

"సంఘంపట్ల మీరు అవజ్ఞ చూపించకూడదు. ఆ యిల్లు సంఘకార్యాలకోసం వినియోగపడాల్సి ఉంది. మీరు తాళం చేతులు ఇవ్వాల్సిందే. ఆ సంఘ ద్రోహి జాడకూడా చెప్పాల్సిందే."

అతని ఆవేశం, గాంభీర్యం చూస్తోంటే నాకు ఇంకా కుతూహలం కలిగింది. నవ్వాను. "ఇవ్వకపోతే, చెప్పకపోతే నేనూ సంఘద్రోహినే అయిపోతాను. అంతేనా ? నువ్వు కోరుతున్నదీ అంతేకదూ! వెళ్ళు. వెళ్ళిపోయి నీ పైవారితో

చెప్పు: అవసరమని తోస్తే ఆ యిల్లు ఇక ముందు ఎలా ఉప యోగపడాలి అన్న విషయమై నాతో వచ్చి మాటాడమను.”

“లాల్‌తో ఎటువంటి సంబంధం పెట్టుకోరాదనీ, అది అనిష్టహేతువనీ మన సంఘం భావిస్తున్నది. ఆ సంగతి తమకు గట్టిగా చెప్పవలసిందిగా నేను కోరబడ్డాను.”

“కృతజ్ఞురాల్ని. నిన్ను కోరినవారితో వెళ్ళి చెప్పు: నువు చెప్పావనీ, నేను విన్నాననీ.” ఆమాట అనేసి ఇక అక్కడినించి వెళ్ళిపోదామనిపించింది. కాని ఎదురుగా కూర్చుని ఆ కుర్రవాడు ఆడుతున్న నాటకానికి నాకు తేలిగ్గా కోపం వచ్చేస్తూ ఉంది. ఎవరో అతనికి జారీచేసిన ఆజ్ఞల్ని ఇక్కడ వల్లిస్తున్నాడు. కాని అతని హృదయంలోనుంచి వస్తున్న మాటలేమీ కావు అవి. “ప్రభాత్! నీ ఖర్చులకు నువు ఏమన్నా ఇబ్బంది పడుతున్నావా? పడుతుంటే సంకోచించ బోకు; చెప్పు” అన్నాను.

ప్రభాత్ గంభీరముద్ర తాల్చాడు.

“నువు ఇప్పుడు ఎక్కడ ఉంటున్నావు?”

ఈసారి కూడా అతడు జవాబు చెప్పలేదు.

“నువు హరీశబాబుకు ఎంతో విశ్వాసపాత్రుడివి. నన్ను ఒక పర్యాయం ఆయనదగ్గరికి తీసుకువెడతావా? వారు చేరు వలో ఎక్కడైనా ఉంటే, వారికి అభ్యంతరం లేకపోతే నన్ను తీసుకుపో. వారితో కొన్ని విషయాలు మాటాడాలనుకుంటు

న్నాను. ఆయన సమక్షంలోనే అన్ని సంగతులూ తేల్చుకో వచ్చు. ఏం, తీసుకుపోతావా ?"

పోతవిగ్రహంలా అలాగే కూర్చున్నాడు. ఉలుకులేదు, పలుకులేదు.

"నా మాటలు వినిపిస్తున్నాయా తమ్ముడూ !...నీకు అమ్మ ఉందా ? అక్కచెల్లెళ్ళు ఉన్నారా ?"

ముఖంముడుచుకుని అలాగే కూర్చున్నాడు. పెదవి విప్పలేదు.

నాకు నవ్వు వచ్చింది. "ఇదిగో, ప్రభాత్, నువు సంఘంలోకెల్లా నిజాయితీగల సభ్యుడివి. నాకు చాల సంతోషం." అంటూ లేచి ముందుకు వచ్చాను, అతని తల నిమిరి, ఆశీర్వదించి, వీపు దువ్వుదామని. కాని అంతకుముందే అతడు బాణంలా లేచి వెనక్కు వెళ్ళాడు దూరంగా. "ఇచ్చెయ్యండి. ఇస్తారా ? పొమ్మంటారా ?" అన్నాడు.

వెంటనే అతడు అడిగేదేమిటో స్ఫురణకు రాలేదు.

"ఏమిటి ఇవ్వమంటావ్ !"

"తాళంచేతులు కావాలి, లాల్ బాబు జాడకూడా చెప్పండి."

నేను నిల్చునే ఉన్నాను. "ప్రభాత్ ! సంఘద్రోహిని నువు ఏం చేస్తావు ? ఏం చెయ్యాలని నీ ఉద్దేశం ? అతడు నా మిత్రుడైతే అవకూడదా ?"

"తెలిసింది లెండి. అతడు మిమ్మల్ని కూడా బుట్టలో వేశాడన్నమాట! మీరు కూడా అతనికి కొత్తగా ఇటీవల బలిఐనారన్నమాట! దుర్మార్గుడు!"

"ప్రభాత్!" ఆ లేత వయసు కుర్రవాడు అంత తీక్ష ణంగా, కటువుగా పలికిన మాటలకు నా హృదయం క్షోభించింది.

అతడు నా చూపుకు నీరుగారిపోయే స్థితిలో లేడు. "మీరు అంత అమాయకులా? అంతమాత్రం తెలుసుకో లేకపోయారా?"

"ప్రభాత్! ఇక నువ్వు ఇక్కడినుంచి వెళ్ళిపో" అంటూ వాకిలి చూపించాను.

ప్రభాత్ చలించలేదు. "ధూర్తుడు! అమాయకులను వేటాడి బుట్టలో వేసుకుంటూ ఉంటాడు. కాని ఈసారి గనక—"

"వెళ్ళిపో ఇక—"

"వెడతాను. వాడు బ్రతికిపోతాడనుకోకండి. కాని స్త్రీజాతి గుడ్డిదై పోతోంది."

ఇక నా కోపం హద్దులు దాటిపోయింది. అతన్ని చెవి పట్టుకుని లాగి బైటికి పంపించేద్దామనుకున్నాను. ముందుకు అడుగు వేశాను.

"ఇక మిమ్మల్ని అక్కయ్యా అని పిలవను. నామీద చెయి చేసుకున్నారంటే జాగ్రత్త!—"

ఇద్దరమూ కూడా ఆవేశంలో బిగ్గరగానే మాటాడి ఉంటాం. తులసి (నౌకరు) గదిలోకి వచ్చాడు.

"ఏంరా! ఇంత ఆలస్యంగా వచ్చావేం? ఇందాక పిలుపు వినిపించలేదా? రెండు గ్లాసులు మజ్జిగ కలిపి తీసుకురా." అన్నాను. ప్రభాత్ వైపు తిరిగి "కూర్చో తమ్ముడూ! ఇంట్లో తులసి లేడేమో అనుకున్నాను" అన్నాను.

ఏదో విచికిత్సలో పడిన మనిషిలా నిల్చున్నాడు తులసి.

"ఇక నాకు సెలవు ఇప్పించండి" అన్నాడు ప్రభాత్.

"కూర్చోవా?" (తులసి వైపు తిరిగి) "నువ్వు వెళ్లి దబ్బున పట్టుకురా" అన్నాను.

తులసి వెళ్లిపోయాడు. ప్రభాత్ తన పల్లవి మరచి పోలేదు. "తాళంచెవి ఇస్తారా సరేసరి. లేకపోతే తాళం పగలగొట్టేయవలసివస్తుంది" అన్నాడు.

"తాళం పగులగొట్టేస్తావా? హరీశ్ బాబును అడిగి తెలుసుకునేంతవరకైనా ఆగవా?"

"ఊహుఁ. హరీశ్ అన్నగారిని అడగాల్సిన అవసరం లేదు."

"అయితే నువ్వు తాళం పగలగొట్టటానికి వీల్లేదు."

"ఆఁ. ఏమిటీ? చూస్తాగా!" అంటూ గిర్రున తిరిగి జోరుగా వెళ్లిపోయాడు. నమస్కారంకూడా చెప్పలేదు.

అతని వ్యవహారం తలచుకుంటే నా మనస్సు మిక్కిలి ఆందోళితం అయింది. కోమలత్వాన్ని కలుషితంచేసే, మెత్తదనాన్ని కాఠిన్యంగా మార్చే ఎలాంటి విషం అది! తరుణ వయస్కుడు ప్రభాత్. సౌమ్యుడు, వినయవంతుడుగా కనిపించేవాడు. అతన్ని గురించి ఎప్పుడూ అనుకుంటూ ఉండేదాన్ని. ఏ గాలి సోకి అతడిప్పుడు ఇంత కఠినాత్ముడుగా తయారైనాడు? నా మనస్సుకు అసహ్యం కలిగింది. ఎవరిమీద? ఏమో నాకు సరిగ్గా తెలియదు. కాని మానవుడు మరో వ్యక్తిని...తన అంతరాత్మ ఆదేశాల్ని వినకుండా...ఎక్కడో బైటినించి జారీ అయ్యే ఆజ్ఞలను పురస్కరించుకుని...దుర్మార్గంగా నులిమి చంపివెయ్యటానికి ప్రయత్నించే విధానంమీద నాకు అసహ్యం కలిగినమాట నిజం.

నా జీవితంలో మొట్టమొదటిసారిగా నాకు ఆ సమయాన ఒక కర్తవ్యం స్ఫురించింది. ఆ యింటిని గురించిన బాధ్యత తేలిగ్గా చేతిలోనుంచి విడిచిపెట్టుకోకూడదు అని నిర్ణయించుకున్నాను. ఒకానొక వ్యక్తికి నాపట్ల ఉన్న విశ్వాసంవల్ల ఆ బాధ్యత నాకు వచ్చిందన్న కారణంచేత కాదు, బలాత్కారంగా దాన్ని నా చేతిలోనుంచి లాగివేయటానికి ప్రయత్నం జరుగుతున్నది కాబట్టి. నాలోని మానవత్వం అంతా ఈ నిర్ణయాన్ని బలపరిచింది. కొంతసేపటికి మావారు ఇంటికి రాగానే చెప్పాను: "విన్నారా! ప్రభాత్ వచ్చాడు. ఆ యింటి తాళం చెవి ఇవ్వమని అడిగాడు. నేను ఇవ్వలేదు—"

"ఏం? ఎందుకివ్వలేదూ?"

"వినండి మరి ! మధ్యలో అడ్డు వస్తారేం. తాళంచెవి నేను ఇవ్వలేదు. ఎందుచేతనంటే—ఇల్లు మనకిందే ఉంచుకుందాం. ఏదైనా మంచిపనికి వినియోగమయ్యేటట్టు చూద్దాం."

"అది మన యిల్లేం కాదుగా !"

"మనది కాకపోవటమేం? డబ్బు మనకిచ్చాడు; తాళంచెవి మనకు ఒప్పజెప్పాడు. ఇంకేం ?"

"అయితే మాత్రం ? ఇల్లు అతనిదికూడా కాదుగా !"

నేను విసుక్కున్నాను. "ఏమైనా గానీ, మీరు ఇప్పుడే వెళ్ళి ఆ యిల్లు సురక్షితంగా ఉండేట్టు తగిన ఏర్పాటు చేసి రాకూడదూ ? ఏమంటారు ? చాతకాకపోతే చాతకాదని చెప్పెయ్యండి."

నేనుగాని, నా మాటలుగాని మావారికి అర్థమైనట్టు లేదు. "ఏమిటి అలా గొడవపడతావు ? ఆ యిల్లు ఇప్పుడు ఎవరు లేవదీసుకు పోతున్నారనీ ?"

"సరే అయితే, మీరు కూర్చోండి. నేను వెళ్ళి కనుక్కుంటాను."

నా పట్టుదల వారు గ్రహించలేదు. నేను మళ్ళీ ఏమీ వారితో మాటాడలేదు. ఆ సాయంత్రమే మా అమ్మగారింటికి వెళ్ళాను. ఏం చెప్పానో, ఏం చేశానో, ఒక గూర్ఖావాడిని మాటాడి పట్టుకువచ్చాను. ఆ యింటి గడపదగ్గర కావలా కూర్చోపెట్టాను.

రాత్రి తిరిగి ఇంటికి వచ్చేసరికి పదిన్నర అయింది. మావారికి అంతా చెప్పాను. "మీరు ఇంకోవిధంగా అనుకోక పోతే నేను రాత్రి వెళ్లి అక్కడే పడుకుంటాను" అన్నాను.

నాకోసం ఎదురుచూస్తూ వారు మంచంమీద పడుకుని ఉన్నారు. పక్కనే టేబిల్ మీద దీపం ఉంది. ఆ వెలుగులో ఏదో చదువుకుంటున్నారు. "నువ్వు భోజనం చెయ్యనని చెప్పి వెళ్ళలేదుగా! వంట తయారై ఉంది. భోజనం చెయ్యలేదుగా మరి నువ్వు?"

"మా అమ్మగారింట్లో భోజనం చేశాను."

"చేసినట్టు జ్ఞాపకం ఉందా? పొరపాటు పడ్డావేమో కూడా? భోజనం వడ్డించమని చెప్పనా?"

'వద్దు."

వారి కంఠధ్వనిలో ఏదో మార్పు వచ్చింది. "ఇప్పుడు పదిన్నరదాకా నువ్వు చేసి వచ్చిన పని మగవాడు చెయ్యవలసింది. కాని నేనిక్కడ చూస్తూ కూర్చున్నాను. దీన్ని గురించి నువ్వు ఏమనుకుంటున్నావో చెప్పు సుఖదా!"

ఇదివరకు అనుభూతముగాని...'సన్నద్ధత' లాంటి ఒకానొక వస్తువు నాలో ప్రతి అణువునా వ్యాపించిపోయింది. నేను కులస్త్రీనన్న సంగతే స్ఫురణకు రాలేదు. ఇల్లువిడిచి ఎక్కడికోపోయి ఒంటరిగా పడుకోవటమనే ప్రస్తావన కులస్త్రీకి రానే రాదు. మనస్సులో ఒకానొక పంతం ఈ పక్కనుంచి ఆ పక్క వరకూ నిగడదన్ని కూర్చుంది. బిగువు, పట్టుదల వచ్చాయి.

ఎటువంటి బెదరింపులకూ, బలప్రయోగానికీ కూడా ఓడిపో కూడదనిపించింది. ఎవరు ఏంచేస్తారో చూస్తాగా !—అను కున్నాను. "మీరు హాయిగా ఇంట్లో కూర్చున్నారు, నిజమే" అన్నాను మావారివైపు తిరిగి.

"సుఖదా ! రా, ఇలా వచ్చి కూర్చో."

"చెప్పండి, ఇక్కడే ఉన్నాగా !"

"అలాకాదు, ఇక్కడికి రా."

"భోజనం అన్నారుగా ! తెప్పించండి; తింటాను."

"అయితే ఇలా వచ్చి కూర్చో మరి !"

"మీకు ఇష్టం లేనట్టుంది. సరే అయితే, పోనులెండి."

"ఇక్కడికి రా నువ్వు—"

"ఏమిటి, చెప్పండి" అంటూ వచ్చి వారి పక్కనే కూర్చున్నాను.

"భోజనం చేశావా ? నిజం చెప్పు."

"చెప్పానుగా, తిన్నానని."

"సుఖదా !—"

"—ఏమిటి చెప్పండి !"

"నిన్ను చూస్తోంటే నాకు భయం వేస్తోంది సుఖదా! నువు నా చేతుల్లోనుంచి జారిపోతున్నావు."

నేను పకపక నవ్వాను. "ఎక్కడికి పోతున్నాను జారి ?"

"ఎక్కడికో మరి !"

"భోజనం తెప్పిస్తానంటిరిగా !"

"ఔను. తెస్తాను, ఉండు."

"మీరే వెళ్ళి తెస్తారా ?"

"తులసిని వెళ్ళి పడుకోమన్నాను."

"మీరు భోజనం చేశారా మరి !"

"ఆఁ, ఎప్పుడో చేశాను."

"అబద్ధం, మీరు భోజనం చెయ్యలేదు."

"పొరపాటు పడుతున్నావు. ఇలా చూడు" అంటూ నా చెయ్యి తీసి తన పొట్ట మీద పెట్టుకున్నారు.

నేను పొట్ట నొక్కి తడివి చూచాను. "మనిద్దరి భోజనం మీరే చేసినట్టుంది. ఉండండి, భోజనం పట్టుకొస్తాను."

వెళ్ళి తెచ్చాను. ఇద్దరం భోజనముందు కూర్చున్నాం మాటాడుకుంటూ. ఆ విషయం ఈవిషయం సాయలా పాయలా మాటాడుకోవటంలో నా హృదయం తేలికపడింది. పంతం, పట్టుదల ఏమైపోయామో ! అన్నీ మరిచిపోయాను. నాలోని నైజంకూడా చాలవరకు మాటుమణిగిపోయింది. అటువంటి సమయంలో మావారు అన్నారు: "రాణీ ! ఒక తప్పు మన్నించాలి. నువు లేనప్పుడు లాల్ ఉత్తరం తీసి చదివాను."

వారి ఉద్దేశం ఏమిటో మరి, నాకు బొత్తిగా బోధ పడలేదు.

"లాల్ నిన్ను ప్రేమిస్తున్నాడు."

నా వైపు ఏకాగ్రంగా చూస్తున్న వారి కన్నుల వైపు చూస్తూ నిశ్చేష్టనై ఉన్నాను.

"నువు ప్రేమించటం లేదని అనుకుంటున్నావు కాబోలు!"

నిర్ఘాంతపోయి గుడ్లు ఒప్పజెప్పి చూస్తూ వింటూ కూర్చుండిపోయాను. నాలో క్షణమాత్రంకూడా చలనం అనేది లేకుండా పోయింది. రెండుచేతుల్లో ముఖం దాచుకోలేక పోయాను. వారు ఎడమచేత్తో నా తల నిమురుతున్నారు. కుడి చేత్తో నా కుడి చెయ్యి పట్టుకుని ఉన్నారు. కాని మరుక్షణం వారి రెండు చేతుల వేళ్ళూ నా శరీరాన్ని స్పృశించి యున్న చోట అలా నిష్పందంగానే ఉండిపోయాయి.

"ఉహుఁ. అది నిజంకాదు. ప్రేమ అతన్ని బాధిస్తున్నట్టుంది! నిన్నూ బాధిస్తుంది. బాధ పెట్టటమే దాని పని. బాధ పెడుతున్నదేమో కూడాను! అంతే సంగతి! అంతకంటే వేరే ఏమీ లేదు. నిజమే సుఖదా! ఇంకేమీ లేదు—"

నాకు అధారభూతులైన – వారు చూపుతున్న నిర్దయాత్మకమైన సహృదయతను ఓర్చుకుంటూ ఉండి పోయాను. వారి కుడిచేతి వేళ్ళు కదలసాగాయి. నా చేతి వేళ్ళను తన అరచేతిలో పెట్టుకుని నొక్కారు – మృదువుగా మెల్లిగా. నా రెండు చేతులూ ఎత్తి పెదవులకు హత్తుకున్నారు. గద్గదకంఠంతో "సుఖీ, ప్రేమ చాల బాధ పెడుతుంది సుమీ!" అన్నారు.

నా అరచేతులు ముద్దు పెట్టుకున్నారు. మళ్ళీ సాదరంగా నా చేతుల్ని యథాస్థానంలో ఉంచారు. కుడిచేయి ఎత్తి నా తలవెంట్రుకల్ని వెనక్కి సరిచేస్తూ, ముందుకు వంగి "కష్టపెట్టటం మంచిది కాదు, నా రాణీ!" అన్నారు.

నా కళ్ళు నిమీలితములైనాయి. నిజంగా నాకు బాధగానే ఉంది. బహుశా నాకు నేనే బాధగా అయిపోతున్నానేమో! ఊహుఁ, లేదు, లేదు, ఒకళ్ళను బాధపెట్టటం నాకు ఇష్టంలేదు. కాని ఆ సమయంలో నేను అవశనై ఉన్నాను. చైతన్యాన్ని నాలోనించి ఎవరో బైటికి లాగివేస్తున్నట్టు అనిపించింది. నా ఒళ్ళే నాకు తెలియకుండాపోయింది.

ఆ పరవశం కాసేపటిదాకా అలానే ఉంది. చివరకు మావారు మంచుబండకన్నా ఎక్కువ శీతలంగా, తాపంతో వేరే కుర్చీలో...కళ్ళు విప్పి చూస్తూ కూర్చున్న ఆ సమయంలో మళ్ళీ నాకు మామూలు చైతన్యం చేకూరింది.

# 22

నిన్న రాసింది మళ్ళీ ఒకసారి చదివాను. అదేమిటి? అదంతా కూడా రాశానేమిటి? ఒక అంశం రాయకుండా ఉంటేనే బాగుండిపోయేది. రాయకుండా ఉన్నంతమాత్రాన నిజం నిజంకాకుండా పోదుకదా! ఒకసారి రాసింది చెరిపేస్తే మాత్రం...అది అబద్ధంకింద లెక్కఔతుంది. కాబట్టి రాసింది ఇప్పుడు ఏ ముఖంపెట్టుకుని కొట్టివేయను? అది అసత్యం ఏం కాదు; సత్యమే. ఆ సంఘటన జరిగినప్పటినుంచీ నాకు ఇంట్లో

ఆదరం, గౌరవం హెచ్చాయి. మమత్వం సాన్నిహిత్యం మాత్రం తగ్గిపోయాయి. మావారు నన్ను యే విషయం లోనూ స్వతంత్రంగా మందలించటం అనేది పూర్తిగా మానేశారు.

వ్యక్తిత్వంపట్ల గౌరవం – ఆదరణ ! వ్యక్తిత్వాన్ని గుర్తించి మన్నించి గౌరవించట మనేది గొప్పసంగతే. అందులో ఒక మాధుర్యమూ ఉంది. కాని ఇక్కడ మాత్రం నా యీ నాశనమైన వ్యక్తిత్వానికి వారిచ్చే గౌరవాదరణలు నన్ను పూర్తిగా దహించి భస్మీ పటలం చేసివేస్తున్నాయి. నేను మావారినుంచి కూడా ఇంతచేటు గౌరవాదరణలు కోరిందెప్పుడూ ? కానీ ఇంట్లో నాకు అదే అనుక్షణమూ ఎదురౌతూ ఉండేసరికి నాలో నేను జ్వలించిపోతున్నాను. కాని అంతకుమించి మరేమీ జరగటంలేదు. ఆరాత్రి మొదలు కొని భర్తకు ఎంతో ఆదరణీయమైన వస్తువునైనాను— అంటే ఒకవిధంగా వారికి దూరమై పోతున్నానన్నమాటే. ఈ దౌర్భాగ్యాన్ని నే నప్పుడు పూర్తిగా గమనించలేదు. సూచనగా మాత్రం గోచరిస్తూ ఉండేది. రోజులు గడిచినకొద్దీ మా యిద్దరి సంయుక్త జీవితము అడుగున ఒక పెద్ద మిత్రు యేర్పడుతున్నట్లు కనిపించింది. పైకి కనిపిస్తున్నది ఒకటే యిల్లు, ఒకటే సంసారం; కాని లోపల జీవన ధార రెండు ప్రవాహాలుగా చీలిపోతున్నట్టు తోచింది. ఎప్పుడు చూచినా మావారి ముఖంలో సౌమ్యత, కర్తవ్యదీక్ష, స్థిర సంకల్పం కనిపిస్తూ ఉండేవి. తమకు కలుగుతున్న యే లోటు పాటుల్నిగురించీ నామీద వారు ఎప్పుడూ యేవిధమైన

ఆరోపణా చెయ్యరు. అయినా లక్షలకొలది ధిక్కృతులు నన్ను కరచిపెడుతున్నట్టుగా బాధపడేదాన్ని. కాని విధికి లొంగి, ప్రతీకారం తెలియనిదానివలె విచలితనై పడివుండేదాన్ని. వారు నన్ను తప్పులుపట్టి వేధించే మనిషి కానేకాదు. అయినా వారి సమక్షంలో నన్ను భయం, వినయం, నమ్రత వచ్చి సూచాయగా ఆవేశించేవి; కాని ఎటునుంచీ యేవిధమైన ప్రోత్సాహం రాకపోవటంవల్ల నాకు నేనై వాటిని పూర్తిగా పైకి ఎలా తీసుకురావాలో నాకు అర్థమయేదికాదు.

"మీరు సరేనంటే నేను కొన్నాళ్ళపాటు ఆ యింట్లో పోయి వుంటాను. అక్కడంతా ఒక దారికి వచ్చినతర్వాత ఆ గొడవేమీ మనం పెట్టుకోనక్కర్లేదు" అన్నాను ఒకనాడు మావారితో.

"ఔనౌను. తప్పకుండా వెళ్ళి ఉండు. కాని తులసిని కూడా వెంట తీసుకుపో, భయంలేకుండా ఉంటుంది."

నేను అప్పుడు వారి ముఖంలోకి చూచాను. నన్ను గురించిన చింతే తప్ప వారి చూపుల్లో మరే భావమూ ఉన్నట్టులేదు. ఇక నేను చెప్పేదేమిటి? చేసేదేమిటి?

నేను ఊరికే గుడ్లు ఒప్పజెప్పి చూస్తూండటం వారు గమనించారు. "ఇక్కడ ఇంకో కుర్రవాడిని ఎవరినైనా కుదురుస్తాలే. అయిదారు రూపాయల్లో దొరుకుతాడు. మహా అయితే పది రూపాయలు అవుతుందేమో! అయితే అయిందిలే. తులసిని పిలిచి చెప్పనా?"

నా హృదయం నీరుగారిపోయింది. ఒక్కసారి మనసులో అనిపించింది : "ఎవరబ్బా ఈ మహానుభావుడు ?—నేనెప్పుడేనా పక్కకి జారితే పట్టి నిలబెట్టకపోగా, ఇంకా అధఃపాతాళానికి పడిపోయేట్టు మరో తోపుతోసి పారేస్తాడేం ? అయినా నేను మాత్రం ?—ఇంత తేలిగ్గా జారిపోయానేమిటి ? ఇంత మరీ జర్రున జారటమా ?" ఏమైనా నే నెత్తిన ప్రసంగంనుంచి నేనే విరమించుకోటం నాకు ఎప్పుడూ అలవాటులేదుగా అన్నాను : "తులసి వస్తాడా మరి ?"

"ఎందుకురాడు ? రాకపోతే నౌకరీ వదలుకుని వెళ్ళిపోతాడు."

"మరి మీా స్నానం ? భోజనం ? ఆ యేర్పాట్లన్నీ ఎవరు చూస్తారు ?"

వారు నవ్వారు. "నా భోజనమా ? నువు ఆ చింత ఏమిా పెట్టుకో నక్కర్లేదు."

"తులసి అక్కడికి వస్తే మీారూ అక్కడికే రండి భోజనానికి."

"అలాగే, అక్కడికే వచ్చి భోంచేస్తాను. ఏముంది అందులో !...తులసీ ! ఓ తులసీ !"

"కాస్త ఆగండి తొందరేముందీ ?" అన్నాను.

"ఈ నౌకరు వట్టి దొంగ వెధవ అయిపోతున్నాడు. రెండుసార్లు పిల్చినా వచ్చాడేమో చూడు ! వినిపించుకోడు... అరే తులసిగా ! వెధవాయ్ ! ఎక్కడున్నావురా !"

అంటూ ఆత్రతగా లేచి అక్కడినించి వెళ్ళిపోయారు. నేను అక్కడే ఎదురుగా ఉన్న గోడపైపు చూస్తూ కూర్చు న్నాను, నిశ్చేష్టనై, ఏమి చేయటానికీ తోచక. మరికాసేపటికి వారు తులసిని వెంటబెట్టుకుని గబగబా వచ్చారు.

నేనేమీ మాటాడలేదు. "ఇదుగో, తులసి! మీ అమ్మగారు కొన్నాళ్ళపాటు ఇంకోచోట వెళ్ళి ఉంటారు. నువుకూడా వారితో వెళ్ళి అక్కడే ఉండాలి. వెడతావా మరి ? ఇవాళే వెళ్ళాలి." అన్నారు మావారే.

తులసి అభ్యంతరం చెప్పలేదు. అమ్మగారి హుకుం అయితే అప్పటికప్పుడే బయలుదేరటానికి సిద్ధంగానే ఉన్నాడు.

ఇంకేం, నన్ను పంపించటానికి అన్ని ఏర్పాట్లూ ఒకొక్కటే చురుగ్గా సాగిపోతున్నాయి. నేను మూగ దాన్నిలా చూస్తూ కూర్చున్నాను. చివరకు అవసరమైన సామానులన్నీ తీసుకుని, తులసిని వెంటబెట్టుకుని మావారు బయలుదేరారు. ఇదంతా ఏమిటో, ఏమి జరుగుతున్నదో తెలియనిదానిలాగ, మొద్దులా కూర్చుండి పోయాను నేను.

మావారు వెళ్ళి తిరిగి వచ్చారు. "అక్కడ అంతా యేర్పాటుచేసి వచ్చాం. ఇక నువు బయలుదేరవచ్చు" అన్నారు.

"ఎన్నాళ్ళు ఉండాలి నేను అక్కడ ?" అడిగాను వారి ముఖంలోకి చూస్తూ.

"ఏం ? అక్కడికి వెళ్ళి ఉంటానని నువ్వే కోరావుగా!" గొంకుతూ అడిగారు మావారు.

"మీరు నన్ను వెళ్ళగొట్టేస్తున్నారు. ఎన్నాళ్ళవరకో మీరే చెప్పండి."

"సుఖదా!—"

"వెళ్ళగొట్టెయ్యండి. నేను వద్దనటంలేదు."

"సుఖదా ! నిన్ను నేను అర్థంచేసుకోలేకపోయాను. నిజం చెప్పు : నీకు అక్కడికి వెళ్ళటం ఇష్టంలేదా ?"

"సరే పదండి." అని నేను మెల్లగా అనేసరికి వారు కుర్చీలో కూర్చున్నారు. "నువు ఇక్కడ సుఖంగా ఉండలేక పోతున్నావు సుఖదా ! అక్కడ కొన్నాళ్లు ఉంటే నీ మనస్సుకు స్వస్థత చేకూరుతుంది. అయినా అంతగా ఇదౌతున్నావేమిటి?"

"కూర్చున్నారేం మరి ! వెళ్లాలంటే వెడదాం పదండి!" అన్నాను బిగ్గరగా.

"నీ సామాను సర్దుకున్నావా ?"

"సామానేముంది ? నేను సిద్ధంగానే ఉన్నాను."

మావారు కొంచెం తటపటాయించారు. "ఇటు చూడు. కోపం తెచ్చుకోకు. నీ చీరలు అవీ సర్దుకుని మరీ బయలు దేరు. నేను ఇందాక అక్కడికి వెళ్ళినప్పుడే నువు అన్నీ సర్దు కుని ఉండాల్సింది. ఏమిటి నీసంగతి మరీను !"

"సర్దుకోమన్నారా ?"

"అరె, మళ్ళీ అదేం మాట ! నన్ను అడగాలా ?"

"సర్దుకోమన్నారా ?"

"ఊహుఁ ఊహుఁ, కానీ."

"సరే, సర్దుకుంటాను" అన్నాను. ఇలా అని, అక్కడి నించి లేచి లోపలికి వెళ్లాను. పొంగిపొంగి వస్తోన్న కన్నీళ్లు తుడుచుకున్నాను. సామానంతా సర్దుకున్నాను. ఏమిటో, ఏమి చేస్తున్నానో, నాకే ఆశ్చర్యంగా ఉంది.

"అయిందా ? సిద్ధంగా ఉన్నావా ? జట్కా వచ్చేసింది" అంటూ హడావిడిగా లోపలికి వచ్చారు ఆయన.

"అయింది. సిద్ధంగానే ఉన్నాను" అన్నాను.

వారు ఒకసారి నాలుగువైపులా చూచారు. "అయింది కదూ !"

"అయింది."

"నువు వచ్చెయ్యి. సామాను వెనకాలే వచ్చేస్తుందిలే. పద."

నా తోలుపెట్టె చేతపుచ్చుకుని బయలుదేరాను. నన్ను రెండు చేతుల్లో పొదువుకుని తీసుకుపోతున్నట్టుగా తీసుకువెళ్లారు. జట్కాలో ఇంకా కొంత సామానేదో కూడా ఉంది. అదంతా మావారు తయారుచేసింది కాబోలు !

ఇంటిముందు గూర్ఖా చౌకీదారు ఉన్నాడు. బండి దిగటంతోనే నే నతనివైపు చూడకుండానే ఎకాఎకి లోపలికి వెళ్ళాను. లోపల తులసి సామాన్లు యథాస్థానంలో అమ

ర్పుతూ ఉన్నాడు. నాకు అటు ధ్యాస లేనేలేదు. నాకు ఏకాంతం కావాలి; ఎవరూ దగ్గర ఉండకూడ దనిపించింది. మరి కాసేపటికి మావారు వచ్చారు. "వంట కాసేపట్లో తయారు ఔతుంది. ఇక నేను వెడతాను" అన్నారు.

నా మనస్సు కొంచెం కొంచెం స్థిమితపడుతూ ఉంది. "భోంచేసి పోదురుగాని లెండి" అన్నాను.

"భోజనమా?—నాకు పని ఉందే."

"ఇక్కడ భోజనం చెయ్యరా అయితే?"

"ఇక్కడ కాకపోతే ఇంకెక్కడ చేస్తాను? కాని—"

"మీరు ఇక్కడ భోజనం చెయ్యకుండా వెడితే నా మీద ఒట్టు సుమండీ!"

మావారు విచారసూచకంగా ముఖం పెట్టారు. "నేను ఆకలికడుపుతో వెళ్ళిపోతాననుకున్నావా లేకపోతే. అయితే మరి వెళ్ళిచూడు: ఎంత ఆలస్యం ఉందో ఏమోను!"

"మీరు అక్కడ ఇంకో నౌకరును పెడతారా?"

"ఎక్కడ?"

"మన ఇంటి దగ్గర."

"లేకపోతే ఎలా మరి!"

"నా సామానుతోపాటు ఈ ట్రంకు కూడా ఎందుకు పంపించారు?"

మావారు ఆశ్చర్యం ప్రకటిస్తూ "ట్రంకా ? ఏం ? అందులో నగలు ఉన్నాయి; పైకం ఉంది" అన్నారు.

"అయితే మరి...అది ఇక్కడికెందుకు తెప్పించారు?"

"అందుకనే. అవన్నీ జాగ్రత్తచెయ్యటం మగవాడి కేం తెలుస్తుంది ? ఎవరు కనిపెట్టి చూస్తుంటా రక్కడ?—నేనా?"

నేనొక నిట్టూర్పు విడిచాను. "సరే కానీయండి; మీ యిష్టం."

మావారు వెంటనే అందుకుని విషయం మారుస్తూ "ఆ పత్రిక...అమెరికానుంచి వస్తుందే...హెల్తు అని అదేదో పత్రిక...నువ్వు చూచావా ! చాలరోజులనుంచీ అనుకుంటూను : కుక్కర్ తీసుకువద్దామని, నివ్వాకు విటమినులన్నీ— కుక్కర్ మీద వండితే పదార్థాలు బలకరంగా ఉంటాయి, వాటిలో సత్తువ ఏమీ నష్టంకాదు. ఆరోగ్యానికి కూడా చాలా—" అన్నారు.

"రెండుపూటలా మీరు భోజనం ఇక్కడే చెయ్యాలి" అన్నాను బిగ్గరగా.

వారు నవ్వారు. "బాగానే ఉందే నీ జులుం. నువ్వు కూడా ఒకసారి చూద్దువుగాని సుఖదా ! కుక్కర్ మీద వండిన అన్నంగాని, కూరలుగాని చాల రుచికరంగా ఉంటాయి, ఏమీ చెడిపోవు. నా మాట విను నాకేమీ యిబ్బంది ఉండదు. మంచి అన్న హితవు కలుగుతుంది కూడా."

"అరవకుండా కాసేపు కూర్చోండి; తయారైతే భోజనం ఇక్కడికే తీసుకు వస్తాను."

ఈవిధంగా నా నివాసం అక్కడ ఆరంభం అయింది. తరువాత రెండురోజులవరకూ మావారు మళ్ళీ రానేలేదు. ఇంటికి తులసిని పంపించాను కనుక్కురమ్మని. వాడు తిరిగి వచ్చి ఇల్లు తాళంపెట్టి ఉందని చెప్పాడు. అంతను తప్పితే మిగతా వ్యవహారాలన్నీ మామూలుగానే సాగిపోయాయి. ప్రభాత్ సమాచారం ఏమీ తెలియలేదు, ఇంకెవరూ రానూ లేదు.

మూడోనాడు మా అమ్మ వచ్చింది. వస్తూనే "ఏమిటే నీ నిర్వాహకం ఇదంతాను ? ఇదేం పనే !" అంటూ ఆరంభించింది. ఆ మాటకు జవాబేమీ చెప్పకుండా నేను "వినోద్ ఎలా ఉంటున్నాడు ? ఏమిటి ?" అని ఏవేవో అడిగాను. ఆవిడ తన పల్లవి విడిచిపెట్టలేదు : "ఏం పనే ఇది నువు చేసింది ?"

అందుకు సమాధానంగా "వారు నిన్ను కలిశారా అమ్మా ?" అని ప్రశ్న వేశాను.

"ఆఁ, ఒకసారి వచ్చాడు. ఇంటికి వినోద్‌ను తీసుకుపోతా నన్నాడు. తీసుకుపోయాడు. నువు ఇక్కడ ఉంటున్నా వన్న సంగతి నా కప్పుడు తెలీదు. ఇందాక తెలిసింది."

"వినోద్‌ను తీసుకువెళ్ళారా? ఎక్కడికి తీసుకువెళ్లారూ?"

"ఏమో మరి ! ఇంతకూ నీ కీ బుద్ధి ఏమిటే వేరుగా వచ్చి ఇక్కడ పడి ఉండటం దేనికి ? అతనికేదో కాస్త కోపం వచ్చిందని ఇలాంటి పని చేస్తావా ?"

"వారికేం కోపం రాలేదు—"

"మరి ఇదేమిటి ? నువ్వు ఇక్కడ, ఆయన అక్కడ..."

"ఈ రెండురోజులనుంచీ ఆయనా, వినోద్ ఏమైనట్టు ? ఎక్కడికి వెళ్లినట్టు?" ఆశ్చర్యపడుతూ అన్నాను.

"ఏం పిల్లవే నువ్వు ? నన్నడుగుతావేమే ఆ ప్రశ్న ! వినోద్‌ను కూడా ఒకసారి చూచి మరీ వద్దామని అక్కడికి వెళ్ళాను. లేకపోతే తిన్నగా ఇటేవచ్చేదాన్ని. ఇప్పుడు అక్కడి నుంచే ఇక్కడికి వచ్చాను. కాని ఏడీ ? నీకూ తెలియదాయేం ఎక్కడికి పోయిందీని ?"

"తెలియదమ్మా ! రెండు రోజులనుంచి ఇక్కడికి రావటమే మానేశారు."

అమ్మ చాల విచారించింది; నాకూ విచారం కలిగింది. మా అమ్మ నన్ను ఓదార్చి "వాళ్ళు రాగానే నాకు కబురు చెయ్యి" అని గట్టిగా చెప్పి వెళ్ళిపోయింది. నా విచారం హద్దులు దాటిపోయింది. తులసిని చాలసార్లు చూచిరమ్మని పంపించాను. ప్రతిసారీ వాడు తిరిగివచ్చి ఇల్లు తాళంపెట్టి ఉన్నదనే చెప్పాడు.

ఆతరువాత చాలసేపు అరచేతుల్లో తలమోపుకుని కూర్చున్నాను. విధి బలీయమనుకుని నిట్టూర్చాను. ఆ మర్నాడు ఉదయం నలుగురు వ్యక్తులు నాకోసం వచ్చారు. గూర్ఖా చౌకీదారు వాళ్ళను బైటనే అడ్డగించేశాడు. వాళ్ళను లోపలకు రానీలేదు; నాకు కబురు చెప్పనూ లేదు. చివరకు సంగతి తెలుసుకుని నేనే వాళ్ళను లోపలికి పిలిపించాను.

నరేశ్‌ను, శర్మాజీని మాత్రం గుర్తుపట్టాను. మిగిలిన ఇద్దర్నీ నాకు నరేశ్ పరిచయంచేశాడు. ఒకని పేరు కోహలీ. రెండవవాని పేరు జ్ఞాపకంలేదు; కేదారనాథ్ అని కాబోలు చెప్పాడు. ఈ పెద్దమనిషి మాత్రం చివరదాకా పెదవి విప్పనే లేదు. అతని చూపులుమాత్రం మిగతావారి చూపులకన్నా చాల తీక్షణంగా ఉన్నాయి. వాళ్ళు ఈ యింటి విషయమయ్యే మాటాడేందుకు వచ్చారు. వారిలో ప్రముఖుడు కోహలీ. అతనే అడిగాడు: "ఈ యిల్లు మీ కిందనే అట్టిపెట్టుకోదలచారా?" అని.

దానికి సమాధానంగా నేనూ ప్రశ్న వేశాను: "దయచేసి మీరు చెప్పండి: ఈ యిల్లు ఎవరిదో, దీని స్థితి ఏమిటో."

లాల్ ప్రయత్నంవల్లనే ఈ యిల్లు యేర్పాటైంది. బహుశా మొదటినుంచీకూడా అతని కిందనే ఉంది. కాని సంఘ కార్యాలయంగా వినియోగపడుతూ వచ్చింది. కాబట్టి ఇక ముందుకూడా అలాగే వినియోగపడవలసి వుంటుంది—ఇంతే వారు చెప్పిన విషయం.

లాల్‌బాబు అనుజ్ఞ తెచ్చుకుంటే ఇల్లు అలాగే వారికి స్వాధీనంచేస్తానని చెప్పాను. నాకు నేనై స్వతంత్రించి ఏమీ చెయ్యజాలనని కూడా చెప్పాను.

"లాల్‌బాబు మళ్ళీ ఈ చాయలకు వచ్చే అవకాశాలేమీ ఎక్కువగా కనిపించవు. అదీగాక అతని అనుజ్ఞ తెచ్చుకోవలసిన అవసరం ఏమీలేదు. లాల్‌బాబువల్ల మీకు వచ్చే ఇబ్బంది ఏమీ లేకుండా చూచే భారం మాది. అతనికేమీ

అభ్యంతరం ఉండదు. ఈ మాట మీరు విశ్వసించవచ్చు. పైగా ఈ యింటిని మీ స్వంత ఉపయోగానికై ఉంచుకో గోరటం లేదనే మేము అనుకుంటున్నాం" – అన్నాడు కోహాలీ.

నేను కోహాలీవైపు చూచాను. ముప్పయి సంవత్స రాల యువకుడు. అతన్ని గురించి నాకు ఎక్కువగా ఏమీ తెలి యదు. కాని అతని ముఖకవళికలో మాత్రం కాఠిన్యం, వ్యగ్యం తొంగిచూస్తున్నాయి.

"క్షమించండి. నాకు స్వంత అధికారాలేమీ లేవు ఇక్కడ. నేను ఏమి చేసినా లాల్ బాబు ఇష్టప్రకారం చెయ్యా వలసినదాన్నే. కాబట్టి మీ ప్రయత్నాలు ఆ దిక్కున చెయ్యా టమే మంచిది."

ఈలోగా చేతిలో ట్రే పుచ్చుకుని తులసి వచ్చాడు. ట్రేలోనుంచి ఒక గ్లాసు తీసి కోహాలీకి ఇవ్వబోయాను, "పుచ్చుకోండి" అంటూ.

"క్షమించండి, మేము..." అంటూ గ్లాసు తీసుకోటా నికి బదులు కుర్చీలో ఇంకా వెనక్కు ఒదుక్కున్నాడు.

"తీసుకోండి పరవాలేదు" అన్నాను ప్రబతిమాలు తున్నట్టుగా.

అతడు తీసుకోనేలేదు. గ్లాసు అలాగే చేతిలో ఎత్తి పట్టుకుని ఉన్నాను చాలసేపు.

"ఇలా తెండి, నాకు ఇవ్వండి" అంటూ శర్మాజీ ముందుకు వచ్చి నా చేతిలో గ్లాసు అందుకున్నాడు. ఆతరువాత

నరేశ్, ఆమీద ఆ నాలుగోవ్యక్తి తలా ఒక గ్లాసు తీసుకున్నారు. చివరకు మిగిలిన ఇంకో గ్లాసు కోహ్లీముందు ఉంచాను "ఇకనైనా తీసుకోండి" అంటూ.

కోహ్లీ గ్లాసు చేతిలోకి తీసుకున్నాడు. పక్కన ఒక ముక్కాలిపీట ఉంటే దాన్ని దగ్గరకు లాక్కున్నాడు. గ్లాసు దానిమీద పెట్టాడు. నావైపు తిరిగి "శ్రీమతిగారూ! మీ రీ విషయంలో బాగా ఆలోచించి వ్యవహరిస్తున్నట్టు కనిపించదు. చూచారూ! మీరేగనక—"

నేను అర్ధోక్తిలో అందుకుని "ఆ గ్లాసు మీయెడల ఏం తప్పు చేసింది చెప్పండి పాపం!" అన్నాను.

"చిత్తం. కాని...అయితే మరి, లాల్‌ను పిలిపించవలసిందే నంటారా?"

"అక్కర్లేదండి. అతని దగ్గర్నుంచి ఒక చీటీముక్క చాలు."

"అతను మీ కేమన్నా ఔతాడామేం?" కోహ్లీ నా ముఖంలోకి చూస్తూ అడిగాడు.

ఆ ప్రశ్నకు నా రక్తనాళాల్లో రక్తం దూకుడుగా ప్రవహించింది. బహుశా ముఖం ఎర్రబడిపోయి వుంటుంది. వెంటనే ఏ జవాబూ చెప్పలేకపోయాను. "ఏమిటీ – ఈ?" అన్నాను.

"ఏమీలేదు. క్షమించండి. అతడు మీ కేమన్నా బంధువేమో అనుకున్నాను."

అతని గడుసుతనానికి నాకు కోపం వచ్చింది. "చిత్తం, బంధువే. మీకు మిత్రుడుకదూ! అలాగే. అతడే లేకపోతే మీకు——"

కోహ్లీ ఇంకా తన ఔద్ధత్యం చూపించబోయాడు: "క్షమించండి, మిసెస్ కాంత్! మిస్టర్ కాంత్ బహుశా ఇక్కడ ఉండటం లేదాయేమిటి?"

"లేదండి. ఇక్కడ ఉండటం లేదు. మీరుకూడా ఇక్కడ ఇంకా ఎక్కువసేపు ఉండ ఉండదలచ లేదనుకుంటాను—తులసీ!"

"మాకోసం బండి పిల్చుకురావటానికా తులసి? అతన్నెందుకు కష్టపెడతారులెండి. అవసరంలేదు. బండి మేమే తెచ్చుకున్నాం...అయితే, మిస్టర్ కాంత్ కూడా ఇక్కడే వచ్చి ఎందుకు ఉండకూడదండీ!"

"ఏమిటా మట్టూమర్యాదలేని మాటలు కోహ్లీ!" అన్నాడు బెదిరిస్తూ శర్మాజీ.

శర్మాజీలాగనే నరేశ్ కూడా బాధపడ్డట్టే కనిపించాడు. ఆ నాలుగోవ్యక్తి ముఖంలో మాత్రం ఏవిధమైన భావమూ కనిపించలేదు. కోహ్లీ ఉద్దండత తేలిగ్గా వెనక్కు తగ్గేదికాదు. కాని శర్మాజీ అతని రెక్క పుచ్చుకుని గట్టిగా లేవదీశాడు— "లే, ఇక బైటికి పోదాం పద! నీకు మరీ మాటా - మర్యాదా తెలీదేం?" అంటూ.

శర్మాజీ రెక్కపుచ్చుకుని తీసుకుపోతూంటే కోహ్లీ

పక పక వ్యంగ్యంగా చాలసేపు నవ్వాడు. నరేశ్ చిత్రపు బొమ్మలా, నన్ను క్షమాపణ యాచిస్తున్నవాడులా చూస్తూ ఉండిపోయాడు. కాని చివరకు ఏమీ మాటాడకుండానే బైటికి వెళ్ళిపోయాడు. నాలుగో వ్యక్తి కుర్చీలోనుంచి లేననేలేదు. అతడు వచ్చినప్పటినుంచి ఇంతవరకూ ఒక్క మాటకూడా పలకలేదు. ముఖంలో ఏవిధమైన భావమూ కనబరచలేదు. ఈ జరిగిన సంఘటన అతనిపై ఏవిధమైన ప్రభావమూ ప్రసరించలేక పోయింది. ఇదంతా నాలుగు వైపులా అప్రీతికరమైన, రసహీనమైన తుచ్ఛ ప్రపంచం అన్నట్టూ, తనకంతా తెలుసునన్నట్టూ కూర్చునిఉన్నాడు. అందరూ వెళ్ళిపోయిన తరువాతకూడా రెండుమూడు నిమిషాలపాటు అతను మాటా పలుకూ లేకుండా, తీరుబాటుగా, నిశ్చలంగా అక్కడే కూర్చున్నాడు. చివరకు లేచాడు, ఒక సారి ఆవలించాడు; నావైపు చెయి చాచాడు. అప్పుడు చూచాను : అతను పూర్తిగా యూరోపియన్ దుస్తుల్లో ఉన్నాడు. నేను అతనితో కరచాలనం చెయ్యలేదు. చేతు లెత్తి నమస్కారం చేశాను. అతడు విలక్షణంగా ఒక మంద హాసంచేసి, ప్రతినమస్కారం చెయ్యకుండానే తిరిగి వెళ్ళి పోయాడు. మళ్ళీ తిరిగి వచ్చాడు. కుర్చీకింద పెట్టుకున్న Hat (టోపీ) తీసుకున్నాడు ; మళ్ళీ పూర్వంలాగే నాముందు చెయి చాచాడు. నేను విస్తుపోయి చూడసాగాను. అప్పుడతడ చాచిన చేయి వెనక్కు తీసుకుని, ఇదివరకులాగే మందహాస చేసుకుంటూ వెళ్లిపోయాడు.

ఈ నలుగురు వ్యక్తులతో ఇలా కలిసి మాట్లాడ్డంలో నాకు ఒక కొత్త అనుభవం కలిగింది. గార్హ్యస్థ్యపుహద్దు అతిక్రమించి బైటి ప్రపంచంలోకి వచ్చేసినట్టనిపించింది. అక్కడ నిర్ణీతమైన మర్యాదలు లేవు. వ్యక్తికి – ముఖ్యంగా స్త్రీకి – ఏవిధమైన రక్షణా లభించదు. అందరికీ సమాన అవసరాలు, సమాన సంఘర్షణలే ఉంటాయి. ప్రతి వ్యక్తికీ ఒక నైజం ఉంటుంది. మనిషికీ మనిషికీ మధ్య సంకోచం అనేది ఉండదు; అంతా సమానులే అన్న భావమే. ఈవిధంగా మొట్టమొదటి సారిగా రుచి తగిలిన ఈ బాహ్యప్రపంచ వ్యవహారం నాకు నచ్చలేదు. కాని ఇల్లు, వాకిలి, సంసారం, ఈ వలయాన్ని నేను కావాలని ఉద్దేశ్యపూర్వకంగా విడిచిపెట్టకపోయినా, ఏకారణంవల్లనైనా గానీ, ఆ గీటు దాటి బైటికి పాదంపెట్టడమే సంభవిస్తే...మళ్ళీ వెనక్కి వచ్చి మామూలు రక్షణ పొందటమనేది అసంభవమేమో—అని తోచింది.

# 23

మర్నాడు కూడా మావారు రాలేదు. మా సొంతం కాని ఈ కొత్త యింట్లో నాకేదో విలక్షణంగానే ఉంటోంది. ఏం కానున్నదో! ప్రభాత్ ఏం చేస్తాడో! కోహ్లీ ఏం చేస్తాడో! తీక్షణమైన చూపులు గల ఆ వ్యక్తి ఎంతకైనా సాహసుడులాగే కనిపిస్తున్నాడు. ఇలా మాటిమాటికీ మనస్సుకు ఆందోళనకరంగానే ఉంటోంది. శాంతి, స్థిమితం

లేకుండాపోయాయి. ఎంతసేపటికీ మనస్సుకు అటువంటి ఆలో చనలనుంచి విముక్తి చేకూరలేదు.

నాలుగోరోజు కూడా వచ్చింది. రెండు జాములైంది. సాయంత్రం అయింది. గడియలు నా నెత్తిమీద మోపిన బండరాళ్ళలా ఉన్నాయిగాని చప్పున జారిపోవటంలేదు. నాకు ఆలోచన చెప్పగలిగినవారు ఎక్కడున్నారు? ఇవాళ నాలుగో రోజు! మావారు ఇవాళ తప్పకండా వస్తారు. ఎక్కడికి వెళ్లారో! ఎందుకు వెళ్ళారో! నాకు తెలీదు. కాని ఇవాళ వస్తారని మాత్రం నాకు నమ్మకంగా ఉంది. రాకపోతే నేను అన్నం, నీళ్ళు, ఏమీ ముట్టను. వారు ఇవాళ రావాలి; రావాలి; రావాలి.

ఒక గడియ; రెండు గడియలు. వారు వస్తారని నాకు ఆశగానే ఉంది. కాని ఈ గడియలు ముడిచిపెట్టి పడుకుని నిద్రపోతున్నట్టున్నాయి. జరిగిపోవటంలేదు. ముద్దకట్టుకు పడి వున్నాయి. ఆ గడియల అడుగున నా మనస్సు నలిగిపోతు న్నది. ఏడుగంటలైంది; ఏడున్నర అయింది; ఎనిమిదికూడా అయింది. తరువాత అయిదారు నిమిషాలకు వాకిలి దగ్గర ఎవరో వచ్చి నిల్చున్నట్టు అనిపించింది. నిజంగా వారే ఐవుంటారు. నా హృదయం గంతు వేసింది. ఇంతలో గది బైటనించి ఎవరో "లోపలికి రావచ్చా?" అని మెల్లిగా ప్రశ్నించాడు. ప్రశ్నిస్తూనే ఎవరో లోపలికి రానే వచ్చాడు.

"ఇదేమిటి? దీపం ఏదీ?"

నేను ఆగదిలో చీకటిలోనే కూర్చుని ఉన్నాను. లైటు వేద్దామన్న ఆలోచనే పోలేదు నాకు. నూతన వ్యక్తి ఎవరో ఇలా లోపలికి ప్రవేశించేసరికి నాకు భయంవేసింది. "ఎవరదీ ?" అన్నాను.

"శత్రువును కాదు. స్విచ్ ఎక్కడ ఉందీ ?"

"ఎవరు మీరు ?"

"శత్రువును కాదు. స్విచ్ వేసి లైటు వెలిగించండి."

నాకు బాగా భయం వేసింది. కేకలు వేద్దా మను కున్నాను. కాని గొంతు పెగల్లేదు. ఆ వ్య క్తి ముందుకు సాగివచ్చాడు. నా చెయి పుచ్చుకుని, కూర్చున్నదాన్ని లేవదీశాడు. "స్విచ్ వెయ్యండి" అన్నాడు.

లేచినదాన్ని వేగంగా ఆ గదిలోనుంచి ఇంకో గదిలోకి వెళ్ళాను. స్విచ్ వేశాను. దీపం వెలిగింది. ఆ వ్యక్తి కూడా ఈ గదిలోకే వచ్చాడు. చూచాను. అతడు ఎవరో కాదు. ఆ చురుకుచూపుల మనిషే. "ఇవతల ఈ గదిలోకి రండి; పని ఉంది" అన్నాడు.

వచ్చాను ఇవతల గదిలోకి.

"ఇక్కడకూడా స్విచ్ వెయ్యండి."

గదిలో ఇదివరకంత చీకటిగా లేదు. అయినా స్విచ్ వేశాను.

"కూర్చోండి."

"తమ రెవరు ?"

"శత్రువును కాదు."

"మిమ్మల్ని లోపలికి ఎవరు రానిచ్చారు ?"

"నేనే వచ్చాను. హరీశ్ మిమ్మల్ని చాలా చాలా అడిగారు."

"ఎవరూ? "

"—వారు ఇక్కడ ఢిల్లీలోనే ఉన్నారు. యమునా ఘాట్‌లో. ఉదయం ఏడెనిమిది గంటలమధ్య అయితే దొరుకు తారు. వెళ్లి చూస్తారా ? ఒంటరిగానే వెళ్ళాలి."

"తమ రెవరూ ?"

"శత్రువును కాదని మాత్రం తెలుసుకోండి."

"మిమ్మల్ని నేను విశ్వసించవచ్చా ?"

"మీయిష్టం. కాని విశ్వసిస్తేనే మంచిది. ఒక విషయం చెప్పండి : ఉన్నది ఉన్నట్టు చెప్పాలి : లాల్‌ను రక్షించా లనేనా మీ ఉద్దేశం ?"

"తమరు ఎవరూ ?"

"శత్రువును కాదని చెప్పానుగా ! మొన్న వాళ్ళతో కూడా వచ్చాను. లాల్‌ను కాపాడాలనే మీ ఉద్దేశం అయి నట్టయితే—"

"ఎక్కడ ఉన్నాడతను ఇప్పుడు ?"

"మీరు అతన్ని కాపాడ్డానికి అవకాశం ఉంది."

ఇదంతా చాల విచిత్రంగా ఉంది. ఈమనిషి అంతు ఏమిటో నాకు చిక్కటం లేదు. అతనితో మాటాడ్డం నాకు ఇష్టంలేదు. కాని నా ఇష్టాయిష్టాలతో అతని కేమీ సంబంధం ఉన్నట్టు కనిపించలేదు. 'శత్రువును కాదు' అనిమాత్రం చెబుతున్నాడు. అంతకుమించి తనను గురించి ఏమీ చెప్పటంలేదు. నేను వెంటనే ఒక నిర్ణయానికి రాలేకపోయాను. ద్వైధీభావం లోనుంచి బైటపడలేకపోయాను. పరిస్థితి అలాంటిదీ మరి!

"ఒకవేళ రేపు ఉదయమే నేను వెళ్ళలేకపోతే—" అంటూ ఆరంభించాను.

"మీరు లాల్‌ను కాపాడలేరు; ఆలోచించుకోండి."

నేను వెళ్ళినందువల్ల అతన్ని కాపాడ్డం ఎలా వీలౌతుంది? వెళ్ళకపోతే ఎందుకు వీలుకాదు? ఆ సంగతేమిటో వివరంగా చెప్పమని అడిగాను.

కాని అతడు ఎక్కువగా ఏమీ చెప్పలేదు. ఇక్కడ లాల్‌కు తాను ఒక్కడే స్నేహితుడట. తానేమీ అతనికి సాయంచెయ్యలేని స్థితిలో ఉన్నాడట. నేనుగనక తలచుకుంటే అతన్ని...హరీశ్ బాబు కోపం చల్లార్చి రక్షించగలనట. అంతే చెప్పాడు.

ఇప్పుడు భలే తంటాయే వచ్చింది. ఇటువంటి చిక్కులో పడతానని నే నెప్పుడూ అనుకోలేదు. మధ్యమధ్య అతని

ముఖకవళిక కనిపెట్టి చూస్తునే ఉన్నాను. కాని నాకేమీ అంతు చిక్కటం లేదు. "మీరెవరో, మీ సంగతేమిటో ఎక్కువగా చెప్తారా ?"

"ఊహుఁ. కాని శత్రువును మాత్రం కాదు."

"ఎవరికీ మీరు శత్రువు కానిది ? లాల్‌కు యేదో అపాయం జరగనున్నట్లు చెబుతున్నారు మీరే. అపాయం కలిగించనున్నవారికా ? పొందనున్నవారికా ?"

ఆ వ్యక్తి క్షణమాత్రం ఆలోచనలో పడ్డాడు. "మీకు శత్రువును కాదు" అన్నాడు చివరకు.

"ఇక మీరు వెళ్లిపోండి. నేనేమీ చెయ్యలేను. నాకేం తెలీదు. ఇక మళ్లీ మీరు ఇక్కడికి రాకండి" అన్నాను విసుగ్గా.

అతడు తానున్నచోటునుంచి కదల్లేదు. మెదల్లేదు. "చెప్పమన్నారా నేను ఎవరినో !"

నేను అతని ముఖంలోకి చూచాను—

"నేను దోపిడీదొంగను. నమ్మగలరా ?"

నమ్మగలుగుతున్నాను; నమ్మలేకపోతున్నాను. అతని ముఖంలోకి చూస్తూ ఉండిపోయాను.

"దోపిడీదొంగ కూడా మనిషే, బాగా చదువుకునీ ఉండవచ్చు. మరి మీరు—?"

అతని ముఖంలోకి చూస్తూఉంటే ఒక్కసారిగా నా

హృదయంలోనుంచి భయం వదలిపోయింది; అనుమానం తొలగిపోయింది. "రేపు నన్ను మీరు తీసుకువెడతారా ?" అని అడిగాను.

"నేనా ?"

"ఆ చోటు ఎక్కడో తెలుసుకోటానికి నాకు కష్టం ఔతుందేమో !"

"సరే ! యమునాఘాట్ సమీపంలో నాలుగు రోడ్లూ కలిసేచోట నేను వచ్చి కనిపిస్తాను."

అతనికి దోపిడి వృత్తి ఎలా అబ్బిందీ, ఈ వ్యక్తులందరితో సంబంధం ఎలా ఏర్పడిందీ—ఈ మొదలైన విషయాలన్నీ చాలా తెలుసుకుందామనుకున్నాను. కాని అవకాశం లభించలేదు. అదే సమయాన మావారు వచ్చేశారు. వారి ముఖం చాల ప్రసన్నంగా ఉత్సాహభరితంగా ఉంది. వస్తూనే కొత్త వ్యక్తిని చూచారు; కొంచెం అనుమానించారు; కాని మరుక్షణమే అతని ఉనికే మరచిపోయారు. "సుఖదా ! ఎలా ఉన్నావు ఏమిటి ? చెప్పు. ఈ నాలుగురోజులనుంచీ నేను ఏమైపోయానా అని ఆలోచిస్తూన్నావు కాబోలు ! కదూ ! నైనిటాల్ వెళ్ళాను; తరువాత ఆల్మోరాకు; ఆతరువాత రాణీఖేత్ కు. వినోద్‌ను 'టూర్' చేయించాను చక్కగా. నువు ఇక్కడ తిరగలి ముందు పెట్టుకుని కూర్చున్నావు. వినోద్ ఎన్నెన్ని ఊళ్ళు తిరిగొచ్చాడో, ఏం చెప్పను !...తమ రెవరండీ !"

"హరీశబాబు అనుచరులలో ఒకరు."

"హరీశబాబు ఎక్కడ ఉన్నారు ?"

ఆ వ్యక్తి మౌనంగానే ఉన్నాడు.

"ఇక్కడే ఉన్నారుట" అని నేను చెప్పాను జవాబు.

"ఏమిటీ ? ఢిల్లీలోనే ? ఎన్నాళ్ళనుంచీ ? అతను ఈ చాయల ఎక్కడా ఉండటం మంచిది కాదే ! (ఆ వ్యక్తివైపు తిరిగి) ఏమండీ ! మీకు అంతమాత్రం తెలియకుండా ఉందేం ? ఆయన్ను ఇక్కడే ఎందుకు అట్టిపెట్టారూ ?"

ఆ వ్యక్తి ఆ మాటకు సమాధానం చెప్పలేదు. లేచాడు వెళ్ళిపోటానికి. "ఇక నేను వెడతాను. మరి..." అన్నాడు.

అతను అడగదలచిన ప్రశ్నకు సమాధానం నేనైతే చెప్పలేదు. తనే గ్రహించుకున్నాడేమో, వెళ్ళిపోయాడు.

"మీరు నాతో చెప్పకుండా ఎక్కడికో ఎందుకు వెళ్ళిపోవాలి ? నేనిక్కడ ఒక్కతెనే ఉంటున్నాకదా ! మీకు అంతమాత్రం తెలీదూ ?" ఆవేశంగా అడిగాను.

"ఒక్కతెవే ఏం ? తులసి ఉన్నాడుగా !"

నేను కోపం తెచ్చుకున్నాను. "తులసి ఒక్కడే ఏం కర్మం. కుర్చీలున్నాయి, బల్లలూ ఉన్నాయి. మీరు నన్ను ఎందుకు ఇలా యేడిపించటం ?"

తమకూ నాకూ మధ్య ఏ సంబంధమూ ఉండని బాంధ వ్యాన్నే స్థిరంచేస్తూ వారు ఇలా అన్నారు: "విషయం అది కాదు సుఖదా! నువు ఒక ఆవరణలో బంధితవై ఉండవు. మొదట కొంచెం విలక్షణంగా కనిపిస్తుందనుకో. కాని ముమ్ముందు—ముమ్ముందు ధైర్యశాలి వౌతావు; నన్నా శ్రయించుకుని ఉండాల్సిన అవసరం పోతుంది. పరాశ్రయం అంత మంచివస్తువేమీ కాదు."

ఆ మాటలకు నాకు చాల కష్టం కలిగింది. "వినోద్‌ను కూడా తీసుకొచ్చారా?"

"నువు ఈమధ్య వినోద్‌ను చూడలేదు కాబోలు! వాడికి తల్లీ, తండ్రీ, అమ్మమ్మ—ఎవరూ అక్కర్లేదు... మనమే ఇక్కడ అనవసరంగా లేనిపోని ప్రేమలూ, అనేక బాధ్యతలూ పెట్టుకుంటూంగాని."

"వెంట తీసుకురాకపోయారూ?"

"నాకేం తెలుసూ నువు అంత—పోనీ చూడాలను కుంటే పిలిపించుదాం."

"ఇప్పుడు పదికొౌతోంది. ఇంటినుంచి వస్తున్నారా?"

వారు నవ్వారు. "కాదు. అత్తగారింటినుంచి వస్తు న్నాను."

"అక్కడంతా కులాసాగా ఉన్నారా?"

"ఓ, కులాసాగానే ఉన్నారు...ఇక వెడతాను."

"వెడతారా ? ఎక్కడికి వెడతారు ? నాలుగు రోజుల నుంచీ తాళంపెట్టి ఉన్నదికదా ఇల్లు !"

"అయితే యేం ? తాళంచెవి నాదగ్గరే ఉందిగా !"

ఆమాటకు నా హృదయం క్షోభించింది. "వద్దులెండి; మీరు వెళ్ళద్దు. ఇక్కడే పక్క వేయిస్తాను, పడుకోండి."

"అదేం మాట ? ఇల్లు తాళంపెట్టి ఉంచుతామా ... ఊళ్లోకి వచ్చాక కూడాను ? ఇలా బైటికి వచ్చి చూద్దువు గాని రా—"

చూచాను. పళ్ళ గంపలు ఉన్నాయి. ఇంకా ఏవేవో చాలానే ఉన్నాయి.

"మీ సామానేది ?"

"నా సామానా ! వీధిలో టాంగాలో ఉందిగా !"

నేను ముందుకు వచ్చాను. వారు తొడుక్కున్న కోటు అంచు పుచ్చుకుని "దింపెయ్యండి; సామాను లోపల పెట్టించండి." అన్నాను.

"నీకేమైనా పిచ్చా సుఖదా !"

"ఔను. పిచ్చే ఎత్తింది నాకు."

"ఇల్లు తాళంపెట్టి ఎలా ఉంచుతాం ?"

"అయితే నన్నుకూడా తీసుకుపోండి."

వారు నా ముఖంలోకి చూచారు. "నువ్వు కూడా వస్తావా ?—మరి ఇక్కకడెవరుంటారు ?"

"తులసి ఉంటాడులెండి. ఏమంటారు? రమ్మంటారా?"

"వస్తావా ? అయినా ఎందుకూ ?"

అబ్బ ! ఏం మనిషో కదా——ఆడది ! "ఆ ఇల్లు, ఆ సంసారం నాది; మీరు నావారు. అందుకోసమే నేనూ వచ్చేస్తాను" అన్న మాట నోటినించి పెగిలి రానేలేదు. పైగా 'ఎందుకూ?' అని ఆయన అనేసరికి మండిపోయిన ఆత్మాభిమానం అంతలోనే ఎక్కడినుంచి ముంచుకొచ్చిందో నాలోకి — "సరే లెండి; రాను లెండి; ఈ తట్టలు, బుట్టలు అన్నీ మీతోబాటు తీసుకుపోండి."

వారు నవ్వారు. "ఇవన్నీ మీ అమ్మ పంపించింది. నా కెందుకూ ?"

"అయితే ఇప్పుడే వెళ్ళిపోతారా ? కాసేపన్నా ఉండరా ?"

"ఇంకానా ? ఇంతసేపు ఆలస్యం అయినందుకే టాంగా వాడు గోలపెడుతూ ఉంటాడు."

"అయితే చూడండి, రేపు ఉదయం నన్ను యమునా ఘాటుకు తీసుకుపోతారూ ?"

"యమునాఘాటుకా ?" ఆశ్చర్యంగా అడిగారాయన.

"ఔను తీసుకుపోతారా మరి ?"

"నాకు చాతకాదు బాబూ ! నాలుగు రోజులనుంచీ ప్రాణం అంతా అలసిపోయివుంది. ఈ రాత్రి హాయిగా పడుకుని నిద్రపోతాను. ఉదయాన్నే లేవగలుగుతానన్న నమ్మకం లేదు."

ఏం చెయ్యాలో కాసేపు ఆలోచిస్తూ నిల్చున్నాను. వారి పాదాలమీద తలకొట్టుకుని ఏడ్చేదా? అప్పటికైనా నా ప్రార్థన మన్నిస్తారేమో! కాని అంత అవసరంలేకుండా తేలిగ్గానే నా పని నెరవేర్చుకోగలనని నాకు తెలుసు. అయితే యేం, ఆ తేలిక అనుకున్నదే మహా కష్టతరమై నాకు చాత కాకుండా పోయింది. లోపల అభిమానం పట్టుకుని ఏడిపిస్తోంది.

నావైపు చూస్తూ చూస్తూ వారు వంగి గంపలోనించి రెండు మూడు పళ్ళు తీసుకుని "ఇక నేను వెళ్ళనా? సెలవా?" అన్నారు.

నేను ఏం మాటాడలేదు.

ఏదో క్షమాపణ అడుగుతున్నట్టుగా ముఖంపెట్టి వారు హఠాత్తుగా "అప్పుడప్పుడు ఈ పళ్ళతో కాలం వెళ్ళ దీసెయ్యొచ్చు. అసమానం పొయ్యి ఎవరు రాజేస్తారు?" అన్నారు. అని మళ్ళీ నా ముఖంలోకి చూశారు. నేను దిగాలు పడి చూస్తూ నిల్చున్నాను.

"సరే, ఇక వెడుతున్నాను..." అంటూ వారు వీధిలో నిల్చి ఉన్న టాంగావైపు వెళ్ళారు.

నేనూ చూస్తూ ఉండిపోయాను. కాసేపటికి లోపలికి పోయి కూర్చున్నాను. ఏవేవో ఆలోచనలు వచ్చాయి. వారు ఇంటికి వెడతారు; తాళం తీస్తారు; దీపం వెలిగించు కుంటారు; కూజాతో నీళ్ళు తెచ్చుకుంటారు; ఇల్లు ఊడ్చు కుంటారు...చీపురు పుచ్చుకుని! రాత్రి పదకొండు గంటలకు

చీపురు పుచ్చుకుని ఇల్లు ఊడ్చుకోటం!...ఈ రకమైన ఆలోచనలనుంచి మనస్సు మరలించుకోటానికి ప్రయత్నించాను. కాని తేలిగ్గా సాధ్యంకాలేదు. చివరకు ఎలాగైతేనేం రాత్రి చాల పొద్దు పోయింది. ఆ చీకటిలో కళ్ళు తెరచుకునే, అంతా చూస్తూనే పడుకున్నాను. ఎప్పుడో అవే మూసుకు పోయాయి. నిద్రపట్టింది. ఉదయాన్నే మెలకువ వచ్చింది. లేచాను. అరచేతుల్లో తలకాయ పట్టుకుని కూర్చున్నాను. జ్ఞాపకం వచ్చింది...అరె, యమునాఘాటుకు వెళ్ళాలిగా!

# 24

యమునాఘాటుకు వెళ్ళినతరువాత అప్పుడు తెలిసింది: ఆనాడు ఏదో పర్వదినం అని. గుంపులు గుంపులుగా వస్తున్నారు జనం. పరంపరగా వస్తున్న ఆచారాల్ని నేను చాలా మరచేపోయాను. ఇటువంటి పర్వదినాన తెల్లవారేసరికి ఇళ్ళలో నుంచి బయలుదేరి స్త్రీలు అసంఖ్యాకంగా యమునా స్నానానికో, గంగాస్నానానికో వస్తారు, ఎంతో ఉత్సాహంగా. వేల సంవత్సరాలుగా సాగివస్తున్న ఆచారం ఇది. కాని నాకు మాత్రం ఈ రోజు అటువంటి మహాపర్వదినం అన్న సంగతే తెలియదు. చుట్టూ చూచాను. అంతటా ఆనందోత్సాహాలు వెల్లివిరుస్తున్నాయి. ఆ వాతావరణంలో ఇముడని ఒక వింత వ్యక్తినా నేను?—అనిపించింది. ఈ స్త్రీలంతా మూఢనమ్మకాల్లో మునిగి తేలుతూ, గతానుగతికమైన పాతమార్గంలో కుళ్ళి పోతున్నారు; వీళ్ళకు నూతన విషయాలు తెలియజెప్పాలి; చైతన్యాన్ని కలిగించాలి. అంటూ ఇలాంటి ఆలోచనలు

తెచ్చుకోటానికి ప్రయత్నం చేశాను. కాని...ఒంటరొంటరిగా, జట్లు జట్లుగా, కుటుంబ పరివార సహితంగా, నడచి కొందరు, బండ్లమీద కొందరు, ఎంతో ఉత్సాహంగా, ఉల్లాసంగా, ఆనందంగా ఇంతమంది స్త్రీలు ప్రవాహంగా వస్తున్నారు, పోతున్నారు. ఆ దృశ్యం చూస్తోంటే వాళ్ళంతా మూఢాత్ములని నాకు జాలికలగలేదు, సరికదా నన్ను గురించే నాకు అనుమానాలు కలగసాగాయి. వాళ్ళే సత్యం; నేనే మిథ్య అనిపించింది. వాళ్ళు ఉన్నారు; నేను లేను. వాళ్ళకు ఆధారం ఉంది. నేను ఎంతో గొప్పదాన్ని అయినానని అనుకున్నా నాకు మూలాధారం ఏమీ లేదు.

"దయచెయ్యండి."

టాంగా ఆగింది. ఆ వ్యక్తి అక్కడ హాజరుగానే ఉన్నాడు. ఎంతో మర్యాదగా "రండి, దయచెయ్యండి" అంటూ స్వాగతం పలికాడు.

నా ఆలోచనలు చెదరిపోయినవి. ఇంత జన సమూహంలో...క్షణమాత్రం కూడా ఆలస్యంకాకుండా...టాంగా వచ్చి ఆగిందే తడవుగా ఈ వ్యక్తి అక్కడే ఎలా వచ్చి హాజరుగా ఉన్నాడబ్బా! ఇప్పుడతను మరో మనిషిలా కనిస్తున్నాడు. వదులైన పలుచని ఆఫారం తొడుక్కున్నాడు. పిక్కల దాకా ధోవతి కట్టుకున్నాడు. ముఖాన గంధపు పట్టెలు ఉన్నాయి. ఒక పండా పైల్వాన్‌లా ఉన్నాడు.

"దయచెయ్యండి అమ్మగారూ!"

నాకు నవ్వు వచ్చింది. "ఓ, మీరా!" అని అందా మనుకున్నాను.

"దయ చెయ్యండి; స్నానానికీ, పూజాదికాలకూ ఏర్పాట్లన్నీ చేశాం."

అతని వెనకాలే వెళ్ళాను. ఘాట్ దగ్గర సత్రాలు చాలానే ఉన్నాయి. ప్రతిచోటా సాధువులు జట్లు జట్లుగా ఉన్నారు. హరికథలు, పురాణకాలక్షేపాలు సాగిపోతూనే ఉన్నాయి. ఒకానొక సత్రంలో ఏకాంతంగా ఉన్న ఒక మూలకు వెళ్ళాం. అక్కడ ముగ్గురు నలుగురు వ్యక్తులు కూర్చుని ఉన్నారు. "స్వామివారు ఎక్కడున్నారు?" నాతో ఉన్న వ్యక్తి అడిగాడు అక్కడ కూర్చున్నవాళ్ళను.

"కూర్చోండి. ఇప్పుడే వస్తారు" అని జవాబు.

నాతో వచ్చిన వ్యక్తికేసి నేను అనుమానిస్తూ చూచాను. అతను మళ్ళీ అడిగాడు వాళ్ళను : "ఎక్కడికి వెళ్ళారు?"

"ఉదయాన్నే లేచి అటు అడవికేసి వెళ్ళారు. తిరిగి వస్తూ ఉండాలి. కూర్చో బాబూ! ఇప్పుడే వచ్చేస్తారు" అని జవాబు.

నేను అక్కడ కూలబడదామనే అనుకున్నాను. "కూర్చుంటారా అమ్మగారూ? నేను అలా వెళ్ళి, వస్తున్నారేమో చూచివస్తాను" అన్నాడు నాతో వచ్చిన వ్యక్తి.

"అయితే నే నీ లోగా స్నానం, జపం ముగించుకు వస్తా" అన్నాను.

"మంచిది అమ్మగారూ ! రండి."

సాగుతూ వెడుతూ మెల్లిగా అడిగాను : "ఏమిటి మరి?"

"ఏదో వ్యవహారం ఉన్నట్టే ఉంది. అలా ఎక్కడికీ వెళ్ళేవాడు కాదాయన."

"ఏడు గంటలు దాటింది ఇప్పుడు."

"ఔను, ఏడున్నర ఔతుంది."

నే నలా కాసేపు తిరిగి వస్తాను" అంటూ ముందుకు సాగిపోయాను. కాని అతడూ నావెనకాలే వస్తున్నాడు. అది నాకు ఇష్టంలేదు. అయినా అతడు నా వెనకాల వస్తున్న సంగతి నాకేమీ తెలియనట్టు ముందుకు సాగిపోతున్నాను. కాని అతడు నన్ను కనిపెట్టే ఉంటున్నాడు. వెళ్ళి వెళ్ళి ఒకచోట ఆగాను. వెంటనే వెనక్కి తిరిగాను. ఎదురుగా కనిపించనే కనిపించాడు. "అరె, నా వెనకాలే ఉన్నావేమిటి ?" అని అడిగాను.

"ఔనౌను. ఒకమాట- "

నేను అతని ముఖంలోకి చూచాను. నా చూపుల్లో సగం ఉత్సుకత, సగం ఉపేక్ష.

"కొంచెం మనం ఒకచోటికి వెళ్ళాలి."

'రాను' అని తీవ్రంగా చెప్పేద్దామనుకున్నాను. కాని నేను మాట్లాడ్డానికి అవకాశం ఏదీ ? ఒక విచిత్రమైన చూపు చూచాడు నాకేసి. వెంటనే ఒక పక్కకు తిరిగి దోవతీశాడు.

నేను అతన్ని అనుసరించి వెళ్ళాను. అల్లంత దూరాన ఒక చిన్న చెట్టు ఉంది. ఆ చెట్టు నీడన నన్ను కూర్చోమన్నాడు.

నేను కూర్చున్నాను.

"మీకు నామీద నమ్మకమేనా?" అడిగాడు ఆ వ్యక్తి.

"మీరు చెప్పదలచుకున్న దేమిటో కానీయండి" గర్విష్ఠురాలులాగ అన్నాను.

"హరీశ్ అన్నగారితో లాల్‌ను గురించి చెడుగా ఏమీ చెప్పకండి."

"మాటాడబోకండి. మీ రెవరసలు?" చాల రోషంగా అన్నాను.

"అన్నగారు చాల నిర్దయుడు, మీకు తెలియదేమో —ఆ సంగతి."

ఆ మనిషితో మాటాడ్డం నాకు అసహ్య మనిపించింది. అతని అనుచిత సాహసానికి మౌనమే సరైన సమాధానం— అనుకుని మాటాడకుండా కూర్చున్నాను.

"ఉన్నదంతా తమ చేతుల్లోనే ఉంది. అన్నగారు ఏదైనా సహిస్తారు; కాని నడవడికలో పొరపాటు వస్తే మాత్రం ఊరుకోరు. మీపట్ల లాల్ చాల అనుచితంగా ప్రవర్తించాడని అన్నగారికి కబురు తెలిసింది. లాల్ బేపరవా మనిషి; కాని నిజంగా వజ్రంలాంటివాడు. అటువంటి గుండెధైర్యం గల వ్యక్తి ఎక్కడా ఉండడని నా నమ్మకం. నామటుకు నేను దోపిడి దొంగనే. అయినా నాకు అప్పుడప్పుడు గుండె దడదడ లాడుతూనే ఉంటుంది..వీసమెత్తు పిరికితనం లేని సిసలైన మనిషి

అతనే. చేతులు జోడించి మీముందు ప్రార్థిస్తున్నాను : లాల్‌ను ఎలాగైనా సరే మీరు కాపాడాలి. మీరు పూనుకోకపోతే అతన్ని రక్షించటం కష్టం. నేను అతన్ని బాగా ఎరిగున్నాను. మాంచి శూరుడు. అందుకనే లోకులకు అతనంటే మంట! ఒక్క హరీశ్ అన్నగారికే అతనంటే చాల ఇష్టం; ఇష్టమే కాదు, చాల ప్రేమ. కాని అన్నగారి ప్రేమ !—అమ్మో ! కత్తిమొన లాంటిది. దేవీ !...ఇదే మీకు నా ప్రార్థన !"

వింటూ కూర్చున్నాను. వింటోంటే విచారంగానే ఉంది. కాని చాల దూరాన ఇద్దరు వ్యక్తులు నడిచి వస్తున్నారు. నా దృష్టి అటు ఆకృష్టమైంది. ఆ వ్యక్తి నావైపు ముఖం పెట్టి నిల్చున్నాడు. అందుచేత ఆ వెనుకనుంచివస్తోన్న ఆ యిద్దరు వ్యక్తుల్ని అతడు చూడ్డంలేదు. నేనుమాత్రం పరీక్షగా చూడసాగాను. ఇక అనుమానం తీరిపోయింది. ఆ యిద్దరిలో ఒకరు మావారే. కాషాయవస్త్రాలు ధరించివున్న ఆ రెండోవారు ఎవరూ ?

"ఇక పోదాం పదండి" అన్నాను

"మీరు నా ప్రార్థన విన్నట్టు లేదు."

"లేవండి, పదండి."

గబగబా అతన్ని చెయి పట్టుకుని లేవతీద్దా మనుకున్నాను. నా ఆత్రత కనిపెట్టి అతడూ భయపడ్డాడు. "ఏమిటీ ? ఏమొందీ ?"

"అటువైపు చూడు."

ఆ వ్యక్తి వెనక్కు తల తిప్పి చూచాడు. "అన్నగారే!" అన్నాడు ఆశ్చర్యపడుతూ.

"ఎవరూ ? హరీశ్ అన్నగారా ?"

"ఔను. కాని ఆ రెండోవారు ఎవరో ?"

"కనిపించటంలేదూ, మావారే—ఇక పదండి."

ఆ వ్యక్తి నిర్జీవప్రతిమలా నిలబడిపోయి...వస్తూన్న ఆ యిద్దరివేపూ చూచి చూచి చివరకు అన్నాడు : "నేను మీవెంట ఎందుకూ ? మీరు ఒక్కరే వెళ్ళిపోండి."

అప్పుడు నా స్థితి ఎలా ఉండిందో మరి ! అతన్ని చెయి పుచ్చుకు లాగి "పద, పోదాం" అన్నాను.

కాని అతని నిశ్చయం మారలేదు. అక్కడ ఇసుక మీద పడుకుంటూ "నేనిక్కడ చేతుల్లో ముఖం దాచుకుని నిద్రపోతుంటాను. మీరు వెళ్ళిపోండి. నేను మంచివాడిని కాదు."

ఇక నేను చేసేదేముందీ ?—వాళ్ళు సాగివస్తూనే ఉన్నారు. దగ్గరికే వస్తున్నారు. రెండోవారు హరీశ్ అన్న గారే అయి వుండవచ్చు. కాని పూర్తిగా సన్యాసిలా కని పిస్తున్నారు. తల వంచుకుని, నేల చూచుకుంటూ...మావారు చెబుతున్న మాటలు వింటూ, మౌనంగా, గంభీరంగా నడిచి వస్తున్నారు. నేను అక్కడనుంచి బయలుదేరాను. పోతూ పోతూ...వాళ్ళకు కనిపించనా ? కనిపించకుండానే ఉండి పోనా ? అని ద్వైధీభావంలో పడ్డాను. ఎటు పోవటానికీ

తోచలేదు. ఒకటి రెండు అడుగులు వెనక్కు వేశాను. ఆ తరువాత అడ్డం తిరిగి నది వైపుకు నడిచాను. ఒడ్డుదాకా వచ్చి బలవంతాన ఆగిపోయాను. లేకపోతే నీళ్ళలో పడిపోయే దాన్నే. తిన్నగా నన్ను నేను సంబాళించుకుని అక్కడే ఒడ్డు దగ్గర...ధ్యాననిష్ఠలో ఉన్నట్టు కూలబడ్డాను. ఆ పైన కాలి బాట మీదగా నడచుకుంటూ వారిద్దరూ సాగిపోతున్నారు. మావారు రెండు మూడు వాక్యాలేవో చెప్పారు. దానికి హారీశ్ బాబు "ఊఁ" అని మాత్రం అన్నారు ; అంతకంటె మరేమీ మాటాడలేదు. మావారు చెప్పిన వాక్యాలు నాకు స్పష్టంగా వినిపించలేదు. కాని అందులో నా పేరు మాత్రం వచ్చింది. " తన పట్టుదల మీదే సుఖద ఆ యింట్లో వెళ్ళి ఉంటోంది...కాస్త ఇల్లు కనిపెట్టి చూస్తూ ఉండాలనే ఉద్దేశం!" అని కాబోలు మావారు చెబుతున్నారు. ధ్వనిని బట్టి వారి అభిప్రాయం ఊహించడానికి...స్పష్టంగా నాకేమీ వినిపించలేదు. వారు దాటి వెళ్ళిపోయాక నేను మళ్ళీ పైకి వచ్చేశాను. ఆ వ్యక్తి అక్కడ అటూ ఇటూ దిక్కులు చూస్తూ నిల్చున్నాడు. నేను కనిపించగానే "మీరు వెళ్ళ లేదా? ఇక్కడే ఉన్నారా?" అని అడిగాడు.

"లేదు, ఇక పద."

"ఎక్కడ ఉన్నారు మరి?"

"భూమిలో పూడ్చుకుపోయాను. ఇక పద!"

ధర్మశాలలో ఆ ప్రదేశానికి వెళ్ళాం. హారీశ్ అన్న గారు అచ్చం సన్యాసిలాగే ఆసీనులై ఉన్నారు. చుట్టూ

భక్తులు అర్ధవృత్తాకృతిలో కూర్చుని ఉన్నారు—ఆ భక్త మండలిలోనే మావారూ ఉన్నారు. నేను రాగానే స్వామివారు (హరీశ్) నావైపు ఒక ప్రసన్న దృష్టి ప్రసరించారు. ఆశీర్వదిస్తున్నట్టుగా చెయి ఎత్తారు. మళ్ళి మామూలుగా అటు వైపు తల తిప్పేసుకున్నారు.

మావారు కూడా సాశ్చర్యంగా నావైపు చూచారు; కాని ఏమీ పలుకరించలేదు.

నేనూ అక్కడే ఒకచోట కూలబడ్డాను. కాసేపు అయాక నా వెంట వచ్చిన వ్యక్తి స్వామివారిని ఉద్దేశించి "బాబూ! ఈ అమ్మగారు తమతో ఏదో ఏకాంతంగా విన్నవించుకోటానికి వచ్చారు." అన్నాడు.

"ఏకాంతంగానా?" అంటూ స్వాములవారు చెయి ఎత్తి ఒకసారి చుట్టూ చూపిస్తూ "ఏకాంతంగానే ఉందిగా! ఏం అమ్మా?" అన్నారు.

"స్వామీ! ఏదో తన సొంత కష్టాల్ని గురించి ఈవిడ గారు—" అన్నాడు నాతో వచ్చిన వ్యక్తి.

"నువు ఎవరు అమ్మా!" స్వాములవారి ప్రశ్న.

"అడుగో! మావారు అక్కడే ఉన్నారు స్వామీ!"

అప్పుడు స్వామివారు చుట్టూ ఒకరకమైన చూపు విసిరారు. వెంటనే అక్కడ సమావేశమైనవారంతా దూరంగా వెళ్ళిపోయారు. నేనూ, మావారూ మాత్రమే మిగిలాం. మేముకూడా ఇంకా దగ్గరగా జరిగాం.

"ఇక చెప్పు సుఖదా! కులాసాగా ఉన్నావుగదా! నేను కాంత్ కు మిత్రుడినని నీ కీపాటికి తెలిసే ఉండచ్చు. కాని మేం కలిసి మెలిసి తిరిగి ఎన్నాళ్ళయిందో! నేను కొన్ని సంవత్సరాలుగా అతనికి దూరమైపోయి ఉంటున్నాను. కాని...మీా ఆయన ఎంతకూ ఒప్పుకోటం లేదు, నేనేం చెయ్యను చెప్పు—నేను విన్న దేమిటంటే—ఇంతకూ మీా కాపురానికి రెండు ఇళ్ళు కావల్సివచ్చాయేమిటి?" అన్నారు స్వామివారు.

"ఎబ్బే, లేదు, లేదు—" అంటూ ఆరంభించ బోయారు మావారు.

స్వామివారు నవ్వారు. "సరే సరే, కొంతకాలంవరకే అన్నారు కదూ! సరే, ఖాళీ చెయ్యమని నేనేం అడగటంలేదు. ఖాళీ చేయటానికి ఒప్పుకున్నారుగా! దానికేంగాని—నీతో పాటు వచ్చాడే ఆ పండా మహాశయుడు! ఎటువంటివా డేమిటి?"

నేనేం సమాధానం చెప్పలేదు.

"అమర్యాదస్థుడు కాదు కద!"

"కాదు."

"బంగారంలాంటి మనిషి! నా కిప్పుడు పెద్ద తంటాయే వచ్చి పడింది. దుర్మార్గులనుకున్నవాళ్ళేమో మంచివాళ్లై పోతున్నారు; మంచివాళ్ళని అనుకున్న వ్యక్తులు...ఆఁ ఆఁ, నేను ఒకసారి డబ్బు కావాలి అని కోరానుకదూ! దానిమీాద

నువు మూడునందలరూపాయలు తెచ్చి లాల్‌కు ఇచ్చావు. మీ ఆయనన్నా అడిగాను—డబ్బు కావాలని. క్షమించాలి, నా పొట్ట చాల పెద్దది. ఆకలి ఒకపట్టాన చల్లారదు...మీ ఆయనగారు నీతో చెప్పకుండా రెండువేల రూపాయలు నా కోసం పంపించారు. సరే అంతవరకు బాగానేఉంది. కాని డబ్బు మళ్ళీ మీరు ఎందుకు తీసేసుకున్నారు ?"

సమాధానం మావారు చెబుతారు కదా అని నేను మాటాడలేదు. వారూ మౌనంగానే ఉండిపోయారు. అప్పుడు నేను అన్నాను : "మేం తీసుకోలేదు; అవే తిరిగి వచ్చేశాయి."

"తిరిగి వచ్చేస్తేమాత్రం మీరు తీసుకున్నారుగా! ఎందుకు తీసుకున్నారు? తీసుకోవలసిందని మీవారితో నువు చెప్పావు కదా ?"

"చెప్పాను."

"ఎందువల ?"

"పైకం మీ చేతిలోకి కాకుండా ఇంకెవరిచేతిలోకో పోయిందని మావారికి చాల కష్టం కలిగింది."

"ఔను, ఆ సంగతి విన్నాను; కాని నీది పొరపాటు, మీ ఆయనదీ పొరపాటే. ఇచ్చిన వస్తువు మళ్ళీ తీసుకో కూడదు. అప్పుగా ఇచ్చింది కాదుగా ఆ డబ్బు!"

ఆ మాటలు వింటోంటే నాకు చాల విచిత్ర మనిపించింది. ఆ డబ్బు ప్రధానంగా ఆయనది; తరువాతనే మాది—అన్నట్టుగా ధ్వనిస్తున్నాయి ఆ మాటలు. ఆయన ఆత్మవిశ్వాసం

స్థితిని తారుమారు చేసేట్టుగా ఉంది. మా డబ్బును మేము అంగీకరించి పుచ్చుకున్నందుకే మమ్మల్ని పెద్ద దోషులకింద కట్టేస్తున్నారాయన.

"అబ్బాయిని చదివించటానికి డబ్బు అవసరమైనట్టుంది నీకు! అంతేకదూ!"

అంటూ వారు నవ్వారు. నవ్వి మళ్లీ ఇలా ఆరంభించారు: "ఇందులో నీ తప్పు ఏమీ లేదని నువ్వు అనుకుంటూ ఉండవచ్చు. నిజమే, తప్పు లేదని నేనూ ఒప్పుకుంటాను. కాని...నువ్వు ఒక్క వినోద్‌కేనా తల్లివి? కాదు సుఖదా! అలా అనుకోకూడదు. అనాథ బాలబాలికలు ఎందరో ఉన్నారు. మన దేశపరిస్థితుల్ని గురించి అడగబోకు. చదువు ఆఖరికి; మొదట కావల్సింది అన్నం, నీళ్ళు. ఆ అన్నం, నీళ్ళే ఎంతమందికి దొరకటంలేదో నీ కేమన్నా తెలుసా? వాళ్ళందరికీ కూడా నువ్వు తల్లివే. లేకపోతే వాళ్ళ కోసం తల్లిని నేనెక్కడినించి తీసుకురాను చెప్పు? భగవంతుడి దగ్గరనించి వాళ్ళ తల్లుల్ని మళ్ళీ ఈ లోకానికి నేను తీసుకు రాలేనుగదా! బ్రతికివున్న, చైతన్యంగల తల్లివి నీ మీదే భారమంతా వచ్చి పడక తప్పదు...

ఏం వింటున్నానో నాకు సరిగా అర్థమౌతున్నట్టు లేదు. మా వినోద్‌కు చదువు చెప్పించకుండా ఉండటమే సముచితంగా కనిపించసాగింది నాకు ఆ సమయాన.

"చదువుకు డబ్బుకావాలి; నాకు తెలుసు ఆ సంగతి. కాని డబ్బు పెడితేగాని రాని చదువు చదువే కాదని నా

అభిప్రాయం. బాగా ఆలోచించి చెప్పు: అది చదువౌ తుందా? వినోద్‌ను నాకు అప్పగించు. నేను చదువు చెబు తాను. దమ్మిడీ పుచ్చుకోను." అంటూ పకపక నవ్వారు. "ఇంకెక్కడినించి పుచ్చుకుంటాను? అంతా ముందే పుచ్చే సుకున్నాగా!...కాని కాంత్! వట్టి బికారివాడిని, నా దగ్గర నించికూడా అంతా లాగేశావు కదా!"

వారి చూపు మమ్మల్ని దాటి, మా మీదుగా దూరంగా వెళ్ళింది. మేము వెనక్కు తిరిగి చూచాం. ఆ పండా మహాశయుడు మెల్లమెల్లగా అడుగులు వేసుకుంటూ వస్తు న్నాడు, స్వామివారికి ఏదో నివేదించుకోవాలన్న ఆత్రతతో.

"ఏమిటీ?"

"చిత్తం. లాల్—"

"వచ్చాడా? సరే, కాస్త ఆగు...కాంత్! నువ్వు వెళ్ళిపో నక్కర్లేదు. నీకేమన్నా అభ్యంతరం ఉంటే మాత్రం బలవంతాన నిన్నిక్కడ ఉంచటం నా కిష్టం లేదు."

పండా వెళ్ళిపోయాడు. మావారుకూడా లేచి అక్కడి నించి దూరంగా వెళ్ళారు.

"సుఖదా! ప్రేమ అంటే ఏమిటనుకుంటున్నావు?— మాటాడవేం? నీ సమాధానం తెలుసుకోవాలనే అడుగు తున్నాను. చెప్పు చెప్పు..."

—చెప్పండీ! (పాఠకమహాశయుల నందర్నీ అడుగు

తున్నాను) నే నేం సమాధానం చెప్పాలో మీలో ఎవరైనా సూచించగలరా ?

"నేను చెప్పనా ? అదే సత్యం అని నా భావన. అదే ఈశ్వరుడని నేను భావిస్తున్నాను. ఈశ్వరునిపైన పరమేశ్వరుడైనా అదే—అని నా విశ్వాసం" అన్నారు ఆయన.

సన్న్యాసి వేషంలో ఉండి, కంటి అద్దాల్లోనించి పదునుగా చూస్తూ, ఒక స్త్రీని అలాంటి ప్రశ్న అడుగుతోంటే...ఆ మనిషిని గురించి...నేనేమి అనుకోవాలి ? ఏమి సమాధానం చెప్పాలి ?

"చెప్పు మరి ! లాల్‌ను ఇక్కడికి పిలవనా ? ఇంకా ఆగనా ?"

నే నేమీ మాటాడలేదు.

"లాల్ అంటే నాకు ఎంతో ప్రేమ. అటువంటి యువకులు అరుదుగా దొరుకుతారు. సుఖదా ! నిజం చెప్పు : అతన్ని శిక్షించవలసిందే నంటావా ?"

నే నేమీ పలుకలేదు. కాని అప్రయత్నంగా నా తల అడ్డంగా ఊగింది.

ఆయన మందహాసం చేశారు. "వద్దా ?" అన్నారు. అదే సమయంలో వారి కనుబొమలు వక్రంగా తిరిగాయి. "ఎందుకు వద్దో చెప్పగలవా ?"

ఆ కనుబొమల వక్రతకు నాకు భయం వేసింది. కాని నే నేమీ మాటాడలేదు.

"అతడు డబ్బు నీకు తిరిగి ఇచ్చేశాడు. నగలు తిరిగి ఇచ్చేశాడు...సుఖదా ! వింటున్నావా ? అది ప్రేమకాదు. అందులో భగవంతుడు లేడు. అందులో మోహమే ఉంది. సైతానే ఉన్నాడు. ఏమంటావు ?"

నే నేమీ మాటాడలేదు.

"సైతాను సర్వవ్యాపి. లేకపోతే భగవంతునికి సర్వవ్యాపి కావలసిన అవసరం ఉండదు. మన అందరిలోనూ ఉన్నాడు ఆ సైతాను. కాబట్టి అతన్ని శిక్షిస్తే నన్ను శిక్షించినట్టు. అతనిలోని పిశాచాన్ని క్షమిస్తే నాలోని పిశాచానికి విందు చేసినట్టు...అతడు నా కెందుకు చెప్పలేదూ ?... నేను—"

"మీరు లేరుగదా !" అన్న మాటలు అప్రయత్నంగా నా నోటివెంట వచ్చేశాయి. వచ్చేసిన తర్వాత కుంచించుకు పోయాను.

ఆయన నవ్వారు. ఆ నవ్వు చాల భయంకరంగా ఉంది. "సుఖదా ! మన తప్పుల్ని మనమే క్షమించుకోటం అనేది పాపం. ఇటు చూడు, అతడు నిన్ను తాకాడా ?"

నేను వారి ముఖంలోకి చూచాను. ఆయన అదే ప్రశ్న రెట్టించి అడిగారు : "తాకాడా ?"

"తాకాడు."

"మరి...?"

అప్పుడు నన్ను ఏమి ఆవేశించిందో మరి ! నాకు

పిచ్చి తినట్టు అయింది. నా చెయి చాచి వారి మోకాలు మీద ఉంచాను. "నేను మిమ్మల్ని తాకాను."

"తప్పు చేస్తున్నావు. తీసెయ్యి చెయ్యి" గద్దింపుగా అన్నారు.

వారి మాటలోని తీక్షణతతోపాటు శరీరంలోని ఆవేగం కూడా నన్ను స్పృశించినట్టయింది. నా చెయి వెనక్కు వచ్చేసింది.

"సుఖదా! నీకు వివాహం అయింది. ఒకని భార్యవు. గృహిణివి. తల్లివి. వీటిలోని పరమార్థం ఏమిటో నీకు తెలుసునా? ఈ స్థితిలో పరపురుషుని స్పర్శ—"

"మీరు పరపురుషులా?" చిరాకుగా అన్నాను.

"నేను నరకం అనుభవించ ననుకుంటున్నావా? ఇప్పుడు నేను నరకంలోనే ఉన్నాను." కఠోరంగా అన్నారు.

"నాస్పర్శ వల్ల మీకు నరకం లభించిందా?"

"ఔను; ఆ సంగతి నువ్వు గ్రహించలేదు; నేనూ గ్రహించలేదు."

ఇంతవరకూ మంత్రముగ్ధనులా ఉంటూవచ్చాను. ఆ స్థితి క్రమశః తొలగిపోతోంది. "మీ రెప్పుడూ స్త్రీస్పర్శకు దూరంగానే ఉంటున్నారా?"

"లేదు, నరకంనుంచి నే నెప్పుడూ దూరంగా లేను."

"మీరు వివాహం చేసుకోలేదా?"

"స్త్రీ అంటే తల్లి అన్నమాట !"

"తమరు అలా అంటున్నారేమిటి ? వివాహం అయిన తర్వాతనే మాతృత్వం వస్తున్నది. వివాహం కాని పిల్లను కూడా మీరు తల్లి అనే అంటారా ?"

వారు కాస్త ఆగారు. కంఠం సవరించుకున్నారు. దానితో పాటు మెదడుకూడా విశాలమైనట్టుంది. ముఖంలో శాంతత, ప్రసన్నత తెచ్చుకున్నారు. "మిథునమే సృష్టి హేతువు—నాకు తెలుసు. కాని ప్రేమ వేరు...అయినా తర్కం దేనికిలే. లాల్ ద్రోహం చేశాడు. నాకేమన్నా ద్రోహంచేశాడంటే... అదొక పెద్ద విషయంకాదు. కాని అతని ద్రోహం దేశద్రోహం అవుతున్నది. అది అల్పవిషయం కాదు. నేను దాన్ని కూడా అల్పవిషయంగానే భావించగలను. కాని అల్పవిషయం అని తోసి వెయ్యటానికి వీల్లేని అంశం ఒకటి ఉంది. నేను లేనప్పుడు అతను ఒక బజారుస్త్రీని డబ్బిచ్చి తెచ్చి ఆ గదిలో అట్టి పెట్టుకున్నాడట. నీకు తెలుసా ఆ విషయం ?"

"విన్నాను."

"అవీ ఇవీ పాడుబొమ్మలన్నీ తెచ్చి అక్కడ తగిలించాడట. ఆ పటాలు అలంకరించటంలో నీ సహాయంకూడా పొందాడట. నిజమేనా ఆ సంగతి ?"

నేను జవాబు చెప్పలేదు.

"నువ్వు సాయంచేశావా ?"

"చేశాను."

"సుఖదా! అది అల్పవిషయం కాదు సుమీ! నీకు నేను రాసిన ఉత్తరం అతని దగ్గర ఉంది. దాన్ని పాటించి నువ్వు అతను చెప్పినట్టు చెయ్యాల్సి వచ్చింది. అదీగాక మనకు... చెడుకూడా మంచిగానే కనిపించేలాగు భ్రమ కల్పించగల చాతుర్యం అతనిలో బాగా ఉంది. నీ దోషం ఏమీలేదు. కాని అతని ప్రవర్తన విషయమై నువ్వు ఏమంటావు?"

నేనేమీ మాటాడలేదు.

"అతడు వచ్చినప్పుడు నువ్వు అక్కడ ఒక్కతెవే ఉన్నావు కదూ!...అతని తప్పు ఏమీ లేదంటావా ?"

"లేదు."

"నువ్వు అన్నట్టు తప్పు ఏమీ లేకనే పోవచ్చు. కాని పైకం తెచ్చి తిరిగి మీకు ఇచ్చివెయ్యటంలో అతని గుట్టు బయలుపడిపోయింది...ఈ విషయంలో కాంత్ ఏమనుకుంటు న్నాడో తెలుసా?"

ఏమిచెబుతారో వినాలన్న కుతూహలంతో నేను వారి ముఖంలోకి చూస్తూ ఉండిపోయాను.

"మీ ఆయన చాల విచిత్రమైన వ్యక్తి. ఈ విష యంలో తానేమీ అనుకోటమే లేదట. నేనుకూడా ఏమీ అనుకోకూడదట. ఎవరికివారే స్వతంత్రులట. ఒకర్ని గురించి ఇంకొకరు తమ ఇష్టం వచ్చినట్టు అనుకోవలసిన అవసరం లేదట. నువ్వూ అదేమాట అంటావా ?"

"ఊహుఁ."

"మరి ?"

"భార్యకు ఏమీ చెప్పకుండా ఉండేందుకు అధికారం భర్తకు లేదు. మీరు నన్ను శిక్షించవచ్చు; ఎవరైనా నన్ను శిక్షించవచ్చు. శిక్ష పుచ్చుకునే హక్కు నాకు ఉంది. శిక్షించే హక్కు అందరికీ ఉందని నా అభిప్రాయం." నాకు ఆవేశం వచ్చేసింది. "ఇక నేను వెళ్లిపోవచ్చా ?" అని అడిగాను.

"ఎక్కడికి వెడతావు ? లాల్ కూడా వచ్చాడు; ఇక్కడికి పిలిపించనా ?"

"నా సమక్షంలో ఎందుకూ ?"

"నువ్వు ఉండగానే పిలిపించాలి; ఒక మాట : బహుశా నిన్ను నేను అర్థం చేసుకున్నాననే అనుకుంటాను. కాని నువుకూడా నన్ను అర్థం చేసుకోవాలి సుఖదా ! నేను మన సనాతన సంప్రదాయ రక్షకుడిని కావలిసి వచ్చింది. నేను నిర్ద్వంద్వుడినై అడవుల్లో తిరుగుతూ ఉండేవాడిని. కాని భగవంతుడు ఒక పన్నాగం పన్నాడు. నాకు ఒక గురువుగారు ఉండేవారు. అయన్ను నేను ఒక మహాత్ముడుగా భావించాను. ఆయనే ఈ కార్యభారం నా తలమీద మోపారు. నాకు అదివరకు ఏమీ పని ఉండేది కాదు. బైరాగిని. ఆధ్యాత్మిక సాధనలో ఉండేవాడిని. కాని మా గురువుగారు నాపై ఒక కార్యభారంపెట్టి "ఇది వ్యావహారికమైన ఆధ్యాత్మిక సాధన. ఇదే చాల ఉన్నతమైనది" అన్నారు. గురువచనాన్ని నేను మన్నించి స్వీకరించాను. వారి మాటల్లోని సత్యాం

కూడా నాకు స్వతః అనుభూతం అయింది. అప్పటినుంచీ నేను ఇందులోనే ఉన్నాను. ఇది అసిధారావ్రతంలాంటిది సుఖదా! ఒక్క తప్పటడుగు వేశామంటే అంతా పాడై పోతుంది. ఇక్కడ మనవాళ్ళు, పరాయివాళ్ళు అన్న విభేదమేలేదు. బ్రతుకు చావులకు సంబంధించిన కర్తవ్యాలతో మాకు ప్రమేయంలేదు. బ్రతుకుతూ ఉంటారు, చస్తూ ఉంటారు. బ్రతికే ఉండాలని ఎందుకు కోరుకోవాలి? చావ కూడదని ఎందుకు కోరుకోవాలి? ఆ యీ వ్యాపారాలన్నీ వాటి నియమం ప్రకారం సాగిపోతూ ఉంటాయి. మనం నిమిత్తమాత్రులమే. జరగవలసిందేదో జరుగుతుందిలే అనుకుని, విధికి తలవొగ్గి, నిశ్చలంగా, నిష్కలంకంగా ఉండటం ...అదే మన కర్తవ్యం. ఈ మధ్యలో అడ్డంవచ్చే ప్రేమ ప్రేమకాదు. మార్గంలో వ్యతిరేకతల్ని తెచ్చిపెట్టగల అవకాశం దానికి లేదు. ఈశ్వరునివైపు ప్రసరించేదీ, ఈశ్వరునుంచి వచ్చేదీ...అదే ప్రేమ. అందులో నాది, నీది అన్న విచక్షణ ఉండదు. ఏమైనా, ఇంత చెబుతున్నా, నా ఓటమిని అంగీకరిస్తున్నాను. అందుకనే లాల్ వచ్చినప్పుడు నువ్వు కూడా ఇక్కడే ఉండాలని కోరుతున్నాను. నీకూ తెలుసుంది: నేను మమతలేని అచ్చపు సన్యాసిని కాదు అని. ఏమంటావు మరి! ఉంటావు కదూ!"

"అలాగే."

వారు చెయ్యెత్తి సైగ చేశారు. మరి కాసేపటికి ఆ పండామహాశయుని వెంట లాల్‌బాబు వచ్చాడు—అదే వేషంలో, తైతై ఎగురుతూ, ప్రసన్నముఖుడై.

# 25

లాల్ దగ్గరకు వచ్చాడు. రెండు చేతులూ జోడించి నమస్కారం చేశాడు...అక్కడ నేను కూర్చుని ఉన్నది అతడు గమనించనట్టుగానే.

"లాల్ ! ఉదయాన్నే వచ్చావే !" అన్నారు హరీశ్ బాబు నమస్కారం స్వీకరిస్తూ. ఆతరువాత ఆధికారయుతంగా "కూర్చో" అన్నారు. పండామహాశయుని దగ్గరకు పిల్చి అతని చెవిలో ఏమిటో చెప్పారు.

అదేసమయంలో లాల్ కూర్చుంటూ కూర్చుంటూ నావైపుకు జరిగి "చాల పెందరాళేనే వచ్చేసినట్టున్నారు, నేను ఇంటికి వెళ్ళే ఇలా వస్తున్నాను" అన్నాడు నెమ్మదిగా.

"లాల్ ! ఇలా రా. ఇక్కడ కూర్చో. ఆమెను నేనే ఇక్కడ ఉండమన్నాను. నీకేమీ అభ్యంతరం లేదుగద !" అన్నారు హరీశ్ బాబు. ఆజ్ఞాపిస్తున్నట్టుగా ఉంది ఆయన కంఠస్వరం.

"లేదు – లేదు. నాకేం అభ్యంతరం ? ఈమెగారితో చెబుతున్నాను : ఇంటికికూడా వెళ్ళే ఇటు వస్తున్నానూ అని. (నవ్వాడు) నేను ఇవతలకు వచ్చేశాక ఈమె ఆ యింట్లో వచ్చి ఉంటోంది. అది పెద్ద తప్పు అయింది కదూ !"

హరీశ్ బాబు కోపం తమాయించుకుంటున్నట్టుగా కనిపించారు. "లాల్ ! నువు జపాన్ వెళ్ళిపోడానికి తయారౌతున్నావుటగా ! విన్నాను, నిజమేనా ?"

"చిత్రం, చైనాకూడా."

"వెళ్ళటం నిశ్చయమేనా ?"

"మీ ఆశీర్వాదం లభిస్తే..."

"మళ్ళీ నువ్వు ఇక్కడికి తిరిగి రాకుండా ఉండేపక్షంలో నాకు ఇష్టమే."

"నేను తిరిగి మళ్ళీ భారతదేశానికి రానేకూడదా ? అదా షరతు?"

"ఆ షరతు నువ్వు పాటించగలిగితే నేను నిశ్చింతగా ఉండిపోతాను."

"నేను అలా మాట ఇవ్వాలన్నమాట !"

"ఔను, ఇవ్వాలి."

"ఎందుకని ? అడగవచ్చా ?"

"నిన్ను నువ్వే ప్రశ్నించుకో. బహుశా నీకే తెలిసిపోతుంది."

"ఎవరి తప్పు వాళ్ళకు ఎలా తెలుస్తుంది అన్నగారూ ? తప్పు ఎప్పుడూ ఇతర్లదే, ఇతర్లలోనే కనిపిస్తూ ఉంటుంది. నాదీ అన్నది ఏముందీ ఈ ప్రపంచంలో ? ఒకచోట స్థిరంగా ఉండిపోయే అదృష్టం నా ముఖాన రాసిపెట్టి లేదు. జపాన్ అయినా ఒకటే, చైనా అయినా ఒకటే, టింబక్టూ అయినా ఒకటే. ఎక్కడైనా నాలుగు రోజులపాటే బస. కాని ఈ భారతదేశం నాకు శాశ్వతంగా పరాయిస్థలం ఎందుకు

అయిపోవాలో !—తమరు నాకు తెలియజెబుతారా ? ఇది నా స్వదేశం కాబట్టి దేశబహిష్కృతి నాకు తగిన శిక్ష ఔతుం దని మీరు భావిస్తున్నారా ? లేకపోతే నావి అన్నీ విదేశీ పద్ధతులు కాబట్టి నేను ఉండవలసింది కూడా విదేశాలలోనే అని మీరు అభిప్రాయ పడుతున్నారా ?"

హరీశ్ బాబు ముఖంలో గాంభీర్యం వచ్చింది. "లాల్ ! నువ్వు ఇన్నాళ్ళూ నా మాట పాటించావు; ఇప్పుడూ పాటి స్తావా ? లేదా ?"

"పాటిస్తాను."

"మన సంఘంపట్ల నీకు గౌరవం ఉన్నదా ?"

"ఉన్నది."

"మరి ఇంకేం ? నీకు తెలియనిదేముంది ?"

"ఒక్క మాట మిమ్మల్ని అడుగుదామని ఉంది అన్న గారూ ! నేను ఇన్నాళ్ళనించీ ఎన్ని దుడుకుతనాలు చేసినా మీరు సహిస్తూ వచ్చారు; మీరు నన్నెప్పుడూ ఏమీ అన లేదు. నన్నే నిర్వహించుకు పోనిచ్చారు. మీకు నామీద ఉన్న విశ్వాసం, ప్రేమ...నేను స్వతః ఎలాంటివాడినో అలాంటివాడినిగానే ... ముందుకు సాగిపోడానికి దోహద మిచ్చాయి. సంఘాన్ని గాని, మీ మాటను గాని పాటిం చాలీ అంటే నన్నూ, నా అభిప్రాయాల్నీ త్రోసిరాజు అను కోవలసిందేనా, చెప్పండి ?"

"ఔను, అనుకోవలసిందే అవసరం వస్తే. అప్పుడే నువ్వు సంఘాన్ని పూర్తిగా మన్నిస్తున్నావన్నమాట. లాల్ ! నువ్వు

చదువుకున్నావు; తెలిసిన వాడివి; అనేకసార్లు నేనూ చెప్పాను-స్త్రీవల్ల అదృష్టం భ్రష్టం అయిపోతున్నది; సంస్థలు నాశనమైపోతున్నాయి; సంప్రదాయాలు భగ్నం అయిపోతున్నాయి; ఇటువంటి దుస్థితి మన ఉద్యమాన్ని నిర్వీర్యం చేస్తుంది సుమా అని. నీకు తెలియని విషయమా అది ? అయినాకూడా నువు—"

"అన్నగారూ ! నా అభిప్రాయాలుమాత్రం మీకు చెప్పకుండా దాచింది ఎప్పుడేనా ఉందా ? అయినా నన్ను మీ సంఘంలోకి తీసుకున్నారు; నన్ను నా యిష్టప్రకారమే స్వతంత్రంగా నిర్వహించుకు పోనిచ్చారు. స్త్రీ పురుషులనీ, ప్రాక్పశ్చిమాలనీ...ఇలాగ రెండు రెండు వేరు వేరు పాయలుగా విభజించుకుంటూ ఆలోచించే విధానం నాకు చాతనౌతుందని మీ రెప్పుడేనా అనుకున్నారా ? అన్నగారూ ! మనం గనక ఈ ప్రపంచాన్ని వేరు వేరు భాగాలుగా విభజించుకుంటూ ముందుకుపోవాలనుకుంటే...మనకు ఎంత పట్టుదల ఉన్నా...ముందుకు పోలేం; ఒక్క అడుగుకూడా ముందుకు పోలేం. అన్ని విషయాలూ మీకు నివేదించాల్సిందే నని మీరు ఆజ్ఞాపించలేదా ? అలాగే అన్నీ మీకు చెబుతూనే వచ్చానుకదా !...వినగల ఓపిక మీకు అక్షయం అన్న ఉద్దేశంతో."

నేను ఆ యిద్దర్నీ అలా చూస్తూ, వారి మాటలు వింటూ మౌనంగా కూర్చున్నాను. లాల్ స్వతంత్రుడు. అతడు మాటాడుతున్న తీరులో ఆత్మ నిగ్రహం, వినమ్రత

కనిపిస్తున్నాయి. హరీశబాబులో స్నిగ్ధత, నిశ్చలత, సరళత, అంతుపట్టని లోతు కనిపిసున్నాయి.

హరీశబాబు ఇలా ఆరంభించారు : "లాల్ ! నీ తత్వం నేను గ్రహించాను. కాని ఓటమిని అంగీకరిస్తున్నా ననుకోకు. మనస్సు ఎలా పోతే మనమూ అలా పోకూడదు. దాన్ని వశంలో ఉంచుకోవాలి. ప్రపంచం అంతా ఒకటే, నాకు తెలుసు. అందులో వేరు వేరు విభాగాలులేవు, ఆ సంగతీ నాకు తెలుసు. కాని భూగోళంలో ఎప్పుడూ సగభాగంమీదే ఎండ కాస్తుంది. మిగతా సగభాగంలో చీకటే ఉంటుంది. ఇక్కడ రాత్రి అయితే అక్కడ పగలు ఔతుంది. స్త్రీ స్త్రీయే; పురుషుడుగా మారదు. పురుషుడు పురుషుడుగానే ఉండాలి. వారిద్దరూ కలిసి ఒక కుటుంబం, సంసారం ఏర్పడుతుంది. కాని ఈ కుటుంబాల్ని స్థాపించి, వృద్ధిచేయటానికే మనం సమకూడలేదు. కావలసినవాళ్ళు గృహస్థులౌతారు; సంసారాలు చేసుకుంటారు. కాని, నీకూ నాకూ కూడా అదేపనా? సరేగాని, ఈమె కూర్చుంది, చూచావుగా! పైకం తీసికెళ్ళి ఆమెకు ఇచ్చేశావు? నన్నడిగావా?"

"చెప్పానుకదా అన్నగారూ! ఆ డబ్బు మనం పుచ్చుకోకూడదు అని."

"పుచ్చుకోకూడనిది అయితే కావచ్చు; కాని నన్నడిగావా?"

"పుచ్చుకోకూడని డబ్బును నేను మింగలేకపోయాను."

"నన్ను అడక్కపోవటం తప్పుకాదా?"

"కావచ్చు, అయినా చాల చిన్న తప్పు. కాని పెద్ద తప్పు—"

"నువ్వు చిన్న తప్పు అనుకుంటున్నదే చాల పెద్దతప్పు. ఎందువల్లనో చెప్పమంటావా ? ఈవిడకోసం నీలో—"

"కాదు, కాదన్నగారూ ! కాదు—"

"కా దనబోకు; నాకు తెలుసు."

"అన్నగారూ !"

"గాభరాపడబోకు. అది సహజం. బహుశా సరైనదే అయివుంటుంది. కాని లోకంమాత్రం ఉద్దేశ్యపూర్వకంగా దాన్ని తప్పుకింద కట్టేసింది. నువ్వు ఎవరివో తెలుసా ? మన సంఘంలోకెల్లా విశ్వసనీయమైన వ్యక్తివి. అన్ని అధికారాలూ నీచేతిలో ఉన్నాయి. నేను సనాతనుడిని; పాతమార్గంలో నడిచే వాడిని. కాని లాల్ ! కాలం అనంతమైంది. భూతభవిష్యత్తులు అందులో లేవు. పాపపుణ్యాలు మనకు బైట ఎక్కడా ఉండవు. కాంత్ నా మిత్రుడే. అతడు ఏమనుకున్నా సరే, సుఖద హస్తాన్ని నీ హస్తాలో అప్పగించేసి "కృతార్థులుకండి" అని ఆశీర్వదించి పంపించే సాహసం నాకు లేకపోలేదు. కాని నువ్వు మామూలు మనుష్యులవంటివాడివి కాదు. నీలో ఒక విశేషం ఉంది. అందువల్ల నే నా పని చెయ్యదలచుకోలేదు. చెప్పు : మళ్ళీ ఈ దేశానికి తిరిగి రాకుండా ఎక్కడికిపోయి వుంటావు ? టింబక్టూ అయినా సరే, నాకు భయంలేదు. లేకపోతే—"

"ఏదైనా మీ ప్రసాదమే. తమరు అనుగ్రహింపదలచిన ప్రసాదంనుంచి వంచితుడినై నే నెక్కడికిమాత్రం ఎలా పోతాను ?"

"నా ప్రసాదం ఏమిటో నీకు తెలుసా ?"

"నా బ్రతుకంతా ఎప్పుడు మీ చేతుల్లో లేకుండా ఉంది ?"

"నా ప్రసాదం నిజంగా నీకు కావాలా ?"

"మీరు ఇవ్వగోరటం, నేను పుచ్చుకోకపోవటం... ఎన్నడైనా జరిగిందా ?"

నా చూపులన్నీ హరీశ్ బాబుమీదే ఉన్నాయి. అటు నుంచి మరలటంలేదు. లాల్ మాటలు చెవులతో వింటు న్నాను. అతనివైపు చూడ్డానికి ధైర్యం చాలటంలేదు. అన్న గారి హృదయం కాఠిన్యం తాలుస్తున్నట్టు కనిపించింది. కంఠం లోనుంచి శబ్దం పెగిలి బైటికి రావటంలేదు కాబోలు ! కాసేపు ఊరుకున్నారు. చివరకు అన్నారు : "లాల్ ! నువు ఇక్కడికి వచ్చావెందుకూ ? రావలసిన అవసరం ఏం లేదే !"

"అన్నగారూ ! టికెట్టు కొనుక్కుని ఓడెక్కి కూర్చుంటేమాత్రం మీమాట వినిపిస్తే రాకుండా ఉంటానా?"

"నువు ఇక్కడికి రాకుండానే వెళ్ళిపోయి ఉండవలసింది. పైగా విమానంమీద రావటం దేనికి ? అనవసరపు ఖర్చులు నాకు రుచించవని నీకు స్ఫురించలేదా ? ఈ విషయం పురస్క

రించుకుని రావటం నువ్వు మానివేస్తేనే బాగుండేది. నా మకాం ఇక్కడ మూడు రోజులు మాత్రమే. ఈ కాస్త వ్యవధిలో నువ్వు ఇక్కడికి వచ్చి హాజరు కావటం సంభవం కాదనే చెప్పారు.”

లాల్ కంఠస్వరంకూడా ఆర్ద్రంగానే ఉంది. “అన్నగారూ! మీరు ఇచ్చిన దీక్ష పుచ్చుకున్నతర్వాత నా కింకా అటువంటి దౌర్బల్యం ఎందుకుంటుంది? చావుబ్రతుకుల విషయమై నిర్భయంగా, నిశ్చింతగా ఉండగలగటం మీదగ్గర నేను నేర్చుకోలేదంటారా?”

ఒక్క క్షణంసేపు హరీశ్ అన్నగారు మౌనంగా ఉన్నారు. తరువాత—“సరేగాని—తరువాత నగలు కొన్నే శావు. అవీ తీసుకుపోయి ఇచ్చావు. ఇంకా పైన అయిదువేల రూపాయలుకూడా ఇచ్చావు. ఆ డబ్బు అంతా ఎక్కడినుంచి ఏ మేం చేసి తెచ్చావో...ఆ వివరాలు నాకు అక్కర్లేదు. కాని ఎందుకు చేశావు? సమాధానం చెబుతావా?”

“ఏం చెప్పను అన్నగారూ? చేశాను, చెయ్యగలిగినవాడిని కాబట్టి, చెయ్యకుండా ఉండలేకపోయాను కాబట్టి.”

“అలాగా? చెయ్యకుండా ఉండలేకపోయావేం? ఏం? సొమ్ములు ఈవిడవి కాబట్టా? పైకం ఆవిడకు ఇవ్వాలనుకున్నావు కాబట్టా?”

“కాదు అన్నగారూ! కాదు!”

“అదిగో, మళ్ళీ ‘కాదు కాదు’ అంటావు. సంకోచిస్తావు దేనికీ? ఈవిడకూడా సంఘసభ్యురాలేకదా! చెప్పు.”

లాల్ సమాధానం ఏమీ చెప్పలేదు.

మళ్లీ హరీశబాబు ఇలా అన్నారు : "లాల్ ! నువ్వు మాటాడకుండా ఉండిపోవటం బాగుంది; చాలా బాగుంది. తర్కంకూడా మధ్య మధ్య మౌనం వహించటం నేర్చుకోవలసిందే. యుక్తి ప్రయుక్తులు మనల్నే మింగివేస్తాయి. వాటి ద్వారా మనల్ని మనం సమర్థించుకుంటూ పోతాం. సుఖదా! నీకోసంగాను లాల్‌లాంటి వ్యక్తి కూడా ఒక్క క్షణం మాట రాకుండా మౌనంగా ఉండిపోవలసి వచ్చింది. నీకు నా ధన్యవాదాలు! సుఖదా, మీ ఆయన నాకు బాల్య స్నేహితుడు. అవసరం వచ్చినప్పుడు నీదగ్గర డబ్బు అడిగి తీసుకున్నాను. అంతటితో ఊరుకోలేదు. మీ పరిస్థితి తెలిసికూడా నీ నగలు అమ్మించియైనా తిరిగి డబ్బు తీసుకో తలచాను. ఇటువంటి వాడిని నేను ఒక రాక్షసుడిని కాదని నీకు తోచలేదా? చివరకు ఆ డబ్బు, నగలు నీకు తెచ్చి అప్పగించటంలో కేవలం నీ శ్రేయోభిలాషే కాదు...అంతకు మించిన ఒక నిషిద్ధమైన, సందిగ్ధమైన, అస్పృశ్యమైన భావం ఏదో ఉన్నట్టు కనిపెట్టలేక పోయావా ?—"

"అన్నగారూ!" పసివాడులా కేకవేశాడు లాల్.

"కాని నువ్వు ఏం చేస్తావు పాపం! ఆడదానివి. మరి లాల్‌లాంటి పురుషుడు—" ఏదో అనబోయి ఆగారు హరీశ్ బాబు.

నేను రాతివిగ్రహంలా కూర్చున్నాను. ఏం మాటాడ లేదు.

లాల్ మాత్రం గద్గదకంఠాన "అన్నగారూ!" అన్నాడు.

హరీశ్ బాబు అటువైపు తిరిగారు. "లాల్! వీళ్ళ కుటుంబం బాగోగులు గురించి ఆలోచించవలసిన బాధ్యత నీకన్న...నిజానికి...నాకే ఎక్కువ. ఆ బాధ్యత పురస్కరించుకునే నే నలా చేశానని నువు తెలుసుకోవాలి. నగలు అనేవి దూష్యవస్తువులు. సగం జనసంఖ్యకు పైగా కడుపుకు అన్నంలేక మలమల మాడుతూన్న ఈ దేశంలో కొంతమంది నగలు నాణేలు దాచుకుని కులుకుతూంటే నేను సహిస్తానా? నాకు ఆత్మీయులైనవారి దగ్గర ఆ నగలు ఉంటూంటే చూస్తూ ఊరుకున్నానంటే నేను తీసుకురాదలచిన విప్లవం ఏమిటి ఇక? కాంత్ నాకు ఆత్మీయుడు; తద్వారా సుఖదకూడా నాకు ఆత్మీయురాలే. వీళ్ళు నిర్ధనులు, దీనులు, నిస్సహాయులు అయితే పోతారు. దానివల్ల చెరువు ఏమిటి? వాళ్ళు అలా అయితీరాల్సిందే. ఇప్పుడు నిండుగా కదలకుండా కూర్చున్నారూ అంటే లోపల హృదయంలో అంతా శూన్యం కాబట్టేగా! కాబట్టి నేను చేసిన దేమిటో బాగా ఆలోచించి, విచారించే చేశాను. వాళ్ళను నా మార్గంలోకి తెచ్చుకుందామనే చేశాను. నేను చేసినదాన్ని పాడుచెయ్యటమే నీ కర్తవ్యంగా నువ్వు భావించుకున్నావు. ఎందువల్ల? నీ మనస్సు ఒప్పుకోలేదు కాబట్టి. అది నీలో ఇమిడిపోలేదు కాబట్టి. ఈ స్త్రీ శరీరం ఎదుటకి వచ్చేసరికి నీలో నీవు కరిగి నీరై పోయేవాడవు కాబట్టి. వణకబోకు! భయపడబోకు! లాల్! మనం ప్రేమించవలసింది ఒక్క మన దేశాన్నే కదా!

మిగతా ప్రేమలన్నీ మనకు నిషిద్ధాలేకదా! ఈవిడకోసమని దొంగతనం చేశావు. ఆ దొంగతనంచేసి తెచ్చిన సొమ్ము ఆమెకు ఇచ్చావు. ఎందుకు చేశావు ఈ మోసం అంతా? మిగతావన్నీ వదిలెయ్యి. ఇది మహాద్రోహం కాదా?"

అని పలికి సమాధానంకోసం ఎదురుచూస్తూ, హరీశ్ బాబు ఆగిపోయారు. "నన్ను చెప్పమంటారా, అన్న గారూ?—" అన్నాడు లాల్ వినయభరితమైన కంఠస్వరాన.

"ఊఁ, చెప్పు."

" 'ఆదర్శవాదం' అన్న ఒక శబ్దం ఉంది—"

హరీశ్ అన్నగారు నవ్వారు. "దాన్ని ఒక కేవల శబ్దం కింద కట్టేసి తప్పుకుపోదామని చూస్తున్నావా?"

"లేదు. కాని ఆదర్శాలన్నీ మనం ఏర్పరచుకున్నవే కాదా? అవి అసంపూర్ణములే కాదా?"

"కావచ్చు. మనం అసంపూర్ణులమై, ఆదర్శాలూ అసంపూర్ణములే అయితే...ఇక చెయ్యరాని పని అంటూ ఏముంటుందీ? అసంపూర్ణులం కాబట్టే పట్టుదలగా ఆదర్శాన్ని అంటిపెట్టుకుని ఉండాలి. ఆ పట్టుదలే మనం పరిపూర్ణులం కావటానికి మార్గాన్ని చూపిస్తుంది."

"క్షమించండి అన్నగారూ! మానవుడు మనం అనుకున్నట్టుగానే ఉండడు. అతనికి ఒక నైజం ఏదో ఉంటుంది. సశరీరుడు. ఊహకు మాత్రం శరీరం ఉండదు. అది నేల విడిచి ఆకాశంలోకి ఎగిరిపోగలదు. మనిషి ఆ విధంగా ఎగిరిపోలేడు

అన్నగారూ! మెల్లగా నడిచి పోతాడు అంతే. అటువంటి మానవుల్లో మనం తేదలచిన పరివర్తన కూడా మెల్లిగానే రావాలి. మన ఉద్యమం కూడా ఒక్కసారి ఎగిరి ఆకాశాన్ని చుంబించాలంటే లాభంలేదు. నిరాశ ఎదురౌతుంది."

"ఉద్యమం ఎగురుతుందో, జారి పడుతుందో... అదంతా తరువాతి విషయం. ఆ చింత మనకు అక్కర్లేదు. నువ్వు ఆ చింతేమీ పెట్టుకోనక్కర్లేదు. నువ్వు డబ్బిచ్చి బజారునుంచి ఒక స్త్రీని తెచ్చుకుని గదిలో అట్టిపెట్టుకున్నావుటగా! ఎందుకూ?"

"ఆవిడకు డబ్బు అవసరమైంది."

"డబ్బు అవసరమా? డబ్బు అవసరం ఎవరికి రాకుండా ఉంటుంది?"

"ఆవిడ నాకు కొంచెం దూరపు బంధువు."

"బంధువు! డబ్బు ఉచితంగా ఇవ్వలేకపోయావూ?"

"ఉచితంగా ఇవ్వకూడదు అన్నగారూ! అందువల్ల నేను చూపే అనుగ్రహం ఆమెకు బరువౌతుంది. ఆమె ప్రకటించే కృతజ్ఞత నాకు బరువౌతుంది. అలా ఇవ్వకూడదు అన్నగారూ!"

"కాబట్టి గదిలో తెచ్చి అట్టిపెట్టుకోవాలేం?"

'పోలీసువాళ్ళ దృష్టి అటునుంచి మరలించాలిగా మరి!"

"సరే, అర్థం అయింది. అవసరం పట్టినప్పుడు ఒక నీచకార్యం చేసినా అది నైచ్యం అనిపించుకోదన్నమాట!

అంతేనా ? ఒక స్త్రీ మనకు బంధువైన కారణం పురస్కరించుకుని ఆవిడను అవమానించి పంపించవచ్చునన్నమాట ! అంతేనా ?"

"నన్ను అడగబోకండి అన్నగారూ ! అంతా మీకు తెలుసు. ఇంకా నన్ను సంజాయిషీ అడగటం ఎందుకూ ? మీరు ఎటువంటి కళ్ళతో చూస్తారో, అటువంటి కళ్ళు నాకు లేవు. నేను ఆ సమయానికి ఎలా తోస్తే అలా చేశాను. మనస్సులో ద్వైధీభావం రానీకూడదు. పూర్తిబాధ్యత నా నెత్తి మీద వేసుకుని చేసిందేదో చేశాను. ఒక్క నిమిషంకూడా మళ్ళీ దాన్ని గురించి ఆలోచనలో పడకూడదు. అటువంటి సమయంలో ఎలా చేశామో, ఎలా చెయ్యాలని అనుకుంటామో అలా చేసెయ్యవలసిందే. అటువంటి ద్వైధీభావంలో మిమ్మల్ని పడనీకుండా "ఇదిగో, నేను వచ్చేశాను; దేనికైనా నా మెడకాయ సిద్ధంగా ఉంది" అని మీకు చెబుదామనే ఆత్రతగా పరిగెత్తుకుని వచ్చాను. కాని అన్నగారూ ! మనిషిని దేవతనుగా తయారుచేసే ప్రయత్నంలో మీరు సఫలులు కాలేకపోయిననాడు నన్ను గుర్తుకు తెచ్చుకో గలుగుతారు. మనిషిలో ఏదైతే ఉందో దాన్ని యావత్తూ సమగ్రంగా అంగీకరించకపోతే మీరతన్ని అల్పుడినిగానే తయారుచేస్తారు; గొప్పవాడిని చెయ్యలేరు. మనిషిలో నుంచి కొంచెం ఏదో విడిగా కోసి తీసేసి అతన్ని పరిపూర్ణుని చెయ్యలేము. కోసి తీసెయ్యటం కాదు కావలసింది. ఏదైనా తెచ్చి జోడించటానికే యత్నించాలి...అటు పడమటి వైపునుంచి

వస్తున్నది—ఒక తుఫాను. మీరైతే శ్రేష్ఠులను మాత్రమే తీసుకుంటారు; నికృష్టులను దూరంగా విసిరి పారేస్తారు. అది ఆ విసరి పారేసిన ఉచ్ఛిష్టాన్నే తీసుకుని ధ్వజం ఎత్తి జేగీయమానంగా సాగి వస్తున్నది. అది ఆదర్శవాదం కాదు; కేవలం భౌతికవాదం; అదే కర్మవాదం. ఆదర్శం కాదక్కడ ప్రధానం; కృషే - మానవుని స్థితిగతుల గురించిన ప్రసంగమే తప్ప ఆత్మతత్వ విచారం ఉండదక్కడ. అక్కడ స్త్రీ 'దేవి' కాదు; పురుషులకు దూరంగా ఉండవలసిన వ్యక్తి కాదు. మామూలు మనిషే; పురుషులతో సావాసంగానే ఉంటుంది. ఇందువల్ల మీరు సంతోషించేట్టయితే ఈ సంగతికూడా చెబుతాను: నాకు ఈమెమీద ప్రేమ కలిగినమాట వాస్తవమే. కాని ఆ ప్రేమ ఎటువంటిది? అందువల్లనే నేను మళ్ళీ ఇక్కడికి రావాలన్న ఉద్దేశమే వదులుకున్నాను. దీనికి మీరు పలాయనం అని పేరు పెడితే పెట్టవచ్చు. కాని నాలో వెల్లుగా పొర్లిన ఆ పవిత్ర ప్రేమను మీరు అవగాహన చేసుకుంటారా?...అది అపవిత్రం అని మీ ఉద్దేశం. అది చాల పవిత్రం అని నా భావన. పోనీ మీ విశ్వాసం ప్రకారం పవిత్రం కాదనే అనుకుందాం; అయినా మానవుడు వాంఛలలోనుంచే ముందుకు సాగుతూ ఉంటాడు. నాకు తోచిన పద్ధతిలో చెయ్యవలసిందేదో చేశానని చెప్పాను. ఎందువల్ల?—మీరు నన్ను ఆజ్ఞాపించారు గనక; నేను ఏదో చేస్తానుకదా అని మీరు ఆశించారుగనక; నిర్వహణబాధ్యత కూడా మీరు నామీదనే పెట్టారు గనక; చెయ్యాల్సిన పద్ధతి కూడా నా నిర్ణయానికే వదిలేశారుగనక. మీరు నాకు ఎప్పుడు

ఏ పని చెప్పినా నేను తోసివెయ్యలేదు; అది నాకు చాల సంతోషకరమైన విషయం. అయితే ఏం చేసినా నాకు తోచిన పద్ధతిలోనే చేశాను—మరింకో పద్ధతిలో చెయ్యటం నాకు చాతకాదు కాబట్టి. నాకు ఒక్కటే తెలుసు : ఏదో విధంగా పని జరిగించెయ్యటమే నా వంతు. ఆ పద్ధతి మంచి చెడ్డలు నా చేతిలో లేవు. అవి మీ చేతిలోనివి. మీరు విశ్వసించిన నీతి ననుసరించి నేను నడుచుకో లేదంటారా, ఇదిగో, మీ యెదుటనే ఉన్నాను; మీ యిష్టం వచ్చినట్టు చెయ్యండి నన్ను. కాని 'మీరు విశ్వసించిన నీతినే నేనూ విశ్వసిస్తున్నా' నని చెప్పలేను. అలా చెప్పానంటే నేను వట్టి అసత్యవాది నౌతాను. నీతులు బోధించే ఏ తత్వశాస్త్రాన్నీ నేను అంగీకరించలేను. మీ విప్లవ కార్యక్రమంతోటి సంబంధం వదిలేసుకుని వెళ్ళిపొమ్మంటే పోతాను, లేదా మీరు ఏమిశిక్ష విధించదలిచినా సిద్ధంగానే ఉన్నాను. కాని మనిషిని మనం సమగ్రంగా లెక్కలోకి తీసుకోవాలి. నైతికదృష్టి మనిషిలోని సగాన్నే తీసుకుని విలువ కడుతుంది...అన్నగారూ! నేనెప్పుడూ ఏ విషయమూ నోరువిప్పి మీతో చెప్పలేదు. మన సంఘసభ్యుల అందరి వ్యవహారమూ కాస్త పరకాయించి చూడండి మీరే. మీరు ఏ విచారమూ అంటకుండా పైన ఉంటారు. కింది పనులన్నీ చెయ్యటానికి నేను ఉన్నాను. అందుచేత మీకు అక్కడి యథార్థ పరిస్థితులన్నీ దృష్టిలోకి రావు. ప్రపంచంలోని కాముక జనంలో మీ వైరాగ్య దృష్టికి కనిపించే అధమలక్షణాలన్నీ ఇక్కడా ఉన్నాయి. ఈమె ఇక్కడ కూర్చుని ఉంది. ఇంతకన్నా నేను ఇంకే

చెప్పను ? ఇంతకూ మనిషి మనిషే. చెడునడత గల మనిషి అని తోసివేసినందువల్ల ఆతని శక్తిద్వారా పొందవలసిన లాభాన్ని పొందలేకపోగా ఆత్మవంచనకు పాల్పడుతున్నామన్నమాట. అతన్ని జారవిడుచుకున్నందువల్ల ఫలితాన్ని కోల్పోతున్నాం. అది పెద్ద పొరపాటు. అన్నగారూ ! మీరు నామీద మోపిన నేరాలన్నీ నిజమే. అన్నీ చేశాను. నగలు తిరిగి ఇచ్చేశాను. అయిదువేల రూపాయలూ ఇచ్చాను. డబ్బు ఇచ్చి ఒక స్త్రీని గదిలో అట్టిపెట్టుకున్నాను. ఇందులో ఏ ఒక్క నేరానికీ నేను సంజాయిషీ యివ్వను. నేను నిజంగా కల్మషంలేనివాడినే అయితే సంజాయిషీ ఇచ్చుకోకపోయినా నాకు వచ్చే నష్టం లేదు. కల్మషం గల వాడినే అయితే సంజాయిషీ ఇచ్చుకుంటే మాత్రం కల్మషరహితుడిని ఔతానా ? నేను ఎంత మంచివాడినైందీ, ఎంత చెడ్డవాడినైందీ ఆ నిర్ణయ బాధ్యత నామీద లేదు. అన్నింటికీ మీరే ఉన్నారు. ఇంకో విషయంకూడా చెప్పాలి : లోకంలో అసంఖ్యాకంగా ప్రజలు భార్యాబిడలు సంసారం గొడవల్లో ఉంటున్నారు. కిందా మీదా పడుతూ రోజులు వెళ్ళదీసుకుంటున్నారు. ఆయా బాధలు అనుభవిస్తూ ఉంటారు. ఏదో విధంగా జీవిక కొనసాగించుకుంటూ; తిరుగలి, పొయ్యా...అవే సమస్త ప్రపంచంగా కాలక్షేపం చేస్తూ ఉన్నారు. వాళ్ళ స్థితిగతులను నేను...సర్వ విచారాలకూ అతీతమైన ఒక ఉన్నత ప్రదేశంలో నిల్చుని చూడ్డం లేదు. అన్నగారూ ! లక్షలాదిగా ఉన్న అటువంటి ప్రజలకు డబ్బే ప్రాణం సుమండీ ! మీకైతే డబ్బు అంటే మట్టితో

సమానం. నేనూ ఒకరకంగా డబ్బును తుచ్ఛవస్తువుగానే చూస్తాను. కాని ఆ లక్షలాది ప్రజాజీవితానికి సంబంధించిన అనేక రకాల వ్యవహారాలద్వారా ఏర్పడిన సమాజానికి జీవమే అది. వాళ్ళ జీవితానికి వెలుగే అది. అది తగ్గితే మనిషి నీరసిస్తున్నాడు. కాబట్టి ఆత్మనీతి, ధర్మనీతి అనేవి తరువాత చూచుకోవచ్చు. మొదట అవసరంగా చూడాల్సింది అర్థనీతి. మీరు డబ్బుకు అతీతులు. దాన్ని తాకనుకూడా తాకని పవిత్రులు. డబ్బు దానంతట అదే మీ పాదాలవద్ద వచ్చి వాలుతుంది; శాంతంగా అక్కడే పడివుంటుంది.”

లాల్ కాసేపు ఆగాడు. హరీశ్ అన్నగారు మౌనంగా ఉన్నారు. లాల్ మళ్ళీ ధోరణి సాగించాడు: “కాని చాల మందికి డబ్బు అలభ్యంగానే ఉంది. ధనదేవత పైన ఎంతో ఎత్తున నడచిపోతూ ఉంటుంది. వారు ఆమెను అందుకోటం దుస్సాధ్యం. కూలి నాలి చేసుకునో, మోసంచేసో, అబద్ధాలాడో...ప్రపంచం రీతే అలా ఉంది అనుకోండి...దమ్మిడీ దమ్మిడీ సంపాదించి కూడబెట్టుకుంటున్నారు. డబ్బుమీద వాళ్ళకు ఉన్న మమత ఇంతా అంతా అని చెప్పటానికివీల్లేదు. మానవుడికీ మానవుడికీ మధ్య ఉండవలసిన ప్రేమ చాల స్వల్పంగా కనిపిస్తున్నది. అదైనా ధనబలం మూలంగానే విలువ నిర్ణయమై, విక్రయమౌతున్నది. మనం ఇప్పుడు తొలగించాలని చూస్తున్న ఆ విదేశీ ప్రభుత్వానికే నాణాలు, నోట్లు ముద్రించటానికీ, చలామణీ చెయ్యటానికి హక్కు ఉంది. ఆ ప్రభుత్వాన్ని మనం కూలదొయ్యాలి. స్వతంత్ర ప్రభుత్వాన్ని నెలకొల్పుకోవాలి. మన విప్లవోద్యమానికి అర్థనీతి

అత్యవసరం. రాజనీతి బాహ్యరూపం, అర్థనీతి ప్రాణం. అన్న గారూ! మీ దయవల్ల నేను దేశదేశాలు తిరిగాను. కేవలం ధర్మంమీద, నీతిమీద ఆధారపడితే పనులు అవవు. అనేక వ్యవహారాలు చూచిన మీదట నేనా నిర్ణయానికి వచ్చాను. క్షమించండి అన్నగారూ! మీ బలం అంతా ధర్మం నీతి మీద ఆధారపడివుంది. మీకు నైతిక వ్యక్తులే కావాలి. కాని మన దృష్టి సమాజంమీద ఉండాలి. అన్నగారూ! నీతి సాపేక్షమైన వస్తువు; సమాజం సనాతనం. ఏదో వాగాను, మీరు ఇదంతా పాటించనక్కర్లేదు. నన్నొక లెక్కలోకి తీసుకోకండి. మీవల్ల తయారైన వాడినే నేను. నన్ను చంపి పారెయ్యాలని మీకు అనిపిస్తే జంకుగొంకు లేమీ పెట్టుకో నవసరంలేదు."

నేను అన్నగారివైపు చూస్తూ ఉన్నాను. వారి దృష్టి చాలసేపు లాల్ వైపే ఉంది. చివరకు తల వాల్చి నేల చూస్తూ కూర్చున్నారు. లాల్ కనబరచిన బాహాధిక్యతకు వారి ముఖంలో ఏవిధమైన సంచలనమూ కనిపించలేదు. చివరకు లాల్ తాను చెప్పదలచిందంతా చెప్పి, ముగించి శాంతంగా కూర్చున్నాడు. అన్నగారు కొంతసేపటివరకూ తలవంచి నేల వైపు చూస్తూ అలాగే ఉండిపోయారు. తల ఎత్తలేదు; ఏమీ మాటాడనూ లేదు. స్తబ్ధచిత్తులై గంభీరముద్ర తాల్చి కూర్చు న్నారు. నేను నిశ్చేష్టనై చూస్తూ ఉన్నాను, ఆ యిద్దరు వ్యక్తుల భావవైరుధ్యానికి సాక్షిమాత్రంగా. అది నిజంగా నాకు లభించిన మహదవకాశంగా ఈనాటికీ భావించుకుంటూ ఉంటాను. ఏం సన్నివేశం అది! చాల ఆశ్చర్యం అయింది

నాకు. రెండు తత్వాల సంఘర్షణ. ఇద్దరూ వివశులయ్యే ఉన్నారు. ఎవరి ప్రకృతి వారిదిగానే ఉంది.

చివరకు హరీశ్ బాబు తలెత్తారు. "నువ్వు దేశం విడిచి బైటికి వెళ్ళిపోలేవా లాల్ ?"

"పోలేను అన్నగారూ! మీ ప్రసాదం అనుభవించే అవకాశాన్ని విడిచిపెట్టుకుని నేను వెళ్ళిపోలేను."

"సరే" అంటూ హరీశ్ బాబు నావైపు చూచారు, కాసేపు ఆగారు, "ఈమెతో అయిదు నిమిషాలు మాట్లాడా లనుకుంటున్నాను, అవకాశం ఇస్తావా ?" అన్నారు మళ్ళీ.

"చిత్తం—" అంటూ లాల్ లేచాడు.

"ఆగు. ఒక్కడివే కాదు—" అంటూ హరీశబాబు చప్పట్లు చరిచారు. మరుక్షణమే పండామహాశయుడు వచ్చి హాజరైనాడు.

"ఒక అయిదు నిమిషాలు నేను ఈమెతో మాటా డుతూ ఉంటాను. లాల్ ఇంతవరకూ ఏమీ ఫలహారం అదీ చేసినట్టు లేదు. అతన్ని తీసుకువెళ్ళు. అన్నీ సిద్ధంగా ఉన్నా యిగా !" అన్నారు హరీశ్ బాబు.

అంగీగార సూచకంగా తల ఊపి పండామహాశయుడు లాల్‌ను తీసుకుపోయాడు. హరీశబాబు నావైపు తిరిగి "సుఖదా! బెదిరిపోయి చూస్తున్నావేం ? లాల్‌ను రెండు రోజులపాటు నీ దగ్గర అట్టిపెట్టుకుంటావా ? కాంత్‌తో నేను మాటాడతాను. నీ ఉద్దేశం ఏమిటో చెప్పు" అన్నారు.

ఆ ప్రశ్న చాల విలక్షణంగా కనిపించింది. "ఊహుఁ—"
అన్నాను.

ఆయన చిరునవ్వునవ్వారు. "కోపపడబోకు సుఖదా! ఏవో మాటలు వచ్చాయి; అవన్నీ లక్ష్యం చెయ్యబోకు. మరచిపో. సిగ్గుపెట్టుకోవద్దు. ఒకప్పుడు నిర్వక్రతకు కూడా వక్రత సంభవిస్తూ ఉంటుంది."

"అతడు ఒప్పుకోడు" అన్నాను హఠాత్తుగా.

"అందుకనే నీతో చెప్పాను, సుఖదా! ఇంత వయస్సు వచ్చినవాడైనా అతడు ఈ విషయంలో పసివాడే. నువు తలచుకుంటే మాత్రం చెయ్యగలవు."

"ఏం చెయ్యాలి?"

"ప్రేమించాలి. అది నువ్వు చేస్తూఉన్నదే. కాని—"

"అన్నగారూ!"

"నేను రెండు రోజుల పాటు అతనికి గడువు ఇద్దామనుకుంటున్నాను. ఒకడు చచ్చిపోవటంవల్ల ప్రయోజనం ఏముందీ? చంపినందువల్ల మాత్రం లాభం ఏమిటి? అదొక ఛిటికలో పని. కాబట్టి దాని కంత తొందర పడనక్కర్లేదు. చెప్పుమరి! ఆ పని చేస్తావా? నీ దగ్గర ఉంచుకుంటావా అతన్ని?"

"అతడు ఉండడు అన్నగారూ!" అన్నాను. నా మనసులో భాధగానే ఉంది.

"ఆ సంగతి నాకు తెలుసు. కాని ఇదే నీకు పరీక్ష; అతనికి కూడానూ. ఒక సంగతి చెప్పటం మరచిపోయాను:

ప్రభాత్ మాటలు లెక్క చెయ్యబోకు. అతడు వట్టి పిచ్చి వాడు. ఆజ్ఞ ప్రకారం నడుచుకోవటమే అతని పని; మరిం కేమీ తెలియదు అతనికి. నా ముఖం చూచి అతన్ని క్షమించు కాని ఆ యిల్లు సంఘానికి అప్పజెప్పకుండా, నువ్వు వచ్చి అక్కడ ఉండటం మంచి పని అని మాత్రం నేను ఒప్పు కోను. కాని స్త్రీ తప్పు ఎందుకు చేస్తుంది? చూడు, లాల్‌కు కళ్ళెం బిగించేవాళ్ళు ఎవరైనా ఉండాలి. కళ్ళెం బిగించగలిగిన మగవాడెవడూ లేకపోతే, అటువంటి స్త్రీ యైనా ఉంటుందా? అందుకనే నీతో చెబుతున్నాను...నీకైనా అతను కట్టుబడి ఉంటాడేమోనని. లేకపోతే ఇక అతన్ని..."

నేను ఉలికిపడ్డాను. "అన్నగారూ!..."

"అంతే...మీ అన్నగారి నిర్ణయం. అతను చనిపోవటం నీకు ఇష్టంలేదు. అందుచేత నీకు ఇష్టం లేకపోయినా నా మాట పాటించాలి. సరే; ఇక వెళ్ళు. ఆ వెనుక వైపునే లాల్ ఉంటాడు. అతన్ని ఇలా తీసుకురా!"

"అతనే వస్తూఉండాలి ఈపాటికి—"

"అలా కాదు. నువ్వే వెళ్ళి వెంటబెట్టుకురా. వెనుక వైపున తోటలో మూలగా చపటాలగా ఉంటుంది. అక్కడ ఉంటాడు, వెళ్ళి తీసుకురా."

"వస్తూనే ఉంటాడులెండి."

హరీశ్ బాబు నవ్వారు. "సరేలే అయితే. ఏమైనా ఆడదానివే కదా! వెళ్ళవద్దులే, కూర్చో."

మరి కాసేపటికి పండామహాశయుడు లాల్‌ను తీసుకు వచ్చి, అక్కడ దిగవిడిచి తాను వెళ్ళిపోయాడు.

"కూర్చో లాల్! రెండు రోజులు నీకు గడువు ఇస్తున్నాను. ఇక్కడే ఎక్కడేనా ఉంటావా?"

"ఉరిశిక్షకు పాత్రుడైన ఖైదీని స్వేచ్ఛగా ఉండమనటం, అతని ఇష్టాయిష్టాల్ని కనుక్కోవటం ఆచారం కాదు అన్నగారూ!"

"ఆచారన్ని సృష్టించుకోవచ్చు. ఖైదీ పారిపోకుండా ఉంటే సరి. చెప్పు: ఎక్కడ ఉంటావు?"

"శిక్ష ఏమిటో చెప్పారుగాదే!"

"శిక్ష ఎప్పుడో నిర్ణయం అయిపోయింది. అపీలు చేసింది సుఖద. అదికూడా రెండురోజుల్లో ఫైసలైపోతుంది. రెండు రోజులూ నువ్వు ఇక్కడే ఎక్కడైనా ఉండు. ఎక్కడ ఉంటావు?"

"ఎక్కడ ఉండను? నాకు ఉండటానికంటూ ఒకచోటు ఎక్కడ ఉంది అన్నగారూ! ఢిల్లీ పట్నమంతానాదే. కాని మీరు ఇంకా రెండు రోజులు ఉంటారా ఇక్కడ? చాల ప్రమాదం సుమీ!"

"ఔను, మంచిదే. ఏం కాదా?...సరే, ఈమెగారి యింట్లో ఉంటావా నువ్వు?"

"ఈమెగారి యింట్లోనా? ఈమెగారు నే నుండే బస లో పీఠంపెట్టుకుని కూర్చుందిగా!"

"అరే, అక్కడేనయ్యా !"

"పీఠం ఎత్తేస్తుందా మరి !"

"ఎందుకు ఎత్తేయాలీ ?"

"మరి... ?"

" 'మరి' ఏమిటి ? నీ పై దయ వర్షించటానికి ఆమె సిద్ధంగా ఉంది."

"లేదు - లేదు—" అన్నాను నేను.

"ఆమె మాటలు వినబోకు లాల్ ! ఇందాక నాతో 'సరే' నన్నది."

"ఊహు, ఎబ్బే, అలా కాదు..." అన్నాడు లాల్ ఏదో అహితాన్ని సూచిసున్నట్టుగా."

హరీశ్ నవ్వారు. "సరే బాగానే ఉంది. ఇక పోతే... నా సంగతి ఏం కావాల్సి ఉందో చెప్పు. ఈ యమునాఘాట్‌లో ఉండిపోవలసిందేనా ?"

"ఏం చెప్పను ? ఇవాళ ఉదయమేగా వచ్చాను నేనిక్కడికి ?"

"అరే, నీ చురుకుతనం జాగరూకత ఎక్కడేనా వదిలేసి వచ్చావేమిటి ? ఇక్కడి వాళ్ళందర్నీ నువ్వు ఎరిగే ఉన్నావుగా! ఇవాల్టికి సరే అనుకోండి ; ఇంకా రెండు రోజులు నేను ఇక్కడే ఉండేట్టయితే ... నన్ను పట్టుకున్నందుకుగాను ప్రభుత్వంవారు ఇస్తామని ప్రకటించిన బహుమానమే మీా

చేతుల్లో దక్కుతుంది; తెలుసునా? సుఖదా! కాంత్ చెప్పి వెళ్ళాడు. అక్కడకు రమ్మని ..."

"మావారా?" నాకు ఆశ్చర్యం అయింది.

"ఏం లాల్, నీ అభిప్రాయమేమిటి?"

"నా అభిప్రాయం...సాధు సన్యాసులు గృహిణి లేని యింట్లో వెళ్ళి ఉండటం అనుమానానికి కారణ మౌతుందేమో ననే. ఈవిడగారు అక్కడికే వెళ్ళిపోవటం బాగుంటుందిగా?"

"ఏం సుఖదా! విన్నావా? ఏమంటావు మరి?"

ఒక్క క్షణం నాకేమీ తోచలేదు. చివరకు అన్నాను: ఇవాల్టికి మీరు ఇక్కడే ఉంటారు కదా! మేమిద్దరమూ ఆలోచించుకొని సాయంత్రానికల్లా మీకు ఏ మాటా చెపుతాం."

హరీశ్ ముఖం విప్పారింది. "బాగుంది; చాలా బాగుంది. సరే ఇక వెళ్ళండి. మీకు నా ఆశీర్వాదాలు."

మేమిద్దరమూ అక్కడినుంచి బయలుదేరాము.

## 26

ధర్మశాలలోనుంచి బైటికి వచ్చేశాం. "సుఖదా! నువ్వు నాతో ఏమాలోచించాలి?" అడిగాడు లాల్.

అంతవరకూ నేనేమీ మాటాడలేదు. అప్పు డన్నాను: "మొదట ఇంటికి పద. అక్కడ—"

"ఉహుం. నేను అక్కడికి రాను."

"అయితే నన్ను ఒంటరిగానే పొమ్మంటావా ?"

లాల్ సమాధానం చెప్పలేదు. ఇద్దరం పక్కపక్కనే నడుస్తూ పోతున్నాం. ఏదో తీవ్రమైన ఆలోచనలో ఉన్నట్లు ఉన్నాడు. నేను చెయి పట్టుకుని ఊపుతూ "మనిషివి ఇక్కడున్నట్లు లేదే! నన్ను ఇంటిదాకా తీసుకుపోయి దిగబెట్టవా?"

"దిగబెట్టనా ? సరే...వచ్చేటప్పుడు మరి ఒక్కదానివే వచ్చినట్టున్నావుగా !"

"ఒక్కదాన్నే వచ్చాను. కాబట్టి ఇప్పుడూ—"

"సరే వస్తున్నానుగా, కాని—"

"అయితే పోనీలే."

రోడ్డుదాకా వచ్చాం. అక్కడ పండామహాశయుడు వచ్చి మమ్మల్ని కలుసుకున్నాడు. అతడు రావటం ఉరుకుతూంటూ వచ్చాడు. నావైపే చూడలేదు; నన్ను పలకరించనేలేదు. లాల్‌ను చెయి పుచ్చుకుని దూరంగా తీసుకుపోయి ఏదో చెబుతున్నాడు. నేను ఇవతల ఒక్కతెనే ససంభ్రమంగా నిల్చుని ఆ యిద్దరివైపూ చూస్తున్నాను. లాల్ ఎక్కువగా యేమీ మాటాడటం లేదు. ఆ వ్యక్తే ఏమేమో చెప్పుకుపోతున్నాడు. మధ్యమధ్య ఏదో అడుగుతున్నాడు. లాల్ ఒకటి రెండు మాటల్లో సమాధానం చెప్పేసి మౌనముద్ర తాలుస్తున్నాడు. అయిదారు నిమిషాలు అయ్యాక ఇద్దరూ నేనున్నచోటుకు వచ్చారు. లాల్ నావైపు చూస్తూ "ఇతడు నిన్ను ఇంటిదాకా వచ్చి దిగబెట్టిపోతాడు" అని చెప్పాడు.

ఆ మాటమీద వెంటనే ఆ వ్యక్తి నావైపు తిరిగి ఇలా అన్నాడు : "లేదు-లేదు, అక్కగారూ! మీరే ఇతన్ని వెంట తీసుకుపోండి. మీ కళ్ళముందునుంచి దాటిపోనీకండి. మీరేం భయపడకండి; నేను జాగ్రతగానే ఉంటాను; బైటి వ్యవహారాలన్నీ నేను కనిపెట్టే ఉంటాను. చేతులెత్తి నమస్కారం చేస్తాను అక్కగారూ! మీరుమాత్రం ఇతన్ని మీ దృష్టికి దూరం కానీయకండి."

"కేదార్ !" అన్నాడు లాల్ బిగ్గరగా.

"మీరు ఇతని మాటలు లెక్కచేయకండి అక్కగారూ!" అన్నాడు కేదార్.

"కేదార్ ! నువ్వు వట్టి మూర్ఖుడవు. నాకు రానున్న ఆపద ఏమీ లేదు. ఆపద రానున్నది అన్నగారికే. అంత మాత్రం తెలీదేం నీకు. అన్నగారిని ఇప్పుడు మనం రక్షించాలి" అన్నాడు లాల్.

"ఈ ప్రసంగం అంతా ఇక్కడెందుకు. పద, టాంగాలో-"

"నేనూ రావల్సిందేనా ?" అన్నాడు లాల్.

"ఇతన్ని మీరు విడిచిపెట్టకండి అక్కగారూ!" అన్నాడు కేదార్.

కేదార్ వైపు చూడకుండానే నేను "ఔను, రావలిసిందే" అన్నాను.

"సరే అయితే, కేదార్ ! పోయి టాంగా ఒకటి

పట్టుకురా. అన్నగారిని జాగ్రతగా కనిపెట్టి చూస్తూఉండు సుమా !"

"వారు రేపటినుంచి ఎక్కడ ఉంటారు మరి ?" అడిగాను నేను.

"ఇక్కడే ఉంటారు. ఇక్కడ జనసమ్మర్దం ఎక్కువ. ఇది చాలా ఉపయోగిస్తుంది మనకి."

"కాని వారి మాటల్నిబట్టి..."

"ఔను. మీ యింట్లో అయితే బాగానే ఉంటుంది. కాని కాంత్ ఒంటరిగా ఆయన్ని సంరక్షించలేరు; నువ్వు అక్కడికి వెళ్ళినట్లైతే ఎలాగో కాలం గడపవచ్చు. కాని ఈ పరిస్థితిలో అన్నగారు అక్కడికి వెళ్ళి ఉండటంవల్ల తప్పకుండా శత్రువులదృష్టి అటువైపు ఆకర్షితం కావచ్చు."

"మరి ఏంచేద్దామంటావు ?"

"ఇక్కడే ఉండిపోవటం మంచిది. లేదా...చూస్తాను..."

కేదార్ టాంగా తీసుకువచ్చాడు. మేము అందులో కూర్చుని వెళ్ళిపోయాం. టాంగా కనిపిస్తున్నంతసేపూ కేదార్ అక్కడే నిల్చుని చూస్తునే ఉన్నాడు. లాల్ చాలసేపు ఏమీ మాటాడలేదు. చివరకు ఇలా అన్నాడు : "వీడు వట్టి తెలివి తక్కువ గాడిద. నన్ను రక్షించాలని చూస్తున్నాడు. కాని సుఖదా ! నేను అన్నగారిని బాగా ఎరుగుదును. ఇంతవరకు నాకు కొంచెం భయంగా ఉన్నమాట వాస్తవమే, కాని ఇప్పుడాయన్ని చూచాక నన్నుగురించి నాకు నిర్భయంగానే

ఉంది. ఆయన మనస్సు ఎటువంటిదో ఈ తెలివిమాలినవాడికి ఏమీ తెలియదు. అంత కోమలమైన హృదయం నేనెక్కడా చూడలేదు. మాట కఠినంగానే ఉంటుంది; కాని అది పైకి మాత్రమే. సుఖదా! నాకు ఏదో కొంచెం భయంవేస్తూంది-"

"ఏం భయం? ఎందుకు?..."

"ఎందుకో నాకూ సరిగా తెలియటంలేదు. ఇదిగో, నన్ను మాత్రం ఇంట్లోనే ఉండమని నిర్బంధించవద్దు సుమీ."

"ఏం?"

"అన్నగారికి ఎవరైనా ఒక పెద్ద అఫీసరు ఇంట్లో బస ఏర్పాటు చేయగలిగితే...అది చాలా మంచిది...ఆ పని చూడాలి పోయి."

"పోనీ వెళ్లమంటే నేను మాయింటికి వెళ్లిపోతాను."

"వెళ్ళగలవా సుఖదా?"

"లక్షణంగా వెళ్ళగలను, కావలసిన ఏర్పాట్లు కూడా చేయగలను. కాని అన్నగారు చెప్పటం: నిన్ను నా దగ్గరే అట్టిపెట్టుకోమని కదా!"

"అన్నగారి చాదస్తం మాటలకేమొచ్చెలే! కాని సుఖదా! నేనంటే నీకు భయం కలగడంలేదా?"

"భయమా?"

"మనిషికి తనసంగతే తనకు తెలియదు. అందుచేత సుఖదా! నేను వచ్చి అక్కడ అసలు ఉండను. మాకు విధి

షేధాలు తెలియవు. స్త్రీ స్త్రీ అనీ, పురుషుడు పురుషుడనీ—అంతవరకే మాకు తెలుసు; మిగతా విషయాన్ని మాకు పట్టవు. అందుచేత మా పద్ధతిలో మేము మా పనులు కొనసాగించుకుంటూ పోతాం. ఊహుఁ, అన్నగారి కోరిక పూర్తిగా నెరవేరదు సుఖదా! నేను వారి మనిషిని. నా మీద వారికెంతో విశ్వాసం. ఆ విశ్వాసాన్ని నేను వమ్ము చెయ్యను. వారికి నా మీద ఉన్న అనుమానం నిజమేనని నేను నిరూపించను.''

ఆ మాటల అర్థం నాకు సరిగా బోధపడలేదు. ''మరి దాని ఫలితం ఏమాతుందో ఎరుగుదువా లాల్!''

భయసూచకమైన నా కంఠధ్వని గమనించి అతడు నవ్వాడు. ''దాని ఫలితం నేను మరణించటమే నని అనుకుంటున్నావు కదూ! పిచ్చిదానా? అంత తేలిగ్గా మృత్యువు నా దగ్గరకు రాదు. అదే నాకు శాపం.''

''లాల్!''—అతని నవ్వు చూస్తే నాకు గాభరా ఎక్కువైంది.

నేను అతని బుజాన్ని కరచిపట్టుకుని ఉన్నాను. అతడు మెల్లిగా నాచేతిని తన బుజంమీదనుంచి తీసివేశాడు. ''ఒక పని చేద్దాం సుఖదా! ఇప్పుడు సరాసరి మీయింటికే వెడదాం. వెళ్ళి కాంత్‌తో చెబుదాం: అన్నగారిని అక్కడికి తీసుకువచ్చి ఉంచే ఏర్పాటు చేయవలసిందని.''

''ఇప్పుడేనా?''

"ఇప్పుడే అయితే ఏం ?"

"తరువాత నువ్వు ఏం చేస్తావు ?"

"ఏం చేసేదీ ఏముంది ? ఉండిపోతాను."

"ఆ గదుల్లో ఉంటావా పోయి ?"

"అక్కడైనా ఉంటాను."

"ఆతరువాత ?"

"సుఖదా ! 'తరువాత' అనే శబ్దం నాదగ్గర లేదు. 'ఇప్పుడు' అనేదే నాకు కావలసిందీ - నేను పట్టించుకొనేదీను. 'తరువాత' అనేది భగవంతుని దగ్గర ఉంటుంది. భగవంతుడూ? అరె, ఎటువంటి పాడు అలవాటో చూడు ! ఆత్మవిశ్వాసంతో ఆ జబ్బు ఎప్పుడో నయం చేసుకున్నాను. అయినా సరే, ఆ పదం అప్పుడప్పుడు నోటివెంట జారివస్తూనే ఉంటుంది ! ఇంతకూ ఇప్పుడు మన యీ పనిలో సాయం చేసేందుకు భగవంతుడనేవాడు ఉంటే బాగానే ఉంటుంది. నువ్వు పేర్కొన్న ఆ 'తరువాత'ను గురించిన భారం అతడికి వప్పగించి 'ఇప్పుడు'ను గురించి మనం శ్రద్ధచేయడానికి వీలుచిక్కేది. ఏమైనా, సుఖదా, నాకు మాత్రం ఆ 'తరువాత' అనేది ఏమీ లేదు."

"చచ్చిపోయిన మీదట ఏమౌతుంది లాల్ ?" అకస్మాత్తుగా అడిగాను నేను.

"మీదటి సంగతులు నన్ను అడగబోకు. ముందటి సంగతులే నన్ను అడుగు. చచ్చిపోవటానికి ముందు ఎప్పుడూ...చచ్చిపోతామేమోనని భయపడుతూ ఉంటాం.

'చావు'కు ముందున్నది 'బ్రతుకు' అంటారు – ఎవడికి వాడు స్వతః తన బలంమీద బ్రతుకుతున్నట్టు ! సరే, ఏదో బ్రతుకుతున్నాం, బాగానే ఉంది, అంతమాత్రాన 'చావు' అంటే భయం ఎందుకూ ? మనం నిజంగా బ్రతుకుతున్నాం గనకనా! లేదు సుఖదా ! నువ్వూ, నేనూ ... వగైరా...అందరం ... మనంతట మనం...బ్రతకటంలేదు. నిజంగా బ్రతుకుతున్నది బ్రతుకే. మానవ ఇతిహాసమే బ్రతుకుతోంది – మానవ వికాసమే బ్రతుకుతోంది ! అది చారిత్రికం, పరిణామసిద్ధం. అది నీదీ, నాదీ కాదు; అది నిన్నుబట్టి, నన్నుబట్టి ఉండదు; దాన్నిబట్టే మనం. అది సత్యం, మనం మిథ్య. మనమే మిథ్య అయినప్పుడు మృత్యుభీతి అనేది వట్టి తమాషా అయిన వస్తువు కదూ !... చెప్పవేం సుఖదా ? మీయింటికి పోదామా మరి !"

"నీకు తమాషాగా ఉన్నట్టుందే !"

"తమాషా లేదు – గిమాషా లేదు, చెప్పు – వెడదామంటావా ?"

మేము నిజంగా మాయింటికే వచ్చేశాం. కాని ఇల్లు బైట తాళంపెట్టి ఉంది. "ఇక చెప్పు. ఏం చేస్తావ్ ?" అన్నాను.

"ఇది అపశకునం, సుఖదా !"

"ఇక జరగవలసిందేమిటి ?"

"కాంత్ ఎక్కడికి వెళ్ళి ఉంటార్యా ?"

"మా అమ్మగారింటికి వెళ్ళారేమో."

"పద అయితే; అక్కడికే వెడదాం."

లాల్‌ను వెంటబెట్టుకుని మా అమ్మగారింటికి వెళ్ళటం నాకు ఇష్టంలేదు. కాని అలా వెళ్ళటం అసంగతంగా లాల్‌కు స్ఫురించటమే లేదు.

"ఉహుఁ, నేను రాను, నీతో కూడా—" అన్నాను.

"నేను నీతో కూడా ఎందుకు ఉంటానూ ?"

"ఉహుఁ, నేనక్కడికి అసలు వెళ్ళనే వెళ్ళను."

ఆసమయంలో నాకు కలిగిన సంకోచం ఏమిటో మరి ! మా అమ్మగారింటికి వెళ్ళటానికి నేనెందుకు జంకానో కారణం నేనేమీ చెప్పలేను. కాని ఆడది ఏమాటైనా అన్నదీ అంటే అది అయి తీరాల్సిందే. పెద్ద విషయం ఏమీ ఉండకపోయినా పంతానికి మాత్రం అంతు ఉండదు.

"ఒక పని చెయ్యనా ? తాళం పగల గొట్టేస్తాను" అంటూ లాల్ ఆ పనికి దిగాడు. నాకు మనస్సు వికలంగా ఉంది. బండివాడు మమ్మల్ని ఎగాదిగా చూస్తున్నట్టు ఉన్నాడు. నాకు సిగ్గాతోంది. ఛిన్నతనంగానూ ఉంది. ఈ విషయాలన్నింటిమీదా లాల్‌కు దృష్టే లేదు. ఎలాగైతేనేం నేనతన్ని తాళం పగులగొట్టకుండా ఆపేశాను. ఆ తరువాత ఇద్దరం నేను వేరే ఉంటోన్న ఆ యింటికి వచ్చేశాం. అందుకు లాల్ ఒక షరతుమీద ఒప్పుకుని వచ్చాడు. అక్కడకూడా కాంత్ లేకపోయినట్టయితే

వారికోసం ఆఫీసుకు వెళ్లి తాళంచెవి తీసుకువచ్చి మా యింటి తలుపు తీస్తాడట. నేనేమో సాయంౘ్రం తానికల్లా అక్కడికి వచ్చెయ్యాలట! "సాయంత్రం అయేసరికి నేను అన్నగారి దగ్గరకు పోయి...కాంత్ ఇంట్లో మీకు బస ఏర్పాటు చేశాం. ఈ రాత్రికే మీ రక్కడకు వచ్చి ఉండచ్చు అని చెబుతాను" అన్నాడు లాల్.

గదికి రాగానే, వెంటనే వెళ్లిపోడానికి ఉద్యుక్తుడైనాడు లాల్.

"ఇదిగో, ఎక్కడికీ? ఎందుకూ వెళ్ళటం? స్నానం అదీ చెయ్యవూ?"

"అందుకోసమే వెడుతున్నాను. స్నానం అదీ చెయ్యటానికే."

"మరి నీ బట్టలూ అవీ—ఎక్కడున్నాయి?"

"ఎక్కడో ఒకచోట ఉంటాయిలే—వెడుతున్నా."

"సరేగాని, కొంచెంసేపు లోపలికిరా. ఒకమాట ఉంది."

లోపలికి వచ్చాడు. కాని కూర్చోలేదు. ఊఁ, చెప్పు, యేమిటా మాట?"

"కూర్చోమరి. అన్నగారితో మాటాడి నువు అటు వెనకవైపుకు వెళ్ళావు కదూ! అక్కడ ఇంకెవరన్నా ఉన్నారా?"

"ఎందుకూ? కేదార్ ఒకడు ఉన్నాడు."

"నవ్వులు కాదు, నిజం చెప్పు."

లాల్ నవ్వాడు. "ఎందుకూ ?"

నే నొక మనిషిని చూచాను. ప్రభాత్ కాబోలు! వెనక వైపునుంచి చూచాను. అతను కాకపోవచ్చు. ఎవరెవ రున్నా రేమిటి ?"

"అందరూ ఉన్నారు—"

"అందరూ అంటే ఎవరూ ?"

"అందరూను."

"వాళ్ళందరి మధ్యకూ నువ్వు వెళ్ళావన్నమాట ?"

"ఆహా! వాళ్ళ మధ్యలోకే వెళ్ళాను. హాయిగా ఫలహారం చేశాను; టీ తాగాను—"

నాకు భయంవేసింది. గాభరా పడిపోయాను. వ్యగ్రచిత్తనై అతనివైపు చూస్తూ ఉన్నాను.

"అన్నగారి పిడికిలి చాల బలిష్టమైంది. అందుచేత భయపడవలసిన పనిలేదు సుఖదా !"

"నాకుమాత్రం చాల భయంగా ఉంది లాల్ ! వాళ్ళు నీకు శత్రువులు" అన్నాను ప్రార్థనాపూర్వకమైన కంఠస్వరాన.

"కావచ్చు. కాని భయపడి ప్రయోజనం లేదు."

"నేను ఏం చెయ్యాను మరి ?"

"నాకోసం ? నువ్వు ఏదో చెయ్యటమా ? వద్దు. ఇందులో నువ్వు చేసేదేమీ లేదు."

ఆ సమయాన నన్నేమి ఆవేశించిందో నాకు తెలియదు. కలలో కూడ అనుకోని పనే జరిగింది. ఇలా జరుగుతుందని ఒక్క క్షణముందు కూడా అనుకుని ఉండలేను. అతని భుజం మీద చెయ్యి వేశాను. భయవిహ్వలనై ప్రార్థనాపూర్వకంగా అన్నాను : "లాల్ ! నిన్ను నీవు రక్షించుకోగలవా? చెప్పు, లేకపోతే నిన్నిక్కడినుంచి వెళ్ళనీను."

"పిచ్చిదానా !" అన్నాడు లాల్ తన బుజాల మీదనుంచి నా రెండు చేతుల్నీ మెల్లగా తీసివేస్తూ.

అంతే అన్నాడు ; ఇంకేమీ అనలేదు.

నేను మరీ అవశనైపోయాను. రెండు చేతులూ అతని కంఠం చుట్టూ వేశాను. నా తల అతని గుండెకు ఆనించాను. "లాల్ !"

"పిచ్చిదానివి అయిపోకు సుఖదా ! నేను పిల్లవాడిని కాదు, పెద్దవాడినే." అన్నాడు గంభీరంగా లాల్.

అంటూ అతని మెడచుట్టూ పెనవేసుకుపోయిన నా చేతుల్ని బలవంతాన తీసి వేశాడు. నన్ను సోఫాలో పడేసి తాను వెళ్ళిపోయాడు.

నాకు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు జోరుగా రాసాగాయి. కూర్చుని అతని అడుగుల చప్పుడు వింటున్నాను. అనుమానిస్తూ లేచి గుమ్మందాకా వచ్చి అతడు టాంగాలో

ఎక్కటం చూచాను. అతని ముఖంలో ఏవిధమైన వికారమూ లేదు. టాంగా వెళ్ళిపోయింది.

ఆడదాని పరిస్థితి యేమిటిది? అంత వివశురాలై పోతుందేం? తాను తానుగా వుండనే లేదేం? నిలువునా కరిగి నీరైపోతుందేం? మగవాడు తనను గ్రహించేందుకు చేరువకు వస్తే అప్పుడామె అతన్ని నిశ్శేషంగా అర్థంచేసుకో గలదు. మనసులో ఏ విధమైన పంతమూ ఉంచుకోదు. కాని అతడు తనలో ఇముడకపోతే...తనను తెలుసుకోకుండా - తనను దాటుకుని వెళ్ళిపోతే...తనను అలక్ష్యంచేసి ముఖం తిప్పుకుని మరలిపోతే...అతనిలో ఆమె కేమాత్రం పట్టు చిక్క నప్పుడు, ఆమెకు అతని తత్వం ఏమిటో బోధపడక బాధపడు తుంది. ఒక దుస్సహమైన అవమానానికి గురిఅయినట్టు భావిం చుకుంటుంది. తగిన ప్రతీకారం చేయాలన్న సంకల్పం, పట్టుదల ఉదయిస్తాయి. అందుకుగాను తన స్వాభిమానం అంతా కేంద్రీకృతం ఔతుంది. ప్రతీకారచర్యకు ఆత్రత పడుతూ ఉంటుంది. అర్థంగాని తత్వం గల ఆ వ్యక్తినే వెన్నంటి, అతన్ని వెనక్కు తనవైపుకు మళ్ళించి తీరాలని శాయశక్తులా ప్రయత్నం చేస్తుంది. ఇక ఆమెకు మరో దృష్టే ఉండదు. పాపపుణ్యాల చింతే అక్కర్లేదు; సమాజం అక్క ర్లేదు; తానూ, తనపంతం; అంతే తప్ప మరింకేమీ ఆమెకు కనిపించవు. అప్పుడిక తాను తానై ఉండజాలదు; తప్ప కుండా తనను తాను అతిక్రమించి నెడుతుంది. ఈ పంతాన్ని పురస్కరించుకుని స్త్రీ 'దేవి' ఔతుంది; లేదా 'దయ్యం

అయినా అయిపోతుంది. అప్పుడామె తనను తాను చూచుకుని ఆశ్చర్యపడుతుంది: "అరె, నేనెప్పుడు ఇలాగ స్త్రీని స్త్రీనిగాకుండా మారిపోయాను ?" అనుకుంటూ.

లాల్ వెళ్ళనే వెళ్ళాడు. నిమిషం తర్వాత నిమిషం గడిచిపోతున్నాయి. పది, పదిహేను, ఇరవై, అరగంట అయింది. గుడ్లు ఒప్పజెప్పి చూస్తూ కూర్చున్నాను గదిలో. అంతకు తప్ప నేను చేసిందేమీ లేదు. చివరకు లేచి వెళ్ళి ఏదో పని కల్పించుకున్నాను.

సుమారు రెండుగంటలప్పుడు మావారు వచ్చారు. "ఆఫీసు సమయం కదా! ఎలా వచ్చారు ?" అని అడిగాను ఆశ్చర్యపడుతూ.

మావారు సహజధోరణిలోనే "ఇది ఫలహారాలకు లేచే వేళ. లాల్ ఆఫీసుకు వచ్చి చెప్పాడు, వచ్చాను. సంగతేమిటో చెప్పు" అన్నారు.

"నేను మిమ్మల్ని పిల్చుకురమ్మన్నానని చెప్పాడా ?"

"ఔను. హరీశ్ బాబును మనింటికి తీసుకు రావాలన్న ప్రసంగం ఏదో వచ్చింది కదూ ? నువు యేమంటావు?"

"మీ ఆలోచన యేమిటి ?"

"ఆలోచించవలసిన అవసరం నాకింతవరకూ ఏమీ కనిపించలేదు. హరీశబాబు కోరిక నేను కాదనేదిలేదు. అతనికి నేను దూరం అయిపోయాను. అయినా మన యిల్లు అతనికి స్వగృహం లాంటిదే. అతనికి జరగవలసిన ఉపచారాదుల్లో

నువ్వుగాని, నేనుగాని లోటు చెయ్యం కదా! నేను వెళ్ళి అతన్ని రమ్మని ఆహ్వానించేంతవరకూ అతడు ఆగనక్కర్లేదు."

"ఆహ్వానించకుండా ఎలా వస్తారు ?"

"నీకు అతని సంగతి తెలియదు. ఇంతకూ నువ్వు అనేది ఏమిటి ? నన్ను వెళ్ళి ఆహ్వానించి తీసుకురమ్మంటావా ? లాల్ ఉద్దేశం మరి—"

"మీ ఉద్దేశం చెప్పండి."

"నాకేం ఉద్దేశం లేదు. హరీశ్ విషయంలో నేను యేమీ ఆలోచించవలసిన అవసరం ఉండదు. నువ్వు అనేదేమిటో చెప్పు."

"వారు యమునాఘాట్‌లోనే ఉండిపోవటం ఆపత్కారం అని వింటున్నాను."

"అయితే ఇంటికి తీసుకునద్దామా ? ఆలోచించి చెప్పు—"

"నేనూ రావాలా ?"

"లాల్ ఉద్దేశం అదే. గృహిణీసమేతంగా ఉన్నయింటికి సన్యాసి రావటం అనుమానాస్పదంగా ఉండదు. లేకపోతే—"

"మీరు ఆలోచించుకోండి మరి! మీరేమో గవర్నమెంటు ఉద్యోగస్థులాయెను."

"ఆలోచించవలసింది నేను కాదు; నువ్వే. అతడు

నాకు బాల్యమిత్రుడు. ఇల్లంటూ ఏర్పడటం భార్యనుబట్టేగా! కేవలం మగవాడు—"

"నేనూ రానా మరి ?"

"ఆలోచించుకో."

నాకు కోపం వచ్చింది. "ఏమాలోచించుకునేది - నా తలకాయ ? రమ్మనమంటే వచ్చేస్తాను."

మావారు నవ్వారు. "నీదీ ఆ యిల్లు. ఇక నేను చెప్పే దేముందీ ?"

"మీరు చెప్పేదేమీ లేకపోతే ఇక్కడే హాయిగా ఉండిపోతాను. మీరు ఇప్పుడు ఇంత శ్రమపడి ఎందుకు వచ్చారూ ?" దురుసుగా అన్నాను.

"నేనేమీ చెబుదామని రాలేదు సుఖదా ! అడిగి పోదామని వచ్చాను."

"ఉదయాన ఎక్కడికి వెళ్ళారు మీరు ?" కోపంగా అడిగాను.

"అక్కడికే - వినోద్ దగ్గరికి. ఏం ?"

"ఎందుకు వెళ్ళారు ?"

ప్రశ్న అడిగిన తర్వాత అనుకున్నాను : ఇదేం ప్రశ్న ! అలా అడిగానేమిటి ? అని.

"ఎందుకూ లేదు. కొంచెం...ఇంతకూ వెళ్ళి హరీశ్ ను ఆహ్వానించి ఇంటికి తీసుకు రావాలీ అంటే చెప్పు. లేకపోతే

నేను తిరిగి ఆఫీసుకు వెళ్ళిపోతాను; పని ఉంది. మనం యిద్దరమూ వెళ్ళి హరీశ్‌ను ఆహ్వానించి తీసుకురావాలనీ... హరీశ్ వచ్చేట్టయితే మనిద్దరమూ ఆ యింట్లోనే ఉండిపోవాలనీ లాల్ అభిప్రాయం."

"ఇక మీ యిష్టం. నాకేమీ తెలియదు." అన్నాను కోపంగా. నాకు నేనై నిర్ణయించటం నాకు ఇష్టంలేదు.

నా కోపం వారిమీద పనిచేసినట్టులేదు. "సరే అయితే. నేను వెడుతున్నాను. ఆఫీసుపని చూసుకుంటాను." అంటూ నిజంగా వెళ్ళిపోడానికే ఉద్యుక్తులైనారు.

"బాల్యమిత్రుడు, బాల్యమిత్రుడు అని చెప్పుకుంటున్నారే మహా. ఇంతేనా మీకు బాల్యమిత్రుడిమీద ఉన్న అభిమానం ?"

"నువు కోపం తెచ్చుకోగలవు. కాని ఆలోచించుకో... సరే, నేను వెడుతున్నాను."

నేను ఇక మళ్ళీ వారిని ఆపలేదు. వారు ఆఫీసుకు వెళ్ళిపోయారు.

నా శరీరమంతా గోళ్ళతో రక్కిపెట్టుకుందామని పించింది. గదిలో ఉన్న వస్తువులన్నీ తీసి విసిరికొడదామని పించింది. నాలో ఏమి రేగుతుందో నాకే బోధపడటం లేదు. మా యిద్దరి మధ్యా ఇంత ఎడం - ఏమిటిది ? అసలు పొత్తే లేకుండా పోయిందే !

సాయంత్రం కావచ్చింది. నా మనస్సుకు మాత్రం స్థిమితం చిక్కలేదు. ఒకవంక అన్నగారిని వెళ్ళి తీసుకువద్దా

మనీ అనిపిస్తోంది. అలా చేస్తినా సాయంత్రానికి మావారు వచ్చి సంతోషిస్తారు; ఆశ్చర్యపోతారు కూడాను. మరోవంక... ఏమైన కానీ, నేనేం చెయ్యను; చేతులు ముడిచిపెట్టుకుని కూర్చుంటాను; ఏవిషయంలోనూ కల్పించుకోను...అని కూడా అనుకోసాగాను.

సాయంత్రం అయింది. లాల్ వచ్చాడు. "ఏమిటి ? నువు ఇంకా ఇక్కడే ఉన్నావేం ?" అన్నాడు.

"ఉండక యేం చేసేదీ ?"

"కాంత్ రానేలేదా ? నువు వెళ్ళలేదేం ?"

అతని నుదుటిమీద ముడతలు పడ్డాయి. దాంతోపాటే నా మనస్సుకూడా ముడత పడ్డట్టయింది. "ఇతర్ల ప్రాణాలంటే నీకంత తేలిక అన్నమాట ! నిర్లక్ష్యంగా కాలయాపన చేస్తావూ, తమాషా చూస్తున్నట్టు ? కాంత్‌తో నువు ఎందుకు బయలుదేరి వెళ్ళలేకపోయావు ? చెప్పు, ఎందుకు వెళ్ళ లేదు?" బెదరింపుగా అన్నాడు లాల్.

"లాల్ !"

"ఏం, నేను చచ్చిపోతానా? ఆతర్వాతనైనా నా మాట మన్నిస్తావా ? చెప్పు ! అలా అయితే అన్నిటికంటెముందు ఇప్పుడే చస్తాను ! సుఖదా ! యేమిటి నీ అభిప్రాయం ?"

"లాల్—!" నాకూ రోషం వచ్చేస్తోంది అతని రోషం చూస్తోంటే. అయినా అవసరమైనంతవరకు క్రోధం బైటికి కక్కుదామన్నా నేను నా వశంలో లేనప్పుడు.

"సుఖదా!—బలిదానం స్వీకరించాలని నీకు ఎందు కంత తహతహ ?''

"ఓ లాల్ !'' అతని మాటలు వింటూంటే మనిషిని నాలుగు దెబ్బలు మోది బైటికి పంపించుదా మనిపించింది. కాని యేమీ చెయ్యలేకపోయాను.

"సరే కానీ; బలి స్వీకరించు. ఊఁ. ఏమైతే అదే ఔతుంది. ఇదిగో వచ్చి కూర్చుంటున్నాను.'' అంటూ ఎదురుగా ఉన్న కుర్చీలో వచ్చి కూర్చున్నాడు. "కానీ, ఇక నువ్వు చెప్పదల్చుకున్న దేమిటో చెప్పు !'' అన్నాడు.

నాకు ఎదురుగా వచ్చి కూర్చున్న అతని ముఖంలోకి చూస్తూ ఉండిపోయాను. ఏమీ మాటాడలేకపోయాను. నా చూపులు ఎలా ఉన్నాయో మరి – ఆసమయాన ! హృదయంలో ఎలాంటి వేదనాగ్ని జ్వాలలు, క్రౌర్యాగ్ని జ్వాలలు రేగుతున్నాయో మరి ! అతని కన్నులు ఎదురుగా కనిపిస్తునే ఉన్నాయి. వాటిలో ఉత్సాహపు పొంగు ద్యోతకమౌతోంది. దీప్తిమంతంగా ఉన్నాయి. పళ్ళు పటపట కొరుకుతుంటూ "ఊఁ, ఇక చెప్పు. నువ్వు అనేది యేమిటి ?'' అని అడిగాడు.

అడుగుతూనే కూర్చున్నవాడు లేచాడు. రెండు చేతుల్నూ పంజాల్లా ఎత్తాడు. వేళ్ళు అర్ధవృత్తాకృతిగా వంగాయి. రెండు పంజాలలోనూ నా రెండు జబ్బల్నూ గట్టిగా పుచ్చుకుని కుదిలించివేస్తూ...తన ముఖం నా ముఖంలో పెట్టి అన్నాడు : "ఊఁ, చెప్పు, నువ్వు అనేది ఏమిటి ?''

ఆ క్షణం నాకు మరపు రానిది. చావు బ్రతుకుల నడుమ అంతరం లాంటిది ఆ క్షణం. మే మిద్దరం ఒకటిగా కరిగిపోయాం ఆ సమయాన. నిర్దాక్షిణ్యము లైన పెద్దపులి పంజాలవంటి తన అరచేతుల్లో నా జబ్బలు పుచ్చుకుని...శక్తి కొలదీ...కసిదీర...నలిపేస్తూ ... అతడు నా కన్నుల్లోకి చూస్తోంటే...ఆచూపుల్లో...నేను ఏమైపోతున్నానంటే... అదేమిటో...నాలో 'నేను' అన్న వస్తువు ఏమిటది? అసలు అది ఉన్నదా ? లేదా ?—అన్న ప్రశ్నకు సమాధానం దొరకని సందిగ్ధభావం ఏదో ద్యోతకమౌతున్నది. అది క్షణమాత్రమే. అయినా అదే అనంతంగా గోచరించింది. త్రికాలాలూ ఆక్షణంలో లీనమైపోయాయి. చూస్తూ చూస్తూ అతడు నిర్దాక్షిణ్యాంగా నన్ను గట్టిగా కరచి పట్టుకుని తనలో తన భాగంగా జోడించేసుకున్నాడు.

ఆసమయంలో నాకు శారీరికంగా, మానసికంగా నాలోని 'నేను' అసలు లేకుండాపోతున్నట్టే గోచరించింది. చచ్చిపోతున్నట్టనిపించింది. నిజంగా ఈ బ్రతుకునుమించిన ఒక విశేషస్థితికి వెళ్ళిపోతున్నట్టనిపించింది.

ఎప్పుడు నన్నతడు తననుంచి దూరంగా విసిరి అవతలకు నెట్టివేశాడో నాకు తెలియదు. వచ్చి సోఫాలో పడ్డాను. అతడు కుర్చీలో కూర్చున్నాడు, "బ్రతికిపోయావులే, పో" అంటూ.

అంటూ అతడు నవ్వాడు. ఎలాంటి నవ్వు అది !

"ఈసారికి బ్రతికిపోయావు. మళ్ళీ ఎప్పుడూ మృత్యువును ఆహ్వానించబోకు" అన్నాడు.

నేను లేచి వచ్చి అతని పాదాల దగ్గర కూర్చున్నాను. "నన్ను చంపివెయ్; చంపేసెయ్."

లాల్ నవ్వాడు. ఆ నవ్వు ఇప్పటికీ నాకు జ్ఞాపకం ఉంది. ఆ నవ్వులో ఇందాకటి నిర్దాక్షిణ్యత ఏమాత్రమూ లేదు. అన్నాడు: "మృత్యువు నోట్లో పడబోకు సుఖదా! నేను చనిపోవటానికి సిద్ధంగా ఉన్నానని నువు అనుకుంటున్నావు. అందువల్ల నువు వచ్చి నాలో కలిసిపోకుండా నిన్ను నీవు నిగ్రహించుకోలేకపోతున్నావు. అదే నీ పొరబాటు. నాకు తెలుసు; ఆ పిలుపు, ఆ ఆకర్షణ మృత్యువువి; నావి కావు. నువు నిశ్చింతగా ఉండు, అన్నగారికి నామీద ఉన్న ప్రేమ వదలిపోయేది కాదు సుఖదా! రా మరి; వస్తావా?

"ఎక్కడికీ?"

"అన్నగారిదగ్గరికి. వారిని తీసుకువచ్చి కాంత్‌కు అప్పగించద్దూ."

"లాల్!"

"పోదాం రా; తయారుకా."

"ఊహుం. నేను రాను, ఇప్పుడు నేను ఏ ముఖం పెట్టుకు వచ్చేదీ?"

లాల్ చిరునవ్వు నవ్వాడు. ఆ ముఖంతోటేరా. మావంటి వాళ్ళను అంధుల్ని చేసివేసే ఆ ముఖం తోటేరా. తలపైన ఏదో బరువు ఉన్నట్టు ముఖం వాల్చు

కుని తిరుగుతామా ఏమిటి ? ఎవరు ఎలా ఉండాలో అలా ఉంటారు. సత్యవిరుద్ధమైన దేమీ లేదు ఇందులో. కాబట్టి సంకోచించవలసిన పనేం లేదు. ప్రేమను గెలువజాలినది ప్రేమే ; కర్తవ్యం కాదు. ఎందుచేతనంటే—ప్రేమను మించిన కర్తవ్యం మరొకటి లేదు. రా, పోదాం.”

“లాల్ !”

“ఊఁ, లే మరి ; తయారై రా.”

నాకు విముక్తి చేకూరినట్టనిపించింది. లేచాను. మనస్సు ప్రఫుల్లంగా ఉంది. మందహాసం చేస్తూ లాల్ ముఖంలోకి చూస్తూ “రానా ?” అన్నాను.

లాల్ అలాగే ప్రసన్నంగా చిరునవ్వులు చిలుకుతూ “ఊఁ ; రా మరి ; రెండు నిమిషాల్లో రావాలి” అన్నాడు.

తలమీద బరువేదే దిగి దూరంగా పడిపోయినట్టనిపించింది. హృదయం ప్రఫుల్లమైంది. శరీరం తేలికపడింది. గోరు వెచ్చని సంధ్యాతపంలో సిగ్గు సిగ్గుగా, వికాసవంతంగా వయ్యారం చిలికే పూవువడుచులా అయిపోయాను.

ఇద్దరమూ బయలుదేరి యమునా ఘాట్‌లో అన్నగారు ఉండే చోటుకు వచ్చాం.

# 27

సాయంత్రం సుమారు ఏడుగంటలు కాలేదింకా. యమునా ఘాట్ నిర్జనంగా ఉంది. అక్కడా అక్కడా ఒకరిద్దరు మనుష్యులు మాత్రం వస్తూ పోతూ కనిపించారు. అన్న

గారు...వారు మామూలుగా ఉండేచోట లేరు. వెనుక వైపు వసారాలో కూడా ఎవరూ లేరు. పరిస్థితి చూస్తే అక్కడి నుంచి మకాం ఎత్తి వేసినట్టుగానే కనిపించింది. అప్పుడే ఎత్తి వేస్తారని మేము అనుకోలేదు. ఏమి జరిగిందో ఏమిటో లాల్ కూడా ఊహించలేకపోయాడు. "ఏమిటిది ? అన్నగారు ఏమైనట్టు ? నువు ఏమని ఊహిస్తున్నావు సుఖదా ?" అని అడిగాడు.

ఆ ప్రశ్న నన్ను అడుగుతున్నట్టుగా ఉంది. కాని నిజానికి తనకు తానే ప్రశ్నించుకుంటున్నాడు. ప్రశ్నకు సమాధానం లభించ లేదు. మేము అక్కడినుంచి వెనక్కి తిరిగి యమునానదివద్దకు వచ్చాం. నదిఒడ్డునే నడుస్తూ వెడుతున్నాం. చుట్టూ నిశ్శబ్దంగా ఉంది. ప్రకృతి శోభాయమానంగా ఉంది. సంధ్యాకాంతులు ప్రసరిస్తున్నాయి. వాతావరణంలో మాంద్యం ఏర్పడి వుంది. ఎండవేడి తగ్గిపోయింది. పగలంతా పనిపాటల్లో మునిగివుండే శ్రామికులకు విశ్రాంతి లభించే సమయం. లాల్‌తోపాటు నడుస్తున్నాను నది ఒడ్డున. వాతావరణంలోని మాంద్యాన్ని లాల్ గమనించినట్టేలేదు; అతని ముఖం ఎప్పుడూ నవ్వుతూ ఉంటుంది. కాని ఇప్పుడు అతని ముఖంలో నవ్వు కనిపించటంలేదు. గంభీరంగా ఉంది ముఖ కవళిక. కనుబొమలు కుంచుకుపోయి వున్నాయి.

"లాల్, పడవలో ఎక్కి వెడదామా ?" అడిగాను నేను.

"ఎందుకూ ?" హఠాత్తుగా అన్నాడు లాల్.

"అదిగో! పడవ! కనిపిస్తోందా? అవతలి ఒడ్డునుంచి వస్తోంది. అందులో ఎక్కి అవతలి గట్టుకు పోదాం."

నా మాటలు అతడు విన్నాడో లేదో! అర్థం చేసుకున్నాడో లేదో! "ఇప్పుడా?" అన్నాడు.

"ప్రకృతి ఎంత అందంగా ఉందో చూడు!"

"మరి అన్నగారి సంగతో?"

"వారు ఇక్కడెక్కడా ఉన్నట్టులేదు మరి!"

"ఎక్కడో ఉండక ఏమౌతారు? పోదాం రా" అంటూ మందగమనంతో సాగుతున్న నా వేలు గట్టిగా పుచ్చుకుని ముందుకు దారితీశాడు. రెండు ఫర్లాంగులు వెళ్లాం. లాల్ మౌనంగానే ఉన్నాడు. "ఇంకా ఎక్కడికని వెడదాం?" అడిగాను నేను.

"నువు ఏమీ అడగద్దు. నడుస్తూఉండు."

ఒక మైలు నడిచాం. నాకేమీ అర్థం కావటం లేదు. మౌనంగానే నడుస్తున్నాను. క్రమేణా గాలిలో చల్లదనం వచ్చేస్తున్నది. చీకట్లు కూడా క్రమ్ముకు వస్తున్నాయి. యమునాఘాట్ విడిచి చాలాదూరం వచ్చేశాం. దారి, డొంక ఎప్పుడో విడిచి పెట్టేశాం. ఏదో పాడుపడిన ప్రదేశంలా ఉంది మేము వెడుతూన్న దోవ.

"లాల్!—" పిల్చాను.

"ఆగద్దు. వచ్చెయ్యి" అన్నాడు అతను.

మేము ఒక దిబ్బ ఎక్కుతున్నాం. వెలుతురు మరీ మందగించిపోయింది. రెండు వైపుల పొదలు తుప్పలు ముడిచి పెట్టుకు పడివున్న ఏవో జంతువుల్లాగా కనిపిస్తున్నాయి. దిబ్బ పైకి ఎక్కాం. అక్కడ కొన్ని చెట్లు ఉన్నాయి. ఇదంతా వట్టి అనవసరపు తికుగుడుగా కనిపించింది నాకు. కాని లాల్ మాత్రం తొట్రుపాటు లేకుండా ముందుకు సాగిపోతూనే ఉన్నాడు. ఎక్కడికో, ఒక ప్రదేశాన్ని దృష్టిలో పెట్టుకునే వెడుతున్నాడు కాబోలు! నిజంగా కూడా అంతే. ఆ చెట్ల గుబురు దగ్గరకు వచ్చాం. అక్కడ కొంతమంది సమావేశమై ఉన్నారు.

"అన్నగారూ!" పిల్చాడు లాల్.

"నువ్వా లాల్! రా. సుఖద కూడా వచ్చిందా?"

అక్కడి వారిని అందర్నీ గుర్తించలేకపోయాను. చీకటికూడా బాగానే కమ్మింది. ఏడెనిమిది మంది ఉంటారు. ఎవరు ఎవరో ఊహించుకో గలిగాను. మా రాకకు వాళ్ళు సంతోషించినట్టుగా కనిపించలేదు. అన్నగారు ఆదరంగానే పలుకరించారు. మిగతావాళ్ళు మాత్రం ముఖాలు ముడుచుకునే ఉన్నారు – మా రాకవల్ల వాళ్ళకు పెద్ద విఘ్నం కలిగినట్టు. మాటలు ఆపేసి అంతా నిశ్శబ్దంగా కూర్చున్నారు.

"కూర్చోండి."

మేమిద్దరమూ కూర్చున్నాం. హరీశ్ ఇలా అన్నారు: "మీరు రావటం ఒకవిధంగా మంచిదే. లాల్! నిన్ను గురించే మాటాడుకుంటున్నాం. సంఘంలో మంచి ఎవరినీ బహిష్క

రించవలసిన అవసరం లేదు. ఇక మనందరమూ కూడా ఎక్కడివాళ్ళం అక్కడ విడిపోదాం. మన ఉద్యమం ఇంతటితో ఆపివేద్దాం. ఈ విషయమే మీరందరితో చెబుతున్నాను నువు వచ్చేముందు. ఏమంటావు, నీ అభిప్రాయం ఏమిటి లాల్ !"

"అన్నగారూ! సంఘంలోనుంచి నన్ను బహిష్కరించవలెననేగా ఇప్పుడు మీ సమస్య! అందువల్ల అసలు ఉద్యమమే ఆగిపోవలసిన అవసరం ఏముందీ? నన్ను వెంటనే బహిష్కరించివెయ్యండి. నేను వద్దనటంలేదుగా !"

"సమస్య నిన్ను గురించే కాదు లాల్! అంతకన్నా పెద్దదే. నీకు సంబంధించినంతవరకు సమస్య అంత కఠినమైన దేమీ కాదు; ఆ సందర్భంలో ఒక నిర్ణయానికి వచ్చేశాం ఇప్పుడే. విద్రోహం విద్రోహమే. దాని పరిణామం ఒకరకంగానే ఉంటుంది గాని రెండురకాలుగా ఉండదు. ఇక పోతే పొద్దుట చెప్పావు కదూ: పశ్చిమదేశాల్లో తుపాను రేగి తీవ్రంగా విస్తృతమౌతున్నదీ అని? సరే; అది దూరస్థమైన విషయం. మనం ఇక్కడి పరిస్థితుల్ని ఆలోచిద్దాం. ఇక్కడ గాంధిజీ లేపిన తుపాను దానికి ఏమాత్రమూ తీసిపోయేది కాదు. నేను ఈ రెండు పద్ధతులను గురించీ బాగా ఆలోచించాను. ఇక మన ఉ ఎందుకు ఆపివేయకూడదూ? —అనిపిస్తోంది నాకు. ఆ ప్రశ్నే మనవాళ్ళందర్నీ ఇప్పుడు అడుగుతున్నాను. నేను ఈ ఉద్యమం ఇరవైరెండు సంవత్సరాల నుంచి నడిపాను. అచంచలమైన విశ్వాసంతోనే పని చేశాను

ఇప్పటికీ నా విశ్వాసం సడలిపోలేదు; కాని కాలం మారుతూ ఉంది; ఇప్పటికే చాలా మారిపోయింది. బహుశః ఈపాటికి మన విప్లవోద్యమం బాగానే వ్యాపించి ఉండవచ్చు. మనం పరిశ్రమ చేశాం. వేళ్ళలోనుంచికూడా మార్పు తీసుకురాగలిగిన చరిత్రాత్మకమైన కార్యక్రమం మనది. మనం అగ్నిని రగులుకొలిపాం. నిప్పురవ్వలు లేచేట్టుగా ఊదాం. అది ఇక దావానలంగా వ్యాపించగలదు. నిప్పురవ్వలు ఊదవలసిన అవసరం లేదిక. దానంతట అదే వేగంగా రాజుకుని వ్యాపిసుంది. ఆ అగ్ని జ్వాలలు మన సంఘానివి మాత్రమే కావు; దేశానివే అయిపోతాయి. కోట్లకొలదిగా ప్రజలు హుంకరించి, నడుములు బిగించి లేస్తారు. కాబట్టి నేననేది ఏమిటంటే—ఇక మన సంఘాన్ని ఎత్తివేద్దాం. మనం ప్రజాబాహుళ్యంలో విలీనమైపోదాం. మనకు ప్రత్యేకమైన ఉనికి ఇక అవసరం లేదు. ఈ విషయమే ఇందాకటినుంచీ ఆలోచిస్తున్నాం ఇక్కడ."

"అన్నగారూ! ఈ సమావేశానికి లాల్‌ను పిలవకూడదని నిశ్చయం అయింది కదా!" అన్నాడు ఒక వ్యక్తి. కంఠధ్వని బట్టి అతడు కోహలీ అని తెలుసుకున్నాను.

"కాని అతనే వచ్చేశాడు మరి. మన నిశ్చయం అతిక్రామితం అయింది. భగవంతుడే మన నిశ్చయాన్ని భగింపజూచినప్పుడు మనం చేసే దేముందీ? ఆయన సర్వవేది." అన్నారు అన్నగారు.

"ఈ లాల్ కబురు చేస్తే వచ్చాడో, కాకతాళీయంగా వచ్చాడో ఎలా తెలుసు?"

"కబురు చేసివుంటే సమయానికే వచ్చి వుండే వాడుగా!"

"కాకతాళీయంగా వచ్చినట్టు కనిపించాలనే బుద్ధి పూర్వకంగా ఆలస్యం చేసి వచ్చాడేమో!" అన్నాడు కోహాలీ.

"కోహాలీ!—" ఒకే శబ్దం ఉచ్చరించారు అన్నగారు. గద్గదిస్తున్నట్టుగా ఉంది వారి కంఠస్వరం. కాసేపు గంభీరనిశ్శబ్దం.

"లాల్‌కు ఎవరూ ఏవిధమైన కబురూ అందజెయ్య లేదని ఇక్కడ ఉన్నవారంతా ప్రమాణం చేసి చెప్పగలరా?" కోహాలీ అడిగాడు.

"నేను ఇక్కడే ఉన్నాను. ఆ విషయం నువ్వు గమనించాలి కోహాలీ! నీ అనుమానం ఎవరిమీద? విడమరచి చెప్పు." శాంత గంభీర స్వరాన అన్నారు హరీశబాబు.

"అనుమానం సంగతి అలా ఉంచండి. కాని మరి—"

"అనుమానం కాకపోతే మరేమిటి ఇది? పేరు చెప్పు- ఎవరిని అనుమానిస్తున్నావు?"

"కాదు అన్నగారూ!—"

"పేరు చెప్పమంటున్నాను."

"లాల్‌నే అడగండి."

"పేరు చెప్పు కోహాలీ!—లేకపోతే—"

కోహాలీ దిక్కులు చూచాడు. హరీశ్ బాబు మళ్ళీ

ఇలా అన్నారు : "ఇక నేనేం చెయ్యాలో నాకేం బోధపడటం లేదు. మనలో క్షుద్రభావాలు వచ్చి ప్రవేశిస్తున్నాయి. ఆధారంలేని అనుమానాలు పోతాం. ఇలా అయితే లాభం లేదు కోహ్లీ ! ధైర్యం ఉండాలి. నాలుక బలం కాదు; గుండె బలం కావాలి. గుండెబలం వల్ల కార్యం నెరవేరుతుంది. నాలుక వ్యవహారం పాడుచేస్తుంది. నీకు అనుమానం ఎవరిమీదనో చెప్పలేవూ ?"

"అన్నగారూ, మీరు—"

"నన్ను అనుమానిస్తున్నావా ? కోహ్లీ ! నువ్వు పొరపాటుపడుతున్నావు సుమీ !"

కోహ్లీ ఏమో చెప్పబోయాడు. ఇంతలో అన్నగారు అందుకుని "ఆగు ! నువ్వు ఏమీ మాటాడనక్కర్లేదు. ఇక్కడ సమావేశమై ఉన్న మీరంతా లాల్‌ను క్షమాపణ అడుగుతారా, లేదా ?"

ఎవరూ కదల్లేదు, మెదల్లేదు.

"బహుశా ఒక్క వ్యక్తి తప్ప ఇక్కడ ఉన్నవారంతా అతని ప్రాణాల్ని బలిగోరినవారే. అతని ప్రాణాల్ని బలిగోరారు కాబట్టి అతన్ని క్షమాపణ యాచించటం బాగుంటుంది" అన్నారు హరీశబాబు.

"దేన్ని గురించి క్షమాపణ ?" ఒక మూలనుంచి సన్నని కంఠస్వరాన వచ్చింది ఆ ప్రశ్న. ఆ తరువాత ఆ ప్రశ్ననే మరి రెండు మూడు కంఠాలు బిగ్గరగా ఉచ్చరించాయి.

"మీరు శిష్టులూ, సజ్జనులూ అని నిరూపించుకో టానికే క్షమాపణ యాచించాలి. శిష్టజనుడనిపించుకునే యోగ్యత లేనివారెవరేనా ఉన్నారా ఇక్కడ ?"

"లాల్ వట్టి సిగ్గులేని మనిషి" అన్నారెవరో మెల్లిగా.

"వట్టి నీచుడు" అని మరొకరు.

"అమ్ముడుపోయాడు" అని ఇంకొకరు.

"పంచమాంగదళం మనిషి" అని ఇంకొకరు.

ఎవరి యిష్టం వచ్చినట్టు వాళ్ళు అన్నారు. హారీశ బాబు మధ్యలో ఏమీ మాటాడ లేదు. సింహాలన్నీ శాంత పడినతర్వాత "ఇంకెవరైనా ఏమైనా అనేది ఉందా? అంతా అయినట్టేనా ?" అన్నారు.

"అతడు వెళ్ళిపోతాడేమో అడిగి చూడండి" అన్నా డొక వ్యక్తి. కంఠస్వరంబట్టి అతడు ప్రభాత్ అని గుర్తించాను.

ఆమాట హారీశ్ బాబు శాంతంగా విన్నారు. "అతడు వెళ్ళిపోవాలని ఇంకెవరైనా కూడా కోరుతున్నారా ?" అని అడిగారు.

ఎవరూ సమాధానం చెప్పలేదు.

"అలా కోరినవాడు తనే స్వయంగా లేచి వెళ్ళిపో వచ్చు. లేదా, అన్నమాట ఉపసంహరించుకుని ఉండిపోవచ్చు."

ప్రభాత్ వెంటనే ఏమీ మాటాడలేదు.

"అన్నమాట ఉపసంహరించుకోకపోతే నువ్వు లేచి వెళ్ళిపోవచ్చు" అన్నారు హరీశ్.

"ఉపసంహరించుకున్నాను" అన్నాడు ప్రభాత్ నత్తి నత్తిగా.

"క్షమాపణకూడా యాచించు."

"క్షమాపణకూడా యాచిస్తున్నాను." హరీశ్ చాల విచారగ్రస్తులైనారు. మనసులోని విచారమంతా మాటల్లో ద్యోతకం అయింది. "మిత్రులారా! మనమంతా ఈ ఉద్యమానికి సంబంధించినంతవరకు ఒకే దారిలో నడుస్తూవచ్చాం. ఒకరొకరికి తోడుగా ఉన్నాం. అయితే నేను మాత్రం మీకంటే కొంతకాలం ముందునుంచీ కూడా ఈ మార్గంలో ఉన్నాను. మరోప్రసక్తి ఏమీ లేకుండా పదహారు పదిహేడు సంవత్సరాల వయస్సు వచ్చినప్పటినుంచీ ఇందులోనే పని చేస్తూ వచ్చాను. బహుశా మీకన్నా కాస్త అనుభవం ఎక్కువగా ఉన్నందువల్లనే కాబోలు మీరంతా నన్ను చాలానే గౌరవిస్తూ వచ్చారు. ఈవిధంగా పాతవాళ్ళను గొప్పవాళ్ళుగా భావించకూడదు. కాని ఆచారం మాత్రం అలాగే సాగివస్తున్నది మరి! పెద్దవాళ్ళముందు చిన్నలు వినయ వినమితులు ఔతునే ఉన్నారు. అందువల్లనే పనులన్నీ సవ్యంగా నెరవేరుతున్నాయి. సామర్థ్యం అందరికీ సమానంగానే ఉంటుంది. కాని మనలో మనం వినయగుణాన్ని నియమంగా పెట్టుకుని కొన్ని మర్యాదలు ఏర్పాటు చేసు

కుంటూ ఉంటాం. మానవ సంస్కృతి ఈ విధంగానే పెంపొందుతూ ఉంటుంది. మనం ఏం చేసినాసరే, ఈ వినయగుణాన్ని మాత్రం విడిచిపెట్టుకోరాదు. అభివృద్ధికి అది మూలం. మన బాధ్యత ముగిసింది. ఈ విషయం మీకు ఇదివరకు చెప్పాను; ఇప్పుడు మళ్లీ చెబుతున్నాను. ఎవడైనా ప్రపంచానికి తన అవసరం ఉన్నంతవరకే ఉండాలి. తన అవసరం తీరిన తరువాత కూడా ఇంకా బ్రతికివుండకూడదు. ప్రజల మన స్తత్వం మారి పోతున్నది. పూర్వ సంప్రదాయాలు పనికిరాకుండా పోతున్నాయి. నేనైతే ఓడిపోలేదనుకోండి; కాని ప్రస్తుత కాలపరిస్థితినికూడా పరికిస్తున్నాను. ఇక్కడ మిమ్మల్ని నేను చివరిసారిగా సమావేశ పరిచాను. మన సంఘాన్ని ఇక రద్దు చేసెయ్యాలని నా అభిప్రాయం. అంటే ఇక మీరంతా హాయిగా విశ్రాంతి తీసుకోవాలని కాదు. ఇక మీ మీ బుద్ధిని అనుసరించి, మీ పరిస్థితుల్ని అనుసరించి మీ మార్గాన్ని మీరే ఆవిష్కరించుకోండి; ఇన్నాళ్ళ కృషి ఫలితంగా దేశవ్యాప్త మౌతూఉన్న సాతంత్ర్యోద్యమంలో మీ మీ స్థానం చూచుకోండి. ఇక నాతో తర్కించ నవసరంలేదు. మీరు చెప్పేదంతా విన్నాను. మీ ఆవేశం చాల గొప్పది. మీ బాధ్యతమీద మీరు ఏమన్నా చెయ్యండి; మీకు పూర్తి స్వతంత్రం ఉంది. ఉదయంనుంచీ తీవ్రంగా ఆలోచించి, చివరకు ఒక నిర్ణయానికి వచ్చేశాను. ఇక మన సంస్థను రద్దు చెయ్యవలసిందే. మనలో సహజంగా ఒకే ఒక నీతి, ఒకే ఒక లక్ష్యం ఉండటానికి అవకాశం లేదు. అంత

ర్విభేదాలు వచ్చి పడుతున్నాయి. కాబట్టి నేను చెప్పే దేమంటే—ఇక మీరు వెళ్ళిపోండి. బరువు తీరిపోయిందని మాత్రం అనుకోకండి. పని చాలా ఉంది ఇంకా. దేశం స్వతంత్రం కాలేదు. మన సంస్థ మాత్రం ఉండదిక. కేదార్!—"

"చిత్రం—"

"ఇదిగో, మీరంతా ఇక్కడే కూర్చోండి. లాల్! పోదాం రా. సుఖదా! నువ్వుకూడా రా. కేదార్! ఒక ఇరవై నిమిషాలవరకూ మీరంతా ఇక్కడే ఉండండి. మాతో ఎవరూ రావద్దు. యమునాఘాట్‌లో మన బస ఎత్తివేశాంగా! రేపు ఉదయం నన్ను ఎక్కడ కలుసుకోవాలో జ్ఞాపకం ఉంది కదూ! సరే, మిత్రులారా! నమస్కారం."

అక్కడివా రంతా అక్కడే కూర్చునే ఉన్నారు. కేవలం మేం ముగ్గురమే బయలుదేరి గుట్ట దిగాం. యమునా నది ఒడ్డునే నడుస్తూ వెడుతున్నాం.

"లాల్! నువ్వు ఇక్కడికి ఎలా వచ్చావు?" – హరీశ్ బాబు అడిగారు.

"మీరు యమునాఘాట్‌లో కనిపించకపోయేసరికి ఇలా వచ్చాను."

"అయినాసరే, నువ్వు రాకూడదు. (నాతో) కాంత్ రాలేదా? ఎందుకని?"

"నేను వచ్చానుగా! మీరు ఇంటికే వస్తున్నారు కదూ!"

"ఇల్లు ? ఏ యిల్లు ?"

"మాయిల్లే. ఇంకే యిల్లుందీ ?" అన్నాను సిగ్గు పడుతూ.

"మీ యిల్లేకద! అదే అడుగుతున్నాను. లాల్ వచ్చాడు; కాంత్ రాలేదు. అయినా నేనిప్పుడు ఎవరింటికీ రావటంలేదు. లాల్ ! మన సంస్థ రద్దు అయిపోయింది; ఇంకా ఆలోచిస్తున్నావేమిటి ?"

"సంస్థ రద్దు అయిపోయినట్టేనా, అన్నగారూ !"

"ఆఁ. స్వప్నం విడిపోయింది. ఇక మీరిద్దరూ కలిసి వుండచ్చు."

"నా సంగతి ఎరిగివుండికూడా అలా అంటారేం అన్నగారూ !"

"ఏం ? చెడ్డమాట అన్నానా ? ఏం సుఖదా ! అది చెడ్డమాటా ?"

వచ్చి వచ్చి రోడ్డు ఎక్కాం. మరికొంత దూరం పోగానే ఒక కారు ఆగి ఉంది అక్కడ. మేము అల్లంత దూరాన ఉండగానే చూచి డ్రయివరు తలుపు తెరచి ఉంచాడు.

"ఎక్కండి" అన్నారు అన్నగారు. మేము సంకోచిస్తూ నిల్చున్నాం. వారు బలవంతం చేశారు. ఇద్దరం లోపల ఎక్కి కూర్చున్నాం. అన్నగారు కూడా లోపలికి వచ్చి కూర్చుని "ఎక్కడ దిగబెట్టాలి మిమ్మల్ని ?" అని అడిగారు.

"మీరు ఎందాకా వెడుతున్నారు ?" లాల్ అడిగాడు.

"ఈమెగారింటికి."

"మేమూ అక్కడికే వస్తాం."

నేను మధ్యలో కూర్చున్నాను. ఎడమ ప్రక్కన హరీశ్ కూచున్నారు. దారిపొడుగునా లాల్ ఏమీ మాటాడ లేదు. అన్నగారు మాత్రం నాతో, ఏవో మామూలు సంగతులు మాటాడుతున్నారు : కాంత్ కు ఎంత ఆస్తి ఉంది ? ఆదాయం ఎంత వస్తుంది ? ఏం చేస్తూ ఉంటాడు ? కుర్రవాడు చురుకైనవాడేనా ?...ఇత్యాది ప్రశ్నలేవో అడిగారు.

ఇంటికి వచ్చాం. మావారు ఇంట్లోనే ఉన్నారు. హరీశ్ బాబు వస్తారని ఎదురు చూస్తున్నట్టుగానే ఉంది వారి వ్యవహారం; కాని హరీశ్ బాబుతోపాటు మేమిద్దరమూకూడా రావటం వారికి ఆశ్చర్యం కలిగించినట్టుంది.

హరీశ్ ఇలా అన్నారు : "కాంత్ ! ఇక నువ్వు దబ్బున కానీ. మనం—(నావైపు తిరిగి) పద ! నిన్ను ఆ గదిదగ్గర దిగ బెట్టి వెడతాం. ఏం, కాంత్ ! వీళ్ళిద్దర్నీ గది దగ్గర దిగ బెట్టి వెడదామా ?"

మావారు మాట సరిగా వినుపించుకోలేదు కాబోలు ! దగ్గరగా వచ్చి "ఆఁ, ఏమిటీ ?" అని అడిగారు.

అన్నగారు నవ్వారు. "మనకు టైము లేదు. నువ్వేమో నిమిష నిమిషం ఆలస్యం చేస్తున్నావు. వీళ్ళను గది దగ్గర దిగ బెట్టి వెడదామా అని అడుగుతున్నాను."

నాకీ ప్రసంగం అంతా అనవసరం అనిపించింది. ఇంట్లో చుట్టూ కలియజూచాను. ఏ ఒక్క వ్యక్తి లేకపోయేసరికి ఇల్లంతా దయ్యాల కొంపలా తయారయిపోతుందో నాకు అర్థమయింది. ఈ నాలుగు రోజుల్లోనే ఇల్లు ఇలా పాడై పోయిందేమిటి! నాకు చాల విచారం కలిగింది. కోపంకూడా వచ్చింది.

"జానాను. ఆ యింటి మీాదుగానే వెళ్ళాలి" అన్నారు మాావారు.

"మరి ఇక్కడ?" హరీశ్ అడిగాడు.

మాావారు తాళం, తాళంచెవి తీసుకొచ్చారు, "ఇక్కడ తాళం పెట్టేద్దాం" అంటూ.

అప్పుడు నన్నేమి ఆవేశించిందో చెప్పలేను. గబగబా ముందుకు వచ్చి మాావారి చేతిలో నుంచి తాళం, తాళంచెవి లాక్కున్నాను. ఒక్క మాటాకూడా పలుకలేదు. లోపలి గదిలోకి వెళ్ళిపోయాను. అదీ అస్తవ్యస్తంగానే ఉంది. వంట గదిలోకి పోయాను. అక్కడకూడా శోభ ఎలా ఉందని చెప్పను? తలకాయ బాదుకోవాలనిపించింది. పనిపాటలు చాతగాని ఈ మగవాళ్ళతో ఎలా వేగటం? చీపురుకోసం వెతకసాగాను. ఊడ్చి శుభ్రం చేయకపోతే ఇక్కడ ఉండేదెలాగ? ఇంతలో మాావారు వచ్చారు. క్షమాపణ యాచిస్తున్న వారులాగ "నేను కాస్త అలా వెళ్ళివస్తాను సుఖదా!" అన్నారు.

"వెడితే వెళ్ళండి, నేను వద్దన్నానా?"

"నువ్వు ఇంట్లో ఒక్కతివే—"

"ఒక్కతెనే గాకపోతే ఇంటినిండా నౌకర్లను పెట్టారు గనకనా ?"

"అయితే వెళ్ళనామరి ?"

"వెళ్ళండి, వెళ్ళండి, నన్ను వేధించకండి."

వారు తిరిగి వెళ్ళిపోతున్నారు. "ఏమండోయ్, మిమ్మల్నే !" అన్నాను.

వారు మళ్ళీ తిరిగివచ్చారు.

"ఎక్కడికి వెడుతున్నారు మీరు ?"

"ఏమో, తెలీదు."

"ఎందుకు తెలీదు ? మళ్ళీ ఎంతసేపట్లో వస్తారు ?"

"ఏమో తెలీదు."

"ఏమో తెలీదు, ఏమో తెలీదు ! నేను ఈ యింట్లో కూర్చుని పొయ్యి రాజెయ్యాలన్న సంగతైనా తెలుసునా అదీ తెలీదా మీకు ?" కోపంగా విసుక్కుంటూ అన్నాను. వారు సమాధానం చెప్పలేదు.

"ఎక్కడికి వెడుతున్నారో కూడా చెప్పరా ? అయితే తలకాయ గోడకు వేసి పగలగొట్టుకుంటాను."

"హరీశ్ బాబుతో వెడుతున్నాను. ఎక్కడికో, ఎందుకో ఆయనకే తెలియాలి."

"సరే అయితే, వెళ్ళండి. ఇంట్లో ఏమన్నా సరుకులూ గట్రా వున్నాయా? గోదుమ పిండి, నెయ్యి, ఉప్పూ, పప్పూ, ఇంకా..."

"చూచుకో."

"చూచుకోవాలా? ఏం చూచుకోవాలి?"

"అదిగో, కారు హారన్ మోగుతోంది."

"చప్పున రండి మళ్ళీ."

తిరిగి గబగబా వెళ్ళిపోతున్న మావారి వైపు ఒక్క క్షణంసేపు చూచాను. ఆతరువాత నా వొళ్ళు నాకు తెలియదు. పంపులో నీళ్ళు వస్తూనే ఉన్నాయి; అది పెద్ద అదృష్టమే. చీపురు పుచ్చుకున్నాను. ఎంత టైము అయిందో కూడా నాకు తెలియదు. ఎలాగో మొత్తానికి ఇల్లంతా శుభ్రం చేశాను. ఏదో కోప్పడుతున్నాను; గొణుక్కుంటు న్నాను; పని చేస్తూనే ఉన్నాను. వంట యింట్లో బియ్యం, పప్పూ కనిపించాయి. కుంపటి రాజేశాను. పులగం వండుతు న్నాను. మనస్సు ఇంకా మామూలు స్థితికి రాలేదు ఇల్లంతా ఊడ్చి, శుభ్రంచేసి, తిరిగి వచ్చిచూద్దును గదా పులగం ఉడికి పోయింది. తప్పేలా కుంపటి మీదనుంచి దించేశాను. అప్పటికి గడియారం చూస్తే పదకొండున్నర అయింది. ఈపాటికి ఆయనగారు కూడ వస్తే రెండు ముద్దలు నేనూ తినచ్చు కదా! అనుకున్నాను...ఒళ్ళంతా నలిగిపోయినట్లనిపించింది. వెళ్ళి పక్క వేసుకొని పడుకున్నాను. ఇక తరవాత నా వొళ్ళు నాకు తెలియలేదు.

నిద్రలేచాక కాస్త మనస్సు స్వస్థపడింది. బాగా తెల్లవారి పోయింది. ఆయనగారు వచ్చారేమోనని చుట్టూచూచాను. రాత్రి వారు రాలేదన్న మాట! వెళ్ళిచూచాను—వీధి తలుపు లోపల గడియవేసి ఉంది. నేను మనసులో చాల బాధ పడ్డాను. వరండాలో ఒక బెంచీమీద వారి కోటు ఉన్నది. వారు మాత్రం లేరక్కడ. మరి కాసేపటికి అటు వెనుకవైపు నుంచి వచ్చారు. స్నానాలగదిలో ముఖం కడుక్కొని తువ్వాలుతో తుడుచుకుంటూ వచ్చారు.

"రాత్రల్లా ఎక్కడున్నారు?" అని అడిగాను.

"ఎక్కడా లేదు, ఎక్కడా లేదు—"

"రాత్రంతా నేను మేలుకొని మీకోసం ఎదురు చూస్తూ కూర్చున్నాను. మీరేమో—"

"ఏంలేదులే, ఏంలేదు."

"ఎక్కడ పడుకున్నారు రాత్రి?

"పరవలేదులే, ఇక్కడ బెంచీ ఉందిగా!"

"రాత్రంతా ఈ బెంచీమీదే పడుకున్నారా?"

"పరవాలేదులే. దానికేమిటి—"

"నన్ను పిలవకపోయారా? తలుపు తీసేదాన్నిగా!"

"దానికేంలే, పరవాలేదులే. నువ్వు నిద్రపోతున్నావని—"

"నేనొక పెద్ద కుంభకర్ణుడి నన్నమాట! లేపితే లేవనా యేం? భోజనమన్నా చేశారామరి!"

"ఏం పరవాలేదులే. అరె, ఇల్లంతా చక్కగా శుభ్రం చేసేశావే! చాల పొద్దుపోయేవరకూ శ్రమ పడ్డావు కాబోల్నే?" అన్నారు. ఆయన, నన్ను సంతోషపెట్టాలన్న ఉద్దేశంతో కాబోలు.

"ఎంత పొద్దుపోయే వరకు అవస్తపడి చస్తే మాత్రం మీకెందుకులెండి. ఆ పులగం అంతా ఎవరి నోట్లో వేసి కుక్కమంటారు ఇప్పుడు? ఇలారండి, లోపలికి రండి."

ఈవిధంగా మళ్ళీ నేను ఇంటి పనుల్లో నిమగ్నురాలినై పోయాను. రాత్రి మావారు ఎక్కడికి వెళ్ళిందీ, తిరిగి ఎప్పుడు వచ్చిందీ, హరీశబాబు ఇక్కడ ఎందుకు ఉండలేదు? ఎక్కడికి వెళ్ళారు?...ఈ విషయాలన్నీ అడిగి / తెలుసుకోడానికి నాకు అవకాశమే దొరకలేదు.

నేను కొన్నాళ్ళు ఇంట్లోలేని లోపం కనిపించకుండా మాఫుచెయ్యాలనిపించింది. మావారు తులసిని పిలిపిస్తా నన్నారు. "ఏం వద్దులెండి" అన్నాను నేను గట్టిగా. ఇన్నాళ్ళ తరువాత వచ్చి మళ్ళీ నేను ఇంటి పనుల్లో జొరబడ్డాను. నౌకరు వచ్చి సాయపడాలన్న అభిలాష నాకు కలగనేలేదు. పొట్లాడి, కోపంచేసి మావారిని బజారుకు పంపించి కావలసిన సరుకులన్నీ తెప్పించాను. నేనే వంటచేశాను. పెందలాడే వారికి భోజనం పెట్టి ఆఫీసుకు పంపించాను. తరువాత ఇంట్లో అస్త

వ్యస్తంగా పడివున్న వస్తువులన్నీ ఎక్కడివక్కడ సర్ది, మళ్ళీ చీపురు పుచ్చుకుని అంతా శుభ్రంచేశాను. సాయంత్రం అయింది పగలల్లా ఇంట్లోనే సరిపోయింది నాకు. బైట ఏమేమి సంఘటనలు జరిగాయో నాకేమీ తెలియదు.

# 28

సాయంత్రం మామూలు వేళకు మావారు ఇంటికి రాలేదు. ఎదురుచూస్తూ కూర్చున్నాను. రోజంతా ఇంటిపనుల్లో నిమగ్ననై ఉన్నానేమో, శరీరమంతా అలసిపోయింది ; కాని మనస్సు మాత్రం స్వస్థంగానే ఉంది. చినిగిపోయిన మావారి పాతమేజోళ్ళు కుడుతూ కూర్చున్నాను. వారు మామూలు వేళకి ఇంటికిరాలేదని కోపగించుకోలేదు. కాని విచారం కలిగింది. ఏవో దుశ్శంకలు కలుగసాగాయి. మనస్సు లోతుల్లో భయం పొడసూపుతోంది.

నేను శంకించినట్లే అయింది. చీకటి పడుతూఉండగా ప్రభాత్ వచ్చాడు ఆత్రతగా. హరీశ్ అన్నగారు ఎక్కడు న్నారు ? ఏరీ? అని అడిగాడు. "వారు ఇక్కడలేరు ; ఎక్కడున్నారో నాకు తెలీదు" అని సమాధానం చెప్పాను.

ప్రభాత్ దీనంగా ముఖం పెట్టాడు. "చాల భయంకరమైనవార్త సుమీ ! అన్నగారు ఎక్కడున్నదీ తక్షణం తెలుసుకోవాలి" అన్నాడు.

"ఏమిటా వార్త ?"

ప్రభాత్ సూటిగా జవాబు చెప్పలేదు. "మీకు గాని తెలిస్తే వెంటనే చెప్పండి అక్కగారూ! చెప్పకపోయారంటే ఒట్టు. నేను తక్షణం వారిని వెళ్ళి కలుసుకోవాలి" అన్నాడు.

నా మనసు క్షోభించింది. "నాకేమీ తెలియదు."

"లాల్ కూడా అతను ఉండవలసినచోట లేడు. అతను అన్నగారిని పోలీసులకు పట్టి అప్పగించబోతున్నాడని తెలిసింది."

"ఎలా తెలిసింది?"

"మీరు నిజం చెబుతూంటే నమ్మరన్నమాట!"

"ఎవరు చెప్పారు నీకు?"

"మీకు అతని సంగతి తెలియదు. పయోముఖ విష కుంభం. పక్కలో పాము."

నాకు ఆవేశం వచ్చింది "ప్రభాత్! నువ్వు ఇక ఇక్కడి నుంచి వెళ్ళిపోవచ్చు."

ప్రభాత్ వెళ్ళలేదు. "నేను నిజం చెబుతున్నాను, అక్కగారూ! కేదార్‌ను ఎరిగివున్నారు కదూ! అతను పది సంవత్సరాలనుంచీ దొంగలగుంపులో నాయకుడు. లాల్ అతన్ని మన సంఘంలోకి తీసుకువచ్చాడు. అతడు ఏం చేస్తున్నాడో తెలుసునా? రివాల్వర్లు పోగుచేస్తున్నాడు."

"ఎందుకూ?"

"ఎందుకా? లాల్ అనుచరుడు కాబట్టి. ఇక పోతే—"

సరే, అసంగతులన్నీ నాకు అక్కర్లేదు. ఇక నువ్వు వెళ్ళిపోవచ్చు."

లాల్ ఎక్కడున్నాడూ ?"

ఆ ప్రశ్నతోపాటు ఒక వ్యంగ్యహాసం కూడా అతని పెదవులపై నాట్యం చేసింది. లేక అది నా భ్రమేనేమో ! నన్ను నేను నిగ్రహించుకోలేకపోయాను. నా చెయి విసురుగా లేచింది. అతని చెంపమీద బలంగా లాగి కొట్టాను.

ప్రభాత్ గడుసు మనిషే. ఒకసారి చెంప తడివి చూచుకున్నాడు. నిల్చున్న చోటునుంచి కదల్లేదు; మెదల్లేదు. ఆవేశపడనూ లేదు. "మీరు మరోవిధంగా ఏమీ అనుకోకండి అక్కగారూ ! మరేమీ లేదు. నేనతన్ని అవశ్యం కలుసుకోవాలి. రేపటిదాకా నేను ఆగటానికి వీల్లేదు. మన నాయకుని పట్ల విశ్వాసఘాతకుడుగా ప్రవర్తిస్తున్నవాడిని సహించి ఊరుకోలేను. అతను ఎక్కడున్నదీ మీకు తెలిసేవుంటుంది."

అతని హాసం చూస్తే నాకు ఆశ్చర్యం కలిగింది. "నన్ను భయపెడదామని వచ్చావా ఏమిటి ?"

ఆ మాట ప్రభాత్ వినిపించుకున్నట్టు లేదు. అన్నాడు: "మీ దోషం ఏమీలేదు ఇందులో. మిమ్మల్ని అప్పుడే ఇక్కడ దిగబెట్టి వెళ్ళిపోయాడుగా ! అర్ధరాత్రి దాటేంత వరకూ వాళ్ళు ఏమిచేస్తున్నారో తెలుసునా ? అంతా నిద్రపోతూన్న ఆ సమయంలో వాళ్ళు కుట్ర పన్నుతూ కూర్చున్నారు."

"మరి నువ్వు అప్పుడు నిద్రపోలేదా ?"

"లేదు, నిద్రపోలేదు. వేరే పనిలో ఉన్నాను. కేదార్ మిత్రుడొకడు నాకు తైనాతీలాగ దాపురించాడు. నేను ఏమి చెయ్యటానికీ వీలు చిక్కింది కాదు. చివరకు ఇవాళ ఉదయం బయలుదేరాను, వ్యవహారం ఏమిటో కనుక్కుందామని. కాని లాల్ ఎక్కడ మాయమైపోయాడో మరి ! కనిపించనే లేదు. ఉదయంనుంచి ఇప్పటివరకూ అతనికోసం గాలిస్తూనే ఉన్నాను. కాని అంతు చిక్కలేదు. ఇక మిమ్మల్ని అడుగుదామని వచ్చాను. ఇప్పటికైనా మీరు చెప్పాలి."

ఆ కుర్రవాని కర్తవ్యదీక్ష, పట్టుదల చూస్తోంటే నాకు అతనిపట్ల కరుణ ఉత్పన్నమైంది. కాని ఆ కర్తవ్యం తన అంతరాత్మ ప్రబోధిస్తున్నది కాదు; బైటినించి ఎవరో ఆదేస్తున్నది. అన్నాను : "ప్రభాత్ ! నీ ఔద్ధత్యాన్ని మన్నించవలసిందిగా అన్నగారు నన్ను కోరారు. బాధ్యత వారిది; నీది కాదుకదా ! మరి వారి అభిప్రాయం పాటించవా నువ్వు ?"

ప్రభాత్ మెల్లిగా ఇలా అన్నాడు : "అన్నగారి అభిప్రాయం మీరు నాకు ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు అక్కగారూ ! వారు నాతో 'ఇదిగో ప్రభాత్ ! రెండురోజుల్లోగా లాల్‌బాబు వంకరప్రవర్తన మాయమైపోవాల్సిందే. ఆతరువాత నాకు వచ్చి కనపడు, చెబుతాను. నేను కనిపించకపోతే నీ మనస్సుకు ఎలా తోస్తే అలా చెయ్యి' అని చెప్పారు. అన్నగారు అటువంటి మహాత్ముడు కదా ! ఆయనపట్ల లాల్ ఇలా విశ్వాసఘాతుకంగా—"

"ఊరుకో ప్రభాత్ ! మాటాడబోకు. నీకేమీ తెలియదు."

"నాకేమి తెలియదంటారు ?"

"ఔను, నీకు ఏమీ తెలియదు ప్రభాత్ ! నోరు మెదల్చకుండా కూర్చో."

"అలా అనకండి. నా కర్తవ్యం ఏమిటో నాకు బాగానే తెలుసు. మరో విషయంతో నాకు సంబంధం లేదు. అతను ఎక్కడ ఉండేదీ మీరు చెబుతారా లేదా ?"

'చెప్పకపోతే కొడతావా యేమిటి ?"

'ఆఁ, కొడతాను."

నాకు అతనిమీద జాలి కలిగింది. "నేనేం చెప్పను ప్రభాత్ ! అతను ఎక్కడ ఉండేదీ నాకు తెలియదు. తెలిస్తే తప్పకుండా చెప్పేదాన్నే. అయినా నీ చేతిలో చచ్చిపోవటానికి అతనికేమీ విచారం ఉండదు. పాపం, నీ కోసమే విచారిస్తాడు. అతనైనా తన ఉద్దేశాల ప్రకారం ఉద్యమానికి సాయపడాలనేగా చూస్తున్నాడు ? ఇంతకూ నీకీ పిచ్చి ఏమిటి ? అతన్ని చంపమని కాదుగా అన్నగారి ఆదేశం ?"

"అదంతా ఆడవాళ్ళ ప్రసంగం కాదులెండి...ఇంతకూ మీకు తెలియదన్నమాటేగా ! సరే, వెడుతున్నాను. నమస్కారం."

కోపంగా, దూకుడుగా, దీక్షాబద్ధుడులా వెళ్ళిపోయాడు.

ప్రభాత్. మళ్ళీ మేజోళ్ళు కుడుతూ కూర్చున్నాను. మా వారింకా రానేలేదు. చీకట్లు బాగానే కమ్ముకొస్తున్నాయి. ఆకాశంలో నక్షత్రాలు వచ్చేస్తున్నాయి. మావారు ఇంకా రాకపోవటానికి కారణం ఏమిటో నాకు బోధపడటంలేదు. వాతావరణం శూన్యంగానూ, ప్రపంచం స్తబ్ధంగానూ ఉన్నట్టు కనిపించసాగింది. కాని నిజానికి ప్రపంచ స్తబ్ధంగా ఉన్నదా? ఎబ్బే, ఎందుకుంటుందీ? తరంగాలమీద తరంగాలు పొర్లి పొంగి వస్తూ ఉంటాయి. అనేక రీతులు! పద్ధతులు! అభిప్రాయాలు! చింతలు! ఉత్కంఠలు! ప్రేమలు! ఈర్ష్యలు! ఆశలు! ఇలా రకరకాలుగా భావాలు పడుగు పేకలుగా ప్రపంచకథ అల్లుకుపోతూ ఉంటుంది...ఇక నేను ఇక్కడ కూర్చుని ఏమి ఆలోచిస్తున్నట్టు? బహుశా నేనేమీ ఆలోచించటంలేదేమో! చేతిలో మేజోడు ఉంది; ఒక వేళ నన్ను గురించే నేను ఆలోచిస్తున్నానేమో! ఆ ఆలోచనల్ని గమనిస్తున్నాను కాబోలు!...కాలం గడిచిపోతూఉంది. బైటి ప్రపంచానికి నేనిక్కడ దూరంగా, వేరై పోయి, ఒంటరిగా ఉన్నాను. ఏం చెయ్యాలో, ఏమో నాకేమీ పాలుపోవటం లేదు.

రాత్రి పది అయింది, పదకొండు అయింది; పన్నెండు అయింది; చాల పొద్దుపోయింది. ఇంకా ఎంతసేపని కూర్చుండేది. తలుపు మూసేసి వెళ్ళి పక్కమీద పడుకున్నాను. పక్కనే ఇంకో మంచం ఖాళీగా ఉండటం నాకేమిటో విచిత్రంగా కనిపించసాగింది. అలాగే పడుకునే ఉన్నాను. మనస్సు ప్రపంచమంతటా విశృంఖలంగా పరిభ్రమించింది. ఎంతసేపటికీ నిద్ర

రానేలేదు. ఒక్కొక్కటే గడియలు గడిచిపోయాయి. చివరకు ఎప్పుడో కాస్త కునుకు పట్టింది.

దభీ దభీ ఒకటే ధ్వని! ఎవరో తలుపు కొడుతూన్న చప్పుడు వినిపించి కళ్ళు తెరిచాను. లేచి పెద్దలైటు వేశాను. తలుపు తీశాను. గుమ్మంలో మావారు కనిపించారు.

నేనేమీ మాటాడలేదు. వారు లోపలికి వచ్చారు. వస్తూ వారే తలుపు గడియ వేశారు.

వారి ముఖం చాల గంభీరంగా ఉంది. "తాళంచెవి ఏదీ?" అని అడిగారు.

"తాళంచెవా?"

"ఔను. పైకం దాచిపెట్టాలి."

"పైకమా?—"

"పైకం—" అంటూ ఒక పొట్లం బైటికి తీశారు జేబులోనుంచి.

"నేను నిర్ఘాంతపోయాను. "ఎక్కడిదదీ? ఏమిటదీ?"

"ప్రశ్నలు అడగబోకు. తాళం చెవి పట్టుకురా" అన్నారాయన దూకుడుగా.

తాళంచెవి ఎక్కడ ఉన్నదో నాకు తెలియదు. అందుచేత నేనేమీ మాటాడలేదు.

"తాళంచెవి!" వారు కోపంగా గర్జించారు.

"మీదగ్గరే ఉండాల్నే."

"ఏమిటీ?"

నేనేమీ మాటాడలేదు. పొట్లాన్ని విసిరి కుర్చీలో వేశారు. కోటు విప్పి దానిమీద పడేశారు. "ఇప్పుడు టైమెంత?"

నేను గడియారంవైపు చూచాను. "రెండు దాటింది" అని చెప్పాను.

"అయితే పడుకో. నిద్రపో. నేనూ నిద్రపోతాను."

ఇదేమిటి? వీరి వాలకం చిత్రంగా ఉందే! నేను నిర్ఘాంతపడి అలానే చూస్తూ నిల్చున్నాను.

"ఏమిటి అలా చూస్తున్నావు? వెళ్ళి పడుకో, పో."

ఆ స్థితిలో వారిని అక్కడ వదలిపెట్టి వెళ్ళిపోడానికి నాకు మనస్కరించలేదు. వారు అటూ ఇటూ చూచారు. ఎక్కడో ఒకచోట వారి దృష్టి నిల్చిపోయింది. "ఏమిటదీ? రెండు ఎందుకూ?" అన్నారు.

నాకేమీ అర్థం కాలేదు. అన్నాను: "ఏమిటీ? వచ్చి పడుకోండి పక్కమీద. తల ఒత్తనా?"

వారికి కోపం వచ్చేసింది. "నాకు ఏమైందంటావు? పక్క నువ్వే వేశావా?"

"ఔను."

"ఇక్కడెందుకు వేశావు ?"

"నేను ఆగదిలో వెళ్ళి పడుకుంటాలెండి."

"సరే, గొడవచెయ్యక వెళ్ళిపో."

వారి వ్యవహారం నాకు దురవగాహంగా ఉంది. నేను మాట్లాడకుండా అవతల గదిలోకి వెళ్ళి మంచం వాల్చుకుని కూర్చున్నాను. కాసేపు అయాక మళ్ళీ పెద్దగదిలోకి తిరిగి వచ్చాను. మావారు ఇంకా నిద్రపోలేదు. కళ్ళు పత్తి కాయల్లా తెరచుకుని, ఇంటి కప్పుకేసి చూస్తూ పడుకుని ఉన్నారు. నేను రావటం చూచారు. "ఏం వచ్చావేం ? పక్క తీసుకువెళ్ళలేదా ? సరే, తీసుకుపో." అన్నారు.

నేను మెల్లిగా వచ్చి వారి తలవైపున కూర్చున్నాను. నుదుటిమీద చెయి వేశాను. వారేమీ మాట్లాడలేదు. నేనూ ఏమీ మాట్లాడలేదు. నేను మెల్లిగా వారి తల నిమురుతూ కూర్చున్నాను. వారు కదలటంలేదు, మెదలటం లేదు. అలాగే స్థిరంగా పడుకుని వున్నారు. కొంతసేపు ఆయాక "కాస్త నిద్ర పట్టించుకోండి" అన్నాను మెల్లిగా.

వారు నా మాట విన్నారు. కాని జవాబేమీ చెప్ప లేదు.

నేను నా వ్రేళ్ళతో వారి కనురెప్పలు మూస్తూ "కళ్ళు మూసుకుని పడుకోండి; నిద్రపడుతుంది" అన్నాను.

వారు నా చెయ్యి తీసిపారేస్తూ "నువు వెళ్లి పడుకో పో !" అన్నారు.

నేను వెళ్ళలేదు. వారి తలవెంట్రుకలలో వ్రేళ్ళు పోనిచ్చి నిమురుతూ కూర్చున్నాను. వారు అభ్యంతర పెట్ట లేదు. మరేమీ మాట్లాడనూ లేదు. కళ్ళుమాత్రం మూసు కునే పడుకున్నారు. నేను అలా తల నిమురుతూనే ఉన్నాను. చాలసేపు గడిచింది. వారు కళ్ళు మూసుకుని ఉన్నారు. అంతే, నిద్రమాత్రం పోలేదు.

"ఇదిగో, ఏమండోయ్ !" అని పలుకరించాను.

వారు పలుకలేదు.

నేను మెల్లిగా వారి తల ఎత్తి నా ఒడిలో పెట్టు కున్నాను. "ఏం జరిగిందండీ, అసలు సంగతేమిటో చెప్పరేం?"

ప్రాణంలేని వ్యక్తిలాగ అలా పడుకునే ఉన్నారు. మాటలేదు; పలుకులేదు.

"కోపం వచ్చిందా ?"

"          "

"మాటాడనే మాట్లాడరేం ? నేను వెళ్ళిపోనా ?"

"మీకంత అసహ్యంగా కనిపిస్తున్నానేమో, వెళ్లి పోతా లెండి."

చటుక్కున వారు నా ఒడిలోనుంచి తల అవతలకు తీసుకున్నారు. "పో, వెళ్లిపో." అన్నారు.

నేను వెళ్లి పోడానికే లేచాను.

వారికి ఎక్కడలేని రోషం వచ్చేసింది. "వెళ్లిపో. పెద్ద లైటు వేసి నువ్వు వెళ్లిపో."

నేను పెద్దలైటు వేయలేదు. అక్కడినుంచి వెళ్లిపోయాను. అవతలగదిలోకి పోయి మంచంమీద కూర్చున్నాను. అలానే చాలసేపు కూర్చుండిపోయాను. నాకేమీ బోధపడటం లేదు. వారే లేచి స్విచ్ వేశారు కాబోలు! ఆ గదిలో పెద్ద కాంతి కనిపిస్తోంది. వెళ్లి దీపం ఆర్పివెయ్యటానికి నేనేమీ ప్రయత్నం చెయ్యలేదు. ఏమైంది? అసలు విషయం ఏమిటి? మనస్సు పరిపరివిధాల పోయింది. ఏవేవో అనుమానాలు కలిగాయి. భయాలు పొడసూపాయి. మంచం మీద అలాగే కూర్చుండిపోయాను. ఎంతకాలం అలా గడిచిందో నాకు తెలియదు. వెక్కివెక్కి మిక్కుటంగా ఏడుస్తున్నట్టు చప్పుడు వినిపించింది. కాసేపు వినిపించి ఆగిపోయింది. కంఠంలోనుంచి బైటికి రాలేక కాసేపు ఆగిపోయిందేమో! కాని మళ్ళీ అవరోధం తొలగిపోయి బైటికి వచ్చేసింది. రాత్రి మూడు జాములు గడిచాయి. ఈ సమయంలో ఏమిటిది నా చెవికి వినిపిస్తున్నది? ఆగి ఆగి పొంగి పొరలి వస్తోన్న ఆ రోదనం నన్నొకరకంగా బంధించి బాధింపసాగింది. నేను లేచి వెళ్ళాను. గదిలో దీపం బాగా ప్రకాశవంతంగా ఉంది. మా నారు బోర్లా పడుకుని, దిండులో ముఖం పెట్టుకుని ఏడుస్తున్నారు. కాసేపు వెక్కివెక్కి యేడుస్తున్నారు. కాసేపు ఊరుకుంటున్నారు; మళ్ళీ యేడుస్తున్నారు. లోపలి దుఃఖమంతా ఒక్కసారిగా బయటికి రావటంలేదు కాబోలు! మూడు నాలుగు నిమిషాలవరకూ నేనక్కడే చిత్రపు

బొమ్మలా చూస్తూ నిల్చున్నాను. వెళ్లి వారిని నా ఒడిలో పడుకోబెట్టుకుని "స్వామీ! నా స్వామీ!" అని ఓదారుద్దా మనుకుంటాను. కాని నిల్చున్న చోటునుంచి మంత్రబద్ధ నై పోయినట్టు కదలనే లేకపోయాను. అలానే నిల్చుని చూచి చూచి తిరిగి వెళ్లి పోయాను. అవతలగదిలోకి వెళ్లి తలుపు వేసుకుని, మంచంమీద చెయ్యే దిండుగా తలకింద పెట్టుకుని పడుకున్నాను. అంతకంటే హాతపూర్వకంగా నేనేమీ చేయ లేక పోయాను.

# 29

తెల్లవారింది. మెళుకువ వచ్చింది నాకు. కళ్లు తెరచుకుని అలాగే చూస్తూ పడుకున్నాను కాసేపు. గది అంతా మామూలుగా పరిశుభ్రంగానే ఉంది. ఎక్కడివస్తువు లక్కడ చక్కగా అమర్చి ఉన్నాయి. చెల్లాచెదరుగా ఏమీలేవు. మావారు ఈపాటికే లేచి వరండాలో కూర్చుని ఉన్నారేమో అని ఊహ చేశాను. దూరంనుంచి చూచాను. ఔను, నేను అనుకున్నట్టు వారు వరండాలో కూర్చుని వార్తాపత్రిక చదువు తున్నారు. నేను వారిదగ్గరకు వెళ్ళలేదు. పోయి ప్రాతఃకాల కృత్యాలు నిర్వర్తించుకున్నాను. వంట యింట్లోకి పోయాను. ఫలహారాలు వండాను; తేనీరు కాచాను. గరిటె పుచ్చుకుని ఒక తప్పేలమీద కొడుతూ కూర్చున్నాను.

ఇలా తప్పేల మోగించటం ఇన్నాళ్ళ తరువాత నాకు కొత్తగా అనిపించింది. కొత్తగా కాపురానికి వచ్చిన ఆడపిల్ల

లాగ సిగ్గు పడ్డాను. వారి దగ్గరకు వెళ్ళి ఫలహారం చేద్దురుగాని రండి అంటూ పిలవలేకపోయాను. తప్పేలమోత విని వారు రావాలని నా ఉద్దేశం. కాని వారు ఎంతసేపటికీ రానే లేదు. చివరకు కోపం తెచ్చుకుని ఫలహారాలన్నీ ఒక పళ్ళెంలో పెట్టుకుని నేనే వరండాలోకి వచ్చాను. ముఖానికి అడ్డంగా వార్తాపత్రిక పట్టుకుని వారు అలాగే కూర్చున్నారు పడక కుర్చీలో. తిరిగి నాకేసి చూడనేలేదు. నేను వచ్చిన సంగతే వారు గమనించలేదా?

"పళ్ళెం తీసుకోరేమండీ?"

వారు నామాట విన్నట్టే లేదు.

"నా మాట వినిపిస్తోందా? తీసుకోరేం?"

వారు వార్తాపత్రిక ముఖానికి అడ్డం తీసివేసి నావైపు చూచారు.

"తీసుకోండి" అంటూ పళ్ళెం అందించబోయాను. వారు దాన్ని అందుకున్నారు. కాని చేరువనే ఉన్న పేముబల్ల దగ్గరగా లాక్కొని దానిమీద పెట్టేశారు. "సుఖదా!—"

"ఇప్పుడు నాకు తీరిక లేదులెండి. మళ్ళీ త్వరగా వంటింట్లోకి వెళ్ళిపోవాలి. ఇవాళ లేవటమే ఆలస్యంగా లేచాను" అంటూ నేనక్కడ ఆగలేదు. తిరిగి వెళ్ళిపోయాను.

తరువాత వారు ఆఫీసుకు పోయేముందు వేళకు వచ్చారు; భోజనం చేశారు. వెడుతూ వెడుతూ "పైకం నేను దాచిపెట్టేశాను" అన్నారు.

నే నా మాట వినిపించుకోనే లేదసలు. ఎందుకూ నా కా సంగతులన్నీ. ఏ విషయమైనా వారు బలవంతాన విని పిస్తే వినాల్సినదాన్నేగాని, ఆ యీ విషయాలతో నేనేమీ సంబంధ పెట్టుకో దలచలేదు. అందుచేత నేను ముఖమెత్తి వారివైపు చూడనూలేదు; సమాధానం చెప్పనూలేదు.

"ఎవరైనా వస్తే—" అంటూ ఏమో చెప్ప బోయారు మావారు.

"ఎవరు వస్తారు ?"

"ఎవరైనా ఒకరు—"

"ఎవరూ రారు ఇక్కడికి."

"నా అభిప్రాయం ఏమిటంటే..."

"తెలిసింది లెండి. మీరు నన్ను గురించి ఏమీ భయ పడ నక్కర్లేదు."

"సుఖదా !—"

నేను వినిపించుకోకుండా వెళ్ళిపోయాను. ఏవో పనుల్లో జొరబడ్డాను. వారు వెళ్లిపోయారు.

భోజనం చేశాను. వంటిల్లు శుభ్రం చేశాను. అంట్ల తప్పేలాలు తోమేశాను. వరండాలోకి వచ్చి తీరిగ్గా కూర్చుని వార్తాపత్రిక తిరగవేద్దును కదా—

అరె, ఏమిటిది ?

వెంటనే నాకేమీ అర్థం కాలేదు. రెండుసార్లు చదివాను. ఇంకా చాలసార్లే చదివాను. ఎన్నిసార్లు చదివినా విషయం అదే. హరీశ్ అన్నగారు పట్టుబడ్డారట!

విషయమంతా పూర్తిగానే చదివాను అంతా సవిస్తరంగానే రాశారు; కాని కొన్నిచోట్ల విస్పష్టంగా లేదు. రాత్రి పదకొండు గంటలప్పుడు ఊరి బైట ఒక తోటలోని శివాలయంలో ఉండగా హరీశ్ బాబును పోలీసులు వచ్చి పట్టుకున్నారట. వారు అప్పుడు అక్కడ ఒక్కరే ఉన్నారట. అనుచరు లెవ్వరూ ఒక్కరు కూడా లేరట దగ్గర. ఎక్కడికో వెళ్ళి ఉంటారని పోలీసులు అనుమానించారు. అప్పు డక్కడ విప్లవకారులంతా ఒక రహస్య సమావేశం జరుపదలిచినట్టు కూడా పోలీసులు అనుమానించారట. హరీశ్ బాబుకు ఇంకా కొంతమది అనుచరులు లేకుండా ఉండరన్న సంశయంతో పోలీసులు వాళ్ళకోసం కూడా వెదకుతూనే ఉన్నారట. కొందరు వ్యక్తులు గుంపుగా వచ్చి పోలీసు స్టేషన్ మీద దాడి చేశారట. నలుగురు పోలీసులకు బాగా గాయాలు తగిలాయిట. దాడిచేసిన వారిలో ఒకడు పోలీసులు పేల్చిన తుపాకీగుండు తగిలి చనిపోయాడట. ఈ దాడిని ఆ వ్యక్తులెవరోగాని బాగా ముందుగా ఆలోచించి, చాలా చాకచక్యంగా జరిపారట. ఈ దాడి చేసినవారు పది పన్నెండుగురు ఉంటారట. దాడి చేసి వెంటనే వెళ్ళిపోయారు; మళ్ళీ వాళ్ళ సమాచారం తెలియ లేదుట. వాళ్ళలో చాల మందికి బాగా గాయాలు తగిలా

యని అను కుంటున్నారుట. వాళ్ళు రెండు జీప్ కార్లలో వచ్చి వెళ్ళిపోయారుట.

హారీశ్ బాబు ఎలా పట్టుపడ్డారు? పోలీసులకు వారి కబురు ఎలా తెలిసింది? ఈ విషయాన్ని గురించిన భోగట్టా ఏమీ పత్రికలో లేదు. ఏవరో ఒక గూఢచారుడు పోలీసులకు కబురు తెలిపినట్లు అనుకుంటున్నారుట. అయితే అయివుండ వచ్చు. హారీశ్ ను పట్టించినవారికి 5000 రూపాయలు బహుమానం ఇస్తామని ప్రభుత్వం ప్రకటించింది కదా!

వార్తాపత్రికలోని ఈ సమాచారం ఎన్ని సార్లు చదివానో లెక్కలేదు. ఎన్ని సార్లు చదివినా అంతకు మించి నాకింకేమీ విషయాలు బోధపడలేదు. ఇదంతా చదివిన తరువాత...రాత్రి రెండు గంటలు దాటాక మావారు ఇంటికి రావటం, వారి విచిత్ర ప్రవర్తన గుర్తుకు వచ్చాయి. ఏమిటి ఇదంతా? ఇంతకూ హారీశ్ బాబును పట్టించిన ఆ గూఢచారి మావారేనా ఏమిటి? ఊహుఁ. నేను నమ్మలేకపోయాను. కాని ఆ ఆలోచన మనసుకు తోచేసరికి కత్తి పెట్టి నా శరీరాన్ని రెండుగా చీల్చినట్లనిపించింది. మరి వారు పైకం తీసుకు వచ్చారే! ఎక్కడిదా డబ్బు! అదే ఆలోచన నన్ను వెంటాడ సాగింది. ఆ పొట్లం ఎక్కడ దాచారో తీసి చూద్దామనిపించింది. తాళంచెవి కోసం అక్కడా ఇక్కడా వెదికాను. ఎంత వెదికినా కనిపించలేదు. జేబులోనే వేసుకుని తీసుకుపోయారు కాబోలు!...అయి వుండవచ్చు. నా మనసు మరీ విచలితమైపోయింది. ఏం జరిగిందో ఏమిటో, యెంత ఆలోచించినా నాకు అంతు పట్టటంలేదు. లేచాను. ఇల్లు

తాళం పెట్టేసి ఆగది వైపు వెళ్ళాను. ద్వారంముందు గూర్ఖా వాడు కనిపించాడు. లోపలికి వెళ్ళాను. తులసిని గుచ్చి గుచ్చి అడిగాను. "రాత్రల్లా ఇక్కడ నేను ఒక్కడినే ఉన్నాను అమ్మగారూ! మరింకెవరూ రాలేదు పెట్టలేదు. లాల్‌బాబు నిన్న ఉదయనే వెళ్ళిపోయారు; మళ్ళీ ఇంతవరకూ తిరిగి రానేలేదు. ఆయనతోపాటు ఇంకో వ్యక్తి ఎవరో కూడా ఉన్నాడు. అతను కూడా ఆయన వెళ్ళిన కాసేపటికి లేచి పోయాడు. మళ్ళీ రాలేదు" అన్నాడు తులసి.

"అతను ఇక్కడే భోజనం చేశాడా?"

"చిత్తం. ఇక్కడే భోజనం చేశారు."

"ఆ యిద్దరూనా?"

"ఇద్దరూను."

"ఎన్ని గంటలప్పుడు?"

"సుమారు రాత్రి పదిన్నర గంటలకు."

నేను గదులు రెండూ కలయ జూచాను. ఏమైనా ఆపత్తారాలైన కాగితాలుగాని, వస్తువులుగాని మిగిలి ఉన్నాయేమో నని మూల మూలలా జాగ్రతగా వెదికాను. పోలీసులు ఏ నిమిషాన అయినా ఇక్కడికి సోదా చూచేందుకు రావచ్చు. నేను గాభరా పడుతున్నట్టు పైకి కనిపించలేదు. గబగాబా... అనుమానాస్పదములుగా కనిపించే వస్తువులన్నీ [illegible]. గూర్ఖావాడికి జీతం ఇచ్చేసి వెళ్ళిపోమన్నాను. తులసిని వెంటబెట్టుకొని, అక్కడ తాళంపెట్టి ఇంటికి వచ్చేశాను.

సాయంత్రం మామూలు వేళకు మావారు ఇంటికి వచ్చారు. కాని నా కంట బడకుండా ఉండాలన్నట్టుగా వారు సంచరించారు. చివరకు నేనే వారి యెదుటికి పోయి కూర్చుని అడిగాను: "నేను తులసిని ఇక్కడికి తీసుకువచ్చేశాను. విషయమంతా మీరు విస్పష్టంగా చెప్పండి. ఏం జరిగిం దేమిటి అసలు? నా దగ్గర ఏమైనా దాచారంటే మాత్రం బాగుండదు.

మావారు అంతా చెప్పేశారు. వారు చెప్పినదానిలో నాకేమీ అనుమానించదగిన అంశం కనిపించలేదు. వారు చెప్పింది ఇది: "హరీశబాబు ఒక నిశ్చయానికి వచ్చేశారు. ప్రభుత్వం చేతిలో పట్టుబడిపోవాలనే ఆయన సంకల్పం. శాసనం ఎలా ఉంటే, తన్ను అలా శిక్షిస్తే శిక్షిస్తారు. అందుకు ఆయన సిద్ధమే. విప్లవ కార్యక్రమంలో ఆయనకు ఆనందం కనిపించకుండా పోయింది. లాల్ మూలాన ఆయనకు తీవ్రమైన అఘాతం కలిగింది. కాని దాన్ని ఆయన ఆఘాతంగా భావించనే లేదు. "లాల్ నాకు కనువిప్పు కలిగించాడు" అని అంటూ ఉండేవారు. మిగతా కారణాలు ఎలా ఉన్నా, ఒక్క లాల్‌ను గురించిన విచారమే ఆయన్ను ఆ సంకల్పంవైపు తీసుకుపోయింది. లాల్ ప్రవర్తన విషయమై ఆయన ఎప్పుడూ చర్చకు దిగేవారు కాదు. అతని ప్రసంగం వస్తే మౌనంగా ఉండిపోయేవారు. ఏమీ చెప్పేవారు కాదు. సంఘంలో చాలామంది లాల్‌కు శత్రువులుగా మారి పోయినట్టు కనిపిస్తుంది. వారతన్ని ద్రోహిగా పరిగణించి చాలని చూస్తున్నారల్లే ఉంది. అతన్ని నామరూపాలు

లేకుండా చంపి పారెయ్యాలనే వాంఛిస్తున్నా రనుకుంటాను. బహుశా అతన్ని అలా చంపెయ్యటానికి హరీశ్ బాబు కూడా తన అనుమతి ఇచ్చే ఉంటాడు—అని అనుమానిస్తున్నాను; అంతేగాని గట్టిగా చెప్పలేను సుమీ! కాని ఈమధ్య వారిలో ఎంతో హృదయ మథనం సాగుతున్నట్టు నాకు కనిపించింది. ఇటీవల నే నాయన్ను చాలసార్లు కలుస్తూ ఉండేవాడివికదూ! మనశ్శాంతి లేశమాత్రమూ ఉండేది కాదు ఆయనకు. నిమిషం కూడా సుఖంగా ఉన్నది లే దాయన. మనిషిని ఉరిదీస్తున్న ప్పుడు ఉండే బాధను మించిన బాధ అనుభవించారు, నాతో ఒకసారి ఇలా అన్నారు: "కాంత్! నువు నా మిత్రుడివి. నువు నాకు ఒక్క పని చేసిపెట్టాలి. సర్కారువారు నాపేరు మీద అయిదువేల రూపాయలు తీసి విడిగా పెట్టారు. నన్ను పట్టుకోవాలని వారి ఉద్దేశం. అందు కెవరన్నా తోడుపడే టయితే అయిదువేల రూపాయలూ అతనికి ఇచ్చెయ్యటానికి సిద్ధంగా ఉంది ప్రభుత్వం. నువు నాకు చెయ్యవలసిన సాయం ఏమంటే—నన్ను పట్టుకోవాలనుకుంటున్న వారి దగ్గరకు పోయి...నువు యేమీ చెయ్యనక్కర్లేదు...కాస్త నాకబురు వారి చెవిలో వెయ్యి. అంతే." "అంతకన్నా నన్నింత విషం తాగమని చెప్పకూడదూ హరీశ్ బాబూ!" అన్నాను. అప్పుడు హరీశ్ బాబు నా చెయ్యి తన చేతుల్లోకి తీసుకుని "కాంత్! నువు నా సంగతి అర్థంచేసుకోలేవేం? ఇక నేను ఎంతమాత్రమూ జీవించలేను. ఈ విధంగా చచ్చిపోయానంటే, బహుశా తరువాత నా అనుచరులకు బుద్ధి వస్తుంది. చైతన్య వంతులూ, సహనశీలురూ కాగలరేమో! ఇటువంటి

మృత్యువు ఫలవంత మనిపించుకుంటుంది. అటువంటి సఫల మృత్యువును నాకు దక్కించు. ఇలాగాక ఇంకోవిధంగా చచ్చిపోతే ఆ మృత్యువు మిమ్మల్ని నిరాశాపూరితులను చేస్తుంది. యజ్ఞం అంటే ఏమిటో, బలిదానం ఎందువల్ల మహాధర్మం అయిందో నాకు అర్థం అయింది ఇప్పుడు. కాంత్ ! నువ్వు నాకు విరోధివి కాదు. విరోధి అయివుండి కబురు చెబితే అది దోషం ఔతుంది. నేను నీకు పరమ మిత్రుడిని. ఏం ? కాదా ? కాబట్టి నువ్వే ఈ పని చెయ్యాలి. వెళ్ళు. లే. ఆలోచించబోకు. ఇతర్లను చంపటంకంటే తానే చచ్చిపోవటంలో ఉన్న మహత్తును గుర్తించి, ఈ మార్గంలో అడుగుపెట్టాను. నువ్వు నాకు మిత్రుడివి. అడ్డురాబోకు. వెళ్ళు. ఇంతమాత్రం సాయం చెయ్యి" అన్నారు. సుఖదా ! నీకు ఈ సంగతి అంతా చెబుతూంటే నాకు చాల కష్టంగా ఉంది. ఆ సమయంలో నా బుద్ధి ఎలాగై పోయిందో, ఏమైపోయిందో నాకు తెలియదు. ఆయన మాటల్లో ఏదో ప్రబల సత్యం దాగి వున్నట్టు నాకు స్ఫురించింది. నా నుంచి నేను వేరై పోతున్నట్టు అనిపించింది. విశిష్టత అంటే అలా ఉంటుంది కాబోలు ! అది కేవలం ఒక రకమైన ఉన్మాదమే. అది ఇంద్రజాలంలా ఎలా పనిచేస్తుందో నీకు తెలీదు సుఖదా ! ఇప్పటికీ నాకూ దురవగాహంగానే ఉన్నదది. ఆయన మాటల్లో ఏదో విచిత్రమైన, అవార్యమైన బలం ఉంది. నేనేమీ అడ్డు చెప్పలేకపోయాను. ఆయన ఇష్టప్రకారమే చేసెయ్యటానికే ఉద్యుక్తుడినైనాను. ఏమి చెయ్యాలో అంతా ఆయన ఉపదేశించారు. నేను ఆఫీసుకు వెళ్ళానని నువ్వు అనుకున్నావే కాబోలు ! ఆఫీసుకైతే వెళ్ళాను; కాని హాజరు

పట్టీలో దస్కతు పెట్టి అక్కడినుంచి వెంటనే వచ్చేశాను. సాయంత్రం ఏడు గంటలకు పోలీసు సూపరింటెండెంటు దగ్గరకు పోయాను. హరీశబాబు ఎక్కడ ఉన్నదీ కబురు చెబుతానన్నాను. బహుమానం ముందుగా ఇవ్వవలసిందని కోరాను. ముందుగా ఎందుకిస్తాడు? గుట్టు చెప్పేసెయ్యమన్నాడు. ఏం చెప్పాలో సంగతి అంతా హరీశ్ బాబు బాగా నేర్పే పంపించారుగా! నేను చెప్పినదంతా విన్న తరువాత ఆఖరుకు డబ్బు ఇచ్చేశాడు. కాని నన్ను అక్కడే ఖైదీగా అట్టిపెట్టాడు. అంటే—హరీశ్‌ను పట్టేసినతర్వాత నన్ను విడిచిపెడతాడన్నమాట! ఆ పైని ఏమి జరిగిందో ఏమో ఈ వార్తాపత్రిక చూచినతరువాతనే నాకు తెలిసింది. సుమారు రాత్రి పన్నెండు గంటలప్పుడు నన్ను అక్కడినించి విడిచిపెట్టారు. పోలీసులు నన్ను ఒక కారులో తీసుకువచ్చి కొంత దూరాన దిగబెట్టారు. అక్కడినించి ఇంటికి చేరుకోడానికి నాకు రెండుగంటలు పైగా పట్టింది. ఇప్పటికీ నన్ను ఆవేశించిన మత్తు వీడిపోయిందో లేదో! ఒకరకమైన తీవ్రమైన హృదయబాధ అనుభవించాను. ఈ డబ్బు ఏ బావిలోనో విసిరి పారేద్దా మనిపించింది. డబ్బుతోపాటు నేనుకూడా బావిలో దూకి చచ్చిపోదా మనిపించింది. అలా నేను చచ్చిపోయినట్లయితే బాగానే వుండేది. కాని శ్వాసకోశాలకు గాలి కావలిసివచ్చింది. అందుకోసం ఏదైనా పార్కుకు వెడదామనిపించింది. కాని పార్కులన్నీ మూసి ఉన్నాయి. ఆ శూన్యవాతావరణంలో నిరుద్దేశంగా అటూ ఇటూ తిరిగాను నా పరిస్థితి నాకే దురవగాహమైంది. చివరకు

ఇంటికి వచ్చాను. సుఖదా! నీకు అర్థం అయిందా ఈ నా వ్యవహారమంతా?"

అర్థం చేసుకొనేటంత తీరికగా లేదు నా మనస్సు. "పోలీసు స్టేషనుమీద దాడి జరిగిందటగా! ఆ విషయం మీకేమన్నా తెలుసునా?" అని అడిగాను.

"ఊహుఁ. నాకేమీ తెలియదు."

"దాడిచేసినవారెవరో మీరేమన్నా ఊహించ గలరా?"

"ఊహుఁ. నేనేమీ ఊహించలేను."

"దాడిచేసినవారిలో ఒక మనిషి చనిపోయాడట. అతనెవరో ఇంతవరకూ తెలియనే లేదా?"

"ఇదిగో 'ఈవినింగ్ న్యూస్' తెచ్చాను. శవాన్ని గుర్తించినట్టు మాత్రం రాశారు."

నేను మరేమీ ప్రశ్న వేయలేదు. చటుక్కున వార్తా పత్రిక అందుకుని చూచాను. అందులోనూ అదే కబురు ఉంది. అంతకుమించిన వివరాలేమీ లేవు.

"అతడు ఎవరై ఉండవచ్చు?" అనుకున్నాను. హఠాత్తుగా నాలో నేను బిగ్గరగానే.

ఆ ప్రశ్న తనను అడుగుతున్నానని అనుకున్నారేమో మావారు!—దానికి జవాబు తెలియని మనిషివలె నా ముఖం లోకి చూస్తూ ఉండిపోయారు.

"ఏమండీ! ఆ నాటి సాయంత్రంగాని, పగటిపూటగాని ఎప్పుడైనాగాని లాల్‌బాబు అన్నగారిని కలిశాడా?"

"కలిశాడు."

"మీరు ముగ్గురూ ఆ రాత్రి ఇక్కడినించి కలిసే వెళ్ళారు కదూ? ఎక్కడికి వెళ్ళారు?"

"హరీశ్ బాబుకు ఒక మిత్రుడున్నాడు. అతడు పెద్ద ఉద్యోగి. ఆయనగారి ఇంటికి వెళ్ళాం."

"లాల్‌బాబు మధ్యలోనే దిగిపోయాడా?"

"లేదు. కాని ఆ ఉద్యోగస్థుని బంగళాలోకి హరీశ్ బాబుతోపాటు నేను ఒక్కడినే వెళ్ళాను. లాల్‌బాబు మోటారును యజమానికి అప్పగించి రావడానికి పోయాడు."

"ఆతరువాత?"

ఆతరువాత సుమారు మూడుగంటలప్పుడు హరీశ్ బాబును కలుసుకోడానికి లాల్‌బాబు బంగళాకు వచ్చాడు. వారిద్దరు ఏమి మాటాడుకున్నారో నాకు తెలియదు. ఒక గంట అయిన తరువాత అతను వెళ్ళిపోయాడు. ఆ మీదట హరీశ్ అన్నగారు చెప్పవలసిన మాటలన్నీ చెప్పి నన్ను పంపించేశారు. మరి రెండున్నరగంటల తరువాత, ఎనిమిది గంటలు కొట్టేలోపున నన్ను పోలీసు స్టేషను వెళ్ళమని ఆదేశించారు. ఆ తరువాత ఏమి జరిగిందో ఇక నాకు తెలియదు."

ఒకరు మరొకరితో ఆడే చదరంగపాటలో ఒక పావుగా మారిపోయిన మావారి ముఖంలోకి చూస్తూ నిస్తబ్ధంగా కూర్చున్నాను.

నిజానికి ఒకరు మరొకరితో ఆడుతున్న ఆటా ఇది? ఎవరిది మరి ఈ లీల అంతా? మన మనస్సులలో ఉత్పన్న మౌతూ ఉండే సంకల్ప వికల్పాల ద్వారా ఈ లీల క్రమబద్ధంగా సాగుతోందా? అలాగని భావించటం మనస్సును

ఒక విధంగా సమాధానపరచుకోటమే. సూత్రధారు డెవడో పైనో, కిందో, ఏ మూలలో, ఎక్కడో దాగి వున్నాడు. మనం తోలు బొమ్మలమై అతను ఆడించినట్లెల్లా ఆడుతూఉన్నాం. ఆడుతున్నాం, ఆహ్లాదిస్తున్నాం. కాని ఈ క్రింద పడటం, పైన పడటం,దూకటం—ఈఆట యావత్తూ మనం బుద్ధిపూర్వకంగా ఆడుతున్నది కాదు. సూత్రం ఎక్కడో ఎవరిచేతిలోనో ఉంది. మనం కేవలం ఉపకరణాలు మాత్రమే. ఈ సత్యం నేను ఇప్పుడు గ్రహించగలుగుతున్నాను. అంతా అయిపోయిన తరువాత ఈనాడు గ్రహించి మాత్రం ఏమిలాభం ? ఆ సమయంలో మాత్రం. మావాడు కేవలం మరొకడి చేతిలోని పావుమాత్రమేనని, స్వయంగా బుద్ధి ఉపయోగించి యేమీ చేయలేని అసమర్థపు వ్యక్తి అని చులాగ్గా నిర్ణయంచేశాను.

“పెంపుడుజంతువులాగా ఆయన చెప్పినట్టు మీరు చేశారన్నమాట !”

“పెంపుడుజంతువులాగే కాదు. అంతకన్నా హీనమైన వ్యక్తినేమో కూడా. అయినా ఏం చెప్పను సుఖదా ! హరీశ్ బాబు కంఠస్వరం, ఆ చూపు తలుచుకుంటే. . .ఇప్పుడు కూడా మళ్ళీ. . .ఒకసారి అనుభవం అయినతరువాత కూడ. . . అలాగే చేస్తానేమో అనిపిస్తున్నది.”

నే నా మాట వినిపించుకోలేదు. “ఇంతకూ మీరు ఆ శవం ఎవరిదో కబురు తెలిసికొని రాగలరా ?”

“ఎలా తెలుస్తుంది ?” అమాయికంగా అడిగా రాయన.

“మీరు చాతగాకపోతే ఇంట్లో కూర్చోండి.”

వారు విస్తుపోయి నా ముఖంలోకి చూచారు. జవా బేమీ చెప్పలేదు.

"ఈ పైకం ఏం చేయాలి ?" అని అడిగాను.

"ఏం చేయాలో నువ్వే చెప్పు."

"తగలబెట్టేస్తే బాగుండదూ ?"

వారు నా ముఖంలోకి అదో రకంగా చూచారు. "ఊఁ, తగలబెట్టేసెయ్యి."

"తగలబెట్టెయ్యనా ? దానివల్ల ప్రయోజనమేమిటి చెప్పండి ? అన్నగారు తిరిగివస్తారా ?"

వారు నా ముఖంలోకి ఆశ్చర్యంగా చూచారు.

"ఆ డబ్బు దూరంగా ఉంచవలసిందే. మీకు దాని మీద అపేక్ష ఉందేమో ! అది ఒక వ్యక్తిని హత్య చేస్తే వచ్చిన డబ్బు. నాకు అక్కర్లేదు."

ఆ సమయాన నన్ను ఏమి ఆవేశించిందో నాకే తెలియదు. మనస్సు భయంగా, ఆందోళగా ఉంది. మావారిని అలాగ దెప్పి పొడుస్తూ మనస్థిమితం పొందదలచాను. చేసిన పనికి వారు సిగ్గుపడుతున్నట్టు కనిపిస్తూనేఉంది. వారు బుద్ధి పూర్వకంగా చేసిందేమీ లేదు. అంతా విధివిహితంగా జరిగిందని నాకు తెలుసు. హరీశ్ బాబు హృదయంలో ఉత్పన్నమైన సంకటావస్థ తొలగిపోవడానికి అంతకన్నా మార్గాంతరం లేదనీ నాకు తెలుసు. ఇందులో మావారి పట్ల రోషం ప్రకటించవలసిన అవసరంలేదనీ, వారు సానుభూతి చూపవలసిన వ్యక్తేననీ నాకు తెలుసు. అయినాకూడా ఆ సమయంలో నేను ఎన్నో కటువైన సూటీపోటీమాటలు పలికి ఆయన

హృదయానికి. గాయాలు కలిగించాను. ఆ విషయం అంతా తలచుకుంటే ఇప్పుడు నా హృదయం పరితప్తమౌతున్నది. అప్పటి నా దురుసుమాటలన్నీ వారు మింగి ఊరుకున్నారు. సాయంత్రం వారు ఆఫీసునుంచి వచ్చారు. చాల అలసిపోయి ఉంటారు కదా ! నేను ఫలహారం తెచ్చి పెట్టలేదు. మంచి నీళ్ళు అయినా ఇవ్వలేదు. మళ్ళీ చర్చ, తర్కం ఆరంభించి వారిని చాల వేధించాను. నేను చేస్తున్న పని ఏమిటా అన్న స్పృహే లేకుండా పోయింది నాకు. చివరకు నా మనస్సంతా వికలమైపోయింది. ఏమైనా కాస్త ఫలహారం అదీ చేస్తారా అన్న మాటైనా అనలేకపోయాను. వారినక్కడే వదిలిపెట్టి లోపలికి వెళ్లాను. తులసిచేత ఏదో కాస్త ఫలహారం మంచి నీళ్ళు పంపించాను. నేను వంటింట్లోనే ముద్దులా కూర్చుండి పోయాను. మరికాసేపటికి తులసిని కేక వేసి పిలిచాను. వాడు తీసుకువచ్చిన పళ్ళెం చూద్దునుగదా వారు అందులో ఏమీ ముట్టుకున్నట్టే లేదు. అందులోని తినుబండారాలన్నీ ఎలా పంపించానో అలాగే తిరిగి వచ్చాయి.

"ఏమిరా ! అయ్యగారేం చేస్తున్నారు ?"

"అక్కడ ఎవరూ లేరండి అమ్మగారూ."

"ఫలహారాల పళ్ళెం ఆయనకి యివ్వనే లేదా అయితే?"

"చిత్తం అమ్మగారూ !"

నాకు కోపం వచ్చింది. అసలే మనస్సు వికలంగా ఉందేమో, ఈ తులసి సరిగ్గా పనిపాటలు చేయటంలేదనిపించింది. బాగా కేకలేశాను. చీవాట్లు పెట్టాను. అదిరించాను. బెదిరించాను. ఈ నా వ్యవహారమంతా అర్థంగాక వాడు

గుడ్లు ఒప్పజెప్పి చూచాడు. నేను చరచరా గదిలోకి వెళ్ళి పోయాను.

సుమారు తొమ్మిది గంటలకు మావారు తిరిగివచ్చారు. "ప్రభాత్‌ను తీసుకువచ్చాను. వరండాలో ఉన్నాడు." అని చెప్పారు నాదగ్గరకు వచ్చి.

"ఎవరూ?"

"ప్రభాత్."

"పదండి వస్తున్నా."

నేను వెంటనే వరండాలోకి వెళ్ళలేదు. నా మనస్సు చాల కుంగిపోయివుంది.

మావారు మళ్ళీ లోపలికి వచ్చారు. "రామరీ. అతను మళ్ళీ వెళ్ళిపోవాలట." అన్నారు.

"చెప్పారుగా! పదండి, వస్తున్నాను."

ఎంతసేపని ఆలస్యం చేయగలుగుతానూ? దానికీ ఒక హద్దు ఉంటుందిగా! చివరకు బయలుదేరి వరండాలోకి వచ్చాను. నేను రాగానే ప్రభాత్ నమస్కారం చేశాడు. "ఏమిటి సమాచారం?" అని అడిగాను.

"మీరు నన్ను రమ్మన్నారటగా?"

"నేనా? లేదే!"

"మీరు పిలవకపోయినా నేనైనా రావలసే వుంది లెండి. అన్నగారు వెళ్ళిపోయారు. ఇక ఏమికావాలో గదా!"

"ఎలా వెళ్ళిపోయారు? నీకేమైనా తెలుసా? ఏం జరిగింది?"

"అంతా లాల్‌బాబు దుర్మార్గం – చెప్పేదేముంది!"

నాకు కోపం వచ్చింది. "అసలు జరిగిన సంగతేమిటో వివరంగా చెప్పమంటున్నాను." అని దూకుడుగా అడిగాను.

"మీకు చెప్పకుండా దాచేది ఏముంటుంది ? లాల్ బాబు పోలీసులకు కబురు తెలిపినట్లు తోస్తుంది. ఎవరిద్వారా పోలీసులకు కబురు తెలియచేశాడో మనకు తెలియదు. బహుశా ఒక స్నేహితునిద్వారా తెలియజేసి వుంటాడు. నేను వ్యవహారాలన్నీ కనిపెడుతూనే ఉన్నాను. కేదారనాథ్ ఒక మిత్రునితో సహా తొమ్మిది గంటలకు పోలీసు స్టేషను దగ్గరికి రానున్నాడని నాకు కబురు తెలిసింది. ఏదో ప్రభుత్వపు ఖజానా రానున్నదనీ, దాన్ని దోచుకుపోవడం కేదార్ ఉద్దేశ్యం అనీ నేను విన్నాను. సమయానికి నేనూ అక్కడికి వెళ్ళాను. అక్కడ లాల్ బాబు దొరుకుతాడని నా ఆశ. రోజంతా అతనికోసమే గాలిస్తూ తిరిగాను. సుమారు పద కొండు గంటలప్పుడు అతనక్కడికి వచ్చాడు. కాని నాకు అవ కాశం చిక్కలేదు. అన్నగారిని ఈ దుర్మార్గుడు పోలీసులకు పట్టించాడన్న సంగతి అప్పటికి నా కింకా తెలియదు. తెలిస్తే విడచిపెడతానా ? నా చూపులోనుంచి అతడు జారిపోకుండా కనిపెట్టి చూస్తూనే వున్నాను. కాని కేదార్, ఇంకా అతని అనుచరులు ఇద్దరు ముగ్గురు ఎప్పుడూ అతనిచుట్టూ ఉంటూ వచ్చారు. అందుచేత నాకు అవకాశం దొరకలేదు. మరికాసేప టికి పోలీసుకారు ఒకటి వచ్చింది. లాల్ బాబు చుట్టూవున్న అనుచరులంతా ఆ కారువైపు పరుగెత్తారు. లాల్ బాబు చేరు వనే వున్న ఒక దుకాణంలోకి వెళ్ళాడు. నేను రోడ్డుపక్కన నిల్చొని ఎదురుచూస్తూవున్నాను : లాల్ బాబు దుకాణం

లోంచి ఎప్పుడు బయటకు వస్తాడా అని. పోలీసు కారు మీద వారు చేసిన దాడి సఫలం కాలేదు. అందువల్ల లాల్ బాబు దుకాణంలోంచి బయటకు వచ్చి గబగబా పరుగెత్తిపోసాగాడు. పోలీసులు తుపాకులు పేలుస్తూనే వున్నారు. నేను గురిచూచి పిస్తోలు పేల్చాను. అది అతనికి తగిలే వుంటుంది. కాని అతడు కింద పడిపోలేదు. నేను ఇక అక్కడ నిలవలేదు. ఆతరు వాత...ఆ కారులో పోలీసులు ప్రభుత్వపు ఖజానా తీసుకు రావడం లేదు; హరీశ్ అన్నగారిని బందీచేసి తీసుకువస్తు న్నారు అని తెలిసింది. అప్పుడు ఆ దుర్మార్గుని తంత్రం అంతా నా కర్థమైంది. తన రహస్యం, తన దుర్మార్గం కేదార్‌కు తెలియకుండా...పోలీసులు కారులో ఖజానా తెస్తున్నారని చెప్పి, దాడిచేయమని కేదార్‌ను ప్రోత్సహించి పంపించాడు. పోలీసుల చేతుల్లో కేదార్ చచ్చిపోతాడు, పీడా వదులుతుంది అని అతని ఉద్దేశం. అత డనుకొన్నట్టే కేదార్ పోలీసులు పేల్చిన తుపాకీగుండు తగిలి చావనే చచ్చాడు. అలా చావకుండా వున్నట్లైతే లాల్ బాబే తన పిస్తోలు పేల్చి అతనిని చంపేసేవాడు. ఈవిధంగా లాల్ బాబు కోరిక సఫలం అయింది. అన్నగారిని పోలీసులకు పట్టించాడు. తన దారిలో కంటకంగా వుండకుండా కేదార్‌నుకూడా పోలీసులకు బలిపెట్టాడు. కాని, అక్కగారూ !—"

అంతా మౌనంగా విన్నాను. ప్రభాత్ పలుకుతున్న మాటలకు అతని ముఖలక్షణాలకు నాకు వళ్ళు మండిపోయింది. "ప్రభాత్ ! 'నేనైనా ఇక్కడికి రావలసేవుంది' అని చెప్పావే ఇందాక ! ఎందుకు రావాలి ?"

"నేను వచ్చి మిమ్మల్ని కలవాలని అన్నగారి సందేశంట."

"ఎవరు ఇచ్చిన సందేశం అది ?"

"నా గదిలో పడివుంది చూచాను."

"రాసిపెట్టివున్న సందేశమా ?"

"అవును. 'కోడ్' భాషలో రాసివుంది."

"ఏదీ, నీ దగ్గర ఉన్నదా ?"

అతను ఒక కాగితం తీసి చూపించాడు. 'కోడ్' భాష తెలియజెప్పాడు.

"ప్రభాత్ ! ఇందులో మరి—" అన్నాను.

"అవును. కానీ ఇవాళ ఉదయమే నాకిది దొరికింది. నేనేం చెయ్యనూ. చివరివరకూ అన్నగారు శత్రువును గుర్తించనే లేకపోయారు. పైగా బేపరవాగా—"

అర్ధోక్తిలో నేను అందుకుని "నువ్వు ఇక ఈ పని విడిచిపెట్టటానికి సిద్ధంగా ఉన్నావా ?" అని అడిగాను.

"అన్నగారు సంఘాన్నే రద్దుచేశారు కదా."

"అవును, రద్దుచేశారు. శ్రద్ధగా చదువుకొని పరీక్షలో మొదటి క్లాసులో ఉత్తీర్ణుడివి కావాలి. వింటున్నావా ? అందుకు తగిన ఏర్పాట్లు చేస్తాను. ఎంతైతే సరిపోతుందంటావ్ ? ఇంతకూ ఇప్పుడు నువ్వు ఉంటున్న బస ఎక్కడ ?"

"వీరికి తెలుసును."

"సరే ఐతే; కొద్దిరోజులు ఆగు. పోనీ, ఇప్పుడే అవసరం అయేట్టయితే—ఏమండోయ్, మిమ్మల్నే ! ఇరవై రూపాయలు ఇతనికి ఇచ్చెయ్యండి...లాల్‌బాబుకు పిస్తోలుగుండు ఎక్కడ తగిలిందో చెప్పగలవా ?"

"చెప్పలేను."

"నువు పిస్తోలు పేల్చినప్పుడు అతనికి ఎంత దూరంలో ఉన్నావు ?"

"బహుశా పది అడుగుల దూరంలో ఉండివుంటాను."

"పదిఅడుగులా ? అయితే అతను—"

"అతనేమో వేగంగా పరుగెత్తి పోతున్నాడు. నేను పిస్తోలు అతని మెడకు సూటిపెట్టి పేల్చాను. కానీ—"

"గుండు తగిలిందా అతనికి ?"

"తగిలి తీరింది. కానీ అతను వెనక్కి తిరిగి చూడనైనా చూడలేదు. ముందుకే సాగిపోయాడు, నేనేమో పారిపోయి వచ్చేశాను."

"అయితే ఆ శవం కేదార్‌నాథ్‌ది అన్నమాట. వార్తాపత్రికలో ఆ విషయం వ్రాయలేదు."

"అవును. చచ్చిపోయింది కేదార్‌నాథే. నేను శవాన్ని చూచాను. ఇంకా చాలమంది కూడా వెళ్ళి చూచారు."

"లాల్‌ను గాయపరిచి నువు పారిపోయి వచ్చేశావన్న

మాట. అంతేనా ప్రభాత్ ! చచ్చిపోయేవరకు ఉండి చచ్చాడో లేదో తెల్సుకునిరాకపోయావా ?"

ప్రభాత్ సమాధానం చెప్పలేదు.

"అతన్ని చంపివేయాలని కదూ, నీ ప్రతిజ్ఞ? దేశ సేవాపరాయణుడివికదా ! ఇంత పిరికివాడివిగా తయారైనావేం ? అటువంటి దుర్మార్గుడిని ప్రాణాలతో విడిచిపెట్టవచ్చా ?"

ఇంతవరకూ మావారు ఏమీ మాటాడలేదు. నా మాట పురస్కరించుకొని ఇరవై రూపాయలు అతనికి ఇచ్చారు. అంతకు తప్ప వారేమీ పలకలేదు, ఉలకలేదు. ఇప్పుడు మాత్రం కల్పించుకుని ఇలా అన్నారు: "ప్రభాత్ నువ్వు త్వరగా వెళ్ళిపోవాలన్నావు కదూ—పోనిద్దూ పాపం అతన్ని."

"ప్రభాత్ ! సంఘసభ్యులు ఏమి ఆలోచిస్తున్నారేమిటి ? కోర్టుకు వెళ్ళి పోట్లాడతారా ? లేక—" అని అడిగాను.

"ఏమో మరి నాకు తెలియదు."

"కోహాలీని అడిగి తెలిసికొని నాకు చెప్పు."

"కోహాలీ ఇప్పుడు ఊళ్ళో లేడు."

"ఎక్కడికి వెళ్లాడు ?"

"ఎవరికీ ఏమీ చెప్పి వెళ్ళలేదు. ఎక్కడికి వెళ్ళాడో మరి !"

"మరి నరేశ్ ?"

"రెండుగంటలప్పుడు అక్కడికే వెళ్లాను. అతడూ లేడు."

"సరే, శర్మాజీ కలిస్తే ఇక్కడికి ఒకసారి రమ్మని చెప్పు."

"ఎందుకూ ? అవసరం ఏముంది ?" అన్నారు మా వారు.

నేను వారి మాట వినిపించుకోకుండానే ప్రభాత్‌తో శర్మాజీ కలిస్తే ఇక్కడికి పంపించమని మరొకసారి చెప్పాను.

అందుకు ప్రభాత్ ఇలా సమాధానం చెప్పాడు: "ఆయనా పారిపోయే ఉంటాడు ఇవాళ ఉదయం కలిశాడు నాకు ఒకటి రెండు నెలలపాటు ఎక్కడా కనిపించకుండా దాగి వుండాలని అనుకుంటున్నాడు. కాని ఎక్కడికి పారిపోవాలో తోచక, డబ్బులేదని విచారిస్తున్నట్టు కనిపించాడు."

"అయితే సంఘ సభ్యుల్లో ఎవరూ లేరన్నమాటేనా?"

"ఏమో మరి, నాకేం తెలియదు."

"లాల్ ఎక్కడుంటాడో చెప్పగలవా ?"

"నాకు తెలియదు."

"సరే ఇక నువు వెళ్ళు. మావార్ని అప్పుడప్పుడు కలుస్తూ వుండు—ఏమండోయ్! మీరు ఇతన్ని గురించి

కనుక్కుంటూ వుండండి. అతనికేమీ ఇబ్బంది కలక్కుండా చూస్తూ వుండండి."

ప్రభాత్‌కు ఫలహారం పెట్టి, టీ యిచ్చాను. ఆ తర్వాత వెళ్ళిపోయాడు. మా వారు నా కెదురుగా వచ్చి "సుఖదా! నీవు నాకు ఒక సంగతి చెబుతావా ?" అన్నారు.

"చెప్పటం కాదు; అడుగుతాను. నే నడిగేది ఏమంటే—నన్ను ఇంట్లోనించి వెళ్ళిపొమ్మంటారా ?"

"నువు ఎందుకు వెళ్ళటం ?"

"ఇక్కడ ఉండే యోగ్యత నాకు లేదు కాబట్టి."

"సుఖదా! నీకు ఇక్కడ సుఖం లేదు. నావల్ల నీకు చాలా దుఃఖం- -"

"మా అమ్మగారింటికి వెడతాను."

"సుఖదా !—"

"తులసి ఇక్కడ ఉంటాడు, అవసరం నాకు కబురు చేయండి."

"ఇప్పుడే వెళ్ళిపోతావా ?"

"లేదు. రేపు ఉదయం వెడతాను."

"సుఖదా ! ఎప్పటికైనా నువు నన్ను క్షమించగలిగితే మళ్ళీ రా."

మావారు పలికిన ఆ వాక్యం నేను సగంవరకే విన్నాను. అప్పటికే నేను అక్కడినుంచి లేచి నా గదిలోకి వచ్చేశాను.

అది నా సొంత గది. అదే నా మంచం. దానిమీద మావారు నాకోసం పక్క వేశారు. అందుచేత నేను దాన్ని ఎత్తి అవతల విసిరి పారవేయలేకపోయాను. నాచేతులతో చుట్టి మళ్ళీ పరుచుకుందా మని కూడా ప్రయత్నించలేదు.

రాత్రి గడిచింది. తెల్లవారింది. ఒక టాంగా తీసుకు రమ్మని మావారిని పంపించాను. అది రాగానే దానిలో ఎక్కి కూర్చున్నాను. వారుకూడా బండిలో ఎక్కబోతున్నారు. "మీరూ వస్తున్నారా ఏమిటి ?" అన్నాను.

"అవునవును."

"ఎందుకూ ? ఒక్కతెనే వెడతాలెండి."

"అయితే నేను వద్దంటావా ?"

'వచ్చి ఏంచేస్తారూ ? మా అమ్మగారింటికే కదా వెడుతున్నాను."

"సరే అయితే."

"ఊఁ, పోనీ." అన్నాను బండివాడితో.

మావారు నా ముఖంలోకి చూస్తూఉన్నారు. మాయిద్దరి నోటి వెంట ఇక ఏ మాటా రాలేదు. ఎవరి చేతులూ

నమస్కార రూపంలో గానీ - మరే రూపంలోగానీ పైకి లేవ లేదు. వారు వెనుకకు మరలి వెళ్ళిపోయారు. నా టాంగా ముందుకుసాగిపోయింది.

# ఉపసంహారం

చూడండీ, నేను ఏంచెయ్యనూ? పట్టేశారు నన్ను. జాగ్రత్తగానే ఉంటూ వచ్చాను. కాని నేను రాస్తున్న సంగతి బయటకు పొక్కింది. బహుశా ఈ కాగితాలన్నీ నా దగ్గరనుంచి లాగివేస్తారేమో! నేను బాగా విశ్రాంతి తీసుకో వాలిట. మరేమీ చేయకూడదట. తాకీదు వచ్చేసింది. రోగాన్ని నిర్లక్ష్యం చేసే హక్కు నాకు లేదట. ఇప్పుడు ఈ రోగం నాకు ఎడబాయని చెలికత్తె అయింది. చచ్చిపోయే వరకూ నాతోనే వుంటుంది. నాతో ఇంత అభిన్నంగా ఉంటున్న ఈ చెలిపట్ల ఆదరం యేమిటి, అవజ్ఞ యేమిటి? అస్తమానం నన్ను అంటిపెట్టుకునే ఉంటున్న ఈ చెలిపట్ల నిర్ల క్ష్యం ఎలా చూపగలను? చూపితే మాత్రం ఎన్నాళ్ళు చూపగలుగుతాను? మీరే చెప్పండి? దగ్గు తెర వస్తుంది! ఒళ్ళంతా చాప చుట్టినట్టు ముడుచుకుపోయి ముద్దకట్టుకు పోతుంది. కళ్ళలో నెత్తురు పడుతోంది—పడిపోతోంది; బాధ కలుగుతోంది—కలిగి పోతోంది, దుఃఖం కలుగుతుంది—కలిగి పోతోంది, మందు ఇస్తున్నారు! తాగుతున్నాను. ధర్మా

మీటర్ టెంపరేచర్ కొలుస్తున్నది. ఆసుపత్రి నియమాలు యథావిధిగా సాగిపోతున్నాయి. నేనేమీ అభ్యంతర పెట్టటం లేదు. ఇంతకన్నా నేనేమి చేయగలను ? ఈ అన్నింటి మధ్య కాస్త విశ్రాంతి లభించినపుడు, ఏదో మనస్థిమితం చేకూరు తుందికదా అని ఆత్మకథ రాసుకోటం మొదలుపెట్టాను. ఇది తప్పా? దీని వల్ల ఎవరికేమి నష్టంఉంది ? ఇప్పుడు రోగగ్రస్తురా లిని ! కాని అప్పుడు యువతిని...అమ్మబాబోయ్! ఇంకే ముంది ! అదిగో డాక్టరుగారు వచ్చేస్తున్నారు, ఇంకెలాగ ! ఏమైనాగానీ, దయాన్వితులైన ఓ పాఠకమహాశయులారా ! క్షమించండి. కథ మధ్యలోనే ఆపివేయవలసి వచ్చింది. చూస్తు న్నారుకదా, నేను ఎంత వివశురాలినై ఉన్నానో ! సరే వీలైతే నన్ను అప్పుడప్పుడు జ్ఞాపకం చేసుకుంటూ ఉండండి. సెలవు !

# మానవజీవితాన్ని ఉన్నదున్నట్టు చిత్రించే మరికొన్ని ఉత్తమ పుస్తకాలు:

## సునీత

ఇది శ్రీ జైనేంద్రకుమార్ అమర కృతి. హిందీలో దీని ప్రథమ ముద్రణ 1935 లో ప్రచురింపబడింది. ఇప్పటికి ఎన్నో సార్లు పునర్ముద్రణలు జరిగాయి. హిందీ సాహిత్యచర్చలలో నేటికికూడా ఇదొక ఉత్తమ కళాఖండంగా ప్రశంసింపబడుతున్నది. ప్రత్యేకించి జైనేంద్రుని రచన లన్నిటిలోనూ ఒక అపూర్వత, క్రొత్త సొగసు, విశిష్ట కళాకుశలత ప్రస్ఫుటమౌతూ ఉంటాయి. మానవ జీవితాన్ని ఉన్నదున్నట్టు దర్శించాలంటే జైనేంద్రుని రచనలన్నీ పూర్తిగా చదవాలి. మీరు విన్నారో లేదోగాని, మహాకవి ప్రేమ్‌చంద్ జైనేంద్రుని "ఇండియన్ గోర్కీ" అన్నారు; కిశోర్‌లాల్ మష్రూవాలా "టాల్‌స్టాయ్‌తో సమానుడు" అన్నారు. మైథిలీశరణగుప్త "రవీంద్రనాథ్ టాగూర్, శరత్‌బాబులను జైనేంద్రునిలో ఒకేమారుగా పొందగలిగాము—తిరిగి పొందగలిగాము"—అన్నారు.

ఈయన రచనలలో మరొక విశేషం—ఎన్నిసార్లు చదివినా ఈయన పుస్తకాల్ని మళ్ళీ మళ్ళీ చదవాలనే అనిపిస్తుంది. చదివినకొద్దీ మాధుర్యం ఎక్కువౌతుంది. చదివినకొద్దీ ఇంకా ఇంకా మనోవైజ్ఞానిక పులోతులు లభిస్తాయి—ఇంకా ఇంకా పాఠకుని హృదయం వికసిస్తుంది. కళాత్మకమైన త్రివర్ణ ముఖచిత్రంతో రూ. 3-12-0, మేలుప్రతి రూ. 4-0-0.

## కల్యాణి

ఇది కూడా శ్రీ జైనేంద్రకుమార్‌చే రచింపబడిన ఉత్తమ రచన. వాస్తవంగా జరిగిన ఒక సంఘటన ఆధారంగా రచింపబడ్డది.

సాదాప్రతి రు. 2-12-0. మేలుప్రతి రు. 3-0-0.

కొంటున్నారు? ఈ పరస్పర ప్రతీకార జ్వాలలలో సమిధలై పోతున్న వా రెవరు? స్వర్గం అంటే యేమిటి? నరకం అంటే యేమిటి? ఈ స్వర్గ నరకాలనేవి ఏవైనా బాహ్యావస్తువులా? లేక మానవుని హృదయంలోనే ఉన్నాయా? నరకంలో ఉన్నవాళ్ళు స్వర్గానికి పోయే మార్గాలు ఉన్నాయా? ఏదేనా ఒక మార్గానపడి పారిపోవచ్చా? అలా పారిపోతే నరకంనుంచి విముక్తి లభిస్తుందా? నరకబాధ వొదులుతుందా? ఒకవేళ అలా ముక్తి లభించకపోతే, పోనీ, ఆ నరకాన్నే స్వర్గంగా మార్చేసే ఉపాయం ఏదైనా ఉందా? - ఏమిటా ఉపాయం? సమాజంలో విషకీటకాలు ఎలా ఉద్భవిస్తున్నాయి? వాటిని నాశనం చేయడం సాధ్యమేనా? లేక వాటిని సంస్కరించడాని కేదైనా ఉపాయం ఉందా? — ఈవిధమైన అనేక ప్రశ్నలు, వాటికి పాఠకుని హృదయాన్ని ఉఱ్ఱూతలూగించే జవాబులు కొల్లలుగా కనిపిస్తాయి మీ కీ పుస్తకంలో. ఇప్పుడే వెలువడింది; తప్పక చదవండి. కళాత్మకమైన త్రివర్ణ ముఖచిత్రంతో రూ. 4-8-0.

మేలుప్రతి రూ. 4-12-0.

## విశ్వప్రసాద్ మిత్రద్వయం

మనోహరమైన అయిదు ఉత్తమ నాటికల సంపుటి. ఇందులోని ప్రతి నాటిక విద్యార్థులూ - సమాజాలవారూకూడ ప్రదర్శించటానికీ, ఎవరైనా సరే చదువుకోటానికీకూడ అత్యంత ఉపయుక్తమైనవి-నీతిదాయకమైనవి. ప్రతినాటిక నిస్సందేహంగా పాఠకుని హృదయాన్ని చూరగొంటుంది. అతి సుందరమైన ఆర్టుపేపరు కవరుతో వెల రు. 1-4-0 మాత్రమే. ఈనాటిక లను ఎవరైనా స్వేచ్ఛగా ప్రదర్శించుకోవచ్చు; కాని ప్రదర్శించిన విషయం మాత్రం మాకు, రచయితకు కూడ తెలియజేస్తుండవలసినదిగా ప్రార్థన.

## కంటి మెర మెర

ఇది విశ్వకవి రవీంద్రనాథ్ ఠాకూర్ రచనకు తెలుగు అనువాదం. విశ్వకవి రచనలను గురించి వేరే చెప్పవలసిన పని ఉండదు. సమాజంలో నిత్యం మన కళ్ళకు కనిపించే రకరకాల చరిత్రలు అతి మనోహరంగా

చిత్రించబడ్డవి-ఇందులో. ఉదాత్తమైన గంభీరహృదయులు, నిగ్రహ శూన్యులైన బలహీన చరిత్రులు, నిష్కపటులైన అమాయికలు, సమాజ పీడితలైన భగ్నహృదయులు—వారి దగ్ధహృదయాలలో పుట్టే ప్రతీకార వాంఛలు, పాఠకుల హృదయాలను ద్రవింపజేసే - వారి వివశపరిస్థితులు, సమాజదౌష్ట్యాలు మొదలైన అనేకవిషయాలు హృదయంగమంగా చిత్రింపబడిన ఈ పుస్తకం పూర్తిగా చదివి ఆనందించవలసినదే! దీనినిగురించి ఎంత వర్ణించినా తక్కువే అవుతుంది ! 460 పేజీల గ్రథం—కళాత్మకమైన త్రివర్ణ ముఖచిత్రము, విశ్వకవి త్రివర్ణ ముఖచిత్రములతో—

వెల రు. 4-8-0 బైండు రు. 4-12-0.

# నిర్మల

## (ఒక కరుణామయ జీవితగాథ)

ఇందులో వృద్ధవివాహాలవలని అనర్థాలను నిరూపిస్తూ, గృహజీవితంలో అకారణమైన అనుమానాలకు తావిచ్చేవారు సంసారాలను ఎలా నాశనంచేసుకుంటారో అతిరసవత్తరంగా చిత్రించారు. శ్రీ ప్రేమ్‌చంద్. బాలబాలికలు స్త్రీ పురుషులు యౌవవృద్ధులు యావన్మంది చదివి గ్రహించవలసిన విషయాలెన్నో ఉన్నాయిందులో. చదవడం మొదలుపెడితే పుస్తకం పూర్తయేవరకు నిద్రాహారాలపైకి బుద్ధిపోదు. హిందీలో ఈ నవల లక్షలాది ప్రతులు నేటికీ ఖర్చవుతున్నవంటే దీని ప్రాముఖ్యతనుగురించి వేరే చెప్పనక్కర్లేదు. నేడే మీ ప్రతి తీసుకోనండి.

ముచ్చటైన త్రివర్ణముఖ చిత్రంతో—.

వెల రు. 3-0-0 లు మాత్రమే. మేలు ప్రతిరు. 3-4-0లు.

# నారీ జీవనము

ఇది ప్రేమ్‌చంద్ అమరలేఖినినుండి వెలువడిన మహోత్కృష్టమైన కథలసంపుటి. భారతదేశపు స్త్రీల సమస్యలను వివిధ దృక్పథాలతో పరిశీలిస్తూ ఒక్కొక్క దృక్పథంతో ఒక్కొక సర్వాంగసుందరమైన కథను రచించారు శ్రీ ప్రేమ్‌చంద్. ప్రతి ఒక కథ ఒక వజ్రపుతునక. ఆర్థిక, సామాజిక, రాజకీయ రంగాలలో స్త్రీకి ఎటువంటి స్థానమున్నది? —ఎటువంటి స్థానముండాలి? సమాజంలో స్త్రీలకు జరిగే అన్యాయాలకు, అక్రమాలకు కారణమేమిటి? మొదలైన అనేక సమస్యలను సమీక్షిస్తూ వ్రాసిన ఉత్తమకథల సంపుటి. ప్రతి తెలుగుబిడ్డ తప్పక చదివితీరవలసిన సద్గ్రంథం.

ప్రథమ భాగం రు. 1-0-0, తృతీయ భాగం రు, 1-8-0

ద్వితీయ భాగం రు. 1-0-0 బైండు రు. 4-0-0

# ప్రేమ్‌చంద్ సేవాసదనము

నూతన దాంపత్యజీవితంలో సంభవించే ఒడిదుడుకులు, వాటికిగల కారణాలు, తన్నివారణమార్గాలు సూచిస్తూ, వేశ్యాసమస్యమీద విపులమైన విమర్శలను సాగించిన చక్కని నవల. పత్రికలచేత సమాలోచకులచేత వేనోళ్ళ ప్రశంసింపబడిన సర్వోత్తమ రచన.

వెల రు. 3-0-0. బైండు రు. 3-4-0.

# ప్రేమ పీఠం

మతభేదాలు మానవజాతికి అనర్థదాయకమని ఋజువుచేస్తూ, నూతన దంపతులకు అమూల్యమైన గుణపాఠాల్ని నేర్పుతూ, సున్నితమైన హాస్యంతో పాఠకుల హృదయాలను కవ్వించే చక్కని నాటకం.

వెల రు. 1-0-0

—(...)—